వన్నియుఁ బల్లెవాండ్ర గుడిసెలు. ఆ యూరిలోని బ్రాహ్మణుల యిండ్లలో నొకటియే పెంకుటి భవంతి. యువకుఁ డా యింటికిఁ బోయెను. ఇంటిలో నతనికిఁ బ్రత్యేకముగ నొక గది యున్నది. అతఁ డా గదిలోనికిఁ బోయెను. గదిలో దీపము లేదు. 'అమ్మా! దీప' మని కేక వేసెను.

ఇంటిలో వంటచేయుచున్న యొక యేఁబదియేండ్ల వృద్ధురాలు పదునైదేండ్ల తన పెద్దకోడలితో "మఱఁదికి దీపము కావలయునఁట, తీసికొని పో"మ్మని చెప్పఁగా నా బాలిక యొక లాంతరును గదిలోనికిఁ దీసికొనిపోయెను. ఆమె యా లాంతరును గది కడపలోఁ బెట్టబోయెను. అతఁడు లోనికిఁ దీసికొని రమ్మనెను. ఆమె లోనికిఁ గొనిపోయెను. యువ:—మాఅన్నయ్య ఇంటికి వచ్చాడా!: ఆమె:—రాలేదు. ఇవ్వాళ ఏదో ఊరు వెళతా నన్నారు.

ఆమె గదిలోనుండి పోఁబోవుచుండెను. యువకుఁ డామె దగ్గరగాఁ బోయెను. ఆమె తొలఁగిపోయెను.

అతఁడు లాంతరువెలుఁగు పెద్దది చేసెను. గది మంచి విశాలమైనది. ఒకవైపున దోమతెరతోఁ బ్రయాణపు మడఁత మంచ మున్నది. ఒకవైపున వాసపుకఱ్ఱలు, మేదరచాఁపలతో జేసిన పుస్తకముల యర లున్నవి. ఆ యరలలో ఇంగ్లీషు పుస్తకము లున్నవి. ఆ పుస్తకములో షేక్స్పియరు, జెన్నిసన్ మొదలయిన ఇంగ్లీషుగ్రంథకర్తలవి కొన్ని, కొన్ని ఫ్రెంచి రష్యను గ్రంథకర్తల ఆంగ్లీకరణములు. కొన్ని సామ్యవాద గ్రంథములు. కొన్ని మేరీస్టోప్సు మొదలయినవారు వ్రాసిన స్త్రీపురుష సంబంధ గ్రంథములు. ఏవస్తు వచ్చుటఁ బరి

శుభ్రముగా నమర్చఁబడి యుండకపోయినను గది యంతయు నూతనత్వము వెదలఁగ్రక్కుచున్నది. గదిలో నేమూల చూచి నను సిగరెట్టుపీకలు కనవచ్చుచున్నవి.

యువకుఁడు మంచముమీఁదఁ బండుకొనెను. తలదగ్గర లాంతరు పెట్టెను. ఇబ్సెన్ నాటక మొకఁడు చదువుచుండెను. నోటిలో సిగరెట్టు లేకపోవుటచేతఁ జదువు సాగలేదు. క్రొత్త సిగరెట్లు లేవు. ఆ యూరికి రైలుస్టేషను గల బస్తీ పదిమైళ్ళ దూరమున నున్నది. సిగరెట్లు తెచ్చినవి ఖర్చయిపోయెను. చేతిలో డబ్బులేదు. అన్నగారు డబ్బుకోసము తిరుగుచున్నాఁడు. డబ్బు దొరకలేదు.

యువకుఁడు గదిలో నామూల నీమూల వెదకెను. ఒక పొడుగైన పీకయొక్కటి తీసెను. లాంతరు పైకిఁదీసి, యొక గుండ్రముగాఁ జుట్టిన కాగితము ముట్టించి సిగరెట్టు ముట్టించెను. కాని లాంతరు గుప్పుగుప్పుమని యారిపోయెను. దీప మారిపోయిన దని తల్లిని కేకవేయుట కతఁడు సంకోచించెను. ఆ యింటిలో నతఁ డెంత చెప్పిన నంత. అతని మాట వేద వాక్యము. అతఁ డిట్లేల సంకోచించెనో?

ఎట్టకేలకు 'అమ్మా! దీప మారిపోయిన'దని కేక వేసెను. అతని వదినెగారు గడపదగ్గరకు వచ్చి 'లాంతరి'మ్మని యడిగెను. అతఁడు సిగరెట్టు త్రాగుచు మాటాడలేదు. ఆమె యచ్చటనే ఒక యరగడియ నిలుచుండి వెడలిపోయెను. సిగరెట్టుపీక రెండుగుక్కలలో నయిపోయెను. అతఁడు లేచి యింటి లోనికిఁ బోయి, "అమ్మా, నిప్పుపెట్టె యి"మ్మని యడుగఁగాఁ దల్లి "నిప్పుపెట్టె లేదురా నాయనా! నీ వదినెగారు లాంతరు

వెలిఁగించి యీయలేదా" యనెను. అతఁడు లాంతరు తెచ్చి పడమటింటిలో దభేలునఁ బడవేసిపోయెను. అతని వదినెగారు లాంతరు వెలిఁగించి మఱల గదిముందరఁ బెట్టి వచ్చెను. అతఁడు లాంతరు గదిలోనికిఁ దీసికొనిపోలేదు.

వంట పూర్తియైన తరువాతఁ దల్లి గది గడపవద్దకు వచ్చెను. "అయ్యో నాయనా! ఒక్కఁడవు చీఁకట్లోకి పడు కున్నావుటరా! భోజనానికీ రా. వంటైంది. అన్నయ్య యేదో వూరు వెళ్ళాట్ట. వాఁడూ డబ్బుకోసం తిరుగుతున్నాఁడు. ఈ సంసారమంతా వాఁ డొక్కఁడు బుజానవేసుకు యీఁదా లాయెను. నీ చదువులకి యెక్కడ డబ్బూ చాలటం లేదు. వాఁడు నానాతిప్పలూ పడుతున్నాఁడు. పెద్దబిడ్డ వాఁడు పడే కష్టాలు చూస్తే నాగుండె తరుక్కుపోతోంది. నువ్వేమైనా పరీక్ష్యాసై వాడిచేతి కక్కఱకువస్తే వాఁడికష్టాలు తీరాలి సిందే తప్ప యింకోవిధంగా తీరేట్టులేవు. ఏవూరు వెళ్ళేఁడో! ఇంతకూ ఒకరి ననాలసిన పనేముంది? ఆయన ఋణాలుచేసి పోయినాఁడు. "పిల్లలున్నారు, డబ్బు నీళ్ళకుమల్లే వాడవ"ద్దని నేను నెత్తిన నోరుపెట్టుకొని మోగాను. నామాట యేమైనా విన్నారా? చివరకు మిమ్మల్ని యిల్లా కాకుల్ని చేసిపోయి నారు. నీవు మడికట్టుకో. ఒంటిమీఁద నీళ్ళు పోసుకుంటావా? వేణ్ణీళ్ళు పెట్టలేదు. పెద్దముండని. వంటచేసేటప్పటికే నాపని యైంది. అక్కయ్య జ్వరంగావుందని దొడ్లోకి పోయిపడుకుంది. ఇంక మీ వదినగారు వక్కత్తె. అదేమో పసిపిల్ల. అది మాత్రం ఏమిచేయఁగల్గును? అందుకని నేనేమడిగట్టుకొన్నాను. ఇంతకూ నా గీఁత బయటపడే రోజులు. నా యదృష్టం బాగా

వుండే రోజులైతే ఆ పెద్దకోడలే బ్రతికి వుండేది. పెద్దతనంలో సుఖపడే గీత వుండవద్దా? అది బ్రతికివుంటే నిక్షేపంవలె కూర్చోపెట్టి రాజోపచారంగా చేసేది. నా కా గీత లేందే! లే నాయనా! భోజనానికి లే!” అని పెద్దచదువు చదివినది.

యువకునకు తల్లి యెప్పుడు నిట్లు మాటాడుట యిష్టము లేదు. అతఁ డామెతో నెప్పుడును పోట్లాడుచుండును. ఆమెయే కన్నకడు పని, కడసారిపిల్లవాఁడని యతఁడన్నచోఁ బ్రాణములు వదలిపెట్టుచుండును. అతఁడు తల్లిమాట లందిపుచ్చుకొని “బ్రతికివున్నప్పుడు వదినా, నువ్వూ యెప్పుడూ కీచులాడుకొనేవారు. ఆవిడ చచ్చింతరువాత నీ కావిడమీద ఆపేక్ష యెక్కువైంది” అన్నాఁడు. తల్లికి వెంటనే కోపము వచ్చెను. ఆమె సణుఁగుకొనుచు నింటిలోనికిఁ బోయెను.

రాతిరి పదిగంట లయ్యెను. అతఁడు భోజనమునకుఁ బోలేదు. రెండుపీఁటలు దగ్గరగాఁ ద్రోసి తల్లి వానిపై నిదుర బోవుచుండెను. దొడ్డిలో పండుకొన్న యాఁడుబిడ్డ లేచివచ్చి యింటిలో మంచము వాల్చుకొని పండుకొనెను. కోడలు గదిలోఁ దనమంచము మీఁద నడ్డముగాఁ బండుకొని నిదుర పోయెను. అంతవఱకు నెవ్వరును భోజనము చేయలేదు.

అప్పు డాఁడుబిడ్డ నిద్రలేచి తమ్ముని భోజనమునకు లేపెను. అతఁడు వెంటనే లేచి యన్నము తినెను. తల్లి విసుగుకొనుచు తా నింతరొట్టె తిని పోయిపండుకొనెను. ఆఁడుబిడ్డ వదినెగారిని లేపి యన్నము పెట్టి తాను ఫలాహారము చేసి పండుకొనెను.

ప్రొద్దు నడిమిరేతికిఁ దిరిగెను. గుఱ్ఱకొయ్యలు నడిమింటఁ

దోఁచెను. ఇంటిలో నందఱును నిద్రపోవుచున్నారు. యువకుఁ డొక్కఁడే మేల్కొనియుండెను. అతని మనస్సులో జగద్రహస్య సిద్ధాంతములు పరాఘాతములై పునసిద్ధాంతీకరింపఁబడు చుండెను. "ఈ లోకమంతయు నన్యాయముగ నున్నది. స్త్రీలను బురుషులు పశుతుల్యులుగఁ జూచుచున్నారు. ఆఁడవారి గొంతులుకోయుచున్నారు. వారికిఁ జదువులు చెప్పించుటలేదు. వారి నెంతవఱకు గృహములలోఁ బనిపాటలు చేయుటకు మాత్రమే యుపయోగించుచున్నారు. ఎంతమందిభార్యలు పోయి నను పురుషుఁడు మఱల వివాహమాడవచ్చునఁట. స్త్రీ యాడరాదట. ఏఁబదియేండ్ల వృద్ధుఁడు పదునాలుగేండ్ల బాలికను బెండ్లి యాడుచున్నాడు. ఆమె తన కిష్టమువచ్చినపురుషుని వివాహము చేసికొనుటకు వీలులేదు. ఆమెను నిర్బంధముగా నొకవృద్ధునకిచ్చి పెండ్లిచేయుదురు. ఆమెబ్రతు కేమికావలయునో? ఈ వృద్ధుని తోఁ దన జీవితమంతయు వ్యర్థము చేసికొనవలసినదేనా? మా యన్నకు నలుబదియై దేండ్లు. పట్టి పల్లెటూరివాఁడు. ఒడలిలో నోపికయు లేదు. కరిణీకము చేయుచు నోళ్ళుకొట్టి సంపాదించు టయేగాని చదువు, సంస్కారము, నేదియును లేవు. మా వదినె మిక్కిలి యందకత్తె. కోఁతిముక్కునకు రతనపుబులాకీ పెట్టి నట్లు మావదినె మాయన్నకుఁ బనికిరాదు. ఆమె తల్లిదండ్రులు పేదవారు. పెద్దసంబంధము తేలేక మాయన్న కిచ్చిరి. వివాహమే దుష్టమైన సంస్థ. లోకములోఁ బతివ్రతలని చెప్పదగిన స్త్రీ లుండరు. దమయంతి, చంద్రమతి, అనసూయ, సీత మొదలగు పేర్లన్నియు దొంగలు కల్పించిరి. పురాణము లన్నియు రంకుపురాణములు. కుంతి కైదుగురు భర్తలు,

ఇంకను నావిడమే నయము. ద్రౌపది మఱియు బజారునఁ బడినది. మొన్న నొకానొకని దేవీభాగవతములోఁ జెప్పినకథ మఱియు బాగుగా నున్నది. లక్ష్మీదేవి యెవనినో రాక్షసుని మోహింపగా విష్ణుమూర్తి కది తెలిసి లక్ష్మీదేవిని మంద లించెనట. లక్ష్మి శక్తిగావున విష్ణుమూర్తి నొక చెంపకాయ గొట్టెనఁట. విష్ణువుతల యెగిరిపోయి యెచ్చటఁబడినదో మఱలఁ గనిపింప లేదఁట. అప్పు డొక గుఱ్ఱపుతలకాయఁ దెచ్చి విష్ణువు మొండెమున కంటించిరి. ఆయన హయగ్రీవుఁడైనాఁడు. లక్ష్మీ దేవి బలేపని చేసినది. లోకములో నందఱు నట్లు చేయవలెను. అప్పుడీ మగవాండ్రకు బుద్ధివచ్చును."

యువకుఁ డిట్లూహాఁ జేసిచేసి యతని మనస్సులో నొక కలవరము పుట్టెను. తన వదినెగారి యౌవనము వృద్ధుఁడైన తన యన్నగారికి భోగ్యపదార్థము గాదు. తాను యువకుఁడు. ఆమె యౌవనవతి. పాపపుణ్యములు లేవు. దేవుఁడే లేఁడు. ఈ సిద్ధాంతము లన్నియు మనుష్యుఁడు స్వప్రయోజనార్థమై కల్పించినవి——ఇట్టి నస్తికము లతనికి హృదయములో గాఢ ముగా నాటుకొనెను. అవి పెకలింపరానివిగా నుండెను. అతఁడు తన వదినెగారినిఁ గూర్చి యూహించినపుడెల్ల తా నొక పాప కృత్యము చేయుచుంటి నని యనుకొనఁడు; లోకములో నున్న యొక దౌష్ట్యము నివారించుచుంటి ననుకొనును; అంధకూప మున బడిపోవు నొకజీవిని సముద్ధరించుచుంటి ననుకొనును. అతనికి నిద్ర పట్టలేదు. అన్నగారు గ్రామములో లేఁడు. వదినెగా రొక్కర్తెయు గదిలోఁ బండుకొన్నది. ఆమెతోఁ బోయి యీ సంగతులు మాటాడవలయును.

అతని హృదయములో మఱియే విషయములు చొరనే లేదు. అతని పేరు రంగారావు. అతని యన్నగారి పేరు సీతారామయ్య. వారితండ్రి గొప్పదాతయై యడిగినవారి కెల్ల లేదనక యిచ్చెను. చాలఋణములు చేసెను. వారిది మర్యాద గల కుటుంబము. వారితండ్రి పేరు చెప్పినచో నా చుట్టుపట్ల మహాదాత యని నమస్కారములు చేయుదురు. చాపచెడి నను, చదరంత గాకపోదుగదా! ఆ తండ్రి యెంత వ్యయము చేసి నను మిగిలినవారికి కూడు గుడ్డలకు లోపములేదు. కాని వ్యవహారములు బలిసియుండుటచేత నా చిక్కులు మాత్రము తాత్కాలికముగా బాధించుచుండెను. ఆ తండ్రి పోయి యిప్పటికిఁ బదునెన్మిదేండ్లైనవి. ఆ యింటిలో నందఱకు నాయన పోయి కొన్ని నెలలైనట్లు తోఁచును. తండ్రి పోవు నాఁటికి రంగఁడా రేండ్లవాఁడు. అప్పటి వ్యవహారపుఁజిక్కు లిప్పటికిఁ బూర్తిగా విడిపోలేదు.

సీతారామయ్య యీ కంపతోడుగు లాగుచుండెను. అందులోననే యన్నికష్టములు పడుచుండెను. ఆ రేండ్లతమ్ముని పెంచి పెద్ద వానిని చేసెను. అతనికి నింగ్లీషు చదువు చెప్పించెను. రంగఁడు బి. ఏ. పరీక్షనిచ్చెను. ఎం. ఎ., ఎల్. ఎల్. బి. పరీక్షలు కలిపి లక్నోలో చదువుచుండెను క్రిందఁబడి మీఁదఁబడి సీతారామయ్య తన తమ్ముని చదువునకు నెలకు వంద, వందయేఁబదిఁగఁ బంపుచుండెను. అతని చెల్లెలు సరస్వతి తండ్రి పోవునాఁటికిఁ బదియేండ్లపిల్లకుఁ దానే పెండ్లి చేసెను. ఆమె రెండేండ్లు భర్తతో సంసారము చేసెను. ఆమె కొక కుమారుఁడు కలిగెను. ఆమె భర్త చనిపోయెను. ఆమె కత్తింట

నాధారములేక చెల్లెలిసి, మేనల్లునిఁ దనయింటఁ దెచ్చిపెట్టు కొనెను. ఆ యల్లునికిపుడు పదునాలుగేండ్లు. వానిపేరు సీలాంబరుఁడు. వానిని బస్తీలోఁ బెట్టి చదివించుచుండెను. అతఁడు ఫోర్తుఫారము చదువుచుండెను. సీతారామయ్య పాతికయో, పరకయో నెల నెల వానికినిఁ బంపించుచుండవలయును.

తగిలినచోటనే తగులు నన్నట్లు దైవము చూచి చూచి కష్టములు కలవానికే తెచ్చిపెట్టును. సీతారామయ్యకు భార్యావియోగము గలిగెను. ఆ చనిపోయిన భార్య పల్లెటూరిది; కష్టనిష్ఠురము లెఱిఁగిన సంసారములోఁ బుట్టిన పిల్ల; పనిపాటలు చేతనైనది. ఆమె బ్రతికియున్నన్నాళ్లు సీతారామయ్య యెన్నికష్టము లున్నను సుఖమే యనుభవించెను. "వివాహశ్చ వివాదశ్చ సమయోః" అన్నట్లు సీతారామయ్య పల్లెటూరివాఁడు. రత్నమ్మ పల్లెటూరిది. కలసి యిల్లు గడుపుకొనుట యెట్లు, ఒకరి కొకరు సాయపడుట యెట్లు, అందని యెత్తు లెత్తక సంసారము కుదిమట్టముగాఁ జేసికొనుట యెట్లు అన్న విషయములే వారికిఁ బట్టెడివి. రత్నమ్మకు నొకయాఁడపిల్లయు, నొకమగపిల్లఁడు నుండెను. ఆఁడపిల్లకు సీతారామయ్య పెండ్లి చేసెను. ఆమె మగనియింటఁ గాఁపురము చేయుచుండెను. మగపిల్లవాఁ డైదేండ్లవాఁడు. వాఁడు ముత్తవల యింటఁ బెరుఁగుచుండెను.

సీతారామయ్య తల్లి యఱువదియేండ్ల వృద్ధురాలు. ఆమె పేరు మాణిక్యమ్మ. మాణిక్యమ్మకు, రత్నమ్మకు నెప్పుడును పడెడిది కాదు. మాణిక్యమ్మకుఁ జెప్పరాని యాచారము. కోడలు తా నొకచోట నిలుచున్నచో 'నదిగో ధూమెంగిలిఁ

ద్రొక్కితి' వనును. చెంబెడు నీళ్లు రత్నమ్మ కాళ్ళమీఁదఁ బోయును. ఆమె చీరకూడఁ దడియును. ఆమె కట్టుకొనుట కింకొక పొడిచీర యుండదు. దొడ్డిలో మడిబట్ట లెండవేసి యుండఁగా రత్నమ్మ గజము దూరముగాఁ బోవును. "అంత కళ్ళు కనపడకుండా పోతావేమే. మడిబట్టలు ముట్టుకున్నావు? అని యా మడిబట్ట లన్నియు మఱలఁ దడిపి యెండవేయును. రత్నమ్మ 'నేను ముట్టుకోలే' దని కోపము తెచ్చుకొనును. 'అదిగో యెంగిలి చేతితో మడి ముట్టించినా' వని ప్రతివస్తువు నకుఁ బులికాపు వెట్టును. మాణిక్యమ్మకు, రత్నమ్మకు రత్నమ్మ బ్రతికియున్నన్నిదినము లీరీతిగాఁ బడలేదు. వా రిద్దరు తక్కిన యపుడు ప్రేమగానే యుండెడివారు.

కోడలు చనిపోయినంతనే మాణిక్యమ్మకుఁ దల తిరిగి ముద్ద నోటిలోనికి వచ్చెను. రెండవకోడలిని కాలు క్రిందఁ బెట్టనీయదు. పువ్వో పువ్వో యని తలపైఁ బెట్టుకొని యూరేగును. ఈమె పేరు రత్నావళి. రత్నావళి యెండలో నంట్లు తోమినచో మాణిక్యమ్మకు నొడలు కంపరమెత్తును. కోడ లొకపూఁట మడిగట్టుకొన్నచో మాణిక్యమ్మ కొడ లంతయు జెట్టులు ప్రాఁకును. రెండవకోడలు జిఱ్ఱునఁ జీదినచో నత్త గారి ప్రాణము లొడుదుడు కగును.

రత్నావళి సహజముగా నందకత్తె. గొప్పయింటిబిడ్డ. ఆమె పుట్టింటివారును చిదికిపోయిరి. వారు పూర్వము మొఖాసా దారులు. సంస్కృతములో డొక్కశుద్ధియైనవారు. రత్నావళిని సీతారామయ్య కిచ్చుట చిత్రముగా సంభవించెను. రత్నావళి తండ్రి చనిపోయెను. ఆమె మేనమామ యీ సం

బంధము కుదిర్చెను. సీతారామయ్యకుఁ బెద్ద యాస్తి లేక పోయినను, తండ్రి చేసిన పరువు లక్షయున్నది. నిర్వాహకుఁ డని పేరు ప్రతిష్ఠ లున్నవి. గ్రామపుఁగరణీక మున్నది. న్యాయస్థుఁ డన్న పేరున్నది. సీతారామయ్య శీవిగలవాఁడు. దర్జా గల వాఁడు. దారినిపోవు తద్దినమా మా యింటికి రమ్మనడు. ముక్కు-కు సూటిగాఁ బోవువాఁడు. ఎంతవఱకుఁ దండ్రిపేరు నిలువఁబెట్టవలె ననియే తంటాలు పడును. కాని పెరజోక్యము లకుఁ బోఁడు. ఈ సద్గుణములకు మెచ్చి యామె మేనమామ రత్నావళి నతని కిచ్చెను. నలుబదియేండ్లవానికిఁ బిల్లనిచ్చు టకుఁ గొందఱు బందుగు లిష్టపడలేదు. మేనమాఁమ "యాయుర్దాయములో నున్నదిగాని, వయసులో నే మున్న?" దనెను. "ఆర్షేయ పౌరుషేయములలో నున్నదిగాని, వయసులో నేమున్న?" దనెను. రత్నావళి కాపురమునకు వచ్చి రెండేం డ్లయినది. భార్యాభర్తలు సుఖముగానే యున్నారు.

రంగఁడు సెలవులకుమాత్ర మింటికి వచ్చును. రత్నావళి కాఁపురమునకు వచ్చినతరువాత రంగఁడు పట్టుమని యింటి వద్ద రెండునెల లున్న దీసారియే. రంగనికి నాలుగైదుసంబం ధములు వచ్చెను. అతఁ డుద్యోగములోఁ జేరినఁగాని వివా హాము చేసికొన న నెను.

సీతారామయ్య తండ్రి చేసిన ఋణములు చాలఁ దీర్చెను. తాను చేసిన కార్యకరామతులకు మఱల నప్పులు చేసెను. తమ్ముని చదువుతో నతఁడు చాలచిక్కులు పడు చుండెను. కిస్తీ సాలునకు రెండుసార్లు వచ్చును. ఇతని చదువు నెలనెలకుఁ గిస్తీలు వచ్చినట్టయ్యెను. ఐనను తలవంచుకొని

యీ బరువు లాగుచుండెను. భవిష్యత్తులోఁ దుప్కుఁడు త్రవ్వి తలకెత్తు ననుకొనుచుండెను.

ఒక్కొకప్పు డా యింటిలో చేతిమీఁదికి మెఱుఁగుండదు. ఆపూఁటకు గిద్దెఁడు బియ్యముండవు. తనకుఁ, దనతల్లికిఁ, జెల్లెలికిఁ గట్టుబట్ట లుండవు. ఒకటే దోవతి యుదికి యదియే యెండ వేయుట, యదియే కట్టుకొనుట. రత్నావళి తా మెం మేనమామ యడపదడపఁ దీసికొని పోయి చీరలకరవు లేకుండఁ జేయును. నీలాంబరుని పేరు పాఠశాలలో నాలుగైదుసార్లు కొట్టివేసిరి. ప్రతి నెలయు జరిమానాలతోనే జీతములు కట్టుచుండెను.

ఇట్టి సంసారమునకు రంగఁ డొక్కఁ డాశాపతాకముగా నిలచెను. అందఱి ప్రాణము లతనిమీఁద నుండెను. అతని చదు వింకొక్క యేఁడాది యుండెను. సీతారామయ్య తన ప్రాణములను పశువులను జేసి యాశ యను త్రాళ్ళతో రంగఁడను కట్టుకొయ్యకుఁ గట్టెను.

రంగఁడు వేషమునఁ బరమాధునికుఁడు. మీసములు ముక్కుక్రింద నటు నిటు నాల్గు పోచలు. క్రాపింగు మాయరాదు. గడ్డమునకుఁ బ్రతిదినము పరిచర్య, కన్నులకుఁ గైవారములు లేని యద్దములజోడు. కంటిమెడ, ప్రక్కగుండీలచొక్కా, బంగాళీకట్టు. చేతిలో నెల్లప్పుడును పత్రికయో, పుస్తకమో యుండవలయును. పైయుత్తరీయ ముండదు. కాళ్ళకు రంగు రంగుల చెప్పులు. నోటిలో నెల్లపుడును సిగరెట్టుండవలయును. మొదటిరోజులలో నన్నగారికిఁ దెలియకుండ సిగరెట్లు కాల్చెడువాఁడు. బి. ఏ., ప్యాసైనతరువాత నన్నగారికిఁ దెలియునట్లే కాల్చుచుండినను నతనిమెదుట కాల్చలేడు.

ఇప్పుడు యం. ఏ. లో సగము, యల్. యల్. బి. లో సగము నైన తరువాత నన్నగారి ప్రత్యక్షములోననే కాల్చుచుండెను.

రంగఁడు బయటి కెంత యాధునికుఁడో లోన దానికి రెట్టింపు. అతనికిఁ గొందరు పూర్వాంధ్రకవుల నామములు మాత్రము తెలియును. వారిపుస్తకము లెన్నఁడును జదువ లేదు. పాఠ్యగ్రంథములుగాఁ జదివినవి యే యేఁటి కా యేఁడే చిలుము పట్టిపోయెను. కాని కొంద రాధునికాంధ్రరచయితల పేర్లు తెలియును. వారిగ్రంథములును చదివెను. ఎవ్వరు తన యాధునికాభిప్రాయముల ననుసరించి వ్రాయుదురో వారి గ్రంథములే చదివెను; చదువును. ఇంగ్లీషుభాషలో నతని పుస్తకముల యరలో నెట్టిగ్రంథము లున్నవని చెప్పఁబడెనో యట్టివానియందు నిష్ణాతుఁడు. ఇవి యతని యాంతరబాహిర వేషభాషలు.

అతఁడు మంచి యూహశాలి. తెలివికలవాఁడు. అబద్ధము లాడఁడు. తనకు నమ్మకములేనిదాని నాచరించఁడు. నమ్మక మున్న విషయము తల పోయినను సరే యాచరించితీరును. అతనికి నంతరాత్మయందు విశ్వాసమెక్కువ. తన యంతరాత్మ యెట్లు చెప్పిన నట్లు చేయుదు నననును. తన కున్న విశ్వాసము లన్నియు తాను తనలోఁ దర్కించుకొని నిశ్చయించుకొన్నవని చెప్పును. వాని నెవరైన కాదని ఋజువు పఱచినచోఁ దాను మార్చుకొందు నననును. అతఁడు మిక్కిలి తీవ్రవాది. ఎదుటివాని వాదము సహించఁడు. మిక్కిలి యావేశముతో నెదుటివారితో వాదించును. అతనితో వాదించుట యతనితో విరోధము పెట్టుకొనుట.

అతని కిప్పు డిఱువదినాలుగేండ్లు. అతనికిఁ గల యూహలన్నియు నాచరించుటకుఁ జదువు పూర్తి యయిన వెంటనే తానుసంసిద్ధుఁడనని యతఁడుమనసులో సిద్ధాంతముచేసికొనెను.

అతఁడు చేయుచున్న దొక్కటియే లోపము. అతని మనస్సు లోకములో జరుగు సాంఘికదౌర్జన్యములను గూర్చి విచారించును. కాని తన కుటుంబపరిస్థితులనుగురించి విచారించదు. అతని మనస్సు పురుషులు, స్త్రీల నధఃపతితులుగఁ జేయుచున్నారని విచారించును. లోకములో సంపదయు, దారిద్ర్యము నెట్లు బహువిషయముల నెగుడు దిగుడులు తెచ్చుచున్నవో విచారింపఁడు. అతనిమనసు తాను పరీక్షలిచ్చి నెలకు వందలో, వేలో సంపాదించు ననుకొనునుగాని తనయన్నగారు తన్ను జదివించుటకుఁ బడుచున్న కష్టములను విచారించఁడు. అతని మనస్సు స్త్రీపురుషుల యౌవనదశామదప్రాదుర్భావమే పరామర్శించును గాని వార్ధక్యదశారోగదశా కాలమృత్యుదశా వైపరీత్యములను గూర్చి యోచింపదు. అతఁడు దైవములేఁడని దృఢనిశ్చయము చేసికొనెను గాని మృత్యువు మృత్యువని బహుమతకర్తలు చేసిన ఘోష యతనికిఁ బట్టదు.

అతని నెఱిఁగియున్న వారందఱు రంగని నారాధింతురు. అతని సహాధ్యాయులు రంగని నొక మహామేధావిగాఁజూతురు. రంగని యబద్ధ మాడకుండుట, రంగఁ డల్పవిషయములఁ దనకు విశ్వాసముగల చోట్ల జరుపు ఋజుప్రవర్తన యతని నెఱిఁగి యున్నవా రందఱకు నాదర్శప్రాయములు.

ప్రతివిషయమునకు రెండుదశలు. ఒకటి సూత్రదశ; రెండవది యాచరణదశ. సూత్రములు కొన్ని సామాన్య విష

యములను బోధించును. కొన్ని తన్మతమహావిషయములను బోధించును. బహుమతముల యొక్క సామాన్యవిషయ బోధకసూత్రములు సన్నిహితార్థములుగా నుండును. అధిక విషయబోధక సూత్రములు భూమికి స్వర్గమునకు నున్నంత యెడముగా నుండును. సామాన్య విషయబోధక సూత్రాచరణములందు రాక్షసులు, దేవతలు నొక్కటియే. తల్లిని ప్రేమించుట పశువునకు, మనుజునకు నొక్కటియే. ఆ విషయముననే మాతృప్రేమను దాటి యిద్దఱకును భేదమున్నది.

రంగఁడు సిద్ధురపట్టిక జగద్రహస్యసిద్ధాంతములను విచారించుచుండెను. తన వదినెగారి దుర్దశనుగూర్చి భావించుచుండెను. ఆ దుర్దశ యెట్టిది? తాను దుర్దశలో నుంటినని యామె యెప్పుడైన ననుకొనెనా? రంగఁడిట్లు చింతించలేదు. ఆమెదుర్దశ యామెకుఁదెలి...దు. తా నా దుర్దశ యామెకుఁదెలిపి యామె నా దుర్దశనుండి తొలగించును. ఇది యతని యూహ. 'బాధ తెలిసినప్పుడుగదా యుండును? క్లోరోఫారము పుచ్చుకొన్నపుడు బాధ తెలియదు. లాభమేగదా! అజ్ఞాన మట్టిది కాదందువా? పరమాత్మవిషయమైన యజ్ఞానమే యజ్ఞానమని కొందఱందురు. సృష్టి యెప్పుడును బాధాహేతువే. తద్బాధాస్వరూపమే తెలియనప్పుడు బాధ యనిపించదు' అని వాదించినచో రంగఁడట్లొప్పుకొనఁడు. శారీరకమైన సుఖము, పాశవమైన సుఖము బ్రహ్మజ్ఞానము వంటి దనును. అసలు దైవమే లేఁడనును. బ్రహ్మజ్ఞానవిషయ మతనితో నెవ్వరును వాదించలేరు. అది యతనికిఁదెలియదు. అతని సిద్ధాంతములలో శారీరకమైన సుఖము పరమావధి. అందును కూడుగుడ్డ

లనుగూర్చికాక స్త్రీపురుషసంబంధమైనదానికిఁ బట్టాభిషేకము.

రంగఁడు నిద్దురపట్టక జగద్రహస్యసిద్ధాంతములను విచారించుచుండెను. అతని నిఘంటువులోఁ గృతజ్ఞత, రక్తసంబంధము, పాపపుణ్యములు, పరలోకము మొదలైన మాటలు లేవు. ఇవి యన్నియు స్త్రీపురుషసంబంధమైన సుఖము తర్క్యమైనచో నల్పవిషయములు. తాను తన యన్నగారి కప్పుపడియుండెను. ఆ యప్పు తా నెన్నిజన్మము లెత్తినఁ దీఱునో? వదినెగారు తనకుఁ దల్లివంటిది. రత్నమ్మ రంగనిఁ జేతులలోఁ బెంచెను. తన్ను 'నాయనా!'యని పిలచెను. తన కొడలుతోమి నీళ్ళుపోసెను. పట్టి బలవంతముగ నన్నముపెట్టెను. తలదువ్వెను. చిన్నమఱఁదిని జంకను బెట్టుకొని పేరంటముల కేఁగెను. తోడునకు మఱఁదిని వెంటఁదీసికొని పుట్టినింటికి నడచి పోయెను. ఈ రత్నావళి యా రత్నమ్మ కళాలేశము; తత్థ్సానీయురాలు.

రంగఁడు జగద్రహస్యసిద్ధాంతమునుగూర్చి విచారించుచుండెను. సెలవులైనంతనే రంగఁడు లక్నోకుఁ బోవలయును. రెండువందలరూపాయలుకావలయును.అచ్చటికిఁబదిమైళ్ళదూరమున నున్న బస్తీలో రెండురూపాయల వడ్డికి నొక మార్వాడీ యప్పునిత్తుననగాసీతారామయ్యయచ్చటికిఁబోయెను. మార్వాడీ వడ్డీని ముందు మినహాయించుకొని యిచ్చును. సాలుసరి తిరుగు వడ్డీతోనిచ్చును. నగఁదాకట్టుపెట్టుకొని యిచ్చును. నాఁడు శుక్రవారమని మార్వాడీ సీతారామయ్యనాఁపెను. సీతారామయ్య ఫ్లాటుఫారపు బసలో నాల్గుమెతుకులు గతికి యొక దేవాలయపు

మంటపముపైఁ బండుకొనెను. ఆయనకుఁ దనకష్ట మింకొకక్క-యేఁడాదియేకదా యనిపించెను. ఇంతకష్ట మతనికిఁ గష్టముగా లేదు. తమ్ముని తలఁచుకొనినప్పు డెల్ల నతని బాధలన్నియు వాయుధూతమేఘములవలె చెల్లాచెద రగుచుండెను.

రంగఁడు జగద్రహస్యసిద్ధాంతమును గూర్చి విచారించు చుండెను. తాను పోయి తన వదినెగారిని లేపి మాట్లాడవలయు నని యూహించెను. ఆమె గదిలోఁ బండుకొని లోపలఁ దలుపు వేసికొన్నదేమో! అయినను పోయి చూచుటకే యతఁడు నిశ్చయించెను. లేచెను. తల్లియు, సరస్వతియు గాఢముగా నిద్రించుచుండిరి. నీలాంబరుఁ డింటిలో లేఁడు. అతఁడు నాల్గు దినములక్రింద నెవరో చుట్టాల యింటికిఁ బోయెను. వదినెగారు నిద్రించుచున్న గది ప్రత్యేకముగ నుండెను. అచటికిఁ బోయి తాను తలుపు తట్టినను నెవ్వరికిని దెలియదు. తలుపు దగ్గఱకుఁ బోయెను. తలుపు లోపల గడియవేసియుండెను. తలుపు తట్టి నచో ధ్వని యగునేమో యని యతఁడు గోడమీఁదనుండి లోనికి నెమ్మదిగా దిగుటకే యూహించెను. పెంకుటిల్లగుట మూలమున నడ్డగోడ చూరువఱకే పెట్టబడియుండెను. నిట్రా ళ్ళున్న భాగమున గోడలేదు. అతఁడు నెమ్మదిగా నొక పెట్టె మీఁదనుండి గోడ యెక్కెను. గదిలోఁ దలుపులులేని యల మర యుండఁగా దాని యాధారముగా లోనికి దిగెను. దిగు టలోఁ గొంచెము చప్పుడయ్యెను. రత్నావళి యటు నిటు మస లెను. అతఁడు చప్పుడు చేయకుండ నిలుచుండెను. రత్నావళి మఱలఁ బ్రక్క- కుదుర్చుకొని పన్నుండెను.

అది వేసఁగికాలము; కాని సముద్రతీర మగుటచేతఁ

ప్రొద్దుపోయి చలివేయును. బయటఁ బరుండినచోఁ దెల్లవారు వఱకుఁ బక్కలన్నియుఁ దడిసిపోవును. అందులో సీతారామయ్య యింటిలో లేకపోవుటచేత స్త్రీలులోపలనే పండుకొనిరి. రంగఁడు దీపమును వత్తి పెద్దదిచేసెను. రత్నావళిని నిద్రలేపుటయా, యామె మేల్కనువఱకు నట్లే కూర్చుండుటయా? అతఁడు లేచి తలుపు గడియతీసెను. వెనుకకుఁ దిరుగుసరికి రత్నావళి లేచి చూచెను. మఱేది కనిపించెను. ఆమె తహతహలాడెను. రంగ:—భయపడకు. నేను నీతో కొన్ని సంగతులు మాట్లాడదా మని వచ్చాను. మరెందుకూ గాదు. కేకలు వెయ్యవద్దు. రత్నావళి:—ఏమి మాట్లాడుతారు? రంగ:—నీవు వయసులో ఉన్నావు. మా అన్నయ్య వయసు మీఱిన వాఁడు. నీవు చదువుకొన్నదానవు. మా అన్నయ్య కేమీ చదువురాదు. నీవు అందకత్తెవు. ఆయన అందగాఁడు కాదు. పైగా వట్టి పల్లెటూరివాఁడు. ఎప్పుడూ మాసినగుడ్డలే కట్టుకుంటాఁడు. తలకు యెప్పుడూ నూనె రాచుకోఁడు. తలముందర భాగమంతా నెలకొకసారి బోడిగా చేయిస్తాడు. తక్కిన రోజులు తలా, గడ్డమూ పెంచి బూచిలా వుంటాఁడు. మొగమంతా కొంగరెట్టలల్లే గంధం పెడతాఁడు. నీవు చక్కఁగా బంగారు బొమ్మల్లే వుంటావు. చీర మాయనీయవు. తల మాయనీయవు. మీ మేనమామ నిన్ను అన్యాయం చేశాఁడు."

రత్నావళి మఱు మాటాడలేదు. ఆలోచించుచు నిలుచున్నది. రంగ:—నీతో నీ మాటలు చెప్పటానికే వచ్చాను. పూర్వాచారపరాయణు లందఱూ ఆఁడవాళ్ళని యిట్లా అన్యాయం చేస్తున్నారు. మీరందఱూ గొఱ్ఱె పిల్లలలాగ

వున్నారు. పెద్దవాళ్ళంతా కసాయివాళ్ళల్లే మీ గొంతుకలు కోస్తున్నారు. నోరూ వాయీ లేని మిమ్మల్ని వాళ్ళు యేమిచేసినా చేసినవాళ్లే. మీకు ఈడూ జోడూ ఐన సంబంధాలు తేవటం వాళ్ళ కిష్టంలేదు. ముసలివాళ్ళతో మీకు ఏమిసుఖం? నేను ఈ సంగతులన్నీ చాలా విచారించాను. నా మనస్సు ఎప్పుడూ లోకంలో జరిగే ఈ అన్యాయాలను గురించే ఆందోళనపడుతూ వుంటుంది. వయసులోవున్న స్త్రీలనుముసలివాళ్ళుసుఖపెట్టలేరు. ఈడూజోడూ అయితే చిలకా గోరింకల్లే వుండవచ్చు. ముసలి వాళ్ళకు మాటామంచీ తెలియదు. వాళ్ళపనులు వాళ్ళు చూచు కొంటూ వుంటారు. వయస్సులోవున్న భార్యలతో సరాగాలా చట్టుబండలా? నీకు సుఖ మనేది లేకుండా చేస్తున్నారు. లోకంలో ఇట్లా ఎంతమంది జీవితంలోవున్నసుఖం తెలియకుండా నశించిపోతున్నారు? నేను వెళుతున్నాను. నీవే ఆలోచించుకో!"

రంగఁడు తన గదిలోనికిఁ బోయెను. రత్నావళికిఁ దెల్ల వాఱులు నిదుర పట్టలేదు.

---

## రెండవ అధ్యాయము

---

మఱునాఁడు సీతారామయ్య వచ్చెను. ఆనాఁడు రాత్రి మార్వాడీ కూఁతునకు జబ్బుచేసెనఁట. వాఁ డింక నాల్గు రోజు లాఁగి రమ్మనెను. సీతారామయ్య తిరిగి వచ్చి తమ్ము నితోఁ జెప్పెను: "నాయనా, ఇంక నాల్గురోజుల తరువాతనే వెళ్ళుదువుగాని. డబ్బు దొరకుటలేదు. ఏదో నా కష్టములు నేను పడెదనులే" అనెను. రంగారావు తన కక్కఁడ చదువులు

చెడిపోవు ననెను. సీతారామయ్య "నాల్గురోజుల కేమి చేయుదుము? మార్వాడీ మంచివాఁడు. అతఁడు తప్పకుండ నిచ్చును. ఈయక ఏమిచేయును? మన రెండెకరముల పొలము తాకట్టుపెట్టుకొని యిచ్చుచున్నాఁడు. ఈ సంవత్సరము నీ చదువునకుఁ గావలసిన ధన మంతయు వానివద్దనే తెచ్చెదను. నా కింకొకత్రోవ కనుపించలేదు. ఈనఁగాచి నక్కలపాలు చేసినట్లు నీ చదు వింతదూరము తెచ్చి యీ యేడాదిలో లోభించినచో లాభ మేమి? పైని భగవంతుఁ డున్నాఁడు. నీవు సంపాదించి తీర్చెద వని యీ గుండము త్రవ్వుచున్నాను" అని చెప్పి యింటిలోనికిఁ బోయెను. అప్పటికి పగలు రెండుజాములయ్యెను. సీతారామయ్య స్నానము చేయుటకుఁ బ్రతిదినము రత్నావళి నీరు దోడును. అదివఱకే తోడియుంచకపోయినచో నతఁడు నూతివద్దకుఁ జేరువేళకుఁ దానును పోయి చేదతో నీరు తోడియిచ్చును. ఆ నాఁడు రత్నావళి నూతికడకుఁ బోలేదు. అతఁడే నీరు తోడుకొని స్నానముచేసెను. ఒడలు తుడుచుకొనుచుండెను. అప్పుడు రత్నావళిదొడ్డిలోనికిబోయెను.

సీతారామయ్య వెనుకటిరాత్రి తిండి సరిలేక, నిద్రసరిగాఁ బట్టక డబ్బుదొరక లేదని దిగులుతోఁ గుమారిలి, మార్వాడీ చేత లేదనిపించుకొని పదిమైళ్ళెండలో నడచివచ్చెను. అతని తలయు, గడ్డము నదివఱకే మాసియుండెను. గడచిన వారము దినములుగా క్షౌరము చేయించుకొనుటకు వీలు లేకపోయెను. ఒకరోజున నేకాదశి. మఱునాఁడు ద్వాదశి. నిన్న శుక్రవారము. నేఁడు శనివారము. అతనికిఁ బనిచేయించుకొనుటకు వీలులేకపోయెను. మనిసి యెండలోఁబడి వచ్చుటచేత నల్లపడిపోయెను.

రత్నావళి యతనిని జూచెను. ఆమెకుఁ దనమఱంది చెప్పిన మాటలన్నియు జ్ఞాపకమునకు వచ్చెను. సీతారామయ్య భార్యను బలుకరించవలె ననుకొనెను. రత్నావళి యతఁడుపలుకరించకముందే తిరిగి గదిలోనికిఁ బోయి పెద్దయద్దములోఁ దన మొగము చూచుకొనెను. చక్కనినుదురు. విరిగిన కనుబొమలు చెంపకు చేరేఁడేసి కన్నులు. కోసదేరి యందము పుణికిపుచ్చుకొన్న చిన్నగడ్డము. ఉబ్బి మిసమిస లాడుచున్న బుగ్గలు. ముడుతలు పడుచున్న మెడ. మెడలో నానుపేటలు, గొలుసు. చెవులకు దుద్దులు. ఎడమబుజమువిూఁద నుదికి స్వచ్ఛముగా నుండి ముడుతలుపడుచున్న పైఁట. మెడవైపునకు వంపుదేఱి తన ప్రాయపుమిసిమి వెలార్చుచున్న వక్షస్థలము. ఆమె కుడిచేతితో నద్దముపూని, యెడమచేయి మెడలో నానుజిగినీవిూఁద వేసెను. చేతికి బంగరపుటుంగర ముండెను. చేతిబంగారుగాజులు వెనుకవైపున నొడ్డగిల్లెను. తన మణికట్టువంగి యొక్కనరమైనను కనిపించుటలేదు. తా నెంత యందకత్తె. మొగమున చిన్న కుంకుమబొట్టు నెత్తురువోలె నుండెను. ఆమెకు సగమురాత్రి నిద్దురయే లేదుగానఁ గన్ను లెఱ్ఱవడియే యుండెను.

సీతారామయ్య భోజనము చేయుచుండెను. సరస్వతి వంటచేసెను. ఆమెచేతిక్రింది కేదియో యందీయవలసివచ్చెను. ఆమె వదినెగారిని రెండుసారులు పిలిచెను. ఆమె పలుకలేదు. సీతారామయ్యకుఁ గోపమువచ్చెను. 'గదిలో నున్నదానవు పలుకవేమి? అంత మొద్దుతన మెందుకు? రావేమి?' అని కేక వేసెను. రత్నావళి యప్పుడును కదలలేదు. సీతారామయ్య సంధ్య వార్చుకొనుచుండెను. అతఁడు కోపముతో లేచి గది

ముంగిటికి వచ్చెను. రత్నావళి మంచము మీఁదఁ బండుకొని యుండెను. అతఁడు చూచి కోపము వచ్చి చేతిలో నున్న చెంబెఁడునీళ్ళు రత్నావళిమీఁదఁ జల్లెను. ఆమె తలయంతయు తడిసెను. ఆమె చీరయంతయు తడిసెను. రవికయంతయు తడిసెను. పఱపుమీఁద పఱచిన దుప్పటియంతయుఁ దడిసెను.

రత్నావళి లేచి తల తుడుచుకొనెను. రవికయు, చీరయు మంచివి ధరించెను. తడిసిన గుడ్డ లెండవేసెను. ప్రొద్దుననే తల దువ్వుకొన్నది. జడ విప్పి పాపటలోఁ బొడిగుడ్డ పెట్టి తుడుచుకొని తల దూముడివేసికొనెను.

భోజనమువేళకు రంగారావు వచ్చెను. రంగఁడు పూర్వ మింటిలో మడికట్టుకొనెడివాఁడు. ఇప్పు డది పోయినది. ఆగుడ్డతోనే వచ్చి తినును. రంగడు ప్రతిదినమునను బ్రొద్దుననే వ్యాయామము చేసి స్నానముచేయును. అందుచేత భోజనము వేళ స్నానము చేయనక్కఱ లేదు.

అన్నదమ్ము లిఱువురును భోజనము చేయుచుండిరి. ఏదో పనిమీద రత్నావళి పడమటింటిలోనికిఁ బోయెను. సీతారామయ్యయిట్లనెను."ఇందాఁక, లేచుట కేవీలు లేకపోయెను. గరిటె యిట్లుపెట్టుమనఁగా లేవ లేకపోతివి.ఇప్పుడు లేచిచీర యెండ వేసితివి. దుప్పటి యెండవేసితివి. తల తుడుచుకొంటివి. గరిటె యిచ్చుటకు లేనియోపిక యింతపనిచేయుట కెచ్చటనుండివచ్చెను!" రంగ:— నీవు చెంబెడునీళ్లూ నెత్తిన పోస్తివాయెను. లేవక ఏంచేస్తుంది? ఆవిడ తలదువ్వుకుని చీర కట్టుకుంటే నీవు చూడనన్నా చూడ లేవు. మంచిపని చేశావు! సరస్వతి:—ఒరే! రంగా! మన మేమన్నా జమీందార్లమా? నలుగురూ నాల్గుపనులు చేసికోక

పోతే సంసారం ఎట్లా సాగుతుంది? నీ వొక దొరవు, ఆవిడ ఒక దొరసానిన్ని. మిమ్మల్నిద్దఱిని ఇంట్లోపెట్టి మేపాలి గావలెను! రంగ:—మీరు మోటువాళ్లు. మోటువాళ్ళకి నాగరకుల సంగతి ఏమి తెలుస్తుంది? చెంబెఁడునీళ్ళు నెత్తిన పొయ్యటం తెలుస్తుంది! సర—అవును. నాగరకులే. మీనాగరీకమంతా వెఁలిగిపోతోంది. సాగుతోంటే నాగరీకమే. అన్నయ్య సాగిస్తున్నాడు. ఉన్న రెండెకరాలుకూడా నీమూలంగా తాకట్టుపెట్టవలసి వచ్చింది. నీవేమో ఉద్ధరిస్తావనుకుంటోంటే వదినెగారిని వెనుకవేసుకు వస్తున్నావు. చాలు నోరుముయ్యి."

రంగఁడికి నింటిలో నెవరిభయమును లేదు. సరస్వతి యన్నచో భయము. ఆమె చాల చిత్రమైనమనిసి. ప్రతిదినము పవలామెయే వంటచేయవలయును. ఆమెకుఁగోపమువచ్చినచో వంటచేయదు. ప్రొద్దుతిరిగి మాణిక్యమ్మ మడికట్టుకొని వంట చేయవలయును. ఆవిడ యాదిన మెల్ల భోజనముచేయదు. ఆమె కూరక కోపము రాదు. తనతండ్రినాటి మర్యాద గృహములోఁ జెడినప్పుడు వచ్చును. ఇంటిలో నెవ్వరుగాని హద్దుమీఱి నపుడు వచ్చును. ఆమె యీ న్యాయమైనకోప మింటికిరక్షగా నుండెను. ఒకసారి సీతారామయ్య యూరిలో నొక పల్లెవానిని దిట్టెను. వాఁడు మఱలఁ దిట్టెను. సీతారామయ్య వానిని గొట్ట లేదు. ఊరకుండెను. సరస్వతి యన్నగారితో "నీవు వానిని ముందు మాట యేల మిగిలితివి? వాఁడు మఱల మిగులఁగా నేమియుఁ జేయలేనివాఁడవు, వానితో నేటికిఁ దగాదా పెట్టు కొంటివి? నాన్న మర్యాద యంతయుఁ బాడుచేసితివి. పో" మని రెండుదినము లింటిలో వంట చేయలేదు, చేయనీయలేదు. వీరి

యింటిలో సంగతి యానోట నానోట పొక్కి యా పల్లెవానికిఁ దెలిసెను. వాఁడువచ్చి సరస్వతికి దండములు పెట్టెను. "అమ్మా! తొందరపడ్డాను. నన్ను క్షమించి బువ్వ వండుకుతినండి. మీ నాయనగారి కడుపునఁబుట్టిన తల్లివి. మంచిరోసము గలదానవు. ఇప్పుడు నీవు నన్నుఁ బదితిట్లు, నేను పడుదును" అని యేడ్చెను. సరస్వతియన్నచో రంగఁడు సమాధానము చెప్పలేఁడు, చెప్పఁడు. సీతారామయ్య తన మనస్సులో నిట్లనుకొనెను. "నాకు వెఱ్ఱికోపము. పాపము, చీర విప్పివేసినది. దువ్వుకొన్న తల మఱల జడ యూడఁదీసికొన్నది. రంగఁడికి కోపము వచ్చుటకూడ న్యాయమే. నేను వట్టి పల్లెటూరివాఁడను. రంగ డన్నట్లు నేను నిజముగా మోటువాఁడనే."

అన్నదమ్ము లిద్దఱును భోజనము చేసి వెడలిపోయిరి.

మూఁడురోజులు సరిగాఁ గడచెను. నాల్గవనాఁడు సీతారామయ్య మార్వాడీయొద్దకుఁ బోయెను. ఈ మూఁడురోజులును నేకాంతము చిక్కినపుడెల్ల రత్నావళి మఱఁదివంకఁ జూచును. మఱఁదియు రత్నావళివంకఁ జూచును. అదివఱకు రత్నావళి రంగఁడికిఁ దొలఁగిపోవు చుండెను. ఈ మూన్నాళ్లు పెఱలు లేని యప్పుడు తొలఁగిపోలేదు.

ఆనాఁడురాత్రి యందఱును నిద్రించుచుండిరి. రాత్రి రెండుజాములవేళ రంగఁడు వచ్చి రత్నావళి గదితలుపు త్రోసెను. గదిలోపలగడియ వేసియున్నది. అతఁడు మఱల గోడ మీఁదనుండి లోనికి దిగెను. రత్నావళి మేల్కనియే యున్నది. ఆమె యెఱుఁగనట్లు ముసుఁగువేసికొని నిద్రాభినయము చేయుచుండెను. ఆమె నిద్రాభినయము చేయుచున్న దని రంగనికిఁ

దెలియును. అతఁడు నెమ్మదిగా నామెమీఁదఁ జేయివేసెను. ఆమె ముసుఁగు తీయలేదు. అతఁడు కొంచెము సేపూరకే నిలుచుండెను. ఆమె ముసుఁగు తీసి యతఁడు వెడలిపోయె నేమో యని చూచెను. అతఁ డచ్చటనే నిలుచుండెను. రత్నా:—మటల నెందుకు వచ్చితిరి? రంగ:—ఈ మఁనాన్నా ళ్ళలో మా అన్నయ్య నిన్నేమన్నా అన్నాఁడా? రత్నా:— ఏమీ అనలేదు. రంగ:—కాదు, నిజము చెప్పు. రత్నా:— ఆయన మోటువాఁడఁట. నేను నాగరకురాలనఁట. ఆయన పల్లెటూరివాఁడఁట. నేను సుకుమారినట. ఆయన చదువుకోని వాఁడఁట. నేను విద్యావతినఁట. ఆయన అందవికారిట. నేను రంభనఁట. ఈ మూఁడురోజులు ఇవ్వే మాటలు. రంగ:—సరే! ఇప్పటికన్నా ఆయనకుఁ దెలిసింది. రత్నా:—తెలిసి ఏమి లాభం? అసలు నిజంగా నాకు వచ్చినంత చదువు వారికిరాదా? రంగ:—చదువు రెండువిధాలు. ఒకటి గుమాస్తాపని చేసేది. రెండవ రాజ్యాలేలేది. మా అన్నయ్యకు గుమాస్తా పని చేసే చదువు వచ్చు. రత్నా—నాకురాజ్యాలేలేచదువువచ్చునా?మీఁకు వచ్చును. రంగా:—మొదటిచదువు రాకుండా వుంటే, రెండో చదువు తేలిగ్గా వస్తుంది. నేను ఎల్లుండి లక్నో పోతాను. నీకు కొన్నిపుస్తకాలూ, పత్రికలూ పంపిస్తాను. అవి నీవు చదువుతూ వుంటే, నీకూ అన్నిసంగతులూ తెలుస్తాయి. ఆఁడవాళ్లూ, మగ వాళ్లూ అందఱూసమానమే. ఆఁడవాళ్లే ఎప్పుడూ వంటఎందుకు చేయాలి? మగవాళ్లెందుకు చేయకూడదు? మగవాళ్లనిచూస్తే ఆఁడవాళ్ళు ఎందుకు తొలఁగిపోవాలి? ఎందుకు సిగ్గుపడాలి? నలుగురిలో ఆఁడవాళ్ళు మాట్లాడకూడదా? ఆఁడవాళ్లూ మగ

వాళ్లూ కలసి ఉండకూడదా? ఆడవాళ్లు బజారులోకి ఎందుకు పోకూడదు? మగవాళ్లతో కలసిమెలసి ఎందుకు ఉండకూడదు? భార్యాభర్తా యిద్దఱూ సమానమే. మా అన్నయ్య చెంబెడు నీళ్లూ నీ నెత్తిన పోశాడు. నీకు కోపమువచ్చి నీవు పోస్తే ఊరుకుంటాడా? ఏదీ! రేపు నువ్వుపోసి చూడు? ఎముకలు విరిగే టట్లు కొడతాడు. ఎందుకు కొడతాడు? నీవు తిరిగి కొట్టవు గనుక. కొట్టలేవా? నీవు తలుచుకుంటే మా అన్నయ్య నీముందాఁగలేడు. రత్నా:—నేనుమళ్లీకొడితే అప్రతిష్ఠకాదా! మొగుణ్ణి కొడతారా? రంగ—అది అలవాటులో ఉంది. భార్యాని కొడతారా? మొగుఁడుకొట్టవచ్చు; మొగుడు చంపినా భార్య చెప్పు క్రింద తేలల్లే పడిఉండాలని మనవాళ్లు నేర్పారు. అది సాగుతోంది. రత్నా:—రేపు మీ భార్యావస్తే మీరు ఆవిణ్ణి సుఖపెడతారన్నమాట. రంగ:—నేనసలు వివాహము చేసుకోను. అసలు వివాహం ఎందుకు? వివాహమంటే గంతకట్టటం. ఏ స్త్రీకి ఏ పురుషుఁడిమీఁద ప్రేమ ఉంటుందో వాళ్లిద్దఱు కలిసి ఉంటారు. వివాహము చేసికొనేది, సంసారము చేసేది వాళ్లిద్దఱూనూ. ఎవళ్లో వాళ్ళయిష్టము వచ్చినట్లు సంబంధాలు కుదిర్చి పెళ్ళిళ్ళుచేస్తే నేను ఒప్పుకోను. జీవితాంతం సుఖపడవలసిన విషయంలో వాళ్ళూ వీళ్ళూ జోక్యం కలిగించుకుంటే పనికిరాదు. నాయిష్టము వచ్చిన స్త్రీని నేను ప్రేమిస్తాను. ఈ దొంగపెళ్ళిళ్ళు నేను చేసుకోను. ఈ పెళ్ళిళ్ళు దొంగబ్రాహ్మలకు డబ్బిచ్చేటందుకు తప్ప ఎందుకూ పనికిరావు. పెళ్ళికి మంత్రాలెందుకు? స్త్రీ పురుషుల మధ్య ప్రేమ ఉండాలి. నాకు ఏ స్త్రీ అంటే ప్రేమ కలుగుతుందో, ఆ స్త్రీని చేసుకుం

టాను. ఇది నా సిద్ధాంతము. రత్నా:—మీరు పంపించే పుస్తకాలు నేను చదివితే అర్థమవుతయ్యా? రంగ—ఆపుస్తకాలుఎవరు చదివినా అర్థమవుతవి. మాస్నేహితులు కొందఱున్నారు. వాళ్లు అటువంటిభావలో వ్రాస్తారు. సుఖము, చదువు అందఱి అందుబాటులోను ఉండాలి. ఇది మా సిద్ధాంతం. ఆ పుస్తకాలు చదివితే అన్నిసంగతులూ నీకే తెలుస్తవి. రత్నా—ఆఁడవాళ్లూ మగవాళ్లూ ఒకళ్ళని ఒకళ్ళు తాఁకితే ఏమీతప్పులేదా? రంగ—మనదేశంలోనే ఈ తప్పంతా. ఇతరదేశాలల్లో ఈతప్పులేదు. అందఱూ కలిసి ఒకటేస్కూలులో చదువుకుంటారు. ఒకటే సభలో కూర్చుంటారు. ఇంగ్లండులో, అమెరికాలో ఆడవాళ్ళు ఉద్యోగాలు చేస్తున్నారు. పెద్ద పెద్ద ఉద్యోగాలు చేస్తున్నారు. ఎన్నో ఉత్తమ గ్రంథాలు వ్రాసిన ఆడవాళ్ళున్నారు. ఆ దేశంలో ఆఁడవాళ్ళు స్వేచ్ఛాజీవులు బూబులు కారు. మన ఆఁడవాళ్ళమల్లే అంట్లు తోమరు. రాజ్యాంగ విషయాలు విచారిస్తారు. లోకంలో జనమంతా ఎల్లాసుఖపడాలా, అందఱూ సమానమైన హక్కులు ఎల్లా అనుభవించాలా అనే విషయాలను గుఱించి గ్రంథాలు వ్రాశారు. ఆఁడవాళ్ళు వ్రాశారు. రత్నా—మీరు పంపించే పుస్తకాలు...... రంగ—నన్ను నీవు 'మీరు' అనకూడదు. 'నీవు' అనవలె. మన మందఱము ఒక్క తల్లి కడుపున పుట్టాం. నీవు నాకు సోదరివి. నేను నీకు సోదరుణ్ణి. ఇంగ్లీషులో 'బ్రదర్ అండ్ సిస్టర్' అంటారు. మనకు ఒకళ్ళ కొకళ్ళకు భేదము లేదు. రత్నా:—సరే, నువ్వు పంపించే పుస్తకాలు చదివితే నేను కూడా పుస్తకాలు వ్రాయఁగల్గుదునా? రంగ—తప్పకుండా వ్రాస్తావు. పుస్త

కాలు వ్రాయటమంటే అది ఒక గొప్పకాదు. మనకు ఎల్లావస్తే అల్లా వ్రాశాము. మనకు ఏ ఊహ పుడితే ఆ ఊహ వ్రాస్తాము. ఏ ఊహా చెడ్డదికాదు. లోకంలో కొన్ని ఊహాలు చెడ్డవి అని కొందఱు దొంగలు కల్పించారు. ఇప్పుడు చూడు ఒక ముసలివాఁడు ఒక పడుచు పెళ్ళాన్ని చేసుకొంటాడు. ఆ స్త్రీ ఇంకొకడితో మాట్లాడకూడదు. మాట్లాడితే ఆ ముసిలివాడికి నష్టంగాదూ! ఆవిడ తన ఈడైనవాళ్ళతో, తన కంటికి బాగా ఉన్నవాళ్ళతో, తాను ప్రేమించేవాళ్ళతో మాట్లాడుతుందేమో అని ఆముసలి వాడికి భయం. అట్లాంటి వాళ్ళందఱూ కలసి ఇల్లాంటి ఏర్పాట్లు చేశారు. ఇద్దఱు మనుష్యులు కలసి మాట్లాడితే తప్పా? ఒకరి నొకరు ముట్టుకుంటే తప్పా? రత్న:—సరే పుస్తకాలు పంపించండి. చదువుతాను. రంగ:—పంపించండి కాదు. పంపించు అనాలి. రత్నా:—అల్లాగే. పంపించు ఇంక మీరు వెళ్ళండి. వదినెగాని, అత్తగారు గాని లేస్తే ఏమనుకుంటారో? రంగ:—మన దేశంలో ఇదే దౌర్భాగ్యం. యూరపు దేశాలల్లో ఒక స్త్రీ ఇంకొక స్నేహితుఁడు మాట్లాడుతోంటే ఆ స్త్రీ మగఁడుకూడా లోపలికిపోఁడు. ఆ స్త్రీ అంటే భర్తకు అంతనమ్మకం. నమ్మకంమీాద లోకం నడుస్తుంది గాని అదుపులు, ఆజ్ఞలు పెడితే ఏమి నడుస్తుంది? రత్నా:—నిజమే. నేను రేపటినుంచి నా ఇష్టంవచ్చిన ట్లుంటాను. మీా అక్కయ్య ఒద్దిక నాకు చాలా కష్టంగా ఉంది. రంగ:—ఆవిడఆట ఇంట్లో తెగసాగుతోంది. నువ్వైనా ఎదురు తిరిగితేనే కాని కొంత దారికి రాదు. అంటే నీవు నామార్గానికి వచ్చావన్నమాటే. మన మిద్దఱమూ ఒకటైతే ఈ ఇల్లు బాగుచేయ

వచ్చు. అన్నీ పాతఊహలు, పాత ఆచారాలు. ఆ మడి బట్టలు ఆరవెయ్యటం ఎందుకో! మా అన్నయ్య అప్పుడప్పుడు పట్టుబట్ట కట్టుకుంటాడు చూడు. అది మా అమ్మమ్మ పుట్టెకి తడిసిన గుడ్డ. చాకలివాడు చక్కగా ఉతుక్కువస్తే ఆ గుడ్డ మడికాదట. మిఠాయివండేవాళ్లు కట్టుకుంటారే అల్లాంటి ఈ పట్టుబట్ట మడియట. సిస్టర్! ఇంక నేను సెలవు తీసుకుంటాను."

అని రంగడామె చేయిపట్టుకొని కదిలించెను. ఆమె చేయి కొంచెము వెనుకకు తీసికొని మఱల నట్లే ఉంచెను. అతడు "ఇందులో తప్పేమియు లేదు. ఇది సోదరసోదరీభావము. ప్రపంచకమంతా ఒక్కటే. మనలో మనకు భేదములేదు" అని యామెను గౌగిలించుకొనెను. రత్నావళియు రంగని బలవంతముచేత నతనిని గౌగిలించుకొనెను.

రంగని కది యంతయు నొక మహోన్నతసిద్ధాంతము నాచరించుచున్నట్లు తోచెను. అతని మనస్సులో వేఱొక దుష్టపుటూహ లేదు. రత్నావళికి రంగని మనఃపరిపాకము లేదు. రంగనికున్న యొక యున్నతాదర్శమునందు విశ్వాసము లేదు.

కాని యిరువురయెదలలో నొక వికృతమైనసంచలనము జరిగెను. ఆ సంచలనముయొక్క స్వరూపము రంగనికి దెలియ లేదు. అతడు వట్టిబిందుపతన మెఱుగని యచ్ఛబాలమేఘము. ఇంద్రధనుస్సుయొక్క రొఱపిడి తెలియని యకల్మష ప్రాగ్గగన రేఖ. పెనవెట్టి కన్నెలేడి కొఱుకని బాలఘాసము. ఆ మేఘము నకు దన జలదమండలసంచారయోగ్యతయే తెలియును. మహాగిరిశిఖరము లొఱసికొని శిథిల మగుట తెలియదు. ఆ ద్యూకాశమునకు దన యానంతత్వమే తెలియును. దేశసబంధి

తమై తనకు ప్రాశస్త్య మేర్పడుట తెలియదు. తన్ను హరి ధనువు లొఱసి కిర్మీరితము సేయు నని తెలియదు. తొలి సముద్రము లుబికి యావిరులు క్రమ్మి తన్ను గప్పునని తెలియదు. ఆ బాలఘనమునకుఁ దన పసిమియే తెలియును. పైర గాలిలో స్వేచ్ఛగా తా నాడుచున్నా ననియే తెలియును. ఒక జింకయో, దుప్పియో తనను గసిక్కునఁ గొఱుకఁగలదని తెలియదు. తాను ముదిరి వేసఁగియెండల కెండి మోడుగాఁ దేలుదు నని తెలియదు. కాని యామేఘమునకు, నా యాకాశమునకు, నా బాలఘనమునకు నా కొండ యొఱపిడి, యాధనువు రాపిడి, యాలేడి వంటినూర్పిడి యాజన్మసిద్ధములై యుండెను.

రత్నావళి మన స్సెట్లు కాదు. ఆమె యనాఘ్రాతమైన పుష్పము కాదు. లోకమునందలి బహుసిద్ధాంతరాద్ధాంతము లామె యెఱుఁగక పోవచ్చును. లోకమునందలి సౌఖ్యము యొక్క పరమావధి యామె మనోవధిగా నుండకపోయినను శరీరావధిగా నుండెను. ఆమె యొక క్రొత్తవికారము పొందెను. ఆమె యంతలో శరీరము కుంచించుకొని పిట్టవలె రంగని కౌగిటిలో నొదిఁగెను.

రంగని యున్నతాదర్శములు మనస్సునకు నికషప్రాయములైనను, వానిశరీరము వానిమనస్సుకన్న వానికిఁ దెలియకుండ బలవత్తర మయ్యెను. వానికి స్మృతిలేదు. వానికి మనస్సులేదు. వాని కాలోచనలేదు. వానికిఁ జైతన్యము లేదు. వాని శరీరము వాని సృష్టినంతయు ముంచివేసెను. అతనికి శరీర మంత శక్తిమంతమని పూర్వము తెలియదు. ఇప్పుడు తెలిసికొను జ్ఞానము లేదు. బలవత్తమమైన యీ శరీరము నింతఘూర్ణను

వచ్చి మనుష్యుండు స్వాధీనపఱచుకొనలేడు. మొలకయై వంగ నిది బ్రానై వంగదు. నిగ్రహ మనునది సాధనావిషయము; సిద్ధాంత విషయము గాదు. పూర్వపక్షవిషయము కాదు.

సాధన జీవితవిషయము. జీవితమునం దేక దేశవిషయము కాదు. జీవితమంతయు నొక సాధన. ఆ సాధనాబుద్ధియే లేనివానికి సాధనామార్గము గోచరింపదు. ఈ రహస్యము రంగనికిం దెలియదు. బాలఘాసము పెరిగినది. పువ్వు వికసించినది. సెలయేఱు బయలుదేఱినది. అన్నియు శోభావిషయములు. అన్నియు సౌందర్యపు బొమ్మలు. అనుభూతి దశాప్రతిపాలనాసంతోశరమ్యములు. ఇదియే వానియూహ. ఆ బాలఘాస మెండిపోవును. లేడి తినుట కుపయోగించినను చాలును. ఆ పుష్పము జేపుప్రొద్దున వడిలిపోవును. దాని వాసన గాలి కొంత సేకరించినంజాలును. ఆ సెలయేఱుపోయి యొక పెద్ద చెఱువులోంబడిన చాలును. ఈ బాలఘాసము యజ్ఞయోగ్యము కాలేదని, యీ పుష్ప మప్సరశ్శిరోభూషణము కాలేదని, యీ సెలయేఱు శచీపురందరులకుం జల్లాట కుపయోగించలేదని యేమివగపు? దర్భలు యజ్ఞోపకరణము లగును. అన్నియుంగావు. యోగ్యతగలవి యగును. యోగ్యత దానియందలి దర్భత్వముచేతగాదు; దేశకాలపరిస్థితులచేత. దేశకాలపరిస్థితు లన్నియుం బిండీకరించి యొక గుళికగాం జేసెదవో! కొన్ని పరిస్థితులు చేయుదువు. అన్ని దేశములు, నన్నికాలములు, నన్నిపరిస్థితులు నీ మనశ్శ్మార్పమునం జెరుగుదువో! అప్పుడుకూడ కొన్నిగింజలు వెనుకకును, గొన్నిగింజలు ముందునకును వచ్చును.

మఱునాఁడు సీతారామయ్య వచ్చెను. డబ్బు తెచ్చెను. ఆ నాఁడే రంగారావు ప్రయాణమయి పోయెను. రంగారావు ప్రాణ మూరకే గగ్గోలుపడుచుండెను. అతని మనస్సులో యోజించనిది, యతని హృదయములో వ్యగ్రము కానిది, హఠాత్తుగా నొక పరిస్థితి సంభవించినది! ఆ పరిస్థితికిఁ దా నెంతవఱకు బాధ్యుఁడు? తాను దానినిగుఱించి యూహించ లేదు. అట్టి యూహ యతనికి రాలేదు.

శరీరమంతయు మనస్సు నొద్దికలోనిదికదా! ఈ శరీరమే మనస్సు నొద్దికలో నున్నదా? లేక మనస్సే శరీరము నొద్దికలో నున్నదా? మనస్సే శరీరమునొద్దికలో నున్నయెడలఁ దా నిదివఱకు యోజించి నిశ్చయపఱచిన సిద్ధాంతము లన్నియుఁ దల్లక్రిందు లగుచున్నవి. మన స్సాలోచించును. శరీరము దాని యాలోచనను లెక్కపెట్టదు. హృదయమునకు, శరీరమునకు సంబంధము. అవి రెండు నొక గాడిని పడిపోవును.

వానితో సంప్రదించకుండ మనస్సు సూత్రములను జేసిన నేమిలాభము? శరీరహృదయముల పోకడ లెట్టివో తెలిసి కొని, యా పోకడలవెంటఁ బోవుటకో, యా పోకడల సరి కట్టుటకో మనస్సు యోజించి సూత్రించినచో తత్సూత్రార్థా చరణమందు దోసఁగు పొసఁగదు. వాని రెంటినిఁ బరిత్యజించి మనస్సు లక్షసూత్రములు చేసినను, వాని ప్రాబల్యముముందు వట్టి యూహాజన్యము లైన సిద్ధాంతములు తేలిపోవును.

ఈ రహస్యము రంగారావునకు లీలగాఁ దోఁచెను. దానిని వ్యగ్రముగాఁ జేసి మనోదఘ్నము చేయునంత వివేకము రంగారావునకు లేకపోయెను.

రంగఁడు తనకు గలిగిన పరాభవమునకు ఖిన్నుఁడయ్యెను. అతనికి దెలియకుండ నతని మనస్సులో నొక సంతోషరేఖ తోఁచెను. ఒకయుత్సాహరేఖ కదలెను. ఆ సంతోషము, నా యుత్సాహమును మనస్సుపైకిఁ దెచ్చి, ఛీ! కాదని నిరాకరించునంతటి శక్తి యతనికి లేకపోయెను. ఆ సంతోషమును హృదయములో నట్టడుగున నుండనిచ్చెను మనస్సులోఁ దన పరాభవమును గూర్చి శోకింప నారంభించెను. తాను దన వదినెగారినిఁ బ్రేమించెనా? ప్రేమింపలేదు. ఆమెను తనకు భార్యగా స్వీకరింపవలె నని యనుకొనెనా? అనుకొనలేదు. మఱి తనయందుఁ గావలసిన నిగ్రహము లేదా? నిగ్రహమెందుకు లేదు? అంతవఱకతఁడు స్త్రీమొగ మెఱుఁగఁడు. ఈ విపర్యయ మేల సంభవించెను?

రంగఁడు మనసులోఁ గలవరమునిలుపుకొనలేకపోయెను. ఆనాఁడు సాయంకాలమే ప్రయాణముకట్టెను. ఇంటిలో నందఱును మఱునాఁడు పోవచ్చు ననిరి. అతఁడు పెట్టెయుఁ, బఱుపును సర్ది యొక బండిని పిలిచి దానిపైఁ బ్రయాణమయ్యెను. బయలుదేఱువేళకు రత్నావళి కనిపించెను. రాతిరినుండియు నామెను రంగఁడు చూడలేదు. ప్రొద్దునే లేచి సముద్రపు గుట్టపైఁ బోయి కూర్చుండెను. భోజనమువేళకు వచ్చెను. అతఁడు భోజనము చేయుచున్న సమయమున రత్నావళి గదిలోనుండి బయటికి రాలేదు. అతఁడు భోజనము చేసి గదిలో ముసుఁగుపెట్టుకొని పండుకొనెను. కొంతసేపటికి సీతారామయ్య కబురుతెచ్చెను. తెచ్చినవెంటనే రంగఁడు బయలుదేరెను—రత్నావళి మొగములో నొక లజ్జ, యొక మాన్మథ

విలాసము, నొక యుత్సాహదీప్తి, యొక శంకాసంకులత్వము కనిపించుచుండెను. ఆమె శరీరావయవములయందును, నిలుచున్న వైఖరియందును మాన్మథరేఖయే గోచరించెను. రంగని మనఃఖిన్నత్వము సగము నశఃకరించి యతని హృదయములోని సంతోషరేఖ యతనికిఁ దెలియకుండఁ బొంగివచ్చెను. బండి వెడలిపోయెను.

## మూడవ అధ్యాయము

రంగారావు లక్నోకు పోయి యాఱునెలలు దాఁటెను. సీతారామయ్య మార్వాడీయొద్దనుండి మఱినాల్గువందలు తెచ్చి పంపించెను. మఱల రెండువందలు కావలెనని యుత్తరము వచ్చెను. ఈ యుత్తరముతో మఱికొన్నిపుస్తకములుకూడ వచ్చెను. అపుస్తకము లెందుకు పంపించెనో యేమియు వ్రాయలేదు. ఇంటిలో నెవరు చదువుదురు? సీతారామయ్యకు వానితో నవసరములేదు. తల్లి మాణిక్యమ్మ తెల్లవాఱుకడ నాల్గుగంటలకే నిద్ర మేల్కొనును. వాకిలి యూడ్చి ముగ్గు వేయును. తరువాత భోజన మగువఱకుఁ జిన్నపని, పెద్దపని చేయుచుఁ. గొంతసే పాయాసపడుచుఁ, గొంతసేపు తన్నుఁ దాఁ దిట్టుకొనుచు, మఱికొంతసేపు కూఁతురుమీఁద సవాళ్లు తీయుచు భోజనముల వేళదాఁక నా సముద్రమంత యింటిలో నీఁదుచుండును. భోజనము చేసి పండుకొనును. సాయంకాల మైనవెంటనే అంట్లు తోముట, కసపూడ్చుట, నీళ్లుచల్లుట ముగ్గువేయుట, పీటలు, చెంబులు మరలఁ గడుగుట, యేవో యిట్టి పనులతోడనే యామెకు రోజు చెల్లిపోవును. ఆమె

కీపుస్తకములతో నేమవసరము? ఇంక సరస్వతి యున్నది. ఆమె సూర్యోదయ మైనగాని లేవదు. లేచినతరువాత నామె కాయింటిలో వేయుపను లుండును. ఆ యిల్లు సముద్రమంత యిల్లు. ప్రాతదికూడను. ఇల్లుకట్టి రెండుతరములు గడచినవి. సముద్రతీరమగుటచేత నిల్లు చవుడురలుచుండును. అంతయు మట్టియిల్లు. గోడలు కొన్ని మట్టితోఁ బెట్టినవి. వారమునకు రెండుసారు లిల్లంతయు మన్నును, బేఁడయువేసి యలుకవల యును. గోడలు పెళ్ళలూడిపడి చవుడురలును. ఆమె రోజున కొకగోడఁగా క్రొత్తమట్టితో గోడలుమెత్తి బాగుచేయును. ఇల్లలుకుటయో, గోడలు మెత్తుటయో యేదోయొక పనితో నామెకుఁ బ్రొద్దెక్కును, ఆ యూర మంచినీళ్ళబావులు లేవు. సముద్రపుటొడ్డున నొకచోట రెండు మంచినీళ్లబావులు కలవు. ఊరికి నచ్చటికి చాలదూర ముండును. ఊరిలో నున్నవా రందఱును పోయి మంచినీళ్ళక్కడనుండియే తెచ్చుకొందురు. ప్రొద్దెక్కు వఱకు నాబావికిఁ దెఱపియుండదు. ప్రొద్దెక్కువఱకు నూరిలో నున్న శూద్రులందఱును బావులచుట్టు నుందురు. జామున్నరప్రొద్దు దాఁటిగాని బ్రాహ్మణస్త్రీలు పోరు. ఈ పదియిండ్ల బ్రాహ్మణులు నప్పుడు పోదురు. సరస్వతికూడ నప్పుడే పోయి బావినీళ్లు తెచ్చును. ఇంటిలో నాలుగైదు బిందెలు తెచ్చినఁగాని సరిపోవు. క్రొత్త కోడ లని రత్నావళిని బావులకుఁ బంపించరు. అదిగాక రత్నావళి చలిదియన్నము తినును. ఆమె తెచ్చినచో నీళ్ళు మడికి పనికిరావు. మాణి క్యమ్మ ముసలిది. ఆమె జీవితమంతయు నా బావులనుండి నీళ్లు తెచ్చుటతోడనే సరిపోయినది. ఈ నాలుగైదు బిందెలును సర

స్వతి తనయొక్క చేతిమీఁదుగాఁ దేవలయును. అప్పటికే పగఁలు రెండుజాము లగుఁను. అప్పుడు సరస్వతి మడిగట్టుకొని వంట చేయును. ఈలోపుగా నామెకు నొకవేయిపనులు. ఇంటిలో కూరనార చూచుకొను పనియంతయు నామెదే. దొడ్డిలో ననేకములగు పాదులు పెట్టును. ఆపాదులకు పందిళ్ళు వేయవల యును. ఆపందిళ్లకుఁ దడపలు, త్రాళ్ళు, చిన్న చిన్న పుల్లలు నెచ్చటివో తెచ్చి యామె యదుకుపెట్టును. ప్రాలిపోవుచున్న తీఁగలు వానిమీఁదఁ బ్రాఁకించును. కొన్నిపాదులు మంచి తీర్థము పోసినఁగాని బ్రతుకవు. వానికోస మొక మంచినీళ్ళ బిందె ప్రత్యేకముగాఁ దేవలసియుండును. ఒక్కొక్కప్పు డింటిలోఁ గూరయుండదు. నూటికిఁగోటికి నక్కలకు బస్తీల నుండి కూరలు తెత్తురుగాని దైనందినముగాఁ బల్లెటూరి వారికిఁ గూర లెచ్చట నుండి వచ్చును? అప్పుడప్పుడు తట్టల వాండ్రు కూర లమ్మకమునకుఁ దెత్తురు. ఎత్తుకెత్తువడ్లుపోసినఁ గాని కూరలు కొన వీలులేదు. ఆ సంసారము గడచుటయే కష్ట ముగా నున్నపుడు వడ్లుపోసి కూర లెక్కడ కొందురు? క్రొత్త కోడలు కూరలేకపోయినచో ముద్దయెత్తదు. సరస్వతి యెట్లో యట్లు కూర సమకూర్చును. ఏయాకో పేరు చెప్పకుండఁబులుసు పెట్టి వండును. ఆమె యేపదార్థము చేసినను నవ్ర్రుతాయమూన ముగ నుండును. ఏ దొండపాదో విరియఁగాచినచో నూరిలోఁ దక్కిన వారందఱకును వంతులుగాఁ బంచిపెట్టును. నోరుమంచి దైన నూరు మంచిదికదా! దొడ్డిలో నేకూరయు దొరకనిచో నామె యేయింటికిఁ బోయినను గూరపెట్టుదురు. ఆ యింటిలో నెవరు వచ్చినను సరస్వతినే పలుకరింతురు. ఎవరి కేపని కావల

సినను సరస్వతమ్మగారికే పిలుపు. ఆమె కాఁపురము మిక్కిలి పొదుపు చేయును. సీతారామయ్య కాఁపురము సాగుటకు భగవంతుఁ డామెను విధవరాలినిఁ జేసెను గాఁబోలు. నేయి జాగ్రత్తగా వాడుటలో, నింటిలో నేవస్తువు కావలయునో, యేది యక్కఱలేదో, యొకవస్తువు లేనిచో నెట్లు గడపుకొనవలయునో ఆ యీవిద్యలలో నామె పారంగతురాలు. ఆమెమూలముగా నా లేనిసంసారములో లేమిలేక యున్నది. ఆమెమూలమున సీతారామయ్యకు సంసారపురొష్టు లేదు. సీతారామయ్య మొదటి భార్య బ్రతికియున్నపుడు వదినెగారును, నాఁడుబిడ్డయును గలసి చక్కఁగా సంసారము సాగించుకొనిరి. ఇపుడు సరస్వతి యొక్కతెయు నైనది.

భోజనము లగువఱకుఁ బ్రొద్దు తిరుగును. తరువాతను నామెకుఁ దీరికలేదు. కొంతసేపు విశ్రామము తీసికొన్నచోఁ దీసికొనును. కాక వడ్లు దంపించుటయో, కందులు, పెసలు చేయుటయో, కారముకొట్టుటయో, పిండి విసరుటయో, యేపని యున్నను నామె చేసికొనవలయును. ఇంతలో బ్రొద్దుగ్రుంకును.

ఆమెకీ పుస్తకములతో నవసరము లేదు. ఈపుస్తకములింక నెవరికి? సీతారామయ్య ప్రొద్దుననే లేచును. కరణికపు లెక్కల యొత్తిడియున్నచో నఱుఁగుమీఁదఁ గూర్చుండి భోజనమునకు లేచువఱకు నక్లు వ్రాయుచుండును. ఆ లెక్కలు లేనిచో నేవో పనుల మీఁద గ్రామముమీఁదికిఁ బోవును. ఒకచోట నొకపొలము మహాయతు చేయవలసి యుండును. మఱి యొకచోట నేదో వ్యవహారము ముడిపెట్టవలసియుండును. ఏదో పనిమీఁదఁ బొరుగూరికి బోవలసి యుండును. ఒకొ్కకపుడు

మెతుకులు నోటిలో వేసికొనుట యాలస్యముగ నట్లే పడి పోవలయును. ఊరిలో నుత్తమకులజులైన శూద్రులలో నొక రిద్దఱు కొంచెము సంపన్నగృహస్థు లుండిరి. వారి లెక్కలు సీతారామయ్యయే చూచుచుండును. వారివలన తృణమో, పణమో సీతారామయ్యకు ముట్టుచుండును.

ఈ పుస్తకములు చదువుట కతనికిఁ దీరుబడి లేదు. ఎప్పుడైనను దీరుబడి యున్నచో వారి యింటిలో భాగవతము, భారతము నున్నవి; అవి చదువును. అతనికి గొప్ప భాషా జ్ఞానము లేదు. కాని చదివినచో నర్థమగును.

రంగఁడీ పుస్తకములు పంపించిన దెవరికోసమో? ఆఱు నెలల క్రిందఁ బంపింతునన్న పుస్తకము లిప్పుడేల పంపించెనో? ఈ యాఱునెల లేల పంపలేదో? ఆ పంపించిన పుస్తకములు రెండునవలలు. వానిలోని కథలు స్త్రీస్వాతంత్ర్యము, రంగని సిద్ధాంతములు ప్రతిపాదించు కథాసంవిధానములు కల గ్రంథ ములు. నాలుగు మాసపత్రికల సంచికలు. అవి నాలుగు నొక పత్రికవే. పూర్వ సంప్రదాయములు, పూర్వాచార సంఘ మర్యాదలును పుచ్చిపోయిన వని, ప్రాఁతవడి శిథిలములైన వని, యవి కొందఱు వృద్ధులు స్వలాభాపేక్షతో నిర్మించిన పద్ధతులని వ్యాఖ్యానములు చేసిన వ్యాసములు కలిగిన సంచి కలు. ఇవియన్నియు పని తక్కువగానున్న రత్నావళిమాత్రమే చదువఁగలదు. ఇంటిలోని పనులన్నియు నత్తగారును, నాఁడు బిడ్డయుఁ జేసికొందురు. ఈమె గుడ్డ లుతకనక్కఱ లేదు. ఇల్లు అలుక నక్కఱ లేదు. వంట చేయనక్కఱ లేదు. గోడలు మెత్త నక్కఱ లేదు. కూరలపాదులు పెంచనక్కఱ లేదు. మఱి యేమి

చేయును? ప్రొద్దుటింతల పీటలు కడుగును. చెంబులుతోముసు. ఆడుబిడ్డ యిల్లలికినచో ముగ్గుకఱ్ఱలు తీయును. సంజలఁ గసవు చిమ్మును, నీళ్ళు చిలుకును. బిందెలోఁ జముగు పోయును. భోజనము చేయును. తల దువ్వుకొనును. చీర నలుగకుండ నా చెంబక్కడ, నీ చెంబక్కడ పెట్టును. తన సవతికూఁతురు, సవతి కొడుకు, మేనల్లుఁడు నున్నప్పుడు వారికి చలిదియన్నములు పెట్టుట, తలలు దువ్వుట, నీళ్ళుపోయుట, యిటువంటి చిన్ని పనులైన నుండెడివి. ఇప్పు డవియును లేవు.

రత్నావళి యా పుస్తకములు చదువ నారంభించెను. ఆమె కాఁపురమునకు వచ్చిన తరువాత మొదటి దినములలో భారతము, భాగవతము చదువుచుండెడిది. ఎప్పుడు నవే పుస్తకములు చదువుట యామెకు విసుగెత్తెను. ఈ మధ్య కొన్నాళ్లనుండి యాం పుస్తకములు ముట్టుకొనుటలేదు. ఇప్పుడు సరిక్రొత్త పుస్తకములు వచ్చెను.

రత్నావళి మఱంది చదువులకు పోయిన యీ యేఁటి క్రొత్తలో నొక పదిరోజు లటుచెంబుతీసి యిటుపెట్టలేదు. ఇంటిలో నెవరు పిలిచినను బలుకలేదు. సరస్వతి కోపపడినది. ఆమెను లెక్కచేయలేదు. సీతారామయ్య రెండు మూఁడుసార్లు కోపించెను. కొట్టఁబోయెను. ఆమె లెక్కచేయలేదు. ఏదో దయ్యము పట్టినదనుకొన్నారు. మాణిక్యమ్మ సోదె యడిగెను. ఆ సోదెలో నేమియుఁ దేలలేదు. ఎవరో యొక బ్రాహ్మణుఁడు నొసటఁ గుంకుమ పెట్టుకొని భూతవైద్యుఁడ నంచు గ్రామము లోనికి వచ్చెను. అతనిచేత మంత్రపు నీళ్ళిప్పించిరి. రక్షరేకు కట్టించిరి. అప్పటికే మూఁడునెలలయ్యెను. రంగని యొద్దనుండి

యొకటి రెండుత్తరములు వచ్చెను. వానిలో రత్నావళి ప్రస్తావనయే లేదు. అతఁడు పంపింతునన్న పుస్తకములు రాలేదు. మంత్రపు నీళ్ళతో, రక్షరేకుతో రత్నావళివ్యాధి తగ్గినది. రత్నావళి మఱల గృహములో యథాప్రకారముగ నుండుచుండెను. ఆమె మనస్సులో మఱఁది వెళ్ళిననాఁటి వెనుకటిరాత్రి జరిగిన వర్తమానము బూజుపట్టఁజొచ్చెను. అది యొకానొకప్పుడు సెలవేయును. ఒక క్రొత్తమధురిమ రత్నావళి యెదలోఁ బుష్పించును. దానికిఁ బరిపోషకముగా నేయుపాధియు లేకపోవుటచేత నది యట్లే మణఁగిపోవును. ఆ భావనలు మఱలఁ బుస్తకములతో రేకెత్తెను. రంగఁడు తన్ను మఱచిపోలేదని భావించెను. ఆఱునెల లొదిఁగి యొదిఁగియున్న యొక మధురిమ యుబికి తిరుగఁబోసికొని యడుగులు పైకిఁదేరి క్రొత్తకళలు చూపెను. రంగఁ డిన్నాళ్లు పుస్తకములేల పంపించలేదో? పాపపుణ్యములు లేవని యతని సిద్ధాంతము. ఉన్నవని యొకయనుభూతి చెప్పెను. ఆయనుభూతి దట్టమై యతని నరికట్టెను. అతఁడీ సంకులసమరమునుండి వెలికి వచ్చుటకుఁ గాలు నిలువఁ ద్రొక్కుకొనుటకుఁ నాల్గు నెలలు పట్టెను. దీనికిఁదోడు పరీక్షలకుఁ జదువవలసియుండెను. నాల్గునెల లైనతరువాత నతని మనస్సు మఱలఁ గుదుటఁబడెను. అతని సిద్ధాంతములు సంశయములను బెడఁద్రోసి మఱల తమరాజ్యమును దాము స్థాపించుకొనెను. రంగఁడు నాల్గునెలలు తంటాలుపడి దారి తప్పిపోయి మఱలఁ గట్టుకొయ్యకుఁ జేరు పశువువలెఁ దన సిద్ధాంతముల దగ్గఱకే వచ్చెను. తత్సిద్ధాంతానుయాయులకు లోకములోఁ గనుపించున దొక్కటే విషయము. స్త్రీ పురుష సంబంధము,

లోకములోని దారిద్ర్యము, ఒక్కొక్క కుటుంబపు పరిస్థితులు ఆ కుటుంబముయొక్క పూర్వమర్యాదలు, ఆ కుటుంబములోని భిన్నవ్యక్తులకుఁ గల పరస్పరసంబంధములు—వీనిని గూర్చి యోజింపరు. అందఱును గలసియుండవచ్చును. స్త్రీ పురుషు లొకరి నొకరు స్పృశింపవచ్చును. కౌఁగిలించుకొనుట, ముద్దు పెట్టుకొనుట సామాన్యాచారములు కావచ్చును. ఒక దేశములో నున్న యొక యాచారము రెండవ దేశములో నాచారముగా నుండుటకుఁ బనికిరాదేమో? స్త్రీ పురుషులమధ్య స్పర్శము, పరిష్వంగము, చుంబనము సామాన్యాచారములుగా నుండ వలసినచో నతఁడు తన యక్కగారితోఁ, దల్లితో నీ విష యము లేల చర్చింపలేదు? వారియం దివియేల యాచరింప లేదు? తన యన్నగారిని దా నెప్పుడు నేల కౌఁగిలించుకొన లేదు? ఈ సిద్ధాంతాచరణవిషయమునందుఁ బురుషులు, వృద్ధులు, అక్కలు, సెల్లెండ్రు, తల్లులు విషయములు కారో! వయసులోనున్న స్త్రీలు మాత్రమే యీ సిద్ధాంతములకు విష యము లగుదురో! రత్నావళికి బుస్తకములు చదివినకొలదియు హృదయములోనున్న బహువికారములు వ్యగ్రములై జాగ్రత్ స్థితిని పొందెను. ఆ పుస్తకములలోఁ జాలచోట్ల పురాణముల యందు బూతులు వ్రాయఁబడియుండె నని యున్నది. మత్స్య గంధి విషయము, కుంతివిషయము, ద్రౌపది విషయమును మిక్కిలి నిందగా వ్రాయఁబడియుండెను. వారందఱును పతి వ్రతలు కారనియు, నానాఁటి సంఘాచారములు యథేచ్ఛముగా నుండెననియు వ్యాఖ్యానములు చేయఁబడి యుండెను. రత్నా వళి కావాదన లన్నియు నచ్చెను.

రత్నావళి వానినన్నిటినీ జదివినకొలఁది క్రొత్తమనిసి యయ్యెను. అదివఱకు గృహములోఁ దానుజేయు చిన్న చిన్న పనులుకూడఁ జేయుట మానివేసెను. ఈమె పనిచేయుట, మానినప్పటినుండియు సరస్వతికి, నామెకుఁ బడలేదు. సరస్వతి సూటిపోటిగా రత్నావళి నేదో యనును. "నా కెట్లా సాగుతుందమ్మా, నే నేమి యింటి కోడలినా?" అనును. "నేను కూలికి వచ్చాను. కూలిచేస్తున్నాను. పనిచేస్తేగాని నాపొట్ట గడవదు. దొరసానులకు సాగుతుందిగాని, నాకేమిసాగుతుంది!" అనును. మొదటిలో నిటువంటి తుప్పర బయలుదేఱెను గాని తరువాతఁ గ్రమముగా నిది వర్షమయ్యెను. సరస్వతి బావుల నుండి మంచితీర్థము తానొక్కతెయుఁ దే ననెను. "మూఁడేళ్లయినది. కాఁపురమునకు వచ్చి; యింక నెన్నాళ్లే నీ కోడలికీఘోషా?" యని తల్లితో వాదించెను. సరస్వతి చిత్రమైన మనిసి. ఆమె యొక యూహచేసినచో నది చివరదాఁక చేయును. ఒకరోజున బావికిఁబోయి మంచితీర్థము నిజముగానే తీసికొని రాలేదు. సీతారామయ్య భోజనమునకు వచ్చెను. సరస్వతి త్రాగుట కుప్పునీళ్ళు పోసెను. అతఁడు త్రాగఁబోయి, యుప్పునీళ్లగుట నుమిసి, చెల్లెలితో "అమ్మాయీ! ఇవి ఉప్పునీళ్లమ్మా, మంచినీళ్ళు పోయు"మనెను. సరస్వతి మాటాడలేదు. మాణిక్యమ్మ కలిపించుకొని, "నాయనా! ఇవ్వాళ యెవరున్నూ మంచినీళ్ళు తేలేదు. నీ చెల్లెలు తేపటినుంచి మంచినీళ్ళు తీసుకు రాదఁట. ఆ పసిపిల్లతో వంతు పెట్టుకుంది. నేను ముసలి ముండను, పోలేను" అని పొరుగింటికిఁ బోయి వారి నడిగి యొక చిన్నబిందెఁడు మంచినీళ్ళు తెచ్చెను.

మఱునాఁడు నిదియే నాటకము జరిగెను. సీతారామయ్య యిట్లనెను "ఏమమ్మా! నీవురోజూ నీళ్ళు తెస్తోంటివి. ఈరెండు రోజులూ యిట్లాచేశా వేమి?" అని. భార్యను బిలిచెను. రత్నావళి మాటాడలేదు. అతఁడు లేచి గదిలోనికిఁ బోయి "నీవు గూడ పోయి నీళ్ళు తీసికొనిరారాదా? అది ఒక్కత్తె నాల్గు బిందెలు తేవడం కష్టంకాదా?" అనెను.

రత్నావళి మాటాడలేదు. ఆనాఁడు జరిగిపోయెను. సాయంకాలమున మాణిక్యమ్మ పోయి యొక బిందెఁడునీళ్ళు తెచ్చెను. ఆ మఱునాఁడు సరస్వతియే మంచినీళ్ళు తెచ్చెను. ఆ రాత్రి సరస్వతి యన్నగారితో నిట్లుచెప్పెను. "అన్నయ్యా! నీ భార్యసంగతి యేమీ బాగా లేదు. ఆవిడ రోజులు గడచిన కొద్దీ ముదురుపాకాన పడుతోంది. మునుపు పిలిస్తే పలికేది. ఏ చిన్నపనైనా చేసేది. ఇప్పుడల్లా కొయ్యముక్కలా కూర్చుంటుంది. ప్రతిపనీ నేనో, అమ్మో చేసుకోవలసిందే తప్ప ఆవిడ మాట్లాడదు. కాపరానికి వచ్చి నాలుగేండ్లయింది. ఇంక యెన్నాళ్ళీవిడ యిట్లా కూర్చోవడం? ఇట్లా కూర్చుంటే కొంప యెట్లా సాగుతుంది? పైఁగా ఆవిడకు యీ ముసలావిడ ఒక ఒత్తాసు. మాట్లాడితే వెనక వేసుకు వస్తుంది. కంప్లైంటు మీఁద పడుతుంది. నీవు నీభార్యను అదుపు పెట్టి పనిచేయించ లేకపోతే నేనూ ఱేపటినుంచి చెయ్యను. నలుగురూ నాలుగు పనులు చేసుకోవాలిగాని, యిందులో ఒకళ్ళు రాణివాసం వెలిగిస్తే నాచేతకాదబ్బా!"

సీతారామయ్య యేఁడాదిక్రిందటి తనభార్య స్థితికి, యిప్పటి తన భార్యాస్థితికి భేదము మనసులోఁ గొంత తెలిసి

గొనెను. ఆమెతో సంసారముచేయుటలో నతని కాశేదముగోచ రించెను. వానినిగూర్చి తనమనస్సులోనే భావించవలయును గాని పరులకుఁ జెప్పుటకు వీలులేదు. అతఁడు తన మనోభావములను గొన్నిటిని సరస్వతితోఁ జెప్పెను. తల్లికూడ వినెను. ముగ్గురును గలిసి రత్నానళిని రాసిశిపెట్టిరి. ఆమె కొంత సేపటికిఁ దన మనసును బయటపెట్టెను.

రత్నా:—పురుషులు పెత్తనం చెయ్యట మేమి? ఆఁడ వాళ్ళింట్లో బానిసలవలె చాకిరీచెయ్యట మేమి? నేను చాకిరీ చెయ్యను. సర:—నేనూ ఆడదాన్నేగా? నేను చెయ్యడంలేదా?

రత్నా:—నీవూ చెయ్యనక్క సర:—నేనూ చెయ్యక, నువ్వూ చెయ్యకపోతే యెల్లా సాగుతుంది? వాణ్ణి వంటచెయ్య మంటావా? వాఁడుచేసే కరిణీకం నువ్వు చేస్తావా? మాణి:— ఇవేంబుద్ధులేవ్! ఏమో మంచిపిల్ల వనుకున్నాను. పతివ్రత వనుకున్నాను. దేఇం మాట్లాడటం? రత్నా:—ఎవరూ పతి వ్రతలు కారు. ఎవ రాపతివ్రతలు? కుంతి పతివ్రతా? ద్రౌపది పతివ్రతా? ఐదుగురు భర్తలను చేసుకొన్నది పతివ్రతయేమిటి? ఈ పతివ్రతఅన్నమాట ఆడవాళ్ళ గొంతుక కోసేందుకు మగవాళ్లు కల్పించారు.

సర:—అన్నయ్యా! వింటున్నావా? ఇవన్నీ రంగఁడు పంపించిన పుస్తకాలు. ఏమో! నేనుపుస్తకాలు చదవకపోయినా భారతభాగవతాల్లోని కథలు విన్నాను. కుంతీ, ద్రౌపదీ పతి వ్రతలుకారని ఆ కథలు విన్నా నాకు తోఁచలేదు. ఈవిడ కెట్లా తోఁచిందో? మాణి:—వాళ్లతలపండు పగల! వాళ్లట్లా రాశారు కావలు ఆపుస్తకాలల్లో! సర:—వాళ్ళకుమాత్రం యెట్లా

తోఁచిందంటాను. సీతా:—రావణాసురుఁడికి సీతను ఎత్తుకుపోవాలని యెల్లాతోఁచిందో, సైంధవుడికి ద్రౌపదిని బలాత్కరించాలని యెల్లాతోఁచిందో అల్లా తోఁచిఁది. ఒక్కొక్క మెదడులో ఒక్కొక్క పురుగు ఉంటుంది. దానికి యెవళ్ళేం చెబుతారు?

ఆ రాత్రి మఱికొంత ప్రసంగమైన తరువాత నందఱు గండరించిన గుండెలతోఁ బండుకొన్నారు. సీతారామయ్య యా పుస్తకము లన్నియుఁ దీసికొని చించి తగులఁబెట్టెను. రత్నావళి సీతారామయ్యను మఱికొన్ని యడ్డదిడ్డములైన ప్రశ్నలు వేసెను. అతఁ డామెమీఁద నదినటి కెప్పుడును జేయిచేసికొన లేదు. ఆరాత్రి యామెను నాల్గుదెబ్బలు కొట్టెను. రత్నావళి యెదురుతిరిగెను. 'భార్య యెటువంటిదో భర్తయు నటువంటి వాఁడే. భర్తభార్యను గొట్టినచో భార్యయు భర్తను గొట్ట వచ్చు'ననెను. సీతారామయ్య మిక్కిలి విచారించెను. అతని కేమిచేయవలెనో పాలుపోలేదు. కాఁపురము రచ్చకెక్కునట్లు తోచుచున్నది. రత్నావళిని మఱలఁ గొట్టినచో నామె తిరిగి కొట్టుననుట ధ్రువమైనది. అతఁ డామె నింటివెలుపలికిఁ ద్రోసి తలుపువేయవలె నని తలఁచెను. ఆ రాత్రిపూట నామె యెచ్చటికిఁ బోవును? ఇంత తెగించి మాటాడునది యెచ్చటకైనను బోవును? పోయినచో నింత పరువుగా బ్రదికిన తన బ్రదు కేమి కావలయును? అయ్యో! మఱల వివాహము చేసికొనుటయే తప్పైనది. లోకములో రెండవవివాహ మెంతమంది చేసికొన లేదు? ఎంతమంది సుఖపడుటలేదు? తననొసటనే భగవంతుఁ డిట్లు వ్రాసెను. రేపు ప్రొద్దున రత్నావళిని దాని మేనమామ యింటికి పంపించివేయును. వారచ్చట నుఱల బుద్ధిచెప్పి పంపిం

షుగు. తానే సాత్వికముగా బతిమాలి చెప్పినచో వినునేమో ? ఏమి వినిపించవలయును ? కుంతి పతివ్రత యని చెప్పి వినిపింప వలయునా? ద్రౌపది పతివ్రత యని చెప్పి వినిపింపవలయునా? ఆఁడువాండ్రు గృహములోఁ బనిపాటలు చేయుట తప్పదని వినిపింపవలయును. కుంతీద్రౌపదులు పతివ్రతలగుదురు, కారు. తన కెందుకు? తనభార్య తనయింట పనిపాటలు చేయ వలయునుగదా! ఆమెను గూర్చుండఁబెట్టి పరిచారికలచేతఁ బనిజేయించుటకుఁ దాను ధనవంతుఁడు కాఁడు. ఆమెధనవంతుల యింటిబిడ్డ కాదు. ఆమె పుట్టినింట నామెతల్లియు, మేనమామ భార్యయుఁ బనిచేసికొనుచునే యున్నారు. పేదవాండ్రకు, మధ్యరకపు సంసారులకు నీ రాజసము లెట్లు సాగును ?

అతఁడు రత్నావళితో నిట్లు చెప్పెను. "ని న్నిప్పుడు వాకిట్లోకి తోసి తలుపు వేస్తాను. నీవు యెక్కడికిపోతావు?" రత్నావళి మాటాడలేదు. మఱల నిట్లనెను. "నిన్ను రేపు మీ మేనమామల యింటికి పంపించి వేస్తాను. భగవంతుఁడు నా కెట్లా వ్రాస్తే అట్లా వ్రాస్తాఁడు. తక్కినవన్నీ అట్లాఉంచు. నాభార్యగా ఉండటం నీకు యిష్టంలేకపోతే నాసొమ్ము తినటం యెందుకు? నాయింట్లో ఉండటంయెందుకు?" రత్నా:—నన్ను కనుక్కోకుండా, నాయిష్టం లేకుండా నన్ను మా మేనమామ మీ కిచ్చాఁడు. మీరంటే నా కిష్టం లేదు.

సీతా:—లేకపోతే రెండే ళ్లెట్లా సంసారం చేశావు?
రత్నా:—నా కప్పుడు తెలియదు, ఇప్పుడు తెలిసింది?
సీతా:—నీయంతట నీకు తెలిసిందా? ఎవరన్నా చెబితే తెలిసిందా? ఆ పుస్తకాలు చదివితే తెలిసిందా? రంగఁ డ్గా

పుస్తకాలు యెందుకు పంపించాఁడు? వాఁడు వట్టి వెధవవలె ఉన్నాఁడు. రత్నా:—నాఅంతట నాకే తెలిసింది. సీతా:— సరే, యెట్లాగో ఒకఅట్లా తెలిసింది. ఇప్పుడు యేం చేస్తావు? నీవు నాయింట్లో ఉండటానికి వీలులేదు. ఇంత తెలిసినదానవు, నీకు భర్తకానివాఁడి యింట్లో యెట్లాఉంటావు? వాఁడిసొమ్ము యెలా తింటావు? మీ మేనమామల యింటికి పంపిస్తాను.ఆయన నిన్ను తనయింట్లో ఉంచుకొంటాడా? రేపు ఆయననే అడుగు దువుగాని. అంతలో రత్నావళి యేదియో మాటాడఁబోయెను. సీతారామయ్యకు మిక్కిలి కోపమువచ్చెను. అతఁడు రత్నావళిని గొట్టెను. రత్నావళి మరలఁ గొట్టెను. సరస్వతి గది లోనికి వచ్చి చూచెను. ఆమెకు పట్టరానికోపము వచ్చెను. "ఒశేవు, కొడితే మళ్లీ మగణ్ణి కొడతావా? అంటే, నీ ఒంట్లో బలం వుంది గనుక మళ్లీ కొడతా వన్నమాట. బలం లేకపోతే కొడతావా? నేను కొడితే యేం చేస్తావు? నన్ను కొట్టేబలం నీదగ్గఱ లేదుకదా! కొంపలో చాకిరీ అంతా చేసి నా ఒళ్ళు కాయ తేలింది. నేను యినపముండను. ఏదీ నన్ను కొట్టు" అని రత్నావళిని ఎముక యెముక సందున విఱుగఁబొడిచెను. మఱల ని ట్లనెను. "చూశావా? నీవు వదినెగారి వలె యున్నావా కొట్టలేదు. లోకంలో యెవరూ మగడు కొడితే మళ్లీ కొట్టరు. ఎక్కడ తిరిగి కొట్టవచ్చో అక్కడే కొడతారు. ఒంట్లో బలం ఉందికదా అని, మా అమ్మను నేను కొట్టవచ్చు. ఆవిడ నన్ను రోజుకు పదిసార్లంటుంది. ఆవిడ పెద్దదను గౌరవంచేత ఊరుకుంటాను. ఆవిడా మనిషే, నేను మనిషినే. సమానం అనుకుంటే ఆవిడ నాచేతిలో చచ్చిపోతుంది. ఆవిడ నన్ను కడుపునకన్నదన్న

గౌరవం నాకు ఉంటే ఆవిడని నేను గౌరవిస్తాను. అట్లాగే నీకు వాడు భర్త అని గౌరవం ఉంటే వాడు చెప్పినట్లల్లా వింటావు. నిన్నడక్కుండా నీ మేనమామ నిన్ను వాడికి పెళ్ళిచేశాం డంటున్నావు. నిన్నడిగే భగవంతుడు నిన్ను మీ అమ్మకడుపున పుట్టించాడా? నిన్నడిగితే యేమహారాజుకడుపున పుట్టించమనేదానివో! ఇటువంటి ప్రేతమొగాలకు తోడు మహారాజు కడుపునకూడా పుట్టిస్తాడు! అన్నయ్యా! దీన్ని పుట్టింటికి పంపించవద్దు. జరిగినది యెట్లాగూ జరగనే జరిగింది. దీనికి కేశవగుస్సూ, మాధవతన్నూ తగలాలి. ఏమే! ఎక్కడకు పోతావు? ఈ యింట్లోంచి పంపిస్తే, యే పల్లెవాణ్ణన్నా తీసుకు లేచిపోతావా? నిన్ను మేము వదిలిపెడితే తిండికి లేక యెవడు దొరికితే వాడితో లేచిపోతావు. వాడితో నీవు ఉండక తప్పదు. వాణ్ణి నువ్వు ప్రేమించి చేసుకొన్నట్లా? అన్నయ్యా! దీన్ని నేను చెప్పినట్లు వినిపిస్తాను. ఎట్లా వినదో నేను చూస్తాను. ఈ రాత్రే పోయి యే నూతిలోనన్నా పడితే పడి చస్తుంది. అప్పుడు యముడు దీనికి మొగుడవుతాడు. వాణ్ణి యిది ప్రేమించి పెళ్ళిచేసు కున్నట్టు. నేను చెయ్యి చేసుకోలేదుగనుక దీని ఆటలు సాగినై. ఇక 'యీావిడా' అనక్కర్లేదు. 'దీన్నే' అనే అంటాను. ఏమో అనుకొంటోంది; సున్నంలోనికి యెముకలు లేకుండా విరక్కొడతాను. దీనిబాబు యెవరి డబ్బం వస్తాడో చూస్తాను. పుస్తకాలు చదివింది. పుస్తకాలు. నీ మీద యెప్పుడైతే చెయ్యివేసిందో అప్పుడే దీని బతుకు బండ లెక్కింది; పద."

అని అన్నగారిని బయటకు పంపించి రత్నావళితో

నిట్లన్నది. "నీకీ బుద్ధులు యెవరు చెప్పారు? రంగడు చెప్పాడా? దోసిళ్ళకొద్దీ రూపాయలు తెచ్చి ఆ వెధవకి చదువు చెప్పిస్తోంటే, ఆగాడిద యిల్లాంటి పనులు చేస్తున్నాడా? కృతఘ్నపుముండాకొడుకు. చిన్నప్పుడు వెధవకి చచ్చేటంత జబ్బుచేస్తే, మాఅన్నయ్య వాడికి దోసిళ్లాది డబ్బుపోసి బాగు చేయించాడు. అప్పుడు చచ్చినా బాగుండేది. 'తాగిన ఱొమ్మే గుద్దుమురా' యని బలేపని చేస్తున్నాడు. ఇంక ఆ వెధవకి దమ్మిడీ పంపించనియ్యను. సన్యాసివాళ్ళకుమల్లే రైలెక్కి రావాలి యింటికి వెధవ. వాకిట్లోకి వస్తే పేన్నీళ్ళు కొడతాను. నీవు నేను చెప్పినట్లు విని యింట్లో ఉంటే ఉండు. లేకపోతే నిన్ను శంకరగిరిమాన్యాలు పట్టిస్తాను. ఒక్కగుద్దుకు ఆవలించి చస్తావు. మనిషిమీంద తిరగబడతావేమి? వాడు ధర్మరాజు వంటివాడు. వాడు నానాకష్టాలు పడి సంసారాన్ని రక్షిస్తోంటే, వాడిసొమ్ము తిని వాడి కొంపకి యెసరు పెడుతున్నారా?" అని జుట్టు పట్టుకొని మఱల రెండు గ్రుద్దులు వేసెను. "చెప్పినమాట వింటావా, వినవా?" రత్నావళి "వింటాను, వింటా" నని నమస్కారములు చేసెను.

సర:—నేను రాక్షసిముండను. తెల్లవార్లూ మేలుకొనే ఉంటాను. తెల్లవార్లూ యేగోతిలోనన్నా పడటానికి ప్రయత్నం చేశావా, చీపురుకట్టతో సింగారిస్తూ యింటికి తీసుకువస్తాను. పడిఉండు. నీకు మంచిరోజులు వస్తే యెగురుదువుగానిలే. రేపు పొద్దున్న నాతో లేచి అన్ని పనిపాటలూ చెయ్యి. పని లేకపోతే యెన్ని దుర్బుద్ధులన్నా పుడతవి. 'సాగుతోంటే చాప కింద కాఱుకుంపట్లు, యెనిమిది నెగళ్ళు.'

# నాల్గవ అధ్యాయము

మఱునాఁడు రంగారావునకు వందరూపాయలు పంపించవలసి యుండెను. సీతారామయ్య మఱల మార్వాడీయొద్దకు బోవుచున్నా నని చెప్పుటకు సరస్వతియొద్దకుఁ బోయెను. అతని కన్నులు జేవురించి యుండెను. హృదయములోని యొకనిగూఢ క్రోధము మొగమున కెగదట్టి యుండెను. సరస్వతి యతని మొగము చూచెను. "అన్నయ్యా! ఆవిడ యీనాఁడు ప్రొద్దుననే లేచినది. ఇంటిలోఁ బనిపాటలు చేయుచున్నది. ఇక ఫరవాలే" దనెను. సీతారామయ్య తాను మార్వాడీవద్దకుఁ బోవుచున్నా ననియు, నాఁడు ప్రొద్దుక్రుంకు వేళకు వత్తు ననియుఁ జెప్పెను. సరస్వతి యిట్లనెను. 'రంగఁడికి చదు వెందుకు? వాని చదువే యింతమూరము తెచ్చెను. చదువు మాని యింటికి రమ్మని వానికి వ్రాయుము. సంసార మన్ని విధములఁ జెడఁగొట్టుచున్నాఁడు. నీవు డబ్బు పంపించవ" దనెను. సీతారామయ్య బస్తీకిఁబోయెను. రత్నావళిచేత సరస్వతి యానాఁడు గృహములోని పనులన్నియుఁ జేయించెను. సరస్వతితోపాటు రత్నావళి మంచినీళ్ళు తెచ్చెను. ఆనాఁడు భోజనము లగు పర్యంతము రత్నావళిని గూర్చుండనీయలేదు. రత్నావళికి సరస్వతి యన్నచో భయమైపోయెను.

భోజనములగువేళకు రత్నావళిచేతులు బొబ్బలుపొక్కెను. ఎండలోఁ దిరుగుటచేత మొగము నల్లపడెను. ప్రొద్దుటి నుండియుఁ దల దువ్వుకొనుటకు వీలులేకపోయెను. నాలుగైదు గంటలసేపు తడిగుడ్డకట్టుకొనుటచేతనామెయొడలుకొయ్యవాఱెను. తెల్లవాఱులు నిద్దుర లేకపోవుటచేతను, నొకటియేవిధముగా నేడ్చుచుండుటచేతను, రత్నావళికన్ను లొత్తవడి యుబ్బెను.

ఆమె భోజనముచేసిన తరువాత పోయి యద్దములోఁ జూచు కొనెను. నిన్నటి మొగములోఁగను ముక్కుతీరుమాత్రమే మిగిలెను. లావణ్యము, నైగనిగ్యము, దిద్దుకొనుట వలనఁ గలిగిన సోగతనము నేమియును మిగులలేదు. ఒక్కరోజు కష్టమునకే యింతనాశిపోవు సౌందర్యమును జూచి రత్నావళి యెంత పొంగిపోయినది! నీడపట్టుననుండి చక్కని పోషణలో నున్నచో నందఱును లావణ్యవతులే. ధనవంతుల యిండ్లలోనున్న యందఱును సుకుమారులే. అందఱును ధనవంతు లెట్లగుదురు? ధనవంతులు సుఖపడవచ్చును. అనేక వేషములు వేయవచ్చును. పేదవారి కెట్లుసాగును? పేదవారి ధనమును, రక్తమును బీల్చుచున్న ధనవంతులు లెక్కలుపోవచ్చును. పేదవారు పోవుటకు వీలులేదు. సౌందర్యమనఁగా నచ్చముగాఁ గనుముక్కుతీరును, శరీరావయవసౌష్ఠవమును గాదు. అవయవసౌష్ఠవముకూడ శరీరపోషణచేతఁ గలుగవచ్చును. కనుముక్కుతీరు దైవమిచ్చినది. సౌందర్యము దేశమునుబట్టి, కాలమునుబట్టి మాఱుచుండును. అజంతాగుహాలలోని స్త్రీచిత్రములకు లావైన పెదవులుండును. ఆనాఁటి శిల్పుల కది సౌందర్యమని తోఁచెనేమో! మనుచరిత్రలోని ప్రవరాఖ్యునకు రాపింగులేదు. ముందు బోడివాఁడు. జయంతుఁడో, నలకూబరుఁడో యని వరూధిని వాని వెంటఁబడినది. లోకములో నందఱికన్న నెక్కువ యందకత్తె పొందఁదగిన బహుమానము కొన్ని యేండ్లక్రింద నొక నీగ్రోయువతికి వచ్చెనఁట. చైనా జపాను దేశముల స్త్రీల ముఖలక్షణములు హిందువులకు రుచింపవు. కాని వారిదేశములవారు వారిని సౌందర్యవతులుగానే భావింతురు. విచిత్రముగదా! సౌందర్యముకూడ

దేశకాలానవచ్ఛిన్నము. ఒకవికారమైన మొగముకల పురుషుఁడు విద్యావంతుఁడైనచో, నధికారి యైనచో స్త్రీలు వానిని వాంఛింతురు. వాని మొగములో నప్పు డొక యందము గోచరించును. సౌందర్య మచ్చముగా శరీరసంబంధి కాదు. సౌందర్యమిదమిత్థ మని యెవరు నిర్ణయింతురు? అదికూడ నొకమనోవికారావిష్కరణము. సౌందర్యమును భావించుటలో విశేషమున్నది గాని తక్కిన చోట్ల లేదు.

రత్నావళి తాను నిజముగా నందకత్తెనో, కానో యనుకొన్నది. ఆసమయములో సరస్వతి గదిలోనికి వచ్చెను. సరస్వతి రత్నావళిని రాత్రినుండి యిప్పటివఱకు 'నేమే' యనియే పిలిచెను. ఇప్పుడుమాత్రి 'మేమమ్మా' యనెను. 'ఏమమ్మా వదినే' నిన్నటి నీ యంద మేది? నీ సుకుమారితన మంతయు నేది? సుకుమారిత్వము సాగెడివారికి. నీకు, నాకుఁగాదు. ఆ సాగుదల కలవారు వేయవలసినన్ని వేషములు వేయుదురు. పేదవారందఱు నీకుబలె సిద్ధాంతములు చెప్పినచో లోకము సాగదు. అందఱు నందల మెక్కినచో మోసెడివా రెవరమ్మా! నాభర్త పోయినాడు. జంతువు లన్నిటికిఁ గామేచ్ఛ యుండవచ్చును. అందఱకును సాగునా? నే నిప్పుడుపోయి మఱల వివాహముచేసికొందునా? నీలాంబరుఁ డేమికావలయును? పిచ్చిదానా? ఎవరికేది ప్రాప్తియో వారికది లభించును. నీవు నీమనస్సునకు నచ్చిన వానిని పెండ్లి చేసికొందువు. వానికిఁ బక్షవాతము వచ్చును. మశూచికము వచ్చును. నీ వే సౌందర్యమును చూచి వానిని గాంక్షించితివో యా సౌందర్యము యథాయథ లగును. ధనవంతుఁడని, యుద్యోగస్థుఁ డని, వయసుగలవాఁ డని పెండ్లి

యాడినచో దైవ మనుకూలించఁ డేని, ఆ ధనము నశించి పోవును. ఆ యుద్యోగము లేకపోవును. ఆ భర్త యకాలమరణము నొందవలసివచ్చును. సృష్టికి నీవు కట్టుబాటు చేయలేవు. నీవు చదివిన పుస్తకము లన్నియు నీవు నిద్రపోవువేళల నీకుఁ దెలియకుండ నేనును చదివితిని. అవి యన్నియుఁ బెడతల సిద్ధాంతములు. నేను పెద్దచదువు చదువుకొనలేదు కాని నాకు భగవంతుడు ప్రపంచజ్ఞాన మిచ్చెను. సిద్ధాంతముల కన్నింటికిని సమాధానము చెప్పెదను. ఓసి! పిచ్చిదానా, పండువంటి కాపురము పాడుచేసికొనకుము. నీ యదృష్టముకొలఁది ధర్మరాజువంటి వానిని చెట్టఁబట్టితివి. నీ కంటె సుందరకత్తెను, నీ కంటె తెలివిగలవాండ్రను, నీ భర్తకంటె సౌందర్యహీనుని, వానికన్న నవివేకిని బెండ్లియాడి సుఖముగా గాలక్షేపము జేయుచున్నారు. నీ కడుపున నొక కురూపి పుట్టె ననుకొమ్ము. ఒక చదువురాని వాఁడు పుట్టెననుకొమ్ము. వానిని నీకొడుకు కాదని త్రోసివుత్తువా? నీ తల్లి, ని తండ్రి, నీ యన్నగారు పట్టికోతు లనుకొమ్ము. పశుసమాను లనుకొమ్ము. వారిని నీ వంగీకరింపవా? అట్లే భర్తయును. మన యదృష్టముకొలఁది నొక తలిదండ్రుల కడుపున పుట్టినట్లే యొక భర్త సమకూడును. ఒక యదృష్టవంతుఁడు రాజుఇంట బుట్టును. ఒక దురదృష్టవంతుఁడు కూటికి గుడ్డకు లేనియింటఁ బుట్టును. దాని కెవరు బాధ్యులు? వివాహ మట్టిదవునో కాదో! అట్టిదే యనుకొందము. నీ పుట్టుక, నీసంపద నీచేతిలో లేవు. సౌందర్యముకూడ భగవంతుఁడు ఇచ్చినదే. నీవు తెచ్చుకొన్నదికాదు. వాని దయలేనిచో నొకబండి క్రిందబడి యందమైన మొగము పాడైపోవచ్చును. ఎక్కడను

లేని నీ యధికారము భర్తవిషయములో వచ్చునా? నేఁడొక పేద, ఱేపు ధనవంతుఁడు కావచ్చును. వీని నిప్పుడు వదలిపెట్టి నచో ఱేపు వీఁడు ధనవంతుఁడైనప్పుడు వదలిపెట్టితిమే యని యేడ్వవలయును. నే నిప్పుడు నా కొడుకును వదలిపెట్టి పోదును. పోయి, చెడిపోయి, తినుటకు తిండిలేక బిచ్చమెత్తుకొనవలసి వచ్చునేమో! నా కొడుఁకే యదృష్టపురేఖయో తిరిగి, ధనవంతుఁడై కీర్తిప్రతిష్ఠలు సంపాదించినచోఁ జెడిపోయిన నన్నుఁ బోషింపఁడు. నే నిప్పుడుచేసిన తప్పు నా కప్పుడు తెలియును. నేను వానితల్లినని చెప్పుకొనుగీతకూడ నా కుండదు. ఒకవేళ భవిష్యత్తులో నంతగొప్పవాఁడు కాఁడు. కాకపోయినను వాఁడు నాకు కొడుకు. నేను వానికి దల్లిని. మా యీ ప్రేమకు భంగము లేదు. సరే! నీ వందగత్తెవుగనుక యెవఁడో ఒకదుష్టుఁడు నీ వయస్సున్నన్నిదినములు నిన్నుఁబోషించును. నీవు మాట్లాడునది సర్వస్త్రీలను గుఱించికదా! లోకములో నందఱు స్త్రీలకు వారువారు కోరిన భర్తలు దొరుకుదురా? అందఱు పురుషులకును వారువారు కోరిన భార్యలు దొరుకుదురా? ఒక్కస్త్రీ పురుషసంబంధములో మాత్ర మట్లు దొరకిననే చేసికొందుమని పంటిబిగువుమాటలు మాటాడవచ్చును. లోకములో నే యితరవిషయములోనను మీ యాటలు సాగవు ప్రతివానికిని రాజ్యము చేయువలయు ననియే యుండును. ధనవంతుని ధనము దొంగిలించినచో సంకెలలు వేయుదురు. స్త్రీపురుషులుగూడ నట్టివారే. ఒక సౌందర్యవంతుని, నీ భర్త కానివానిని నీ వపేక్షించినచో నీవు శిక్షాపాత్రురాల వగుదువు.

నీ మేనమామ నీ యిష్టము లేకుండ నీకు పెండ్లిచేసె

నందువు. అతఁడు నీ యిష్టమడిగి నిన్నుఁ బెంచెనా? నీకు రైకలు, పరికిణీలు నీ యిష్ట మడిగి యిచ్చెనా? ఆయన పెంచగా నీవు పెరిగితివి. ఆయన నీ కేదిచ్చిన నది కావలయు ననుకొంటివి. లోకములో నీబోటి పిల్లలందరకు నెట్లు జరుగుచున్నదో నీ కాయన యట్లు జరిపెను. నిన్ను పెంచి పెద్దదానిని చేసి నీకొఱ కంత కష్టపడిన యాయనకు నీవు సుఖపడుదువని యాయన యనుకొన్న సంబంధము నీకు జేయరాదా? నీ విప్పుడు స్వతంత్రురాల వైతివో? నీ స్వాతంత్ర్యము నీ కిప్పు డూరకే రాదు. నీ వాయన కెంతయో యప్పు పడి యుంటివి. ఆ యప్పు తీర్చి నీ స్వాతంత్ర్యము నీవు తీసికొనుము. పైగా నిన్నాయన డబ్బు తీసికొని యమ్మలేదు. నిన్ను పరమవృద్ధున కీయలేదు. ధనము తీసికొని పరమవృద్ధులకుఁ బిల్లల నిచ్చినచో వా రేమైన ననిన నందురుగాక! నీ భర్తకు నలుబదియేం డ్లున్నచో నతఁడు వృద్ధుఁడు కాఁడు. సామాన్య సంసారమునకు భంగము లేకుండ బ్రదుకుచున్నాఁడు. మాకుఁ దగినంతలో గౌరవము కలదు. నీ కెందుకిట్టి యూహాలు పుట్టెనో నాకు తెలియకుండ నున్నది. ఈ బుద్ధులు నీకు రంగడు చెప్పినచో రంగని కత్తికొక కండగా గోయవలయును. వాని నన్నగారు బాగుచేయగా కృతఘ్నుడై యన్నగారి సంసారమున కిట్లెసరు పెట్టినచో వా డేలోకములకు పోవునో నేను చెప్పలేను. నీవు చెడిపోకుము. నేను చెప్పిన మాటలు వినుము. ఇంక పదిరోజులు నీవు నాతో పాటు గృహకృత్యములు చేయుచున్నచో, నీ యొడలి నును పంతయు పోవును. శరీరము పనిచేయుట కలవాటు పడును.

ఏ పనియును లేకపోయినచో, కోతియూహాలు వచ్చును. పని లేనివాడే యన్ని దురూహలు నూహించును.''

అని చెప్పి సరస్వతి తన దారిని తాను బోయెను. రత్నావళి యాడుబిడ్డ చెప్పిన మాట లన్నియు నాలకించెను. ఆలోచించెను. ఇదివఱకు పుస్తకములు చదివినపుడు వానిలోఁ జదివిన యన్నిసంగతులు నిజములనిపించెను. ఇప్పుడు వదినెగారు చెప్పిన మాటలన్నియు వినఁగా నివియు నిజములే యనిపించెను. ఇందులో నేది నిజము? ఆమెకుఁ దెలియలేదు.

ఇంతలో సరస్వతి యంట్లు తోముటకు రమ్మనెను. రత్నావళి తన చేతు లిదివఱకే బొబ్బలు పొక్కెనని చెప్పెను.

"మొదట నట్లే బొబ్బలు పొక్కును. పనిచేయుచుండినఁ గాని యాబొబ్బలు పోవు. అప్పుడు చేతులు కాయలుకాచును. నాచేతులు చూడు మెట్లుకాయలుకాచెనో! మీరందఱు 'నెవరి నైన పనిదానిని బెట్టి చేయించుకొనరాదా' యందురు. అది కూడ నాఁడుదియేకదా! దానికి సాగుబాటున్నచో నీయంట్లది వచ్చి తోమదు. స్త్రీజాతినంతను నుద్ధరించెదు మీకు గొందఱు స్త్రీలకు గూలియిచ్చి పనిచేయించుట యేమి న్యాయము? స్త్రీ లంట్లు తోమరాదు; పురుషులు తోమవలె నందువా? కొన్నాళ్ళు పురుషులు తోమినచో, నాఁడువాండ్రే యధికార ములు చేసినచో నిపుడు స్త్రీ లెదురు తిరిగినట్లే యప్పుడు పురుషులు నెదురు తిరుగుదురు. సృష్టిలో నీతగాదా మెట్లుతీసి వేసెదవు? భూతభవిష్యద్వర్తమానపురుషు లందఱుఁగూడి యొకసభ చేసి స్త్రీలను బాధించుటకు పన్నుగడలు పన్నలేదు. సంప్రదాయముగా నొక యాచారము వచ్చుచున్నది. పరం

పరగా నది యాచరింపబడుచున్నది. ఆ యాచారము బాగుగా లేదనుము, ఆచరించువారు తెలివితక్కువవా రనుము. అప్పు డాచారము మంచిదో, చెడ్డదో విచారింతము. ఇది యంతయుఁ గట్టకట్టి యొక జాతి నెత్తిన, ఒక వర్ణము నెత్తిన బెట్టుటతప్పు. నీవు రంగఁడు చెప్పిన మాటలు నమ్మితివి. ఆ పుస్తకములలో నున్న సిద్ధాంతములు నమ్మితివి. అట్లేయొక యాచారము ననుస రించువారును నమ్ముదురు, చేయుదురు. ఆపుస్తకములు వ్రాసిన వారు లోకమును మోసగించవలెనను నుద్దేశ్యముతో నాపుస్త కములను వ్రాసిరా? అట్లే కొన్ని యాచారములు చేసినవారును వారి కవి మంచివని తోఁచియే చేసిరి. అందులో నున్న తప్పులు చెప్పవలయునుగాని, మనుష్యులమీద జాతులమీఁద,వర్ణముల మీద విఱుచుకొనిపడిన నేమి లాభము?''

సరస్వతియు, రత్నావళియుఁ బోయి యంట్లుతోమిరి. రత్నావళి చేతులు మఱియు నుబ్బెను. ఆరాత్రి అన్నము తిన నీయలేదు. సరస్వతి బొబ్బలకుఁ గొబ్బరినూనె రాచెను.

సీతారామయ్య రాత్రి ప్రొద్దుపోయి వచ్చెను. అతఁడు భోజనముచేసి వీథియరుఁగుమీఁద బోయి పండుకొనెను.రత్నా వళి గదిలోఁ బండుకొనెను. ఈ రెండుదినములలో నామె మన స్సంతయు గగ్గోలుపడి పోయెను. తాను జేసినది తప్పనిపించెను. ఈ తప్పు సర్దుకొనుట యెట్లు? ఆమె మనస్సులోఁ జాల సందే హములు పోయెను. కాని రంగని తలంచుకొనినపుడెల్ల, నానాఁటిరాత్రి సత్కృతికిఁ దగిలినపుడెల్ల, రంగని శరీరసౌష్ఠవము తలచినపు డెల్ల, నామె మనస్సులో నొక యున్మాదచ్ఛాయ కలుగుచుండెను. మఱల నామె కొకయూహా తోఁచెను. తన

నిన్నటి సౌందర్యము నేఁడు లేనట్లే, రంగని కన్నగారు డబ్బు పంపించుట మానినచో నతని సౌందర్యమును లేదు. అన్నగారు వందలకొలఁది గోతులు త్రవ్వి పంపించుచున్నాఁడు. గనుక రంగఁడు శరీరవ్యాయామముచేయును. బాదముపాలు త్రాగును, రంగురంగుల చొక్కాలు తొడుగును. క్రాపింగు దువ్వుటకు పదిరకముల దువ్వెనలు కొనును. తలనూనెలు రాచును. అన్న గారు డబ్బు పంపించనిచో, నన్నగారతనికిఁ జదువు చెప్పిం చనిచో, నతఁడును సీతారామయ్యవలెనే యుండెడివాఁడు. ఇద్దఱు నొకతల్లి బిడ్డలే కదా? సీతారామయ్య రంగనివలె దిన దినము గడ్డము చేసికొనఁడు మంగళవారములు, శుక్రవార ములు, శనివారములు, చవితి, అష్టమి, ఏకాదశి, ద్వాదశులు, పూర్ణిమామావాస్యలు వాని కడ్డము వచ్చుచున్నవి. రంగనికీ యడ్డములు లేవు. సీతారామయ్య మూఢుఁడా? మూఢుఁడో, వివేకియో! ఒక విశ్వాసము ననుసరించి నడచుచున్నాఁడు. లోకములో నెవ్వడైనను విశ్వాసమును బట్టియేకదా నడచును!

రంగ డున్నతవిద్య చదివెను. సీతారామయ్య కా చదువులేదు. రంగని కా చదువు చెప్పించినది సీతారామయ్య యేకదా! ఆ డబ్బు తానే ఖర్చుపెట్టుకొని సీతారామయ్యయే చదువుకొన్నచో నెట్లుండెడిదో! సీతారామయ్య ఈ సంసారపు బరువుకోసము తాను బాగుపడుట మానివేసి తక్కినవారిని బోషించుచుండెను ఇది సీతారామయ్య తప్పుకాదే!

రత్నావళి హృదయములోఁ గొంత గలగలఁతగ్గెను; ఆమె మనస్సు శాంతపడెను. పగలెల్లఁ బనిచేసియుండుటచేత నిద్ర యామెకుఁ దెలియకుండ వచ్చెను. ఆమ్మె షాణము- లెచ్చటికో

పోయెను. సీతారామయ్య యెఱుగుమీఁదఁ బండుకొనెను. అతఁడు మార్వాడీవద్దనుండి డబ్బు తెచ్చెను. ఆ డబ్బు రంగనికిఁ బంపించవలెనా, వలదా? అతని మనస్సున కిప్పు డంతయు సువ్యక్తమైనది.

దూరమునుండి సముద్రఘోష విన్పించుచుండెను. నిశ్శబ్దమైన యాకాశమున సముద్రము హోరు పెట్టుచుండెను. మొదలు తుదిలేని యొక కూయి నిరంతరము సముద్రమునినుండి వెలువడుచున్నది. పగలు జనులు తమతమ కార్యములలో వ్యగ్రులై యాకూయి నాలకింపరు. రాత్రులందు నిద్రామత్తులై దానిని వినిపించుకొనరు. లోకములో మనుష్యులకుఁ గష్టకాలము వచ్చినవారికి నిద్రపట్టనిచో నా హోరు వినవచ్చుచుండెను. సముద్రుఁ డెదలో నెంత కల్లోలపడుచుండెను? రాత్రిందివము లతనికిఁ దెలిపిలేదు. ఎప్పుడును గష్టము లనుభవించువాని కదియే సహజమైన స్థితి యగును. సీతారామయ్య చిన్నప్పటినుండియుఁ గష్టములే పడెను. అతఁడు బుద్ధి తెలిసి నప్పటినుండి తండ్రి చాటున కరణీకమే చేసెను. ఏదో పల్లెటూరి తిండి తినుటయేకాని రాజాన్నము లెన్నఁడు నారగింపలేదు. భోగముల మొగ మెట్టిదో యెఱుఁగఁడు. ఒక చక్కనిగుడ్డ ధరించి యెఱుఁగడు. తండ్రి పోయిన తరువాత, సంసారభారము నెత్తినపడిన తరువాత నతఁ డేొక కష్టమనుభవించి యొకఁ డనుభవింపలేదా? డబ్బుకోసము నిత్యమును గడ్డి కఱచుచుండెను. ఒక్కొక్కప్పుడు పల్లెవాండ్ర యాడంగుల నడిగి, వారిని బీడించి, వారు దాఁచుకొనిన యొకటి రెండు రూకలుగూడ నప్పు తెచ్చుచుండెను. అది తీర్చుటకు

మిక్కిలి కష్టపడుచుండెను. తాను చేతిమీఁదుగఁ జేసిన సరస్వతి పెండ్లియట్లు వృథాయై యామె తలచెడి యింటిలో నుండుటయే యతని గుండెమీఁది కొకబండ యెత్తినట్లయ్యెను. తరువాత రత్నమ్మపోవుట యతని ప్రాణములే పోవుటయయ్యెను. తానుగూడ రత్నమ్మతోఁ జనిపోవుద మనుకొన్నాఁడు. తాను జనిపోయినచోఁ దనబిడ్డ లేమికావలయును? బిడ్డలకోసము మఱల బ్రదికెను. రత్నమ్మ పోకముందు సీతారామయ్య మంచియువకుఁడు. వయసులో నున్నవాఁడు. ఆమె పోయిన యేఁడాదిలో వృద్ధుఁడయ్యెను. ఆమె బ్రతికియున్నచో సీతారామయ్య శరీర దార్ఢ్యము డెబ్బదియేండ్లవఱకును బీటిచ్చెడిదికాదు. క్రొత్తభార్య వచ్చి మఱలరత్నమ్మవలె నాదుకొన్నచో సీతారామయ్య పుంజుకొనియుండును. ఇంక రెండుమూఁడేండ్లు రత్నావళితో లింటివలె నున్నచో వారిరువురి జీవితములు పెనపడెడివి. సీతారామయ్య గుండెలోఁతు రత్నావళికిఁ దెలిసెడిది. రత్నావళి రత్నమ్మస్థాన మాక్రమించెడిది. అతని బీటిచ్చిన యెద, శరీరము మఱలనంటుకొనెడివి. అన్నియు నట్లుండఁగా నతనికీ పరిస్థితి హృదయము మీఁదఁగొట్టరానంత దెబ్బఁగొట్టెను. భార్యచనిపోయినపుడువాని గుండెమీఁద నెవఁడో యినుపగుదియతోఁ దాకించినట్లయ్యెను. ఆదెబ్బ కతని సర్వచైతన్యమును దిమ్మపోందెను. కాలముతో మఱల నది తేఱుకొనెను. ఇప్పటి ఈదెబ్బ విచిత్రముగానుండెను. దిమ్మగొన్నప్పుడు బాధయుండదు. ఈదెబ్బ పదనైన కత్తిచివర భగభగమండించు విసమునుబూసి నెమ్మదిగాఁ గోసినట్లుండెను. అణువణువునందును జెప్పరానంతబాధ పెట్టుచుండెను. కడుపు కోసికొనినఁ గాళ్లమీఁదఁ బడునన్నట్లు వానికి శిక్షాస్థానమెచ్చటనో కనఁబడలేదు. రత్నావళినిదానుదక్కవప్రేమించుటలేదు.

ఎక్కువయే ప్రేమించుచుండెను. తాను పల్లెటూరివాఁడు గనుక తనసంసారపద్ధతిలోఁ గొంత నాగరకత తగ్గియుండవచ్చును. రత్నావళిని దాను మోటుగాఁ జూచెనా? రత్నమ్మను జూచినంత మోటుగాఁ జూచుట లేదు. రత్నమ్మ తానన్నచోఁ బడిచచ్చెడిది. రత్నమ్మకంటెను రత్నావళిని రెట్టింపు ప్రేమతోఁ జూచినను నీమె యిట్లు చేసినది ఇంతకు నెవరినన్న ఫలమేమున్నది? మనబంగారము మంచిదైనచోఁ గంసాలివాని ననుట యెందుకు? వీనిని నేను పాలుపోసి పామును బెంచినట్లు పెంచితిని. నాపిల్లవాని సంగతి కూడ జూడకుండ వీనిచదువున కెంతడబ్బైనను బోసితిని. అయ్యవార్లంగారిని జేయ బోయినకోఁతియైనట్లు వీఁడు చదివి, ధనము సంపాదించి సంసారము నొక యొడ్డునకుఁ బట్టించునని నేను జేసిన ప్రయత్నమంతయు నిట్లు విపరీతఫలమిచ్చినది. ఈ చదువులోఁ దల్లియుఁ దోడునని లేదు కాఁబోలు! ఎందఱింగ్లీషు చదివి మంచిమార్గమున లేరు? ఈ సిద్ధాంతము లేమిటి? వదినెగారు తల్లివంటిది కదా! ఛీ ఛీ!—సముద్రములో నొక పెద్ద కెరటము లేచి గట్టుపై దభేలున మోఁదినది. అదివఱకొక్క స్వరముగా వినవచ్చుచున్న సముద్రపు మ్రోఁతలో భీభీయన్నట్లు పెద్దమ్రోఁత వినవచ్చెను. ఆకాశమున సముద్రపుఁబిట్టలు రెండు వికృతముగాఁ గీఁచుమంచు నఱచుచుఁ బోయెను.

మఱునాఁడు సీతారామయ్య మొదటియత్తవారి యింటినుండి యతనికుమారునకు జబ్బుగానున్నది, రమ్మని వార్తవచ్చెను. సీతారామయ్య భోజనము చేసి కొడుకును జూచుటకుఁ బోయెను. అతనికి దారిపొడుగునను నాలోచనలే. పిల్లవానికొక యెకరము నింటిలో సగము నుండును. వాని ముత్తవలు వానికొక రెండెకరముల పొలమిత్తురు. బ్రతికి బట్టకట్టినచో వానిపొట్ట వాఁడెట్లో పోసికొనును. తాను తనతమ్ముని చదువులకై పిల్లవాని యీ

యెకరము పాడుచేసెను ఈయుప్పు వడ్డీలు పెరిఁగియింటినిగూడ ముంచివేయునేమో? ఇటువంటి లక్షణములుగల తనతమ్ముఁడు తా నస్తిపిస్తయినచో నలుగురిని గూడఁగట్టుకొని సాఁకునని నమ్మకమేమున్నది? తాను పిల్లవాని నన్యాయముచేసితి ననుకొనెను. ఉన్నవియుండఁగాఁబసిపిల్లవాఁడుకూడఁదనదగ్గఱ లేఁడు, తనతల్లియు, చెల్లెలును బిల్లవానిని గుండెలలోఁ బెట్టుకొనిసాఁకుదురు. కాని ముత్తవలగోల యెక్కువైనది. పిల్లవానికేమి జబ్బు చేసినదో! ఒకవేళ పిల్లవాని కిది యపాయకరము కాదుగదా! రత్నావళి యాదినమునఁగూడ నింటిలోఁబనులుచేసెను. ప్రొద్దుగ్రుంకువఱకు నామెశరీర మలసటపడి యామెకు జలుబుచేసెను. జ్వరమువచ్చినట్లుండెను. తలనొప్పి ప్రారంభించెను. మాణిక్యమ్మ 'యీపూఁట కన్నము తినవలదు, పండుకొ'మ్మనెను. రాత్రి ప్రొద్దుపోయెను. సరస్వతియు, మాణిక్యమ్మయు నిద్రించుచుండిరి. రత్నావళికి తేమొగదల నిద్రపట్టె రాత్రి రెండుజాములకు మెలఁకువ వచ్చెను సముద్రపుహోరు విన్పించుచుండెను. సముద్రునకుఁగూడ వయసులోనున్న భార్యలుండిరో! అతఁడు వృద్ధుడని వారతనిని నిరాకరించిరో! అత డూరక యేడ్చుచున్నాఁడు కాఁబోలు! లేక యట్టిభార్యలమీఁదఁ గోపించుచుండెనో! నిజముగా నతనికి నట్టిభార్యలుండి వానిని నిరాకరించినచో నంతటి సముద్రుఁడూరకుండునా? వారినిముంచివేయఁడో! జలప్రళయము చేయఁడో! తన యుప్పునీళ్ళలో వారిని ముంచియెత్తి వారి శరీరములుజగజ్జనులకనుపభోగ్యములుచేయఁడో! ఎవరిమాటలు విని వానిభార్యలు వానిని నిరాదరింతురో, వారినోళ్లయందుప్పుకొట్టఁడో! వారిదేశములు పీనుపెంటలుచేసి కడుపుబ్బినశవమయముగాఁ జేయఁడో! రత్నావళి మనస్సంతయు సీతారా

మయ్యపక్షమునుండి వాదింప నారంభించెను. తానేసీతారామయ్యనైనచో, దనభార్యయేతన్నిట్లు చేసినచోఁ దానేమిచేయును? ఆభార్యను చంపివేయదా, నూరకొని త్రాగదా? తనభర్తయెంతో మంచివాఁడు. మఱియొకఁడు తన్ను నిన్న ప్రొద్దుటనే పుట్టినింటికిఁ బంపివేసెడివాఁడు. ఆరాత్రియే మెడపిసికి సముద్రములోఁ బాఱవేసెడివాఁడు. అన్నయుఁ జెల్లెలునుగలసి తన్నుఁ జంపినచోఁ దానేమిచేయఁగలుగును? రత్నావళికిబాగుగానిద్దుర పట్టెను. అందులో నొకకలవచ్చెను. తాను జచ్చిపోయినదఁట; తలవైపుసీతారామయ్యయుఁ, గాళ్ళవైపున నత్తగారును నాఁడుబిడ్డయుఁ బట్టుకొని సముద్రములోఁ బాఱవేయుటకుఁ దీసికొని పోయిరఁట. తన్ను సముద్రపుటొడ్డునఁ బెట్టిరఁట, "నన్నుఁ జెలియలికట్టలోపలఁ బెట్టకుఁడు. సముద్రుఁడు నన్నుఁ దనలోనికిలాగుకొనిపోవును. చెలియలికట్ట వెలుపలఁ బెట్టుఁడు, సముద్రుఁడచ్చటికి రాలేఁడు" అని తా నఱచినదఁట. అప్పు డొక సన్న్యాసి తన ప్రక్కనుగూర్చుండి యిట్లుచెప్పెనఁట. 'ఓసి పాడుజీవమా! నీకుఁ గాకికి,గ్రద్దకు భేదము తెలియదు సీతారామయ్యకురంగారావునకు భేదము నీకుఁ దెలియలేదు. రంగఁడు సీతారామయ్య చేసిన లక్కబొమ్మ. సీతారామయ్య తరవణిపెట్టిన గాజుముక్క. వానితో జోడుకట్టి సీతారామయ్యనుజంపితివా? నీకు బుద్ధిలేదు.' అని, తన యత్తగారినిజూచి 'ఈపాడుశవమును సముద్రుఁడు ముట్టఁడు. తీసికొనిపొ'మ్మనెనఁట. తన కేడ్పువచ్చినది. అంతలో మెలఁకువ వచ్చినది. రత్నావళిమెదలో మఱలఁ గొన్నియాలోచనలు కలిగెను. తన సవతికొడుకున కెట్లుండునో! ఆపిల్లవాఁడు 'అమ్మా' 'అమ్మా'యనితనవెంటఁబడిగోడాడును. తానన్నచోఁబ్రాణములు వదలిపెట్టును. కుఱ్ఱవానికిజబ్బుచేయనిచో సీతారామయ్య యూ

నాఁడూరు వెళ్ళేశివాఁడుకాఁడు. వెళ్ళనిచో గదిలోనచ్చి పండు కొనెడివాఁడా? రెండేండ్లు తాను సీతారామయ్యతో సుఖముగాఁ గాఁపురముచేసెను. తా నన్నచో సీతారామయ్యకుఁ బ్రాణము. తానుపోయి సీతారామయ్యతోఁ దప్పుచేసితిని, క్షమించుమని యడుగును. రంగఁడు చాలదుర్మార్గుఁడు. తనకు వెఱ్ఱులెత్తించెను, సుఖముగా నీటిపాయ వెంట నీఁదుచుఁ బోవుచున్న రాజహంసికి సుడిగుండమునడుమన నున్న తామరపువ్వు చూపించి యాశ పెట్టెను. ఇదివఱకుఁ దనముక్కునను న్న తామరపువ్వుకంటె నీ తామరపూ వేమంత గొప్పది? అది సుడిగుండములనడుమనుండు టయే దానియాకర్షణశక్తియా? ఆతామరపూ వెంతయందము గానున్నది? నాముక్కున నున్న తామరపువ్వు కాడ నలిగిపోయి నది. రేకులు చిటికిపోయినవి. ఆక్రొత్త తామరపువ్వు తెచ్చు కొనెదను; అయ్యో! అది సుడిగుండము!

---

## ఐదవ అధ్యాయము

---

సీతారామయ్య మూఁడవరోజునఁదిరిగి యింటికివచ్చెను. అతని వాలకము చూచినంతనే యేదో యాపద మూఁడినదని తెలి సెను. ఆయనతల్లి "ఏమిరానాయనా! అట్లువచ్చితివి? పిల్లవాని కెట్లున్నది?" యనియడిగెను. అతఁడు త్తరీయమును గన్నులకడ్డ ముంచుకొని యేడ్చుచు 'నింకెక్కడిపిల్లవాఁడు? మూఁడురోజుల క్రిందటనే వానికిమనకు ఋణముతీఱిపోయినది' యనివెక్కివెక్కి యేడ్వ నారంభించెను. తల్లి యేడ్చుచుఁ గూలఁబడెను. సరస్వతి "అయ్యో! అయ్యో! అన్నయ్యా! నీకు మంచిరోజులుకావు. అన్నియు నీకొంపమీఁదికే వచ్చుచున్నవి. బంగారమువంటి పిల్లవాఁడు. మనము నిర్భాగ్యులము. వాఁడు మనకు దక్కెడి

రోజులు కావు. అయ్యో! తండ్రీ! నీవు వెళ్ళేశిరోజున నన్ను వదలి వెళ్ళనన్నావు. ఏమో ముత్తవలయిల్లుగదా! వాళ్ళు నాకంటె బాగుగ నేచూతురు అని పోనిచ్చినాను. తండ్రీ! నిన్నుఁజనిపోక ముందు చూచుటకైనను లేకపోయెనుగదరా! ఈకొంపకేదో శనిగ్రహముపట్టినది ఇన్నాళ్ళునుకలియో, అంబలియో మాది మేము త్రావుచుఁ దలయెత్తుకొని తిరిగినాము. మాకింక నా ప్రాప్తిలేదువలెఁ గనబడుచున్నది" యని యేడ్చుచుండెను. అప్పటికే ప్రొద్దెక్కినది. మొదటి యేడ్పుపొంగులు తగ్గినతరువాతఁ బిల్లవాఁడు పోయినవైఖరి తల్లీ సెల్లెండ్రడుగఁగా సీతారామయ్య యిట్లుచెప్పెను." మొదటఁబిల్లవానికి జలుబుచేసినదఁట. వాని యమ్మమ్మ యింత మిరియాలకలకము తీసియిచ్చినదఁట. అప్పుడుతగ్గినది. తరువాతమూఁడవరోజున జ్వరమువచ్చినది. ఆ జ్వరము రెండురోజులలో నెక్కువయినదఁట. పిల్లవానికి శ్వాస యెగఁదట్టినది. వెంటనే నాకుఁ గబురు పంపినారు. నేను వెళ్ళుసరికే పిల్లవాఁడు మనవాఁడుకాదు. చివర కొకసారి కన్నులు తెఱచినాఁడు. వాని అమ్మమ్మ 'నాయనా! మీనాన్న వచ్చెను అదుగో! కన్నులు తెఱచి చూడుతండ్రీ!' అన్నది. పిల్లవాఁడు నన్నుఁజూచి చేతులుచాఁపబోయినాఁడు. కాని చేతులురాలేదు. అంతే. ఇంతలో నొక యెక్కిలివచ్చినది. అమ్మా! నాముద్దుతండ్రిని జూపించవే! నాబ్రతుకిట్లు బండకెక్కినది. అది నా కొక కొడుకు నిచ్చిపోఁగా నేను వానిని బ్రతికించుకోలేకపోయినాను. అది చచ్చి యేలోకాలలోనున్నదో? నేనన్నియు దానికిష్టము లేనిపనులే చేసినాను. అమ్మా! నేను చనిపోరాదా? ఈకష్టములు నేనింకఁబడలేను" అని సీతారామయ్య వలవల నేడ్చుచు గుమ్మికుతికిలపడిపోయెను. సరస్వతి 'అన్నయ్యా! అటువంటిమాట

లనకు. వానికి మనకుఁ బ్రాప్తిలేదు. వాఁడు మనబిడ్డయేమైనచో మనకు దక్కెడివాఁడే. ఏదో ఋణముండి వచ్చినాఁడు. వాని బాకీ వాఁడు తీర్చుకొనిపోయినాఁడు' అనెను. సీతారామయ్య 'అయ్యోతల్లీ! నే నింకను బ్రదుకుట యెందులకు? ఏమో ఒక నలుసున్నాఁడు. దానిపుణ్యమాయని యది యిచ్చిపోయినది. పిల్ల యేదో దానిదారి నది కాఁపురము చేయుచున్నది. వీఁడు బ్రదికి బట్టకట్టు ననుకొన్నాను. నన్నేమో రక్షించు నను కొన్నాను. దానిపేరుమీఁదుగా నీమగబిడ్డఁ డుండు ననుకొంటినే చెల్లెలా!' యని రోదించెను. సరస్వతి యోదార్చెను. సీతారామయ్య "అయ్యో! నేనేమిచూచుకొని బ్రతుకుదును? కొడుకేమో యిట్లయినాఁడు. చేసికొనిన భార్య యిట్లున్నది. తమ్ముఁడేమో నాన్నపేరు నిలువఁబెట్టు ననుకొనఁగా వాఁడు సర్వశూన్యము పెట్టుచున్నాఁడు. నాతండ్రికిఁ జివరకు నీళ్లువదలిపెట్టు దిక్కు కూడ లేకపోవుచున్నది. నేనెందులకు బ్రదుకుట? ఛీ! ఛీ! యని చేతులతోఁ దలపైఁగొట్టుకొని గావురుమనెను. సరస్వతి 'అన్న య్యా! నీ వట్లు గుండె చెఱుపుకొరాదు. పెద్దపిల్ల నేమిచేసిపో యెదవు? నీ విట్లున్నచో నా పిల్ల ప్రాణము కడబట్టదా? నీలాం బర మేమికావలయును? ఏఁడాది గుడ్డను దెచ్చితివి. వాని నెంత మట్టుకో కొంతమట్టుకుఁ దెచ్చితివి. అన్నయ్యా! నీ వట్లు తలఁ చినచో మే మేమి కావలయును? అమ్మ నేమి చేసిపోయెదవు? రంగఁడికవళిక తేలిపోయినది. ఈ చివరిరోజులలో ముసలిదానికి దిక్కెవరు' అని యామెకూడ నేడ్చుచుండెను.

కొంతసేపటికి సీతారామయ్య యేడ్పుమాని తల్లిని, చెల్లెలిని దానే యోదార్చెను. 'అమ్మా! నే నెక్కడకుఁబోదును? నేను జాతిముండకొడుకును. ఒకొక్కఁడు కష్టా లనుభవించుటకే

పుట్టును. వాఁడు పోయినచో నాకష్టములగతి యేమికావలయును? నాకేమియు ఫరవాలేదు. నాది మొండిబ్రతుకు. నేనిప్పుడప్పుడే చావను. ఈ కొంపకేదో యొఱ్ఱుచూచి మఱీచత్తును. లేచి వంటచేయండి' యనెను అట్లేయేడ్చుచుఁ, గన్నీళ్లుతుడుచుకొంచు మాణిక్యమ్మ, సరస్వతులు పోయి వంటప్రయత్నములు చేయ మొదలిడిరి. అందఱును స్నానములుచేసిరి.

రత్నావళిసీతారామయ్యకునీళ్ళుతోడియీయఁబోయెను. అతఁడు పుచ్చుకొనక వాకిటిలోనికిఁ బోయెను. ఆమెయు బిందెలో నీళ్లు తోడి తా నింటిలోనికిఁ బోఁగా సీతారామయ్య నూతిదగ్గఱకుఁ బోయి తాను వేఱేనీళ్ళుతోడుకొని స్నానముచేసెను. ఆనాఁడు భోజనముల వేళకుఁ బ్రొద్దువాటారెను. పిల్లవాని కథలు మాటిమాటికిఁ జెప్పుకొనుచు మధ్యమధ్య నేడుపులు, పనులుచేసికొనుటలుగా వారికారోజుగడచెను. సీతారామయ్య భుజించుచు చల్లపోసి కొనువేళకుఁ బూర్వము కుఱ్ఱవాఁడు తాను మజ్జిగపోసికొనువేళకు, దనవద్దకువచ్చి భోజనమునకుఁ గూర్చుండుట జ్ఞాపకమువచ్చి యేడ్చి మజ్జిగయన్నము తినకుండగనే లేచిపోయెను. సరస్వతికి పట్టరానంత యేడ్పును, దిగులును వచ్చెను. మాణిక్యమ్మగారు "అయ్యో నాయనా! నీవు సగ మాకలితో లేచి పోఁగా నే నేమొగమ్ము పెట్టుకొని యన్నము తిందునురా" అని తానుకూడ నేడ్చెను. వారిద్దఱును సరిగా భోజనముచేయలేదు. సీతారామయ్య యెప్పుడును సముద్రమువద్దకుఁ బోఁడు పర్వదినములఁదప్ప సముద్రమువద్దకుఁబోఁడు. వారియూరుసముద్రపుటొడ్డుననేయైనను, నతఁడు పుట్టిపెరిగిన దచ్చటనేయైనను తాను బ్రతికిన నలువదిరెండు నలువది మూఁడేండ్లలో సముద్రస్నానమున కనిపోయిన కొద్దిసార్లుతప్ప నతఁడు సముద్రముకడకే

పోఁడు. ఆనాఁడు సముద్రము కడకుఁబోయెను. తనపిల్లవాఁడు పసివాఁడుగా నున్నప్పుడు రత్నమ్మయుఁ దానును, పిల్లఁడును నొకసారి సముద్రస్నానము చేసిరి. అప్పటికిఁ బిల్లవానికి రెండేండ్లు. వాఁడు కొద్దిగా మాటలాడుచుండెను. అప్పుడా కుఱ్ఱవాఁడు 'నాన్నా! ఇక్కడల పెద్దచెలువు వుందే. ఇది మనయింటికి బత్తుకుపోదాము' అన్నాఁడు. సీతారామయ్యకామాటజ్ఞాపకము వచ్చి యచ్చటఁగూర్చుండి కొంతసేపేడ్చెను. ఇంతలో నతనికిఁ బూర్వము రంగడు కూర్చున్న చిన్నగుట్టమీఁదకుఁ బోయి కూర్చుండవలె ననిపించెను. ఎందుచేతనో పోయికూర్చుండలేదు. పోయి సముద్రములోఁ గాళ్లు కడుగుకొనవలె ననిపించెను. కాని పర్వదినముకాని యానాఁడు సముద్రమును దాఁకుటకు మనస్కరించలేదు. అతడుసముద్రపుటొడ్డుననేకొంతసేపునడచిపోయెను. ఇంతలోఁ బ్రొద్దుగ్రుంకెను. అతని తలపైన నొకతీతువుపిట్ట కూయుచుఁ బోయెను. అతఁడు 'పిట్టా! న్యాయముగానే కూయుచుంటివి. నిన్ను చీచీ యనను' అనెను. ఇంతలో నొకపాలపిట్ట కూసెను. సీతారామయ్యనవ్వుకొనెను. పాలపిట్టమఱలఁగూసెను. సీతారామయ్య యిట్లనెను. 'తీతువుపిట్టకు సంగతి తెలియును. పాలపిట్టకుఁ దెలిసినట్లు లేదు. సీతారామయ్య ప్రొద్దుపోవు వఱకు సముద్రపుటొడ్డుననే తిరుగుచుండెను. అతని కొకసారి యొకయూహ తోఁచెను. తానాసముద్రములోఁ బడి చని పోయినచో? పాలపిట్ట మఱలకూసెను. సీతారామయ్య యిట్లను కొనెను. "నేను చనిపోనఁట. ఒకటి మాతృహత్య, రెండు పసర్వము గాసినాఁడు సముద్రమును తాఁకుట. మూఁడు ఘోరమరణము. భగవంతుఁడెట్లు వ్రాయునో వాని కట్లు వ్రాయును. అనుభవించక కర్మము నశించ దందురు. అనుభవింతుము. నిలాం

బరువు తొక్కలు చేసినట్లు. నా నికోడుకైనను బ్రతుకవలయును. భగ
వంతుఁడు చంపదలఁచియుండినచో శరవా లేమగాని మాత్రదేవ
తను సంస్కరింపనేయకుండ ...ల చావవలయునా? చచ్చి
యున్న మీఁద పగసాధించును: ప్రైవనుమీఁదనా? పాపమాత్రైన
మునకు నా మీఁద నిమిత్తరోషము? నేను పోయినచో రంగ
నికి మఱియును లాభము. సరిస్వల్ప బ్రదుకు నాఁడు తెల్లవార్చునా?
అతఁ డిట్లనుకొనుచుండఁగా దూరమున నెవరో మనుష్యుఁడు పోవు
చున్నట్లు తోఁచెను. ఒక్క గాలిపొరకూడ లేదు. సముద్రము
మీఁదనుండి కూడ గాలి వీచుట లేదు. సముద్రము కరటము తగ్గి
యుండెను. సముద్రము కొంతదూరము వెనుకకుఁ బోయియుం
డెను. సముద్రము వెనుకకుఁబోవుట యుప్పెనవచ్చుటకు గుఱుతం
దురు. సముద్రము సీతారామయ్యమీఁది కేలరావలయును? అతఁడు
తన కోడిగ్రుడ్డియున్నాఁడు! తిన యంచులదాఁకఁ గూడఁ బోలేదే! అందు
లకే కాఁబోలు సముద్రుఁ డతనిని గాంచి వెనుకకుఁ దగ్గెను. మఱి
యుప్పెనవచ్చినప్పుడు వేసవిమీఁద పఱుచుకొనిపడునో? సీతారా
మయ్య మీఁదఁగాదు. దూరముగాఁ బోవుచున్న మనుష్యుఁడు
కనిపించకుండఁబోయెను. సీతారామయ్య వానిని జూచి "ఇతఁ
డెవఁడు? మనుష్యుఁడా! దయ్యమా! మనుష్యునివలెఁ గన్పించ
లేదు. యమభటునివలె గన్పించెను. యమభటుఁడు కాఁడు.
అయినచో నన్ను విడిచి యేలపోవును? ఒకవేళ యమభటుఁ
డయినకూడ నన్ను వదలి పోయెనేమో? ఎవఁడో పల్లెకారియై
యుండును. యమభటుఁడని నేను అనుకొను టెందులకు"
అని యాలోచించెను. అతఁడు గృహాభిముఖుఁడై పోయెను.
రంగమ్మ మూఁడుకుక్క లతనిని జూచి యఱచెను. ఇంతలో
పెద్దపిల్లలు పోరాడకొనుచు నతని త్రోవ కడ్డముగా వచ్చెను.

అతఁడు మంచిశకునములు వచ్చుచున్న వనుకొనెను. మఱల మొఱుగుచున్న కుక్కలలో రెండుకుక్కలు పిల్లులను తఱుమఁగా నవి పోరాడుకొనుట మానివేసి పాఱిపోయెను. సీతారామయ్య దారివెంటఁ బోవుచుండెను. ఆపిల్లులు రెండును కుక్కలనుండి తప్పించుకొని మఱియొకచోటఁ జేరి పోరాడుకొనుచుండెను. సీతారామయ్య మఱల దారివెంటఁబోవుచుండెను. ఒకముసలికాఁపు చుట్టకాల్చుచుఁ దలకు గుడ్డచుట్టుకొని కఱ్ఱఁ జేతఁబూని యతని కెదురుగావచ్చుచుండెను. ఆయన సీతారామయ్యను బలుకరించెను. 'బాబూ! ప్రొద్దుపోయి వచ్చుచుంటివి. తిండి తిన్నావా?' యనెను. సీతారామయ్య మాటాడకుండఁ బోవుచుండెను. కాఁపు "అయ్యా! మాటాడవేమి? మఱచిపోయినాను. పాపము! బుడ్డాయన పోయినాఁడఁటగదా! మన మేమిచేయుదుముబాబూ? మీనాయన చేసిన పుణ్యమంతయు నేమైనదో? కులానికిఁ బిల్లవాఁడు లేకుండఁబోయెను. అయినను మఱలఁ బెండ్లిచేసికొంటివిగదా. సంబంధానికిఁ బిల్లలు కలిగినచో వారే కొమ్మలగుదురు. మీనాయనగారికులము నిలుచును" అనెను. సీతారామయ్య 'బాబూ! పోవుము' నని వెడలిపోయెను. సరస్వతితోఁ దనకాపూఁట నాకలివేయుట లేదనెను. తల్లియు, సరస్వతియు వచ్చి బతిమాలిరి. 'నాయనా! ప్రొద్దున గూడ సగమాఁకలితో లేచిపోయినావు. ఈపూఁట నీకోసమని మెంతిమజ్జిగ చేసినది. వంకాయబజ్జిచేసినది. లేచి రెండుమెతుకు లెంగిలిపడుము' అని తల్లి పదేపదే పిలిచెను. ఎన్నిసార్లుపిలిచినను సీతారామయ్య తన కాఁకలిలేదనెను. సరస్వతియుఁ, దల్లియు నతఁడు భోజనముచేయనిచోఁ దాముసు ఫలాహారము చేయమనిరి. అతఁడెట్టకేలకు లేచి ముఖకట్టుకొనెను. రత్నావళి

మడికట్టుకొనెను. ఆమె వడ్డించుటఁ జూచి యతఁడు మడివాని వేసి వాకిలిలోనికి వెళ్లిపోయెను. సరస్వతి గ్రహించి 'అన్నయ్యా! వెళ్ళకు వెళ్ళకు! నేను వడ్డించెదను' అని తాను మడికట్టు కొనెను. సీతారామయ్య భోజనమునకు వచ్చుటకు మజాల సంత ప్రయత్నము జరిగెను. సరస్వతికి నింటిలో నేమియుఁ దోఁచ లేదు. ఒకటి కొకఁడు పొసఁగని రెండుకష్టములమధ్య తన యన్నప్రాణము యుద్ధసమయమునందలి ధనుస్సువలె సాగుచు, వంగుచు, మధ్యభాగమున మూసిపోవుచు నుండుటకు నామె మనస్సు మిక్కిలి కళవళపడెను. రత్నావళి నొక తెన్నునకుఁ దాను తేఁగలుగును. ఆమె మనసుదిటవులేని స్త్రీ. ఎవ రేది చెప్పిన నది వినును. మనస్సులో నెచ్చటనో దురూహ లుండిన నుండవచ్చును. స్వయంవ్యక్తిగా సాహసించిఆమెయేమియుచేయ లేదు. ఈశోకసమయములోఁ దనయన్నగారి మనస్సున కీవిష యమునచ్చఁజెప్పినంపుఁదీర్చుటయెట్లో యూహకుఁదెలియలేదు. గంపెఁడు శోకములోనున్న యతనితో సదినగారిప్రస్తావన చేసి నచో నతనిదుఃఖమిబ్బడిముబ్బడియగును. ఇప్పుడతని సంసారము నెట్లు పొసఁగఁద్రోసికొని రావలయునో యూహకు దెలియలేదు. తరువాత వారమురోజులు గడచెను. ఆనాఁడు సీతారామయ్య కూఁతురును, అల్లుఁడునువచ్చిరి. కొంచెముతగ్గిన దుఃఖముమఱల పేటెత్తినది. అతనికుమార్తెయు నల్లుఁడును ఒకవారముదినము లుండి వెడలిపోయిరి. సరస్వతి యాఁడుపిల్ల నుంచి పొమ్మన్నది. ఆయల్లుఁడు తమయింట నేవోయక్కఱలు వచ్చుచున్నవనిచెప్పి తీసికొనిపోయెను. సీతారామయ్య తన కూఁతును జూచి దుఃఖముకొంత తగ్గించుకొనెను. ఆమె వెడలిపోయినంతనే యత నిలో రెట్టింపుదిగులు కనిపించెను. ఇన్నాళ్లును సీతారామయ్య

రంగఁడికి డబ్బు పంపించలేను. ఒకనాఁడతనివద్దనుండి యుత్తరము వచ్చెను. దానిని జూచుచునే సీతారామయ్య చింపివేసెను. మఱల వారము దినములు గడచెను. మఱల నొకయుత్తరము వచ్చెను. తాను పాఠశాలలో డబ్బుకట్టవలయుననియు, డబ్బు పంపించనిచోఁ దాను చదువు మానివేయవలసి వచ్చుననియు డబ్బుదొరకనిచోఁ దనభాగము పొలమమ్మివేసియైనను డబ్బు పంపించవలయు ననియు నతఁడు వ్రాసెను. సీతారామయ్య యా యుత్తరముచూచి యిట్లనెను. 'వీనికింకను పొలమెక్కడనున్నది? వీనిచదువుకొఱకు నేను పంపించినడబ్బు లెక్కచూచినచో వీనిపొలము సరిపోవుటయే కాక నాకే బాకీపడును. పొలమంతయు మూఁడెకరములు. పైగా చవిటిపఱ్ఱ. మూఁడుపుట్ల గింజలు రాలునప్పటికిఁ దలప్రాణము తోఁకకువచ్చుచున్నది. శిస్తులుపోను నందరూపాయలుకూడ రావు. నేనెక్కడనుండి తెచ్చి వీనికిఁ బంపింతును? పైగా వీనికిఁబంపించిన డబ్బంతయు బూడిదలోఁబోసినపన్నీరువంటిది. వీనికిఁదల్లిలేదు; దైవములేదు. ఎట్లో యట్లు బ్రతుకఁగలఁడని యనుకొంటిని. వానిబుద్ధి తెలిసివచ్చినది. ఎక్కడనైనను బిచ్చమెత్తుకొని చదువుకొన్ననుసరే! చదువు మానివచ్చిననుసరే! ఫలములేని యీకాటికొలువు నేనుచేయ'' ననెను. ఆయుత్తరము నింటిలోఁ బాఱవేసెను.

క్రమముగా సీతారామయ్యకు కొడుకు దుఃఖముయొక్క వెలిచిన్నెలుమాసెను. ఏరాత్రిపూఁటనో యరుగుపై నొంటరిగాఁబన్నుండి మనసులోఁ గలకవేసినప్పుడు తన చనిపోయినభార్యను, కొడుకును దలఁచుకొని తనలోఁ దానే కుమారిలిపోవును. సరస్వతి యన్నగారి దుఃఖముపశమించిన దనుకొనెను. పిల్లవాఁడుపోయి యప్పటికి నెలనాళ్లయ్యెను. ఆనెలనాళ్లును సీతారామయ్య యరుఁగు

మీఁదనే నిద్రించుచుండెను. ఆ నాఁడు సరస్వతి యన్నగారికి మంచమును, ప్రక్కయు నరుఁగుమీఁద వేయలేదు. అతఁడు భోజనముచేసి మంచమునుదెచ్చి తానేవేసికొని పండుకొనెను. ఆ మఱునాఁడు సరస్వతి 'అన్నయ్యా! గదిలోఁ బండుకో'మ్మనెను. అతఁడు పొరుగింటికిఁబోయి వారితో మాటాడుచు నచ్చటనే పండుకొనెను.ఆమఱునాఁడు రంగనివద్దనుండి యొక యుత్తరమువచ్చెను. తాను పరీక్షకు డబ్బుకట్టవలసిన గడువు దాఁటిపోయెననియు, నాసంవత్సరమునకు చదువు చెడిపోయినదనియు నదివరకుఁ గట్టినడబ్బు వృథాయైనదనియు, తనకు నూరిలో స్నేహితులవద్ద అప్పుపుట్టుటలేదనియు, నింటికిఁ దిరిగివచ్చుటకుఁ గూడఁ దనవద్ద చిల్లిగవ్వ లేదనియుఁ, బాతికరూపాయలైనను బంపించినచోఁ దిరిగివత్తుననియు నాతఁడు వ్రాసెను. సీతారామయ్య యా యుత్తరము చదువలేదు. దానిని బాఱవేసెను. సరస్వతి చదివెను. రత్నావళియు, మాణిక్యమ్మగారును వినిరి. మాణిక్యమ్మగారు "అయ్యో! ఈనఁగాచి నక్కలకుఁ బెట్టినట్లయినదే. వాఁడుతిరిగివచ్చుటకుఁగూడ డబ్బులేదఁట. పసివాఁడు పరాయి దేశములో నేమియిబ్బంది పడుచున్నాఁడో"యనిగుబ్బిసలాడెను. సరస్వతి "అన్నయ్యకు డబ్బు దొరకుటలేదాయె. ఆయనకు వానిమీఁదఁ గోపమువచ్చినది. ఇప్పు డేమిచేయవలయునో తెలియ"దనెను. సరస్వతి లేనప్పుడు మాణిక్యమ్మ రత్నావళితో నిట్లనెను. "ఓయమ్మా మీ రిద్దఱు కొంపమీఁదికిఁ దెచ్చినారు. నీచేతుల ఒక గాజులజత యిమ్ము. అమ్మి పొరుగు శంభయ్యతోఁ జెప్పి వానికి డబ్బుపంపించెదను. వాఁడింటికిరాక ఏమైపోవును!"వ రిరువురును నొప్పుదలమైరి. ఒకనాఁడుసాయంకాలమునఁ రత్నావళి గాజులజతఁదీసియిచ్చెను. పొరుగుశంభయ్య

వానినిఁబుచ్చుకొని బస్తీకిఁబోయి వానినిమార్చి, డబ్బు రంగఁడికిఁ బంపించి రమ్మని వ్రాసెను. నాల్గయిదురూపాయలువానిలో మిగులఁగా నతఁడొక్కరూపాయయే మాణిక్యమ్మచేతికిచ్చెను. వసుధర తగ్గెనసెను. రత్నావళి చేతులు మిగిలిన యొక్కజతతో బోసిగానుండఁగా, నొక పావలాపెట్టి మాణిక్యమ్మ యామెచేతులకుగాజులువేయించెను. సరస్వతివదినెగారినిగాజుల జత యేమైనదని యడిగెను. ఆమె యొకగాజు విఱిగిపోఁగాఁ దీసి పెట్టెలోఁ బెట్టితిసనెను. సరస్వతి "నాలురోజుల క్రిందటి వఱకు బాగుగా నున్న గాజులు విఱిగిపోవుట యేమిటి? ఏవీనాకు చూపించు" మనెను. మాణిక్యమ్మ కల్పించుకొని "అంట్లు తోమించుచుంటివి. అరిగిపోవా! విఱిగిపోవా!" అనెను. సరస్వతి 'అంట్లుదోమక అంతఃపుర స్త్రీయా నీకోడలు? ఆవిడయో, నేనో ఎవరో యొక రంట్లు తోమనక్కఱలేదా? ఆవిడతో మకపోయి నచో నీయమ్మమగఁడు వచ్చితోము' ననెను. మాణిక్యమ్మ 'కుంటిమాటలు మాటాడకు. నోటికి సరిగా రానిమ్ము. ఎగుడు దిగుడు మాటలు రానిచ్చితివా, చీపురుకట్టపెట్టి సింగారింతు' ననెను. సరస్వతి 'ముసలిదానివి యొకమూలఁ బడియుండరాదా? నీ కంతయధికార మెందుకు? ప్రతిదానికిఁ బూసికొని వత్తువు. నీకోడలిలక్షణము, నీసులక్షణము కనఁబడుచునే యున్నవి. మీ యిద్దఱుఁ గలసి పోయి సముద్రములోఁ బడుఁడు. నాకేమి పట్టిన' దనెను. తరువాత సరస్వతి గాజుల ప్రస్తావము తేలేదు. ఇంకొకనాఁడు సరస్వతి తల్లితో 'కోడలికి గాజులు వేయించుటకు నీకు డబ్బెక్కడిదే' యనెను, మాణిక్యమ్మ 'మా అన్నయ్య ఇచ్చి పోయినాఁ' డనెను. సరస్వతి 'వల్లకాడులోనున్న మీఅన్నయ్య నీకు వచ్చి డబ్బిచ్చెనా? నేను చూడకుండ నింటిలో బియ్యమే

మైన నమ్మినావా? వాఁడు నానాకష్టములుపడి తెక్కలమీఁదఁ దెచ్చుచున్నాఁడు. నీయమ్మకడు పిట్లు కాల్చుచుంటివా? నిన్నుఁ జంపివేసెద'ననెను. మాణిక్యమ్మ 'వెధవమాటలు మాటాడకుము. బియ్యము మమ్ముకొనుట నాయింట, నొంటలేదు. నోరు మూయు'మనెను. మఱి నీకు డబ్బు లెక్కడనుండి వచ్చిన'వని సరస్వతి నొక్కి యడిగెను. మాణిక్యమ్మ 'రత్నావళికి దాని మేనమామ యిచ్చెనఁట. పదియణాలు దానిపెట్టెయడుగున నున్నవి. ఆడబ్బులుపెట్టి యదే వేయించుకొన్నది. నేనేమెఱుఁగుదు'ననెను. సరస్వతి వదినెగారిని "నిజమేనటమ్మా" యని యడిగెను. రత్నావళి నవ్వుచు 'నిజమే' అనెను.

ఒకనాఁడు సాయంకాలము రత్నావళి మంచిచీర కట్టుకొని, తల దువ్వుకొని,బొట్టుపెట్టుకొని,యెవరో పేరంటమునకుఁబిలువఁగాఁ బోవుచు నలకూబరునికొఱకుఁబోవు రంభవలె నవ్వుచు కులుకుచు నడచుచుండెను. సీతారామయ్య యరుఁగుమీఁద కూర్చుండి చూచుచుండెను. తానామెతో మాటాడి సుమారు రెండునెలలు కావచ్చుచుండెను. తనకు నామెకు సంబంధము లేకపోయెను. తాను తప్పుచేసితి నని యామె వచ్చి తనతోఁ జెప్పునేమో యనుకొనెను. చెప్పినచోఁదన కుటుంబముయొక్క క్షేమ మాలోచించి తాను మన్నింతునని యనుకొనెను.ఆమెనువదలి యతఁడు సుఖపడుట లేదు. అతనిలో సంతోషకళ లేదు. అతని మొగములో వివ్వారుటయే కనిపించదు. ఇంక రత్నావళియో యింటిలో నవ్వుచుఁ, బ్రెలుచు నుండును. పేరంటముల కెంత మున్నాబై వెళ్ళుచున్నది. ఆమెకు దిగులన్నది లేదు. విచార మున్నది. కనిపించుట లేదు. భర్తకు, తనకుసంబంధము లేకపోవుట యామెమనస్సులో నేమియు విచారమునుకలిగించినట్లు కనిపించ

లేదు. ఆమెకు నంటు సొంటు లేని యీ విచారము సీతారామయ్య కొక్కనికే పట్టినట్లున్నది. ఆమె కనుచూపు మేర దాటి పోయినది. దూరమునుండి యామె యెవరితోనో నవ్వుచున్నట్లు వినిపించెను. సీతారామయ్య గుండెలో నెవరో కత్తితో పొడిచి కదలించినట్లయ్యెను. ఆహా! ఆశత్రువెవ్వరో! వాడు కంటికి కనిపించడో! ఇంతలో సరస్వతియు, మాణిక్యమ్మయు వాకిలిలోనికి వచ్చిరి. రంగడు బండిదిగి గడపలో నిలుచుండెను. మాణిక్యమ్మ పోయి కౌగిలించుకొనెను. "అయ్యో! నాయనా! వచ్చావట్రా" సీతారామయ్య బాధకు దలవంచుకొని కూర్చున్నవాడీ మాటకు తలయెత్తి చూచెను. రంగడు కనిపించెను.

రంగడన్నగారివంకకు జూడనేలేదు. ఇంటిలోనికిబోవుచు నొక్కసారి తీక్ష్ణముగా నరుగువంకకు జూచెను. తల్లియు, కొడుకును లోనికిబోయిరి. సరస్వతి యన్నగారివంక దీనముగాఁ జూచెను. సీతారామయ్య రంగని ముఖతైక్ష్ణ్యము చూచెను. వెంటనే తల వంచుకొనెను. సరస్వతి దీనముగాఁ దనవంకఁ జూచుట యెఱుఁగఁడు. కొంతసేపటికి సరస్వతికూడ లోనికిఁబోయెను. మఱికొంత సేపటికి రత్నావళి తిరిగివచ్చుచుండెను. వాకిటబండిని, సామానులను చూచి యామె మొగము తెల్లపడెను. ఆమెమొగములో ననేకభావములు పెనగొనియుండెను. ఆమొగము వర్షాసంధ్యాకాలధారిధనుఃపిహితనీలవర్ణ మేఘాచ్ఛాదిత పశ్చిమదిశవలె బహువర్ణకిర్మీరితమయ్యెను. ఆ పశ్చిమపుతెఱపు నల్లగా రంగురంగులుగా నెట్టిగా సీతారామయ్య చూచెను అతఁడు నెమ్మదిగా నరుగుమీఁదనుండి దిగిపోయెను.

రత్నావళిని చూచినంతనే రంగఁడుపోయి కరతలచాలనము చేసెను. రత్నావళి సిగ్గుపడెను. సరస్వతి మొగములోఁ గోపము

మాటకర్థము లేదు. ఎల్లవారి కాముకత్వమూండి చనిపోయినాడు.
రంగడు మాటాడ లేదు. కొంతసేపటికి సిద్ధాంతమున కెదురైన
మాట యనినాడు. అతడు పసాపాటికైనను దొడ్డిలోనికి బోయి
గడ్డము చేసికొని, స్నానము చేసి, యుతికిన వస్త్రములు ధరించి
యప్పటికే చీకటి పడినను సముద్రము యొడ్డునకుఁ బోయెను.
పూర్వమతడు సముద్రముకడకు బోయినపుడు వెన్నెల. ఇపుడు
చీకటి. చీకటిలో సముద్రపుతరంగములో మహాభూత మొకడు
వెండిగాజులు పెట్టుకొన్న కొమ్మ చేతులతో భరతాభినయము
చేయుచున్నట్లుండెను. అతడు తనలో ననుకొనెను. "అటువంటి
బుద్ధి కలవారికిఁ బిల్ల లెట్లు దక్కుదురు!" ఈమాట యేమిటి!
బుద్ధికిని లోకములో మనుష్యు లనుభవించువారికిని నేమైన సం
బంధమున్నదా? ఏమియును లేదు. మరి నేనిట్లేల యనుకొంటిని! లోక
ములో నట్లువాడుదురు. ఈదేశములో నిటువంటిసిద్ధాంతములు
వ్యాప్తిఁ జెందినవి. ఈసిద్ధాంతము కడిగి వేయవలయును.
సముద్రపు కెరట మొకటి పూర్వము వచ్చి యొడ్డున కొంతశుష్క
తృణమును, చనిపోయిన నత్తగుల్లలను, ఇసుకలకడ నాచిని నురు
గును నొడ్డున నిలిపిపోయెను. తరువాత వచ్చిన రెండుమూడు
చిన్నతరఁగలు దానియంతమేర రాలేదు. అప్పుడు ఒక పెద్ద
తరఁగ పూర్వపుదానికన్న పెద్దది వచ్చి యా తృణము నంతయు
కడిగి లోనికి దీసికొనిపోయెను. రంగడు తనలో నిట్లనుకొనెను.
"మాసరస్వతి నాలో వాదించుచున్నదా? ... నీతి చదివి, చదు
వని దానివాదనకు లొంగిపోవు. ఏమిటి? దానికి సంగతి చెప్పి
నవో తెలియదు." సముద్రమునందు లేచిన పెద్ద కెరటములేచు క్రక్క
నున్న గుట్టపై ఫేనిలములై కొట్టును సిత్రమైనవలన నప్పుడు. ఎవ
రితోనో పరాచిక మాడఁబోయి. మొగమును నేలకుప్పనో నేసి

కొట్టుకొనిన బాధాసూచికిక్కా తాట్టహాసమునలె నీళ్ళు కుదిం చుకొని కప్పిన రొపచేసెను.

ఈ కడలిలోన దాగిన యే మహా వి
చిత్రభూతము లోనుండి జిలుగు చికిరి
వెగటునవ్వులు నవ్విన వెలికి బుడగ
బుడగలై వచ్చి యీ నిట్ట కడలిగుట్టఁ
గొట్టుకొని మ్రోగినట్లుగాఁ గుతిలపడునో
ఈ కడలి యట్టయడుగునఁ బ్రాకులాడి
కళవళించెడు సర్పరాట్కన్యల చెడి
పోయినట్టి పెండ్లిండ్లకుఁ బోనపుట్టి
కలు దభేలునఁ బడవేయఁగా మెతుకులు
తెల్లగా బుట్టమోతలు పెల్లుగాఁ గ
నంబడి శ్రవోయుగళికి వినంబడినటు
తెల్ల నురుసులమోత లేతెంచెఁ గడలి.
ఈ కడలి ఈ కడలి పాలువోక యెన్ని
నాళ్ళు లీగతిఁ బాటునో నాగలోక
మతివమద్విషవహ్నికయడుగునఁదు
పీల్చివేయదో యెండలు బిట్టుమాడ్చి
యింకిపోవదో యిట్టె యిఱ్ఱింకు లింకి.

## ఆఱవ అధ్యాయము

ఆనాఁడురాత్రి రంగారావు ప్రొద్దుపోయి యింటికిఁ బోయెను. రాత్రి చాల ప్రొద్దుపోవుటకును సీతారామయ్య యింటికివచ్చు నని యెదురుచూచిరి. అతఁ డెంత ప్రొద్దుపోయినను రాలేదు. అతనికోస మెదురుచూచుటవలన భోజనమగువేళకు రాత్రి రెండుజాములాయెను. ఎదురుచూచిచూచి యెవరిదారిని వారు పండుకొనిరి; నిద్రలుపోయిరి. మఱునాఁడంతయు సీతారామయ్య రాలేదు. ఆనాఁటి రాత్రికూడ నందఱును భోజనములు చేసి

పండుకొనిరి. రాత్రి రెండుజాములయ్యెను రత్నావళి తనగదిలో పండుకొనెను. రంగఁడు సావడిలోని తనగదిలోఁ బండుకొనెను. రంగఁడు వచ్చినప్పటి నుండియు రత్నావళి యతనితో నేకాంతముగాఁ బ్రసంగించవలెనని వాంఛపడుచున్నది. అయి దాఱు నెలలక్రింద నతఁడు లక్నోకు వెడలిన క్రిందినాఁటిరాత్రి యతనితోఁ దానుపొందిన సుఖము రత్నావళికి మనస్సులో పచ్చిగానుండెను. దానిపసిమి యీమెమనస్సులో నాఱలేదు. ఆమె మనస్సు నడుమఁగల యీయాఱు నెలలలో నూఁగుచుండెను. ఈ యాఱు నెలలును తాను సీతారామయ్యతో సంసారము చేయ లేదు. ఆమెమనస్సులో రంగఁడే యాడుచుండెను. అందుచేతనే యీమె సీతారామయ్యను నిరాదరించి గృహములో నవ్వుచుఁ, బ్రేలుచునుండెను. ఆమెయుత్సాహమంతయు సీతారామయ్యను మఱియు విముఖునిగాఁ జేసెను. తరువాతవచ్చు పుణ్యపాప ములు, కష్టసుఖములు, కుటుంబకలహములు వీనినిగూర్చి ఆమె యోజించనే లేదు. ఆమెమనస్సులో మఱల రంగారావుతో నేకాంతముగాఁ గలసికొనుటయే ముడిపడినది. ఆవెనుకటి రాత్రి యందఱును ప్రొద్దుపోయి భోజనముచేసిరి. అందుచేత నామె రంగఁడు తన గదిలోనికి రాలేదనుకొనెను.

రంగఁడు తాను లక్నోకు వెడలనున్నరాత్రి రత్నావళికిని దన కును జరిగిన వ్యవహారము మఱచిపోయెను. ఈరెండు దినము లలో నామె గృహమున స్వాతంత్ర్యము నెఱపినవార్తలు విని యతఁడు సంతోషించెను. తనభావములు క్రమముగాఁ దన యింటిలో వ్యాప్తిఁజెందునని తలంచెను. ఆనాఁడురాత్రి రత్నా వళితో నతఁడు కలియుట వానిమనస్సెఱుఁగనిపని; అతఁ డూ హించనిపని, శారీరకశక్తులచేత నాకర్షింపఁబడి తాను తెలియని

స్థితిలో లొంగిచేసినపని. దానియందు తనని మనసు లగ్నము కాలేదు. అది యతడు మఱచిపోయెను. అందుచేత నతడు గడచినరాత్రి రత్నావళిని గుఱించి యూహించనే లేదు. ప్రయాణపు బడలికచేత సొమ్మసిలి నిద్రపోయెను. ఈనాడు పగలెల్ల చాలసార్లు రత్నావళి తన్ను దాచుకొనిపోయెను. తన్ను గాంచినపుడెల్ల ముసిముసినవ్వులు నవ్వెను. పలుమాఱులు తొంగి తొంగిచూచెను. అతనికి మఱల నానాఁడు తమతొల్లింటి సమాగమము జ్ఞాపకమునకు వచ్చెను. ఆరాత్రి యతడామెను గుఱించియే యూహించుచుండెను. మనస్సు 'నీ వచటికిఁబోకుమనును, శరీరము బంధులు దేలుచునును. అతడు లేచి 'ఛీ'యని మఱలఁ బండుకొనును. మఱలఁ గొంతసేపటికి లేచి యామెగది తలుపుదాఁకఁ బోయెను. తలుపు తెఱచియుండెను. దానిలో నామె నిలిచియుండెను. ఆమె నవ్వెను. అతడును నవ్వెను. అతడు వెనుదిరిగి పోఁబోయెను. ఆమె చేయిపట్టుకొనెను. అంతలో వారిరువురు కౌఁగిలించుకొనిరి.

ఆ కౌఁగిలిలో వారిరువురకు నొడళ్లు తెలియలేదు. ఒక మాదకశీలమైనశక్తి, మనస్సులను దిగ్భ్రమయెక్కించుశక్తి, కనులను కనిపించనీయనిశక్తి, ఒకరి మొగము నొకరు చూడనీయనిశక్తి, వారి నావహించెను గదిగుమ్మములో వెలుచున్న దీపమును శయ్యాతలమున కెట్లుచేరెనో వారికి దెలియదు. ఆ గదిలో చీకట్లు తాండవించెను. అంధకారదేవతకు నయనము లున్నవో, లేవో తెలియదు. ఆమె కంటికి కనిపించరాని యొక కరాళమూర్తి. పవిత్రమైన మనస్సులో ప్రవేశింపరానివంటి గోచరించని యొక కుంభీపాకము. ఈ చీకటిలో కరములుగాని కరములు పెనవేసికొనునో ? పెదవులు కాని పెదవులు చుంబిం

చునో? తనపుట్టింటి [illegible] ఘురములను ఘటించునో? మఱునాటినుండి సీతారామయ్య రాలేదు. రంగఁడును, రత్నావళియు నొక్కనచనుపుగా నింటిలోఁదిరిగిరి. ఒకటి రెండుసార్లు సరస్వతి రత్నావళిని మందలించెను. ఆమె లెక్క చేయలేదు. రంగఁడు వచ్చిన నాల్గవరోజున రత్నావళియు, రంగఁడును సముద్రమునకు షికారుపోయిరి. ఆ పల్లెటూరిలో జన మందఱును వారు పోవుచుండఁగా నిలఁబడి చూచిరి. దాఁటి పోయినతరువాత బాజా[illegible]తిరిగిచూచి పక్కున నవ్విరి. ఇర్వురును సముద్రపుటొడ్డున చిన్నగట్టుపై నొకరి కొకరానుకొని కూర్చుండిరి. సముద్రము పొంగుచున్నటు కనిపించెను. అదివర కెన్నఁడును రంగఁడెఱుఁగనంతటి పెద్దయలలు గట్టుమీఁదికి పోసికొని వారిని నడుములదాఁక తడిపెను. రంగఁడు తనకట్టినదోవతి పిండి మఱల కట్టుకొనెను. రత్నావళి తనచీరయంచులు మొలవెట్టి పిండెను. రంగఁ'డట్లే కూర్చుండు'మనెను. రత్నావళి 'పోయి సముద్రమునకు దూరమున కూర్చుండుద' మనెను. రంగఁడు 'గృహమునకుఁ బోద' మనెను. రత్నావళి 'చీఁకటిపడిన తరువాత పోద'మనెను. సముద్రపు కెరటములు వెనుకకుఁ బోవుచుండెను. ఆమెయన్నమాటకు రంగఁడు నవ్వెను. సముద్రపుఁ గెరటములు తూఁగి ముందునకు వచ్చెను. ఇరువురును పోయి సముద్రమునకు దూరముగాఁ గూర్చుండిరి. తడిబట్టలన్నియు నిసుకయయ్యెను. రత్నా:—ఈయింటిలోఁగాని, ఈయూరిలోఁగాని మన ముండకుండ పోవలయును. రంగ:—మామయ్య వచ్చినతరువాత డబ్బుతీసికొనిపోదము. రత్నా:—మామయ్య నీకు డబ్బీయఁడు. రంగ:—ఎందు కీయఁడు? ఇంటిలో సగమునాది. పొలములో సగమునాది. వాని నమ్మి డబ్బుతీసికొందును. ఇద్దఱము మఱల జూలై వచ్చువఱకును

మదరాసులోనుండి ముందునాఁటికి లక్నోకుఁబోవుదము. ముందు నాఁటికి నేనుచెడిపోయినచదువు పూర్తిఁజేసెదను. ఏదోయుద్యోగములోఁ బ్రవేశింతును నా స్నేహితులు చాలమంది యున్నారు. వారందఱును సంస్కారప్రియులు. నీయిష్టము వచ్చినవానిని నీవు పెండ్లి చేసికొనవచ్చును. రత్నా:—మఱల పెండ్లియందు వేమి? ప్రేమయున్నచోటనే పెండ్లి. నాకునీయందు ప్రేమయున్నది రంగ:—ఇది ప్రేమగాదు. నీవు లోకములో నితరుల నెఱుఁగవు. కాన నన్నే ప్రేమించుచుంటి ననుకొనుచుంటివి. మనము పోయి మహానగరములలో నున్నప్పుడు నీవు చాలమంది నెఱిఁగియుందువు. అప్పుడు వారిలో నీ వెక్కువగా నెవరిని ప్రేమింతువో వారిని చేసుకోవలయును. రత్నా:—పెండ్లి చేసికొనుట యన్నమాట నాకుఁబనికిరాదు. రంగ:—సరే! అట్లేయుండవచ్చును. రత్నా— నీయర్థమేమి? అట్లేయుండవచ్చుననఁగా ? రంగ:— నీయిష్టము. రత్నా:—నాయిష్టము నేను నిన్ను ప్రేమించుచున్నాను, ప్రేమించుటయే పెండ్లి చేసికొనుటయంటివిగదా! నేనునీకుభార్యను,నీవు నాకు భర్తవు. రంగ:—ఇంత తొందరలో నట్లనుకొనుటకు వీలు లేదు.ఇంకనునీవుచాలమందిని చూడవలయును.నీవెవనినిచూచి నేనందఱికన్న నితనిని ప్రేమించుచుంటినని అనుకొందువోవానిని నీవుపెండ్లి చేసికొనవలయును. రత్నా:—అట్లనుకొనుటయే పెండ్లి జేసికొనుటగదా? మఱల బెండ్లి చేసికొనవలయునని యనకుము. నేను నిన్నుగుఱించి యట్లనుకొనుచుంటిని.మనయిద్దఱకును బెండ్లి యైనట్లే కదా? రంగ:—నేను నిన్నుఁ బ్రేమించుట లేదు. రత్నా వళియాలోచింపనారంభించెను. సముద్రము రివ్వున ముందునకు వచ్చినట్లే వచ్చును; చరాలున వెనుకకులాగుకొని పోవును. రంగ:—ఏమిటి ఆలోచించు చున్నావు ?

రత్నా:- నేను నిన్ను ప్రేమించుచున్నాను గనుక నేను నీకు భార్యను. నీవు నన్ను ప్రేమించుటలేదు గనుక నీవు నాకు భర్తవు కావు. మన యిర్వురమధ్యను పెండ్లిలేదు. రంగ: నీ మాటలు నాకర్థమగుటలేదు. రత్నా:-ప్రేమగలచోట పెండ్లియంటివి. నాకు ప్రేమయున్నది. పెండ్లి లేదేమి? రంగ-పెండ్లి ఇప్పుడు కాదు. నీవొకనిని ప్రేమించుము. వాడుఁనిన్ను మఱలఁ బ్రేమించవలయును. అప్పుడిద్దఱును పెండ్లియాడవలయును. రత్నా:- నేను నిన్ను ప్రేమించితిని. ఇంకొకఁడు నన్ను ప్రేమించును. నేను వానిని ప్రేమించనేమో? నిజముగాఁ బ్రేమించను. నేను నిన్ను ప్రేమించుచున్నానుగనుక. అప్పుడు వివాహముపడదే? రంగ:- అట్లిరువురు నొకరినొకరు ప్రేమించునపుడేవివాహము. రత్నా:- ఔనునిజమే! ఇద్దఱునుకలసి ప్రేమించుట ఎటుకుదురును?కుదురునని నాకుతోచుటలేదు. రంగ:-నీకు తెలియకయే కుదురును. మనముపోయి పట్టణములలో నున్నప్పుడు, నీవుచాలమందియువకులను చూచినప్పుడు నీ కా సంగతి తెలియును. రత్నా:— మఱిమనమిద్దఱమును భార్యాభర్తలవలెమెలగుచున్నాముకదా! రంగ:- కలసి షికారువచ్చుట, చెట్టాపట్టాలు పట్టుకొనుట, ముద్దులు పెట్టుకొనుట, పరాచికము లాడుకొనుట, దోబూచులాడుట ఇవియన్నియు స్త్రీలును పురుషులును హాళిగా, విలాసముగా నెవరైనను చేయవచ్చును. ఇవి స్త్రీలను ముసుఁగులలో బెట్టి దాఁచకుండ స్వేచ్ఛావిహారముగానుంచుటకు జేయవలసిన పనులు. రత్నా:-అయినచో నేను మీయన్నయ్యతో నిట్లుండవచ్చునా? రంగ:-ఉండవచ్చును. కాని ఆయనకీ సంగతులే తెలియవు. ఇవి యన్నియు ఆయన తప్పనుకొనును. రత్నా:- ఇంతవఱకు నేనునుతప్పేయనుకొనుచుంటిని. మఱి మనమిద్దరము

నింతమాత్రమే కాదుకదా, సంసారముకూడఁ జేసితిమి రంగ:- మనమేమిసంసారముచేసితిమి? మనముపెండ్లియాడలేదు, విడిగా కాఁపురముండలేదు, భార్యాభర్తలమని తలఁచియుండలేదు. రత్నావళిరంగనివంకఁజుఱుక్కునజూచెను. అతని మొగములో నామెయన్నయర్థము వానికిఁబొడకట్టినట్లుకనిపించలేదు. రత్నావళికికాకికనవ్వెను. ఇద్దఱునుగలసి సముద్రపుటొడ్డునకుఁబోయిరి. అచ్చటఁ కెరటములు కాళ్ళకుఁ గొట్టుకొనుచోట నిలుచుండిరి. అస్తమించుసూర్యునికిరణములు మూలగావచ్చి సముద్రతరంగములపై నల్లలాడుచుండెను. రంగడువానిశోభతిలకించుచుండెను రత్నావళి 'ఏమిటిచూచుచుంటి'వని యడిగెను. రంగడు "నీకు కన్నులులేవా? ఆరంగు లెంతయందముగా నున్నవో చూడుము. అందమనునది మనయిండ్లలోనుండదు; పర్వతములమీద, సముద్రముమీఁద, పచ్చికబయళ్లమీఁద, అడవులలో, మేఘములలో ఆకాశములోనుండును. సూర్యుఁ డుదయించునపుడు, ప్రొద్దుక్రుంకునప్పుడు రంగురంగుల యాకాశము ఎంతయందముగానుండును! పల్లెటూరివారికీయందమే తెలియదు. ఒకసారిచూడుము ఆయెఱ్ఱని పడమటిదెస; ఆరంగు లీసముద్రముమీఁదికి కొట్టుట, ఆకాశమంతయు సెలయేరుదారాలు పోసినట్లు పొడుగైన యెఱ్ఱని వెలుఁగురేఖలు తీర్చి యెట్లున్నదో! నీ కిది యందముగానున్నట్లు కనిపించుటలేదా?" రత్నావళియతనివర్ణనతో నా యందమును గ్రహించెను. "అవును, మిక్కిలి యందముగానున్న" దనెను. రంగ:-నీ కిట్టి వింక నెన్నిసంగతులో చెప్పెదను. అప్పుడు నీ మనస్సు పరిపక్వమగును. నీ కనేకవిషయములు తెలియును. ఆపైని నీకుఁ బ్రేమించఁగల శక్తి వచ్చును. అప్పు డెవరిని బ్రేమింతువో వానినిఁ బెండ్లిచేసికొందువు. రత్నా:—వాఁడు మఱల

నన్ను ప్రేమించినచోఁ గదా.' రంగ:—నీవు ప్రేమించినచో నతఁడును ప్రేమించును. రత్నా:—నేను నిన్ను ప్రేమించితిని. నీవు నన్ను మఱల ప్రేమించవేమి? రంగ:—నీమనస్సు పరిపక్వమైనతరువాత నాతో నీవు నన్ను ప్రేమించుచుంటివనిచెప్పుము. అప్పుడు ప్రేమించెదను. రత్నా:—నామనస్సు పరిపక్వ మెప్పుడగును? రంగ:—మన యిరువురము నొక్కయేఁడాదియైనను గలసియున్నచో నగును, అని యాతఁడు కౌఁగిలించుకొనెను. ఆమెయుఁ గౌఁగిలించెను. ఒకరినొకరు ముద్దాడిరి. ఆమె "నీవు నాకీరోజున నెంతయో చదువుచెప్పితి" వనెను. "నాకిదివఱకు నంద మెట్లుండునో తెలియదు. నీవు చూపించితి"వనెను. మఱల నామె కాలి బొటనవ్రేలితో తరఁగ వెనుకకుఁబోయిన యిసుకలో రాచుచుఁ దలవంచుకొని నిలుచుండెను. అతఁడు 'మఱల నేదియో యాలోచించుచుంటి వనెను. ఆమె "మనము సంసారముచేసితిమని మీకుఁ దెలియదా" యనెను. అతఁడు "మనము సంసారము చేయలేదే" యనెను.

అప్పుడేయొక కెరటము నురుసులుకట్టుకొంచు రత్నావళిపాదము వద్దకు వచ్చెను. ఆమె యా నురుసు దోసిటఁదీసి రంగని మొగమునను, దలపైనను బులిమెను. అతఁడు కళవళించుకొని, యుక్కిరిబిక్కిరియై తలవిదల్చి, కనులార్చి యామెవంక జూచెను. ఆమె "మనము సంసారముచేయుట మీకుఁ దెలియదా?" యనెను. రంగనికిఁ దెలిసెను. అతని కన్నులలో నొక చుఱుకుదనము కలిగెను. రత్నావళి "మన మిద్దఱము భార్యాభర్తలము. తెలిసినదా?" యనెను. రంగఁడు తల వంచుకొనెను.

అప్పటికిఁ గొంత చీఁకటివచ్చెను. ఇరువురును గృహాభిముఖులై పోవుచుండిరి. కొంతదూరము మాటాడకుండ నడచిరి. కొంత

దూర మేఁగినతరువాత రత్నావళి రంగని నిలుచుండబెట్టెను. అతఁ డేమి టని యడిగెను. రత్నా:—మన మిరువురమును భార్యాభర్తల మేనా'. రంగ:-ఇప్పుడు చెప్పలేను. ఒక సంవత్సరము గడువవలయును. రత్నా:— అయినచో నీ వింటికిఁ బొమ్ము. నేను సముద్రమునకుఁబోవుచున్నాను. నీవు నాభర్తవు కానిచో నే నాయింటికి రాను. నిన్ను చూచి మాయన్నయ్యను వదలిపెట్టితిని. నీవు భర్తవు కానిచో నే నా యింటికి వచ్చుటకు వీలులేదు. రంగ:-నీవు మాయింటికి నా స్నేహితురాలవుగా రావచ్చును. మన మిద్దఱము స్నేహితులము. నీవు నాయింట నతిథివిగా నుండవచ్చును. రత్నా:—అతిథులను ముద్దుపెట్టుకొనవచ్చును. అతిథులను షికార్లుతీసికొనిపోవచ్చును. అతిథులతో సంసారము చేయవచ్చును. అది పెండ్లి కాదు. అది ప్రేమకాదు. పెండ్లియు, ప్రేమయు వీనినిదాఁటి ఏ రీతిగానుండును? ఆ ప్రేమ ఎటువంటిది? దానికి గుర్తేమిటి? మఱలఁ గొంత సేపటికి నిరువ్వరునుగలిసి యింటికిఁ బోవుచుండిరి. వారింటికిఁ బోవువఱకు సరస్వతియింటిలో లేదు. వంటచేసిలేదు. రంగఁడుతల్లినిపిలిచి "వంట యెవరునుచేయ లేదే"యనెను. తల్లి 'నాయనా, మీరిద్దఱునిట్లుండుటచూచి 'సరస్వతికిగోపమువచ్చినది. మిమ్మీరీతిగానుండనీయకుండుటకు నది యీరెండు మూన్నాళ్ళుప్రయత్నముచేసినది. మీరుదానిమాటలువినలేదు. అది కోపమువచ్చి బండికట్టించుకొని వెళ్ళిపోయినది. ఎచ్చటికిబోయినదో తెలియదు. తనయన్నగారులేని యీయింటిలోఁ దా నుండదఁట. ఎక్కడకుఁబోవుచుంటివని నే నడిగితిని. నాకు సమాధానము చెప్పలేదు. నన్ను తిట్టబోయినది. మీరిద్దఱు నిట్లుతిరుగుటకు నేనకారణమన్నది. ముసలిముండను నే నేమిచేయగలుగు

దును? తెల్లవాఱులాపంచాదిలో కుక్కి వేసికొనిపండుకొందును మిమ్మిద్దఱను నేనిట్లుతిరుగమంటినా? నీవన్నగారిభార్యతో నిట్లు తిరుగుటమంచిదికాదు. ఎవరైన నేమైన ననుకొందురు" అనెను. రత్నావళినవ్వెను. రంగడు "సరస్వతి యెచ్చటికిబోయెనందు?" వనెను. రత్నావళి నవ్వుచు "నెవరినో ప్రేమించుటకు వెళ్ళియుండవలె" ననెను. రంగడు "ఛీ! ఛీ!" యనెను. రత్నావళి "అది ఏమి అట్లందువు? ఆమె మాత్రము ఆడదికాదా! ఒకసంవత్సర మెచ్చటనోయుండియెవరిని పెండ్లిచేసికొనవలయునో తెలిసికొని వచ్చు" ననెను. రత్నావళిపోయి తనగదిలోబండుకొనెను. రంగని కాఁకలివేసెను. రత్నావళిని "నీవువంటచేయరాదా?" యనెను. రత్నావళిరంగనిని "నీవేచేయరాదా?" యనెను. రంగడు తనకు చేతఁగాదనెను రత్నావళి "స్త్రీలెందుకుఁజేయవలెను? పురుషు లెందుకుజేయరా" దనెను. రంగడుపోయి తనగదిలోఁ బరుండెను. కొంతసేపటికి రత్నావళిలేచి వంటచేసెను. రంగఁ డిట్లనెను. "నాకువంటచేతకాదుగనుక నిన్నుఁజేయుమంటిని. మన మిరువురము విడిగానున్నపుడు వంట చేసికొన నక్కఱలేదు. పూఁటకూళ్ళబసనుండి యిద్దఱకు నన్నము తెప్పింతును."

ఇరువురును భోజనముచేసి లేచిరి. మాణిక్యమ్మకు ఫలహారము చేయలేదు. పిండియో, రొట్టెయోచేసిన నామెయుం దినెడిదే. కాని రత్నావళి చేయలేదు. మాణిక్యమ్మ యట్లే యొక్కరుక యుఁ బండియుండెను; వీరిరువురును పోయి యెవరిగదిలో వారు పండుకొనిరి. రత్నావళి రంగఁడు వచ్చునని యెదురుచూచెను. కాని యతఁడు రాలేదు. తుదకుఁ దానే రంగనియొద్దకుబోయెను. రంగఁడు నిదురపోవుచుండెను రత్నావళి తన చీరయంచు మూలను సన్నగా గుండ్రముగాఁ జుట్టి యతని ముక్కులలోఁ

బెట్టెను. ఆతఁడులికిపడిలేచి రత్నావళినిజూచెను చూచి యిట్లు వచ్చితివేమనఁగా "నాకొక్కసారికకు నిద్రురపట్టుటలేదు. నాకు భయముగానున్నది. మన మిద్దఱమును కలసి పండుకొందము" రమ్మనెను. అతడువెనుకముందాడెను. రత్నావళి యతనిని బల వంతముగాఁ దనగదిలోనికిఁదీసికొనిబోయెను. అతనిని గౌగిలిం చుకొని పెనవెట్టిముద్దువెట్టెను ఇంకనతనియొడలతనికిఁదెలియ లేదు. ప్రతివానిలోను బశువృత్తియుండును. అది కొందఱలో మనోదఘ్నముగానుండి యాత్మకు వ్యాపించదు. వాడువట్టి మననశీలి. పశువృత్తి నాచరింపబోయినచో నతని హృదయ మెదురు దిరిగి వాని శరీరము కంపము, స్వేదము, వైము ఖ్యము, నశక్తతయు వ్యాపించును; మఱియొకని యందు నది హృదయదఘ్నముగా నుండును అది మనస్సును స్పృశించదు. కాని పాపాచరణముపట్ల నతని శరీరము సోద్వే గమై, సరోమాంచమై, ధిక్కృతాన్యవిషయపరిజ్ఞానమైచెల రేఁగును. అట్టివాఁడు మనస్సుచేత నెన్నిసిద్ధాంతము లైన చేయవచ్చును వానిశరీరము వానిమనస్సుచేతఁ బాలింపఁబడు నది కాదు. మానవసృష్టి విచిత్రమైనది ఆలోచన మనస్సు లోననే జరుగదు. సంకల్పవికల్పాత్మకమైన యాలోచనయే మనస్సులోజరుగును. తక్కినవి మనస్సువెనుకనున్న ప్రకృతిలో జరుగును. మానిసి నడుచుచుండును ఒకయడుగుఁదీసి క్రొత్త యడుగువేయునప్పుడు 'నేనుకాలుదీసిముఁదల నుంచవలయు' నని సంకల్పింపఁడు. ఈ సంకల్పముయొక్కస్వాతంత్ర్యము మనస్సు కూడ గుర్తించలేనంత సూక్ష్మముగ, వేగముగ శరీరసృష్టిలో జరుగుచున్నది. ఈశరీర మెప్పుడెచ్చట వ్యగ్రమగునో, దాని సంకల్ప మెచటఁ బుట్టునో, యది యెట్టి వికారమును పొందునో

క్రియాపరిణామానుమేయమే తప్ప చెప్పరానిది. ఒకానొకనికి ధనవాంఛ మిక్కుటముగా నుండవచ్చును. వానిమనస్సులో నావాంఛయున్నట్లు వానికే పొడకట్టదు. హఠాత్తుగ ధనము న్యాయమార్గమున కాకుండ లభించు సందర్భము ద్రవికముగా, రహస్యముగాఁగలిగినచో నతఁడా ధనమును దొంగిలించును. తక్కిన జీవితమంతయు నతఁడు న్యాయముగానేయుండును. ఒక్కొక్కప్పుడు మనుష్యుడు తనకు వాంఛలేదనుకొని ధర్మకార్యమున్నట్లు ప్రయత్నమొకదానినిచేయును. దానియందు వాంఛలేనిచో నాకార్యమేచేయడు. వాంఛ యనేకవిధములుగా నుండును ఆవాంఛ యెచ్చటనో సూక్ష్మముగా హృదయాంతరాంతరములనుండును. అదియే తనకు లాభించినను లాభించకపోయినను దానియందతనికున్న యనురక్తి వానికందు స్వలాభములేనట్లు కనిపింపజేసి వానిచేత నాపనిని చేయించును. కార్యమధ్యమున దనకుఁదత్ఫలప్రాప్తిగలిగినచో వాఁడు నిరాకరించుకొనలేడు. నిరాకరించుట వానికి సహజమైనస్థితికాదు.

ఆరాత్రి వారిరువు రేకశయ్యాగతులై నిదురించిరి. మఱునాటి రాత్రి రంగఁడు రత్నావళిగదిలోనికి నామె పిలిచినను పోలేదు. ఆమె యతనివద్దనే పరుండెను. ఇరువురు వాని చిన్నమంచము మీదనే కౌగిలించుకొని పండుకొనిరి. ఆ మంచమువద్దనే వీథిలోని యొక కిటికీ యుండెను. ఆకిటికీ తలుపు తెఱచియుండెను; ఆరాత్రి తెల్లవారుకడ సీతారామయ్యయు, సరస్వతియు బండి మీఁదవచ్చి వాకిటిముందు దిగిరి. సరస్వతి తలుపు తట్టెను. "అమ్మా"యని పిలచెను. రెండురాత్రులనుండి ఫలహారములేక మాణిక్యమ్మ తెల్లవాఱుకడ గాఢముగా నిద్రపోవుచుండెను. రత్నావళియు, రంగఁడును నొడలు తెలియక గాఢముగా నిద్రిం

చుచుండిరి. సరస్వతి రంగఁడి గదికిటికీవద్దకుఁబోయి చూచెను. ఆమె నిర్విణ్ణురాలయ్యెను. ఆమె నోటినుండి మాటరాలేదు. వెంటనే సీతారామయ్య వచ్చిచూచెను. దీపము వెలుఁగుచుండెను. వారిరువు రొకరికౌఁగిలిలో నొకరు హత్తుకొని నిద్రాళువులై యుండిరి. సీతారామయ్యకు కనులు గిర్రున తిరిగెను. అతఁడు పోయి బండిమెక్కఁబోయెను. సరస్వతి యతనిని వెనుకకు లాగుకొని వచ్చెను. సరస్వతి మఱలమఱలఁ దలుపుతట్టగా రత్నావళికి మెలఁకువ వచ్చెను. ఆమె లేచి, పిలుచుచున్నది సరస్వతి యని గ్రహించెను. కిటికీతలుపులుమూసెను. ఆదొంగ కిటికీతలుపులుతామదివఱకు నేమియుకనిపించనీయనట్లెతెక్కలు నెమ్మదిగా నత్తుకొనెను. ఆమె చీర సరిగాధరించి రంగని నిద్ర మేల్కొల్పెను. "మీయక్కయ్య వచ్చినది. పోయి తలుపు దీయు" మని, యామె పోయి తన గదిలోఁబండుకొనెను. రంగఁడు లేచితలుపుతీసెను. సరస్వతికిరత్నావళికనిపించలేదు. ఆమెపోయి రత్నావళిగదితలుపుఁదట్టెను. గదిలోపల గడియవేసియుండెను. సీతారామయ్య యరుగుమీదనే కూర్చుండెను. సరస్వతియన్న గారిని లోనికిరమ్మనెను. అతనిమనస్సుముద్రమూపిరియాడకుండ వచ్చెడుకెరటము, పోయెడు కెరటముగానున్నది. అతని కీమె పిలుచుటయే తెలియలేదు. అతనిమనస్సాలోచనచేయుచుండెను. ఇప్పుడతని కా మనస్సు జడమై చైతన్యమేది యుండెను. అతఁడు తెల్లవ ఱువఱకట్లే కూర్చుండెను. తెల్లవాఱువేళ, కనుచీఁకటి వేళ కాకులుకూయువేళనతఁడుసముద్రాభిముఖముగాఁబోయెను. అతఁడేమి చేయవలయునో యాలోచించవలయునని సముద్రము మొగము వట్టెను. అతఁడు దూరకే కట్టెవలె నొడ్డునఁ దిరుగుచుండెనె కాని వానికొకయూహ వచ్చుటయు లేదు. పోవు

టయు లేదు పగలు రెండుజాము లైనది. అప్పటికతనికొడలు తెలిసినది. అతఁడు తన యూరినుండి పదిమైళ్లదూరమున సముద్రపుటొడ్డున తిరుగుచుండెను. ఇంటికిఁ బోవలయు నన్నచోఁ బదిమైళ్లు నడువవలయును. అప్పటికి ప్రొద్దుకుంకును. అతని కాఁకలి గుర్తువచ్చెను. తాను నడువలేఁడు. అంతలో నతనికిఁ దాను నిస్సారపడిపోవుట దెలిసెను. సరస్వతి వంట జేసికొని కూర్చున్నదేమోయని యతనికిఁ దోఁచెను. అక్కడ నెక్కడిగ నాలుమైళ్ళదూరము నడిచి, అచ్చట నున్న యూరిలో భోజనముచేసి యింటికి పోద మనుకొనెను. ఆ యూరు చేరు వఱకు ప్రొద్దు బాగుగా వ్రాలెను. అంతదూరము వచ్చిన తరువాత నతని కచట భోజనముచేయుట మనస్కరించలేదు. అతని కాకలియుఁ బోయినట్లుండెను. అంత దూరము వచ్చినవాఁ డా యూరిలోనికిఁబోక మఱల ప్రతిష్ఠాపుర మార్గమునే పట్టెను. ఆ యూరిలోనికిఁ బోయినచో, నెచటనుండి వచ్చుచుంటి వన నేమని చెప్పవలయును? అతడు మనస్సులో నేదో నిశ్చయము చేసికొనెను. అతని మనస్సునకుఁ జేసికొన్న దృఢత్వమే తెలిసినదిగాని నిశ్చయ మిదమిత్థమని తెలియలేదు. అతడు కాళ్లీడ్చుకొనుచు నింటికిఁ జేరువేళకు జాము ప్రొద్దుపోయెను. సరస్వతి వెంటనే భోజనమునకు లెమ్మనెను. స్నానముచేయుటకుఁ జితుకుల మంటజేసి నిముసములో వేన్నీళ్ళు కాచెను. అతడుభోజనము చేసి పోయి తనగదిలోఁ బండుకొనెను. సరస్వతి కాశ్చర్యము వేసెను. భయముకలిగెను. పోయియన్నగారితో నేమిపల్కుటకును ఆమెకు నోరాడలేదు. ఆమె యెఱుఁగ నట్లాగదిలోనికిఁ బోయి, గదిలోఁ గొట్టుటకు వలసిన సాధనము లేమియులేకుండఁ దీసికొనిపోయెను. సీతారామయ్య నవ్వెను.

ఆ నాఁడు పగలు సరస్వతి భోజనము చేయలేదు. అన్నగారు వచ్చునని యెదురుచూచెను. అతఁడు వచ్చినతరువాత మడి కట్టుకొనవచ్చునని యూరకుండెను. ప్రొద్దు తిరిగిన తరువాత నన్నము వండి తల్లికి మాత్రము పెట్టెను రత్నావళియు, రంగడును పగలెల్ల భోజనము చేయలేదు. రత్నావళి వండలేదు. రంగఁడల్లె పగలంతయు నిద్రించెను. ఒకసారిపోయి, సరస్వతిని 'వంటచేయరాదా' యనెను. సరస్వతి మొదటిసారి మాటాడ లేదు రెండవసారి పలుకరించగా "నీవు నాతో మాటాడకు. నాయొడలు మండిపోవుచున్నది. నీవు తమ్ముఁడవు కాదు; నే నక్కగారినికాదు" అనెను రంగఁడు నవ్వి "ఎందుకేలంత కోపము? నేనేమిచేసితి" ననెను. సరస్వతి దగ్గరనున్న కట్టెపేడు పుచ్చుకొని "ఏమిచేసితివా? ఏమిచేసితివా' అని ఛీ అని కట్టె పేడు దూరముగాఁ బాఱవేసెను.

ఆ రాత్రి సరస్వతి తనయన్నగారికిమాత్రమే వంటజేసెను పిండి చేసి తల్లికి పెట్టెను తాను నిరాహారముగానే పండుకొనెను. రంగనికిని, రత్నావళికిని ప్రాణములు సొరవోవుచుండెను. సరస్వతి పండుకొనినతరువాత రత్నావళిపోయి యింటిలో గిన్నెలన్నియు వెదకెను. పిండిచేసిన గిన్నెలో నడుగున రెండుమూఁడు చెక్కలుండఁగా నవి తిని యింతమజ్జిగద్రాగెను రంగఁడుపోయి పడమటిల్లుచూచెను. అయ్యవారినట్టిలువలె నుండెను. రత్నావళిని 'లేచి మడికట్టుకొని వంటచేయు' మనెను. ఆమె మాటాడ లేదు. అతనికి మిక్కిలియాకలివేసెను. ఏమిచేయుటకుఁ దోఁచ లేదు. కోమటింటికిఁ బోయెను. ఆ పల్లెటూరి కోమటి దుకాణములో లడ్లులేవు. మైసూరుపాకములేదు. పకోడీలులేవు. కాఫీ లేదు. బస్తీలలో రాత్రి రెండుజాములపుడైన నన్నియు దొరక

కును. తెల్లవాఱుకడ నాల్గుగంటలకే ఇడ్డెనలును, కాఫీయును జేయుదురు. అతనికిఁ దినుట కేమియును లేకపోయెను. కోమటి వంద ప్రశ్నలు వేసెను. ఇతఁడు కొన్నింటికి సమాధానము చెప్పెను. కొన్నింటికి జెప్పలేదు. కోమటియే సెనగపప్పును, బెల్లమును నిచ్చి తినిపించెను పూర్వము వానిని తినుట మోటుతనము; అనాగరకత. వానినిగొన్నితినును.ఇప్పుడురంగనికవిమిక్కిలి రుచిగానుండెను. కోమటి మజ్జిగనిచ్చెను. అతఁడు త్రాగెను. ఇంటికిఁబోయెను; గదిలో ముసుఁగుపెట్టుకొని పండుకొనెను. రత్నావళి మండువాలో తన చీరకొంగుపఱచుకొని పన్నుండెను. సరస్వతి యామెనుచూచి "యా చిన్నమంచము మీఁ యిద్దఱకుఁజాలును. పోయి యచ్చట పండుకొనక ఇక్కడ సేవించినావే'మని యనెను. రాత్రి రెండుజాములు తిరిగి యందఱకును నిద్రపట్టినట్లుండెను. ఎవరికి వారికి నిద్రపట్టలేదు. మాణిక్యమ్మ నిద్రపోవుచుండెను. రంగఁడు నిద్రపోవుచుండెను. రత్నావళికి నిదురపట్టెను. మఱల మెలఁకువ వచ్చెను. ఆఁకలిబాధ ఎక్కువయయ్యెను మఱల కునుకువలెవచ్చెను. అదినిద్రకాదు రోజును పఱుపుమీఁద పండుకొనెడిది నేఁడు క్రింద పండుకొనఁగా నేల గ్రుచ్చుకొనుచుండెను. నోరారుచుండెను. లేచి రెండుమూఁడు సార్లు మంచినీళ్ళుత్రాగెను. సీతారామయ్య రెండుజాములు తిరిగిన తరువాత రత్నావళి పండియున్నచోటునకుఁ బోయెను. అచట నిలుచుండెను. రత్నావళి యతనిఁజూచి తానును లేచి నిలుచుండెను. అతఁడు గదిలోనికిఁబోయి పరుండెను. రత్నావళి మఱల నక్కడనేపరుండెను. కొంతసేపటికి సీతారామయ్యలేచి, యామెను గదిలోనికి రమ్మని పిలిచెను. ఆమె పోయెను. సీతారామయ్యమంచముమీఁదఁగూర్చుండెను. రత్నావళి గుమ్మము

వద్ద నిలుచుండెను. సీతారామయ్య యామెను దగ్గఱకు రమ్మనెను. ఆమె రాలేదు. అతఁడు "సీతా మాటాడవలయును. దగ్గఱకు రమ్మనెను. ఆమె కొంచెము దగ్గఱకు వచ్చెను.

సీతా:- మీ రిరువురి సంగతియు నాకుఁ దెలిసినది. మీ రిద్దఱును గదిలోఁ బంధుకొనఁగాఁ దెల్లవాఱుకడ నేను చూచితిని. ఈ సంగతి యూరిలో నందఱకును దెలిసినది. నేను మీ రిద్దఱ నింటిలోఁ బెట్టుకొని యెఱుఁగనట్లు కాపురము చేయలేను మీ రిద్దఱచ్చటికైన లేచిపొండు. వానితో లేచిపోవుట నీ కిష్టమేనా? రత్నావళి 'ఇష్టమే' యనెను. సీతారామయ్య పరేపొమ్మని తాను రంగనిగదిలోనికిఁ బోయెను. నిద్రపోవుచున్నవానిని మేల్కొల్పెను. అతఁడు లేచికూర్చుండెను. సీతారామయ్య కొంత సేపట్లే నిలఁబడెను. రంగఁ 'డెందుకు నిద్రలేపితి' వనెను. సీతారామయ్య కతనికంఠధ్వని వినఁబడినంతనే కోపము పొంగిపొరలి వచ్చెను. మాట్లాడవలెనని వచ్చిన సీతారామయ్య తనకోపము తాను పట్టలేక వానిఁ లాగి చెంపకాయఁగొట్టెను. రంగఁడు వ్యాయామముచేతకఠినమైనశరీరముకలవాఁడైనను, సీతారామయ్య యా దెబ్బకు దిమ్మరయెత్తిపోయెను. లేచి సీతారామయ్యతోఁ గలియఁబడఁబోయెను. సీతారామయ్య వానిచేతులు పట్టుకొని నొక్కి కూర్చుండఁబెట్టెను. సీతారామయ్యకు బలము లేదని రంగఁడనుకొనెను. ఇంతబలమెచ్చటనుండివచ్చెను? ఇంతబక్కపలుచని వాని కీశక్తియెక్కడిది? తన కొన్నాళ్ళభోజనము లేక పోవుటవలన తన కోపిక లేదనుకొనెను. సీతారామయ్య ఇట్లనెను: "మీరిద్దఱునింటిలోనుండి లేచిపోవుదురా?" రంగడు:- లేచిపోవుదము. సీతా:- ఎప్పుడు? రంగ:- నా భాగము నాకు పంచిపెట్టుము. మేము లేచే పోవుదుము. సీతా:- నీ భాగమే

మున్నదిరా వెధవా? నీభాగమమ్మినచో వచ్చెడుదానికి రెట్టింపు నీ చదువునకుఁ బెట్టితిని. ఇంక నీ కిచ్చుట కేమియును లేదు. కావలసినచో పంచెదను. ఋణమంతయు నీ కొఱకుఁ జేసినదే. ఆ ఋణమును, ఇంటిలో సగమును, నొకఎకరము పొలమును నీ వంతునకు వచ్చును. రేపు పంచెదను, తీసికొనిపొమ్ము. నీవును నదియును మఱల నాకంటికి కనిపింపరాదు. రంగ:–ఇల్లు నే నేమి చేసికొందును? సీతా:–నెత్తిన పెట్టుకొని యుండుకొనుము. రంగ:–అప్పెంతయున్నది? సీతా:–నీయదృష్టమువలన వేయి రూపాయలే యున్నది. రంగ:–ఆయప్పుతో నాకు నిమిత్తము లేదు. ఏనోటుమీదను నేను దస్కతు చేయలేదు.

సీతా:–నీ చదువుకోసమే యీయప్పు చేసినట్లు నోట్లలోనున్నది. నీవు తప్పించుకొన్నను నీకు తప్పదు. అమ్మ యెకర మున్నది. నీ వావిడను పోషించగలిగినచో నామెనుతీసికొనిపొమ్ము. ఆమె నీచేతినీరు త్రాగుటకు సిద్ధముగానే యున్నది. ఆ ఎకరముకూడ నీకేవచ్చును. రంగ:–అప్పుక్రింద ఇంటిలోభాగము నీవు తీసికొనుము. అప్పు నీవేతీర్చుకొనుము. అమ్మయెకరము నాకక్కఱ లేదు. ఆవిడనునీవే పోషించుము. మిగిలిన ఎకరము నాకిమ్ము. నే నమ్ముకొనిపోయి చదువుపూర్తిచేసి యెక్కడనో యుద్యోగము సంపాదించుకొని బ్రతుకుదును. సీతా:–ఎకరమమ్మినచో నాలుగువందలు వచ్చుట దుర్ఘటము. పైగా నిప్పు డెవరు కొందురు? నీ వమ్మెద నన్నచో ఆఱువందలది నాల్గువందల కడుగుదురు. ఒకవేళ బేరము కుదిరినను, నీ కిప్పుడు డబ్బు చేతిలోఁ బడదు. రేపుప్రొద్దున నిచ్చటనుండి మీరు పోవలయును. ఎట్లు పోవుదురు? రంగ:–రేపు నా కెక్కడనైన నొకవంద రూపాయలు నీవే యిప్పింపుము. తరువాత ఒకటిరెండు నెలలలో

కాగితములు వ్రాసి నామెకరము నమ్మివేసి తక్కినడబ్బునాకు పంపించుము సీతా:- అట్లే చేసెదను. వందరూపాయలు తెచ్చి సిద్ధముగా నుంచితిని నోటు వ్రాయుము

"సీతారామయ్య అప్పుడే దీపమువెలుగున రంగనిచేత నోటు వ్రాయించెను. రత్నావళిచేతఁ దనకును, నామెకును సంబంధము లేనట్లు కాగితములు వ్రాయించెను కాగితములకుఁ గావలసిన పరికరములన్నియు నతఁ డావఱకే తెచ్చెను.

మఱునాఁడు పొద్దునసే డబ్బుతీసికొని రంగడును, రత్నావళియుఁ బ్రయాణమైపోవుచుండిరి సరస్వతి రత్నావళి శరీరమున నున్న నగలు తీసికొనిపోవుటకు వీలులేదనెను. సీతారామయ్య 'ఛీ, యామెంగిలికూడెందుకుఁ బోని మ్మనెను. సరస్వతి "ఆ నగలు దీనివా? చనిపోయిన నదినవి. ఆవిడపిల్లపెట్టుకొనును. దీని కేమి హక్కున్న"దనెను సీతారామయ్య, "ఈనగ లంటుపడిపోయినవి. నా పిల్లకక్కఱలేదుపో" మ్మనెను. వారువెడలిపోవు నప్పుడూరంతయు గుమిగూడిరి. సీతారామయ్య మొగమున కత్తి వేసిన నెత్తురుచుక్కలేదు సీతారామయ్య యంతవఱకు దుఃఖమాపుకొనెను చివరకు బండిమలుపుతిరిగెను. అతఁడంతవఱకుఁ గూర్చున్నవాఁడు తటాలున లేచి బండివెంబడి పరువెత్తి "ఒరేయ్! రంగా! ఒక పేగులోనుండి వచ్చావని నిన్ను క్షమించాను. లేకపోతే నీనెత్తురు కళ్ళచూచేవాణ్ణి. నీకు నే నెంతచేశానో, దానికిఁ బ్రతిఫలము నీ వేమిచూపించావో భగవంతుఁడు పాలిస్తాఁడు. ని న్నేమనాలో-కుఱ్ఱవెధవవు. ని న్నేమనేందుకు నాకు నోరురావటములేదు ఒసేవ్! నీవుఅనుభవిస్తావు. నా శాపం మీ యిద్దఱిని కొట్టితీరుతుంది" అని అక్కడ కూలఁబడి గొంతుకూర్చుండి, మొకము చేతులతోఁ గప్పుకొని వలవలా

యేడ్చెను. సరస్వతి యన్నగారిని నింటిలోనికి దెచ్చెను.

## ఏడవ అధ్యాయము

రంగడును, రత్నావళియు చెన్ననగరము చేరిరి. రంగడు తన స్నేహితుడొకడుండగా మొదటి రెండుదినములు నక్కడబస చేసెను. రైలుఖర్చులుపోగా నెనుబది రూపాయలే మిగిలెను. రత్నావళిని వెంటబెట్టుకొని రంగడు హైకోర్టు, లైటుహౌసు, చచ్చినమ్యూజియము, బ్రతికినమ్యూజియము, ట్రిప్లికేన్ బీచ్, అడయారును తిరిగెను రత్నావళికి దానుస్వర్గవిహారముచేయు చున్నట్లు తోచెను. మూడవదినమున రంగడు వేరే యింటి కొరకు తిరిగెను. జార్జిటౌనులో నొకమేడమీద రెండుగదులు నెలకిరువదిరూపాయ లద్దెకు మాట్లాడెను. నాల్గవనాడు రెండు పెట్టెలు కుట్టించెను. రెండుకుర్చీలుకొనెను. ఇంటియద్దెముంద గనే యిచ్చెను. ఒక టిఫినుకారేజి కొనెను. రత్నావళికి బదిరూపాయలుపెట్టి యొక మంచిచీరయు, నింకొక పదిరూపాయలు పెట్టి రోజువారీ వాడుకకు రెండుచీరలునుకొనెను. హోటలులో నుండి యొకమనిషికే యన్నము తెప్పించు చుండెను. అది యిద్దఱును తినుచుండిరి. ఒకనెలకు ముందుగానే హోటలులో డబ్బిచ్చెను. ఈ ఖర్చులన్నియుపోగా రంగనిచేతిలో నిరువది రూపాయలు మిగిలెను ఒకనెల దినములవఱకు నిబ్బంది లేదు కదా యనియు, తరువాత దనయన్నగారు డబ్బుపంపిందు ననియు రంగడాలోచించెను. ఇరువురును బ్రొద్దున నెనిమిదింటికి లేతురు. టూత్ పేస్టులతో, బ్రష్షులతో మొగములు కడుగు కొందురు. రంగడు మాడరన్ కేఫెకిబోయి, తానుకాఫీత్రాగి, రత్నావళికి రెండిడ్డెనలను,కాఫీయును తెచ్చియిచ్చును. ఇద్దఱును

సీతారామయ్యను, సరస్వతిని నాడిపోసికొంచు నొకగంటసేపు కాలముపుత్తురు. ఇంతలో నన్నము వచ్చును. భోజనము చేయుదురు. పదకొండుగంటలకు పండుకొని రేమూడుగంట లకో నిదలేతురు. మరల కాఫీలు త్రాగుదురు. సాయంకాల మైదింటికి బయలుదేఱి యేసినిమాకోపోదురు. రాత్రి తొమ్మి దింటికివచ్చి మరల భోజనముచేసి పండుకొందురు. ఇదివారిదిన చర్య. వారముదినములలో రంగనివద్దనున్న యిరువదిరూపాయ లును ఖర్చుపడిపోయెను. అతఁడిద్దరుముగ్గురు స్నేహితులవద్ద నింకొక పాతికరూపాయ లప్పుతీసికొనెను. ఈపాతికరూపాయలు జాగ్రత్తగా వాడుచుండెను. సినిమాలకుఁ బోవుట రోజువిడిచి రోజుగామాఱెను. సినిమాలకు పోనిదినములలో సాయంకాల ములు సరిగా గడచుటలేదు. రంగని కూరిలో స్నేహితులుండిరి. వారిని చూచుటకుఁ దా నొంటరిగాఁ బోయినచో రత్నావళి గదులలో నొంటరిగా నుండవలయును. అందుచేత నామెయాత నిని పోనీయలేదు. రత్నావళినిగూడఁదీసికొనిపోయినచోఁ బ్రాపు నకు డబ్బగును. పైఁగా స్నేహితులగదుం లోనికి నామెను తీసి కొనుపోవు టతనికిష్టములేదు. పదిరోజులుగడచునప్పటికి రత్నా వళిమూలముగా రంగనికి బందిఖానా యనిపించెను.

నెలలో సగము గడచినది. తానప్పుతెచ్చిన పాతికరూపాయలు సగముపైననైనవి. అన్నగారు డబ్బుపంపించుటకు నింకపదునేను దినములు పట్టవచ్చును. ఈలోపుగాఁ దనపనియేమికావలయునో రంగనికిఁ దెలియలేదు. తరువాత నొకటిరెండుసార్లు రత్నావళి తోఁ జెప్పకుండరంగడుతనస్నేహితులను జూడబోయెను. అతఁ డు తిరిగివచ్చుటకు నాలస్యముచేసెను. ఆరెండుసార్లును నతఁడు తిరిగివచ్చుసరికి రత్నావళి యేడ్చుచుండెను. అతఁడోదార్చెను.

"నేనొక్కఁడనింటిలో నెంతసేపు కూర్చుందును? నీకు భయమెందుకు? ఏవైనపుస్తకములు చదువుచు కాలముగడపవలయును. అంటిపెట్టుకొని ఎంతసేపుకూర్చుందుము? ఎప్పుడునునీ కెదురుగా గూర్చుండుటనాకుమాత్రము విసుగుకాదా" యనెను రత్నావళి "నాతోనుండుట నీకువిసుగా? నీతో నెంతసేపు ఉన్నను నాకు విసుగులేదు. ఇంట్లో ఒక్కర్తెనుబిక్కుబిక్కుమంటూ నేను కూర్చోలేను నన్నుకూడానీ వెంట తీసుకుపో. నేనూనీస్నేహితుల్ని చూస్తాను.నన్ను నీస్నేహితులకు చూపిస్తానంటివిగదా" యనెను. తరువాత నాలుగైదురోజులు రంగఁడింటిలోనుండి కదలలేదు. ఒకరోజున నాతఁడన్నగారికి నుత్తరముvrాసెను. "నేను తెచ్చిన డబ్బైపోయినది. ఇంకను పాతికరూపాయ లప్పుచేసితిని. పొలము వెంటనే యమ్మి డబ్బు పంపించవలసినది. ఇంకొక వందరూపాయలునాలుగైదురోజులలో జరూరుగాఁబంపించవలయును" అని vrాసెను. అతఁడు వెంటనే మనియార్డరు వచ్చు ననుకొనెను. వారమురోజులుగడచినది. కాని రాలేదు. చిల్లరగా మఱినలుగురైదుగురు స్నేహితులవద్ద రూపాయి,రెండురూపాయలచొప్పున పదిరూపాయ లప్పుచేసెను. అవియును ఖర్చుపడిపోయెను.

నెలాఖరైనది. డబ్బురాలేదు. రంగఁడు మఱల నుత్తరము vrాసెను. హోటలువాఁడు క్రొత్తనెల మొదలుపెట్టుటతోడనే మామూజువాణీగా నాలుగురూపాయ లిమ్మని యనెను. రంగఁడు "వెనుకటి నెలడబ్బంతయు ముందే యిచ్చితినిగదా! డబ్బు రావలయును. తొందరపడకు" మనెను. మఱల పదిరోజులు గడచెను. డబ్బువచ్చెడు జాడ కానరాలేదు. కాఫీకిఁగూడ డబ్బులు లేకుండెను. చిల్లరప్పు లిచ్చినవాండ్రకు రంగని నాలుగైదుసార్లడిగిరి. సినీమాలు మూలఁబడెను. ట్రాముప్రయాణ

ములు సన్నగిల్లెను. రంగని ముఖములో విలాసము తగ్గెను. రోజులు గడచినకొలది రంగనికిఁ గోపము పొడసూపెను. అన్నగారిని తిట్టమొదలు పెట్టెను. "నాడబ్బు నాకు పంపించటానికి ఏడుస్తాఁడేమిటి? అతని సొమ్మేమైనా యిమ్మన్నానా? ఉత్తరానికి సమాధానము వ్రాయఁడు. పోయి కనుక్కువద్దామంటే నాదగ్గఱ దమ్మిడీలేదు. ఏమిచేయాలనో తోఁచటంలేదు" అని విసుగుకొనును. ఆ మూఁడవనాఁడు సాయంకాలమున రంగఁడు రత్నావళికిఁ జెప్పకుండఁ దనచేతిఉంగరమమ్మి పదిరూపాయలు తెచ్చెను. తన ప్రాఁతపుస్తకములు మూరుమార్కెట్టులో నొక దుకాణమువాని కమ్మెను. వానివలన నాల్గురూపాయలు వచ్చెను. ఈ పదునాల్గురూపాయలతో రంగని మొగములోఁ గొంచెము వికాసము వచ్చినది. హోటలువాని కాఱురూపాయ లిచ్చెను. ఆ నాఁడుసాయంకాలము మరల సినీమాకుఁబోయిరి. ఆ మఱునాడు మధ్యాహ్నము వారడయారుకుఁ జని సముద్ర తీరమున విహరించుచుండిరి. ఇసుకలోఁ జాలదూరము నడచిపోయిరి. రత్నావళికి కాళ్లుకాలెను. రంగఁడు పరుగెత్తి చెట్టు నీడకుఁ జేరెను. రత్నావళి పరుగెత్తలేక కూర్చుండి యేడువ మొదలుపెట్టెను. రంగఁడామెవద్దకుఁబోయి యామెను లేవఁదీసి నెమ్మదిగా నడిపించి చెట్టుక్రిందికిఁ దెచ్చెను.

రత్నావళి మొగము ముడుఁచుకొనెను. రంగనితో మాటాడలేదు. ఆ సమయములో అడయారులోని యొకయువకుఁడు సముద్రముకడను వచ్చెను. వారిరువురను జూచెను. అతఁడు వారిరువురు భార్యాభర్త లనియు, నాభార్య కాభర్తయందిష్టము లేదనియు ననుకొనెను. అతఁడు రంగనివంక పరిహాసముగాఁ జూచెను. రత్నావళివంక లాలనగాఁజూచెను. రంగనికిఁగోపము

వచ్చెను. అంతట నా యువకుఁడు వెడలిపోయెను. రంగఁడు రత్నావళితో నిట్లనెను: "కాళ్లు కాలవా? నే నేమి చేసితిని? నీవు పరుగెత్తలేకపోతిని." రత్నావళి "నీవు నాకన్న ముందే దుముకఁ బరుగెత్తితివి" అనెను. రంగఁడు "నాకాళ్ళు [illegible] పరుగెత్తితి"ననెను. రత్నావళి మొగము పెడద్రిప్పి "ఎవరి కాళ్లు కాలుట వారికే తెలియు" ననెను. రంగఁడు "నేను వెనుకకు వచ్చి నిన్నుఁ దీసికొనివచ్చితినిగదా! నీకంత కోపమెందు" కనెను. రత్నావళి "తీసుకువచ్చితివి. కాని నేనే నడచివచ్చితి" ననెను. రంగఁడు "నన్నెత్తుకొని రమ్మందువా"యనెను.

రత్నావళి యొకనిముస మచ్చటనే కూర్చుండి తరువాత లేచి రంగనికి దూరముగాఁబోయి కూర్చుండెను. అందు కూర్చుండి తనలోఁదాననుకొన్నట్లుగా, రంగనికి వినిపించునట్లుగా నిట్లనెను. "అవును. నీవు నన్నెందు కెత్తుకుందువు? మేము పూర్వము తిరుపతికొండకుఁబోయితిమి. కొండ నెక్కుచుంటిమి. నేను నడువలేకపోయినాను. నన్ను వదలిపెట్టి యాయన ముందువెళ్ళినారు. నేను కూర్చుండఁబడి యేడ్వ మొదలుపెట్టితిని. ఆయన వెనుకకు తిరిగివచ్చి, నవ్వి, నన్ను బుగ్గమీఁద గొట్టి, యటు నిటు నెవ్వరును లేకుండఁజూఁచి నన్ను చంక కెత్తుకొని పదిగజముల దూరము నడచినారు. నేను సిగ్గుపడితిని. ఆయన చంక నుంచి జాఱితిని. తరువాత నన్ను వదలిపెట్టి యాయనపోనే లేదు. అవును నాకాళ్ళు కాలినచో నీకేమి" యని యేడ్వ నారంభించెను. రంగఁడు కొంతసేపట్లే కూర్చుండి యామెవద్దకుఁబోయి 'తప్పు చేసితిని క్షమించు'మని, 'యిప్పుడెత్తుకొందును'రమ్మనెను. రత్నావళి "ఇప్పుడక్కఱ లేదులే, పో"మ్మని దారివెంట నడువనారంభించెను. రంగఁడును వెనుబడి నడచెను. మోటారుబస్సుదగ్గరికి

వచ్చునరికి నుజల నిరువురొకరితో నొకరు మాటాడుచుండిరి. ఆరాత్రి మజల సినిమాకుఁబోయిరి. రాత్రి భోజనమైనతరువాత నిరువురును బండుకొనిరి. రంగ:- నిజముగా మా యన్నయ్యా నిన్నెత్తుకొనెనా? ఆయనతో నీవుసుఖమనుభవించితివా? ఆయన ముసలివాఁడుగదా! రత్నా:- ఆయన ఏమి ముసలివాఁడు? ఆయన పడుచువాఁడే. రంగ-అయినచో నీ వాయనను వదలి ఏలవచ్చితివి? ఆయనతోడనే యుండలేకపోతివా? నేను నిన్ను రమ్మనిచెప్పలేదే? రత్నా-ఆయనకన్న నీ వందగాడ వని చెప్పితివి. నిజముగా నందగాఁడవే! రంగ:- ఆ పల్లెటూరిలోఁబడి యున్నచో ఈ మదరాసు చూచియుందువా? అడయారుదగ్గఱ సముద్ర మెంతయందముగా నున్నదో చూడుము!

రత్నా-మన ప్రతిష్ఠాపురమునొద్దకన్న నెక్కువ యందముగా లేదు. అక్కడ చిన్నచిన్న ఱాతిగుట్టలమీఁద సముద్రము ద్రొక్కి పడుచుండును.అడయారువద్ద ఱాతిగుట్టలే లేవు. కాని అడయారు బాగుగానున్నది. రంగ:-అయినచో ప్రతిష్ఠాపురమే బాగు గానున్నది. సీతారామయ్యగారే బాగుగా నున్నాఁడు. నిన్ను నేను రమ్మని పిలువలేదు, నీవే వచ్చెద నంటివి.

రత్నా- నీకు కోపమెందుకు? మీ యన్నగారికన్న నీవు నా కెక్కువ సుఖముకల్పింతు నని చెప్పితివి. లోకమును చూపింతు నంటివి. స్త్రీలు, పురుషులు సమానమంటివి. ఇంత పట్టణమునకు వచ్చినను స్త్రీలును, పురుషులును సమానులనుట నాకుఁదెలియ లేదు. నీస్నేహితుల నెవరిని నిచటికిఁదీసుకురావు నీవు స్నేహి తులకడకుఁ బోవునపుడు నన్ను తీసికొనిపోవు. ఈ సమానత్వ మేమిటో నాకుఁ దెలియుటలేదు. నే నేకొంచెముమాట యని నను నీకు కోపమువచ్చును. రంగ:-నీ కంత ఇష్టము లేనిచో

నీవు ప్రతిష్ఠాపురమే పొమ్ము. రత్నా :– ఇదిబాగుగానున్నది! నే నిష్టము లేదంటినా? నీ వన్నచో నా కెంత ప్రేమయున్నదో అందులో సగముకూడ నీకు నామీఁద లేదు. మనము వచ్చి రెండు నెలలు కావచ్చుచున్నది. నే నీగదిలో ముక్కిపోవుచుంటిని. మాటకు మంతికి నెవరును తోడు లేరు. పొరుగున సంసారములు కూడ లేవు. నీ వెవరో స్నేహితులంటివి. వా రెవరును కనిపించరు. రంగ:– నేను నీకు చూపించవలయు నన్న స్నేహితులు లక్నోలో నున్నారు. నా చదువు చెడిపోయినది గాని, వారి చదువులు చెడిపో లేదుగదా! ఇంకొక నెలలో వారి పరీక్ష లగును. వారినిక్కడకు రమ్మని యుత్తరములు వ్రాసెదను. అప్పుడు చూతువుగాని, నాకు నిద్రవచ్చుచున్నది. రత్నా:– నా కిదివరకే నిద్రపట్టినది. డబ్బు లేకపోవుటవలన రంగఁడు మిక్కిలి యిబ్బందిపడుచుండెను. ఆ నెలకూడఁ బూర్తియయినది. ఇంటివాఁడువచ్చి అద్దె యడిగెను. హోటలువాడు డబ్బడిగెను. చేతిలో దమ్మిడీ లేదు. రత్నావళికి కాఫీ యలవాటయ్యెను. హోటలులో కాఫీ క్రిందఁగూడ నప్పుబలిసెను. సోడాలు, వెత్తలపాకు, సిగరెట్లు దుకాణము వానికి నే డెనిమిది రూపాయ లియ్యవలసి యుండెను. ప్రతిష్ఠాపురమునకు జాబు వ్రాయుటకుఁగూడ రంగని చేతిలోఁ జిల్లిగవ్వ లేదు. తాను డబ్బియ్యవలసిన వా రందఱు నిష్ఠురోక్తు లాడఁజొచ్చిరి. గదుల ఖానుండు "ఏ నెలడబ్బు ఆ నెల మొదటి తేదీకి నిచ్చి తీఱవలయును. లేనిచో మాగదులు ఖాళీచేసిపొమ్ము' అనెను. డబ్బునకు మఱునాఁడు వత్తు ననెను. ఈయనిచో వీలు లేదనెను. ఆ మఱునాఁడు ప్రొద్దున రంగఁడు తలవాల్చుకొని కూర్చుండెను. రత్నావళి తానుగూడ నాటాడక యొకచోటఁ బండుకొనెను. రంగఁడు లేచి చొక్కా వేసికొని

బయలుదేఱెను. రత్నావళి కన్నులు తెఱచి యతనిని జూచెను. "ఎక్కడకుఁ బోవుచుంటివి? ఏ స్నేహితునికడ కైనను బోయి మఱల రానిచో నేనేమికావలయును? ఇంటివాఁడు వచ్చి యెద్ది నడుగును. హోటలువాఁడు వచ్చిన్క్రనును. నే నేమి సమాధానము చెప్పవలయును?" అనెను. రంగఁడు చొక్కాయూడఁదీసి మరల కుర్చీలోఁగూర్చుండెను. రత్నావళి యతనివద్దకుఁబోయి "రంగా! మీయన్నగారు డబ్బుపంపించఁడా" అనెను. రంగఁడు "ఎందుకు పంపించవలయును? నే నాయన సంసారమును పాడు చేసితిని. మొన్నటి నీ మాటలనుబట్టి నీ వాయనతో సుఖముగానేయుంటి వని నాకుఁ దెలిసినది. నేను నిన్ను పాడుచేసితిని. ఆయనను పాడుచేసితిని. నేనును పాడైతిని" అనెను. రత్నావళి పకాలున నవ్వెను. రంగనికిఁ గోపమువచ్చెను. "నన్ను వెక్కిరించుచుంటివా?" అనెను. రత్నావళి "పిచ్చివాఁడా! వెక్కిరించుటలేదు. ఆయన యక్కడపొల మమ్మవలయుఁగదా? పొల మమ్మట నిముసములమీఁద జరుగుపనికాదు. ఆయనకు మాత్రము మన మిబ్బందిపడుచున్నా మని తెలియదా? పొల మమ్మి డబ్బుపంపించువఱకు నాయొంటిమీఁది నగలమ్మి కాలక్షేపము చేయుచుందు మని యనుకొనియుందును. అడయారులో నాఁడువాండ్రెవ్వరును నగలు పెట్టుకొనలేదు" అనెను. రంగఁ డామెవంకఁ దెల్లపోయి చూచెను. రత్నావళి "అట్లు చూచెద వెందులకు? ఈనాను తీసికొనిపోయి అమ్మి డబ్బుతీసికొనిరా!" అని ఇచ్చెను. రంగఁడు "నీమెడ బోసిగానుండదా" యనెను. రత్నావళి "స్త్రీలును, పురుషులును సమానులేకదా! మొగవాండ్రకు లేని నగలు ఆఁడువాండ్ర కెందుకు? ఆఁడువాండ్రను మగవాండ్రేల పోషించవలయును? ఆఁడువాండ్రును మగ

వారిని పోషించవచ్చును. అంతయూ నీ డబ్బే ఖర్చుపెట్టవల యునా? మీఅక్కగారి మాటవిని ఆయన ఈ నగలు తీసికొన లేదు. కొన్నాళ్లనాతో సంసారమ్ముచేసిన ప్రేమ, పాపమాయ నకు పోలేదు. ఈ నగలు నా కూరకే యిచ్చివేసెను. ఇది నా సొమ్ము. నాఖర్చు నేనే పెట్టుకొనెదను. ఈనగ తీసికొనిపోయి డబ్బుతీసికొని ర''మ్మనెను. రంగని ప్రాణము తేలికపడెను. అతనిమనస్సుబరువయ్యెను. అతనికన్నులలో వికాసమువచ్చెను. మొగమంతయు నల్లనై దీనతాభూమియయ్యెను. అతని తొమ్మబ్బెను. చేతులు కుంటుపడెను. రత్నావళియే చొక్కా తెచ్చియిచ్చెను. అతఁడు తొడుగుకొని, నగ చేతఁబుచ్చుకొని బజారునకుఁబోయెను. ఆనాఁడు సాయంకాలమున రంగఁడు హోటలువానిని, కిల్లీ దుకాణదారును, నింటివానిని కొంచెము డబ్బాలస్యముకాఁగా నాఁగకుండ దురుసుగా మాట్లాడినందుకు చీవాట్లుపెట్టెను. వారును "బాబుగారూ! కోపపడకండి. మాది ఏముందీ! ఇచ్చేవారు ఇవ్వకపోతే మేము ఏంకావాలి" అని సర్దు కున్నారు. రంగనిచేతిలోనికి నూటయేబదిరూపాయలువచ్చెను. అప్పులుతీర్చఁగా డెబ్బదిరూపాయలు చేతిలో మిగిలెను. కాని ఇది యెన్నాళ్ళువచ్చును? జాగ్రత్తగా వాడుకొన్నచో నొకనెల, నెలాపదునేనుదినములు వచ్చును. డబ్బు చేతిలో నున్నదికదా యని రత్నావళి తనకు నింకొకచీరయు, రెండు మంచిరవికలును తెప్పించెను. ఆ సాయంకాలము రెండురూపాయల సబ్బులు కొనెను. రత్నావళి రెండురూపాయలు పెట్టి తానుచెప్పులజోడు కొనుక్కొనెను. ఇంకొకజోడు రంగనికిఁగూడఁ గొనిపించెను. మదరాసులో నున్న రెండునెలలలో రత్నావళిలో నాగరకత ఏర్పడెను. తల పొడిపొడిగా నుంచుకొనుట, చెప్పులమీఁదికిజుట్టు

చెంపలు రానిచ్చుట, కనులకుఁ గాటుక పెట్టకుండుట, మొగము మీఁద బొట్టుమాత్రము పెద్దదిగాఁ బెట్టుట, చెవులకు జోడు తీసివేయుట, కాళ్ళకు పాంజేబులు లేకుండుట, తెల్లనిపట్టుచీర లే కట్టుట, కొంచెమువంగియొయ్యారముగా నడచుట ఈలక్షణము లన్నియు నామె పట్టించుకొనెను. చెవుల జోడును, కాళ్ళపాంజేబులును తీసి యామె పెట్టెలోఁ బెట్టెను. మఱునాఁడా రెండును అమ్మకమునకుఁ బంపించెను. పాంజేబులది ప్రాఁతవెండి యని వెండిదుకాణమువాండ్రు పదిసారులు రంగని నటునిటు త్రిప్పి యైదురూపాయలు చేతిలోఁ బెట్టిరి. చెవుల దుద్దులరాళ్లు పసికి రానని, బంగారమూఁది తఱుగని బంగారము నరతులముచేసి పదమూఁడు రూపాయలిచ్చిరి. ఆ పదునెనిమిదిరూకలను జేత పుచ్చుకొని రంగఁ డింటికి వచ్చెను.

మఱల రోజులు గడచుచున్నవి గాని రంగనికుత్సాహము లేదు. రత్నావళికి రంగనితోడి కాఁపురములోని క్రొత్తదనపు మోజు తగ్గినది. ఆహా! ఈశరీరము చెడ్డదిగదా! దీనికి వాంఛ యున్నది. ఆవాంఛ నిరంతరముగా నుండ దేలకో! వాంఛ దీఱినతరువాత మఱల వాంఛాంకుర మేర్పడువఱకు దానిని మోహము సంరక్షింపవలయును. ఆ మోహమును బహిఃపరిస్థితులు పోషింపవలయును. అనఁగాఁబహిఃపరిస్థితులకొలఁది మోహాధిక్యమేర్పడు నన్నమాట. ఇంటిలో సుఖముగా నుండి, ప్రొయ్యిమీఁదికిఁ, బొయ్యిక్రిందికి వెదకుకొన నక్కఱలేనివారికి నామోహము ఇతరభోగవిషయములచేత పోషింపబడుచుండును. పేదవాండ్రకును, కడుపుకట్టుకొని తిరుగువాండ్రకును నామోహముతో జోక్యములేదు. పెట్టుకొన్నను సాఁగదు. వారు వాంఛలేని సమయముల తమమోహములు సాగించుకొనలేరు. స్త్రీపురుషులు

కలసి తిరుగుట,షికారులుపోవుట,భోగవిషయములందునిమగ్ను లగుట ఇవి యన్నియు పేదవారికి కూడివచ్చుసంగతులు కావు. అందుచేత వారిజీవితము లపేతవాంఛములుగా, విరహితభోగ శక్తికములుగాఁ గనిపించునుగాఁబోలు! సాఁగినచోఁ జాఁపక్రింద కాలుకుంపట్లు, నెనిమిదినెగళ్లు వారివిమర్శనాదృష్టిచేత పేదవారి జీవితములు మోహాపేతములై వాంఛాపేతములవలె,శక్తి రహితములవలె కాన్పించును గాఁబోలు!

రంగని కుత్సాహము తగ్గుటకాని, రత్నావళికి క్రొత్తమోజు తగ్గుటగాని ఎందులకుఁదగ్గవలయును?రంగనికిధనములేని, వచ్చునట్లు కనిపించని యొకస్థితితోఁ బోరాట మేర్పడెను.అయినచో నీయుత్సాహము ధనమూలమైనది కాఁబోలు. ధనమునుబట్టి యుత్సాహము! రంగనికిఁ బూర్వమునఁగల యుత్సాహములో గొఅంత లేదు.అవును. అప్పుడతఁడు ధనముకొఱకు దిగులుపడిన రోజులు లేవు. అన్నగా రేగడ్డియో కఱచి డబ్బు పంపించెడి వాఁడు. ఇప్పుడు పంపించెడు నాసామి లేఁడు. అతఁడు మనసులో లెక్కచూచుకొనెను. ఒకవేళ తన యన్నగారు తన కొక యే డెనిమిదివందల రూపాయలుపంపించును. రెండునెలలలోఁదనకు రెండువందల రూపాయలయ్యెను. ఆ యెనిమిదివందలును తమ భోజనమునకుఁ, దన సంసారమునకు నెనిమిది నెలలకువచ్చును. తానేమి పెట్టి చదువుకొనును? ఎనిమిది నెలలైనతరువాత నేమి చేయును? అతని కేమియుఁ దోఁచలేదు.

రత్నావళికి క్రొత్తమోజు పోయినది. దానికి నిర్ధనత్వముగూడఁ గొంతవఱకు కారణము. ఏకవస్తుభోగము సర్వథా అటువంటిదే. ఒకక్రొత్తపట్టుబట్ట కొనుము. ఒక వెండిచెంబు చేయించుము. ఒకగ్రామఫోను కొనుము. కొన్ని మొదటినాలుగైదు దినములు

దానితోనే కాలము పుత్తువు. ప్రతినిముసమునను దానినేభావింతువు. తరువాత నావస్తువు మనదిఅన్న ఒకస్థిరమైన,యచంచలమైన క్రొత్త యుబుకులేని యొకతృప్తభావము దాని న్నాశ్రయించి యుండుటయేకాని, దానితోడనే కూర్చుండినచోఁ దక్కినపను లన్నియుఁ జెడిపోవును. అట్లే వివాహవిషయమునఁ గూడను. క్రొత్తగా భార్య కాఁపురమునకు వచ్చిననాఁటి యుబుకు తరువాత నుండదు. తరువాత వా రిరువురును గలసి దంపతులుగా నుందురు. వాంఛాసమయముల మాత్రమే యా పచ్చి యుండును. తక్కినప్పు డామె కింటిలో పనులు; అతనికి సంపాదించుట,కాదా? ఆమెసంపాదించుట; ఇతఁడునుసంపాదించుట. జీవితములయొక్క పరస్పరమిలనములేనిచో వాంఛకు వాంఛ వేఱు, జీవితమునకుజీవితము వేఱు.ఆజీవితముకలసియుండుట వాంఛకుఁబ్రోద్బలము. జీవితముకలసియుండనిచోవాంఛ వాంఛమీాదనే యాధారపడి దైవికముగా నావాంఛ జారిపోవునేని పరస్పరసమాగమము లేదు. అప్పుడు మఱల పునస్సృష్టి. ఈవాంఛకు జీవితమునందలి సమైక్యముతోఁబని లేదని వాదింపవచ్చును. అట్లుకాదు? వాంఛయొక్క స్వభావము తెలిసినచో నట్లు వాదన కుదురదు. వాంఛ మనస్సులోకలుగును. మనస్సు క్రొత్తదానికి రసించును. ప్రాఁతదానికి రసింపదు. పరిచితమైన వస్తువునందు మనస్సుపరిచితముకాని వస్తువునందువలెవ్యగ్రతఁ బొందదు. పరిచితమైన వస్తువునందు వ్యగ్రతపొందుటకు మనస్సునకు నిత్యదోహదముకావలయును. ఆదోహదమే భార్యాభర్తలకు సమసుఖదుఃఖమైన జీవితము గలిగియుండుట. తామిరువురు భార్యాభర్తలమని తమకుగలిగినసంతతివలన తమకుఁబుణ్యాలోకములు ప్రాప్తించునని మొదలయిన విషయముల నిశ్చల

మైన భావన, నిజముగా బుణ్యలోకము లున్నవో లేవో అను మాట నట్లుంచి, వారి లింగమయమైన వాంఛావిషయమును నిరంతరముగఁ బోషించు దోహదవిశేషము. మన మొకవస్తువును సామాన్యముగ నెవరైన నడిగినచో నీయవచ్చును. ఒక స్నేహితుఁడు తన స్నేహచిహ్నముగా నిచ్చిన వస్తువును మఱియొకనికి దానముచేయము. ఈవస్తువును, నావస్తువును నొక్కటియే. కాని ఇది ప్రేమచిహ్న మగుటచేత దానినిఁ బరిత్యజింపము. అట్లే స్త్రీపురుషవాంఛయు సర్వత్ర యొక్కటియే. కాని దాంపత్యమునందు విశేషము తల్లిదండ్రులు కూర్చినదని, ఒక కులమువారని, ఒక గోత్రమువారని, ఒక పాయవారని, అది సంఘమర్యాద యని, అది మనపూర్వులు పుణ్యలోక హేతు వని చెప్పి రని. ఈకారణములచేత దంపతుల మధ్య వాంఛ మెకఁబాయరానిది.

రత్నావళి ఇట్టి వాంఛ యొక్క యర్థమునందు నిరాదరణఁజూపి నిరాధారమైన వట్టి వాంఛ కేగఁ బ్రాకెను. అందుచేత నామెకు క్రొత్తమోజులగ్గుటయు న్యాయమే. అది క్రొత్తగానుండుటకు నెప్పటికప్పుడు క్రొత్తరుచి సవరించుకొనుటఁదప్పమరియొకమార్గము లేదు. అట్లుసవరించుకొనుట నిరవధికమైయేసముద్రపుటొడ్డు పట్టునో తెలియలేదు. నాల్గుదినములుగడచినతరువాత రంగఁడు డబ్బుండగానే యన్నగారికోసము పోదునసెను. రత్నావళితాను కూడా వత్తునసెను. రంగఁడు నీ వాయూరు రావలదు. నేనొక్కడనే పోయివత్తునసెను. రత్నావళి తానొదుచేతఁబోఁగూడదనెను. రంగఁడా యూరిలో ఘనల సిద్ధులను విస్తారముగాఁ జూతురు. చెప్పుకొందురు. అందుచేత వలదనెను. రత్నావళి మనములోకమును పరిగణింపము, వా రేమనుకొనిన మనకేమి? వారేమైన

ననుకొందురన్నచో మనము మొదటనే కలసిరాఁగూడదు. నేనువత్తు"ననెను. రంగఁడు రత్నావళి తనవెంటఁ దప్పక వత్తు ననుటచేతఁ దన ప్రయాణమే మానివేసెను. సీతారామయ్యకు మఱల నింకొకయుత్తరము వ్రాసెను. లక్నోలోను, ఇతరస్థలము లయందును ఉన్న తనస్నేహితులకు ఉత్తరములు వ్రాసెను. తన అన్నగారు వృద్ధుఁడనియు, నొకబాలికను వివాహముఁజేసికొనె ననియు, ఆమెను తానుసంరక్షించి చెన్నపట్టణము తెచ్చితిననియు, నామెనుసీడుజోడైనవానికిచ్చి వివాహముఁజేయుదుననియుఁదన స్నేహితులకు త్తరములు వ్రాసెను. అతఁడాయుత్తరముల వ్రాసిన సంగతి రత్నావళికిఁ దెలియదు. నాల్గుదినములలో నతని స్నేహి తులవద్దనుండి సమాధానములువచ్చెను. సంఘసంస్కారముఁ జే యఁదలఁచినవాఁడెవఁడును తన ఇంటిలోఁ జేయఁడు. లోకము లోఁ జేయవలయు ననియేచెప్పుదురు."రంగా! నీ సంస్కారదీక్ష ప్రశంసనీయము. నీవు చిన్నప్పటినుండియుఁ గార్యదీక్షాపరుఁ డవు. నీ మేధావిశేషమునకు, నీ గొప్పదనమునకు నీ వింతపని చేయుదు వని మే మనుకొనుచునేయుంటిమి. మేము వచ్చి మిమ్ముఁ జూచిపోవుదుము" అని వారు జాబులు వ్రాసిరి.

రోజులు గడచుచుండెను. రంగనిచేతిలో డబ్బైపోయెను.రత్నా వళి నానుపేటలమ్ముమనియిచ్చెను. రంగఁడు నానుపేటలు వల దని, రత్నావళిచేతి బంగారు గాజులజతలలో నొకజతఁ దీసి యవి యమ్మి డబ్బుఁదెచ్చెను. వానివలన నఱువది రూపా యలకన్న నెక్కువ రాలేదు. వానికిబదులు రెండుజతలు రబ్బరుగాజులుకొనెను. ఇంటియద్దెఎక్కువయని యెగ్మూరులో నొకయిల్లు పదిరూపాయల కద్దెకుఁదీసికొని పోయికాఁపురముం డెను. అక్కడ హోటలునకుఁగూడ తక్కువే యగుచుండెను.

హోటలు తిండితో రత్నావళికి జబ్బుచేసెను. ద్రావిడాన్న విక్రేతపెట్టిన పొగుపులు నానాజాతి తైలవిమిశ్రితములై రత్నావళి యారోగ్యమును పాడుచేసెను. రంగఁడడప దడప శరీరవ్యాయామముచేయుటచేత నతని యారోగ్యము మిక్కిలిచెడలేదు. రత్నావళి పూఁటకూటింటి యన్నమువలననే తనయారోగ్యము చెడినదని, సొంతముగా వంటచేసికొందమని చెప్పెను. అతఁడు "నేనేమో వంటచేయలేను. నీవుచేయుట నేనొప్పుకో"ననెను. ఆమె"నే నిట్లనారోగ్యపడి చచ్చిపోవుటకన్న వంటచేయుట మంచిదికాదా" యనెను. "వంటవానినిపెట్టుకొనుటకు డబ్బులేదు. స్త్రీయో, పురుషుఁడో వంటచేయకతప్పదు.వంటచేయుటయనఁగా స్త్రీయో, పురుషుఁడో చేయవలయును. స్త్రీ చేయరాదని పురుషుఁడుచేసినచో నిద్దఱుసమానులే యయినపుడుపురుషుఁడు మాత్ర మేలచేయవలయును? కనుక సర్దుకొని పోవలయును. ఇంటిలోనున్నవారు భోజనమునుచేయవలయునుగాని,ఎవరుచేసిరన్న ప్రశ్నఏమున్నది?" అని రత్నావళి యనెను.

ఆ మఱునాఁడు స్వంతముగా వంటపెట్టిరి.ఆనాఁడువారిరువురును కూర్చుండి భోజనము చేయుచుండిరి. రత్నావళియిట్లనెను.'పేదవారి స్త్రీలుధనవంతులయిండ్లలోఁ దమపొట్టకోసమువంటచేయకుండ నెవరు చేయఁగలరు? పురుషులో, స్త్రీలో పేదవారుకష్టపడుదురు. నీ నాగరికసిద్ధాంతములన్నియుఁ బేదవారికిఁబట్టవు. ధనవంతులకే పట్టును. మనము ధనవంతులము కాము. మనకు పట్టవు. నేఁడు నావంట చక్కఁగాలేదా?" రంగా:—నీవు వంట చేయుట నా కిష్టములేదు. నీవు చేయఁగూడదు.

రత్నా:—నీవు బజారునకుఁ బోయి కట్టెలు తెచ్చుట నాకిష్టము లేదు. నేనుపోయి కట్టెలు తెత్తునా? ఱేపటినుండి నీవు వంట

చేయుము. ననువాయిలత్తుక చేసినను నా కిష్టమే? నేను భోజనము చేయుదును. నేను పోయి బియ్యము, కట్టెలు తెత్తును. రంగఁడు తల వంచుకొని భోజనము చేయుచు 'వద్ద'నెను. తరువాత వారిరువురును భోజనముచేసిరి. రంగఁడు "నే నిట్లూరకే యున్నచో లాభములేదు. ఈ నగ లమ్ముకొని మాత్రి మెన్నాళ్లు తిందుము: నే నేదైన నుద్యోగమునకు బ్రయత్నించెదను. ఈ యూరిలో ననేక పత్రిక లున్నవి. ఏ పత్రికలో నైనను గుమాస్తాగాఁ జేరెదను. తరువాత మన కిబ్బందియుండ" దనెను. రత్నావళి "నీవు పగలెల్ల నెక్కడనో యుద్యోగము చేయుచుందువు. నే నొక్కర్తుక నింటిలో నుందును. ప్రొద్దుననే భోజనము చేసి పోవుదువు, రాత్రికి వత్తువు. ఈ నడుమ కాలములో నే నేమి కావలయు?" ననెను. రంగఁడు "నీ వట్లన్నచో నసలు జీవితము గడచుట ఎట్లు? ఎప్పుడును స్త్రీ పురుషులు కౌఁగిలించుకొని కూర్చుందురా" అనెను. రత్నావళి "అట్లుకానిచోఁ బ్రతిష్ఠాపురమునందు కన్న నిక్కడ నెక్కువ ఏమి? మన మిరువురమును ప్రత్యేకముగా నుండుటయే ఎక్కువయందువా? అయినచో నక్కడ మీ యక్కగారు వంటచేసి పెట్టెడిది. నా నగలు నాయొంటిమీఁదనే యుండునవి. ఇక్కడ కలసియుండుటయే ఎక్కువయినచో నక్కడ నవి రెండు నెక్కువ కాదా?" అనెను. రంగడు మాట్లాడలేదు. మఱల నిట్లనెను.

రంగ :—నీకు ప్రతిష్ఠాపురములోనే బాగుగ నున్నచో నక్కడకే పొమ్ము. రత్నా—నే నట్లనుట లేదు. ఒక్కొకరకపు జీవితములో నొక్కొక్క విశేషమున్న దంటిని.

రంగ :—కాని, ముసలవానితో సంసారముకంటె వయసులో

నున్నవానితో సంసారము మంచిది కాదా? రత్నా :- నేను ముసలివాఁడు, పడుచువాఁడు, అని భేదముచూడలేదు. అక్కడ నేననుకొన్నయంత సరదా లేదు. అందుచేత నిట్లు వచ్చితిని. రంగ :- ఎందుకు సరదాలేదు? ఆయన నిన్ను చంకకు నెత్తుకొనెఁగదా! రత్నా :- అప్పుడు మే మిద్దఱమే వెళ్లినాము. తక్కిన యప్పుడు మీ అమ్మయు, నక్కగారును నున్నారు. దానిచేత సరదా లేకపోయె ననుకొందును. రంగ :- ఇక్కడ వారు లేరుగదా! ఇక్కడ సరదాగానే యుండవచ్చుఁగా!: రత్నా :- నీవు ఉద్యోగము కుదుర్చుకొన్నచో నీవు కనఁబడనే కనఁబడవుకదా! అక్కడ మీ అక్కగారును, అమ్మగారైనను కనుపడెడువారు. రంగ:-ఉద్యోగము చేయనిచో నిల్లెన్నాళ్లు బ్రతుకుదుము: రత్నా :-అవునయ్యా! జీవితములో నొకటి యున్నచో నొకటి యుండదు. రంగ :-నా కాసంగతి తెలియ లేదు. అయినను సవయస్కుల మధ్య వివాహము ప్రధానమైనది. తక్కినవాని కింత ప్రాముఖ్యము లేదు.

రంగారావు మఱునాఁ డుద్యోగమునకై వెదకుటకుఁ బోయెను. వారమురోజులు కాళ్ళు కండెలుకట్టునట్లు తిరిగెను. ఒక మాసపత్రికవాడు నెలనాళ్ళయినతరువాత వచ్చినచో జెప్పుదుననెను. రంగఁడు రత్నావళికి మధ్యమధ్య చదువుచెప్పుచుండెను. ఆమె తెనుఁగు ధారాళముగా జదువుచుండెను. ఇంగ్లీషుకూడ రెండు రెండు మాటలు కలిపి చదువుచుండెను. నెలకు నైదారురూపాయలు ఆమె చదువుటకు పుస్తకముల కగుచుండెను.

తెలివితేటలు గాలివంటివి. ఒక గంటసేపు సముద్రపుగాలి తగిలినంతనే పట్టణముమధ్య ముక్కి చచ్చువానికిఁ బ్రాణములు తేరుకొనియుత్సాహముపుట్టినట్లే జీవితములో రంగములుమారి

నంతనే తెలివితేట లపరిమితముగా వచ్చును. మునుపటి రత్నావళికి నిప్పటిరత్నావళికి నేమియు సంబంధములేదు. ఈ రత్నావళి చకాబికిగా మాటాడును. సంసారమును వదలిపెట్టించిన యొకానొక వికారమూమెలో చెన్నపురి చేరినంతనే క్రొత్త తెలివితేటలు, వాక్చాతుర్యమును నేర్చెను. కట్టకొదిగిననీర మేకముఖముగానే పోవును. తెగిన నీరు బహుముఖములుగాబోవును. ఒకనాఁడు వారిరువురును కూర్చుండి మాటాడుచుండగా మాట మీఁద మాటగా నామె ప్రతిష్ఠాపురము వదలిపెట్టు ప్రస్తావన వచ్చెను. జీవితములోఁ దక్కినవిషయములన్నియు నప్రధానములు, సవయస్కులైన స్త్రీ పురుషుల నడుమ వివాహమొక్కటే ప్రధానమనియు రంగఁడు చెప్పెను. రత్నావళి సమాధానము చెప్పలేదు. అతఁడు మాటాడవేమి అనెను. ఆమె "వివాహమేనా సంబంధముకూడ నా యనెను.'' రంగడు 'సంబంధమనగా' నని ప్రశ్నవేసెను; రత్నా:—మా యూరిలో నొక పిల్లయున్నది. అది నా ఈడుదే. ఏఁబదియేండ్ల ఒక పెద్దయుద్యోగస్థుడు మా యూరు వచ్చెను. అతని కేబదియేండ్లయినను నలుబదియేండ్ల వానివలె నుండును. అతఁడు చదువుకొన్నవాఁడఁట. సంగీతము పాడగలడు. అతడు వారియింటిలో మకాంవేసెను. ఆఅమ్మాయి వానితో సంబంధముకల్పించుకొన్నది. మాయూరిలోనందరును జెప్పుకొన్నారు. రంగ:—అటువంటివి నూటికి కోటికి నుండ వచ్చును. రత్నా:—ఇంగ్లండులో, నమెరికాలో నింతకన్న నెక్కువగా నున్నవని ఈమధ్య నాలుగైదుసార్లు పత్రికలలో జదివితిని. ఒక యిరువదియేండ్ల పురుషుఁ డరువదయేండ్ల స్త్రీని వివాహముచేసుకొనెనని నిన్న నీవు తెచ్చిన పత్రికలోనున్నది. మఱి దాని కేమందువు? రంగడు మాటాడలేదు. వారి జీవితము

దైనందినముగా మాఱిపోయినది. అతఁడు వేఱేచదువుకొను చుండును. ఆమెయు వేఱే చదువుకొనును.

ఒక్కొక్కప్పు డామె వాంఛించును. ఒక్కొక్కప్పు డాతఁడు వాంఛించును. ఉత్సాహముగానున్నప్పుడుఇద్దఱునుగలసిషికారు పోవుదురు. సినీమాకు పోవుదురు. చిన్న చిన్న తగవు లాడు కొందురు. డబ్బు విషయములో సూటి పోటి మాట లనుకొం దురు ఒకనాఁడు వారిఱువురును మాటాడుచుండఁగా రత్నా వళి "మనమువచ్చి ఎన్నాళ్ళయినది" అనెను. రంగఁడు "నాల్గు నెలలైన"వనెను. మీయన్నగారు డబ్బు పంపించలేదుకదా! పంపించలేదు, "నీ స్నేహితు లెవ్వరును రాలేదుకదా!"'వచ్చె దరు' నేనొకమాట చెప్పుదునా?' 'చెప్పుము,' "మనస్సు చిత్రమైనది.' 'అవును'. రత్నా:- మొన్ననీవు చదివిన ఇంగ్లీషు పుస్తకమేమిటి? మనస్సునుగూర్చి యాకవియేమియో వ్రాసెనని చెప్పితివి. ఆకవిపేరేమి? రంగ :- మిల్టను. ఆ పుస్తకముపేరు 'పేరడైజులాస్టు'. రత్నా :- మనస్సును గూర్చిన యామాట లేమిటి? రంగ :- మనస్సు దానిలోఅది యిమిడిఉంది. అదిస్వర్గ మును నరకముగాఁ జేయును; నరకమును స్వర్గముగాఁ జేయును. రత్నా :- ఆయన చాలగొప్పకవి. ఆయొక్కమాటకు ఆయన కేమి యిచ్చినను యియ్యవచ్చును. రంగ :- నీవు చెప్పవచ్చిన మాటఏమిటి? రత్నా :-ఇదే! మనస్సులో నున్నది. నేను ప్రతి షాపురము బాగుగాలేదనుకొన్నాను. బాగుగాలేదు. చెన్నపురి బాగుగా నున్న దనుకొన్నాను. బాగుగానున్నది. నే ననుకొను టలోనే యున్నది. రంగ :- నీకు చెన్నపురికూడా బాగుగా లేదు. నీవు నన్నెన్నిసార్లో ఇక్కెత్తిపొడుచుచుంటివి. నేను నీకుఁ జేసిన యపకారములేదు. రత్నా :- నీవు నాకొక్కటే యుప

కారముచేసితివి. భార్యాభర్తలుకాని స్త్రీపురుషులు కౌగిలించుకొనవచ్చునని చెప్పితివి. నేను నిజమే ననుకొంటిని. దానిమూలముగా నేను చెడిపోతిని. రంగ :- చెడిపోయినది నీవు కాదు, నేను. రత్నావళి చుఱుక్కున నొక్కచూపు చూచి చేతిలో నున్న "గృహలక్ష్మి"ని విసరిపుచ్చుకొని క్రిందవేసి తాను లేచి పోయెను. రంగఁడు మాంటురోడ్డువఱకును బని లేకుండ బస్సు మీఁద పోయి తిరిగి వచ్చెను. నెలదాఁటిన తరువాత నచ్చి చూడు మన్న పత్రికాధిపతిదగ్గఱకు రంగఁడు వెళ్ళెను. అతఁడు నెలకు ముప్పదిరూపాయల జీతముగా నుద్యోగమిచ్చెను. అతఁడు వచ్చి రత్నావళితోఁ జెప్పెను. రత్నావళి నవ్వెను. ఆనాఁడే పోస్టులో సీతారామయ్యవద్దనుండి ఉత్తరమువచ్చెను. రంగని యకరముపొలమునకు నెనిమిదివందలరూపాయలువచ్చినవి. ఇదివఱకు నిచ్చిన వందపోఁగా నేడువందలు మఱునాఁడు బయలుదేఱివచ్చినచో దస్తావేజు రిజిష్టరుచేసి డబ్బుతీసికొనివెళ్ళవచ్చునని యున్నది. రంగఁడు మఱునాఁడు బయలుఁదేఱివెళ్ళెను. పత్రికాధిపతి బహుకష్టముమీఁద సెలవునిచ్చెను. తరువాత నాల్గు దినములకు రంగఁడు జేబులో నేడువందలరూపాయలు పెట్టికొని మద్రాసులో దిగి యా డబ్బంతయు రత్నావళిచేతి కిచ్చెను. ఇరువురును మహానందపరీతులై యుండిరి.

సాయంకాల మాఱుగంటలవేళ రత్నావళియును, రంగఁడును సినిమాకు బయలుఁదేఱిరి. వారి కెదురుగా నిద్దఱు యువకులు వచ్చిరి. రంగఁడు "నీలా నువ్వా! హరీ నువ్వా!" అని వారిని కౌఁగిలించుకొని, "రత్నావళీ, స్నేహితులు! స్నేహితు లనుచుంటివి. ఇదిగో వచ్చిరి. ఇతఁడు నీల. ఇతని పేరు నీలమోహనుఁడు. ఇతఁడు హరి. ఇతని పేరు హరికిశోరరావు. వీరిద్ద

అను యం. ఏ., యల్. యల్. బి.లు. నాకు ప్రాణమిత్రులు. హరీ! నీలా! "ఈవిడే మావదినగారు. ఈవిడ పేరు రత్నావళి" అని చెప్పెను. వారిద్దఱును రత్నావళితోఁ గరతలచాలనములు చేసిరి. పెట్టెలు మఱలఁ దలపులుతీసి లోన వేసి నలుగురును సినిమాకు బయలుఁదేఱిరి.

---

## ఎనిమిదవ అధ్యాయము

---

నీలమోహనుఁడు చామనచాయమనిసి, పొడుగరి, వెడల్పయిన ఱొమ్ము. మొగమందమైనది కాదు. కాని వికారమైనదియుఁ గాదు. శరీరముగట్టిది. మొగమున కందమిచ్చు క్రాపింగు. నిడివియైన బాహువులు. చేతులు మిక్కిలి సుకుమారములైనవి. అతని చేతివ్రేళ్లు దీర్ఘములై కోసదేఱియుండెను. అతఁడు నవ్వు చున్నపుడు మిక్కిలి సుమనోహరంగా నుండును. వారు కమ్మ వారు. హరికిశోరరావు మనిసి పొట్టి, ఎఱ్ఱనివాఁడు. పెద్దకన్నులు. అతని మొగము చూచినంతనే ప్రతివారును వానిని ప్రేమింతురు. అతని శరీరముకూడ వ్యాయామముచేత కఠినమైనది. అతని చేతులు మనిసిపొట్టికి తగినంతవి. అతనివ్రేళ్లు దీర్ఘములుకావు. అతఁడు కన్నులలో నవ్వుచున్నట్లుండును. అతఁ డెక్కువగా నవ్వఁడు. ఎప్పుడును మందహాసమే చేయును. మనిసి కదలకుండ నడచును. అతని క్రాపింగు వాని మొగమునకు నందము తేలేదు. ఇద్దఱును సినిమానుండివచ్చినతోడనే స్నానములుచేసిరి. రత్నావళి వంటచేసెను. భోజనము లగుసరికి రాత్రి పదునొకండుగంట లయ్యెను. మడికట్టు కొనకుండ చొక్కాతోడనే భోజనము చేయుట రంగనిమూలమున రత్నావళికి సలవాటైన విషయమే. వారిరువ్వురును చొక్కాలతోడనే భోజనములుచేసిరి, రత్నావళి

మఱియు ననుకొనలేదు. భోజనము చేసినతరువాత నలుగురును కూర్చుండి లోకాభిరామాయణము మొదలుపెట్టిరి. హరి మధ్య మధ్య రత్నావళితో మాటలాడుచుండెను. మిక్కిలి యుద్వేగ ముతో సంఘసంస్కారమునుగూర్చిమాటాడఁజొచ్చెను. పూర్వాచారపరాయణులను నిందింపసాగెను. వారులోకమునకుఁ జేయు చున్న ద్రోహమింతింతగాదని వెరశి చెప్పెను. అతఁడుద్వేగము పొందుచుండఁగా నుద్వేగము వాక్కునందే కనిపించునుగాని మొగమునందుఁ గన్పించదు. శరీర మేమియుఁ గంపించదు. నీలమోహనుఁడు మాటాడెను. అతఁడుద్వేగము వచ్చినపుడు కుర్చీలోనుండి లేచును. చేతులు విదలించుచు మాటాడును. అతఁడు మాటాడుచున్నప్పు డతని కనులలోనికి దివ్యమైన తేజస్సు వచ్చును. అప్పుడతని కన్నులు చూచినచో గౌరవము కలుగును. అప్పుడతని మొగము సుందరమైనది కాదనిపించదు. హరి ఎంతసేపును రత్నావళి వంకనే చూచును.

సినీమాలో రంగఁడు రత్నావళిప్రక్క కూర్చుండెను. వీరిద్దఱు రంగని ప్రక్కఁ గూర్చుండిరి. సినిమానుండి తిరిగి వచ్చునపుడు బస్సులో రత్నావళి నీలమోహనుని ప్రక్కఁ గూర్చుండెను. ఒకసారిబస్సు కుదుపునకు రత్నావళి నీలమోహనునిపై నొత్తి గిలెను. అతఁడు కొంచెముగా జరిగెను. ఇంటివద్ద నిద్దఱును స్నానముచేసి గదిలోనికిఁ బోవుచుండిరి. నీలమోహనుఁడు తొలఁగిపోయెను హరి రత్నావళిని రాచుకొని పోఁబోయెను. రత్నావళియే కొంచెము తొలఁగెను. ఆరాత్రి ముగ్గురు స్నేహి తులను గలసి సావడిలోఁ బండుకొనిరి. రత్నావళి గదిలో గడియవేసుకొని పండుకొనెను.

మఱునఁటిప్రొద్దున రత్నావళి పెందలకడనేలేచి కాఫీకాఁచెను,

వారు ముగ్గురును ప్రొద్దెక్కి లేచిరి. ముగ్గురును గడ్డములు చేసి
కొని స్నానములుచేసి, తలలకు వేసలైనురాచి, మొగములకు
హేజిలైన్ స్నోలు పట్టించి, యుదికిన మడతలుగట్టి, సిగరెట్లు
త్రాగుచు కాఫీలు సేవించిరి. హరి రత్నావళితో సరాగములు
ప్రారంభించెను. రత్నావళియు నతనియందమైన మొగముచూచి
యతనిసరాగము లంగీకరించెను. సాయంకాలమున షికారులు
పోయిరి. మఱలసినీమాకు వెళ్లిరి. రత్నావళి నీలమోహన హరి
కిశోరుల నడుమఁగూర్చుండెను. కొంతలో హరి తనచేతిని రత్నా
వళికూర్చున్న కుర్చీవెనుక వేసి యామెకుఁ దాకించెను. ఆమె
ముందునకు వ్రాలి కూర్చుండెను. అతఁడు చేయితీసివేసెను. మఱి
లకొంత సేపటికి నీలమోహనుని సిగరెట్టడుగుచు తనచేయి రత్నా
వళిముందుగాఁజాచి యామెకుఁదాఁకించెను. ఆమె యొత్తిగిలు
టకు వీలులేక యట్లే కూర్చుండెను. రాత్రి యింటికివచ్చిరి. భోజ
నములు చేసిరి. ఆనాఁడురాత్రి రత్నావళియు, రంగారావునుగది
లోననే తమ ప్రక్కలు చేసికొనిరి. ఇద్దఱు స్నేహితులునుసావ
డిలో పరుండిరి. గది తలుపు తెఱచియే యుండెను.

ఇట్లువారు పదిదినము లుండిరి. నాల్గవరోజునాఁటికి వారి పరిచ
యము వృద్ధియయినది. ఆనాఁడు నలుగురు నొకగదిలోనే పండు
కొనిరి. హరి రత్నావళికూర్చుండఁగా వెనుకగాఁబోయి కన్నులు
మూయును. ఆమెవదలించుకొనును. హరియామెబుగ్గలుగిల్లును.
మాటాడుచుండఁగా నామె మోఁకాళ్ళమీఁద జేతులు వేసి
మాటాడును. నీలమోహనుఁడామెవంకనే చూడలేఁడు కాని,
యామెకుఁ దొలఁగకుండ రాచుకొనిపోవును. ఆమెకేదైననంది
చ్చునపుడు, నామెచేతనున్న వస్తువును దీసికొనినపుడును వ్రేళ్ల
తో వ్రేళ్లు తాఁకును. నీలమోహనునకు నామెతోనే హరికిఁగల్ల

చనవునకు సిద్ధపడెను. తానో, హరియంత చనవు తీసికొన లేదు. తీసికొన్నచో నామె యేమనునో అని అతనికి భయము. ఆ నాఁడు కొంతసాహసముచేయవలయునని యతఁడుసంకల్పించెను. రత్నావళివాలుజడ వేసికొనెను. తెల్లనిచీరగట్టి, యాజడ నెదురు ఱొమ్ము మీఁదికి వ్రేలాడవేసెను. మువ్వురు స్నేహితులును బజారునకుఁబోయిరి నీలమోహనుఁడు వారికన్న ముందువచ్చెను. రత్నావళి జడలుజూచి, కంపించుచున్న చేతులతో నిది బాగుగా లేదని యామెఱొమ్ముమీఁది జడతీసి వెనుకకు వేసెను. రత్నావళి నవ్వను లేదు; కోపించను లేదు. నీలమోహనునకు నవ్వనిపించను లేదు; కాదనిపించను లేదు. అతనిసంకల్ప మంతటితో నాఁగిపోయెను. తన స్నేహితులిద్దఱును వచ్చువఱకు నతఁడు గదిలో కూర్చుండియేదో పుస్తకమును తెఱచి మొగముపుస్తకము వైపు కనులు రత్నావళివైపుగా నుండెను రంగడును, హరియును, వచ్చిరి. హరియు కాయకి వంటయింటిలోనికిఁబోయి తానుగూడ నామెకు సాహాయ్యముచేయుచున్నట్లు నటించెను. లోపల వారిరువురును కికాకిక నవ్వుచుండఁగా నీలమోహనుని యెదలో చికిటకత్తు లాడెను.

మఱునాఁడు హరియు, నీలయు, గలసియడయారుపోయిరి. రంగ డాఫీసునకుఁబోయెను రత్నావళిఒక్కతెయు నింటిలోనుండెను. కొంతసేపటికి హరియొక్కఁడును తిరిగివచ్చెను. 'నీల యేఁ'డని రత్నావళి యడిగెను. హరి "మే మడయారుకుఁబోలేదు. నీల తన స్నేహితుల నెవరినో కలిసికొనవలెనని వెడలిపోయెను. నేను వచ్చితిననెను. హరి రత్నావళికూర్చున్న చోటఁబోయి కూర్చుండెను. రత్నావళి దూరముగా జరిగెను. హరి రత్నావళితోఁ బ్రసంగ మారంభించెను.

హరి :- నీవు మఱల వివాహము చేసికొందువా?

రత్నా :- ఇదివఱకే చేసికొంటిని. ఇప్పుడు చేసికొనుట ఎందులకు? హరి :- రంగని యన్నగారిపేరేమి? రత్నా :- సీతారామయ్యగారు. హరి:- 'గా' రెందు కాయనకు ?- రత్నావళి నవ్వెను. హరి :- నీ కాయన తగఁడుకదా? రంగఁడు నిన్ను మఱియొకనికి- నీకుఁ దగినవానికి- ఇచ్చి పెండ్లిచేసెద ననుచున్నాఁడే? అట్లని నాకు వ్రాసినాఁడు. మఱల నతఁడిచ్చి పెండ్లి చేయు టెందులకు? నీ కిష్టము వచ్చినవానిని నీవే చేసికొనవలయును. రత్నా :- నాకిష్టమువచ్చినవానికి నాయందు ప్రేమ లేనిచో. హరి :- నీవు కావలెనని కోరినచో మన్మథుఁడువచ్చి నీ కాళ్ళపైని బడును. రత్నా :- నే నంత యందకత్తెనా. హరి :- నీకుకోపము రానిచోఁ జెప్పెదను. నీ యందము సామాన్యమైనది కాదు. నీ శరీరాకృతి తాయిచెక్కి విగ్రహము చేసినట్లుండును. దేవాలయములలో స్త్రీవిగ్రహములవలె నడుము సన్నన. రత్నా :- ఇంక నూరకుండుము. హరి :- నీ వెవరి నైన ప్రేమించితివా? రత్నా :- నే నిప్పు డప్పుడే ఎవరిని ప్రేమించరాదు. నీ స్నేహితు లింక నెంతమంది యున్నారు? హరి :- చాలమంది యున్నారు. ఎవ్వఁడును నీకు తగినవాఁడు కాదు. నీలమోహనునిఁ జూచితివిగదా? వాఁ డొక గేడి. మొగము మిక్కిలి యందమైనది. ఇద్దఱును నవ్విరి.

రత్నా :- రంగఁడు మిక్కిలి యందగాఁడే నందువా? హరి:- నీవు రంగని పెండ్లాడెదవా? ఆ యన్నకుఁ దమ్ముఁడేకదా! రత్నా :- పెండ్లియాడుట యనఁగా నేమి? హరి :- నీకు తెలియదా? రత్నా :- నాకు తెలియదు. ప్రేమకలుగుటయే పెండ్లియాడుటయని రంగఁడు చెప్పెను. ఆప్రేమ యెట్టిదో నాకు దెలి

యుట లేదు. హరి:—నీవు రంగని ప్రేమించుచుంటివా? రత్నా:—ఆఁ ప్రేమించుచుంటిని. హరి—అట్లయినచో నతనిని పెండ్లియాడుము. రత్నా—నిన్నును ప్రేమించుచుంటిని నీలమోహనుని ప్రేమించుచుంటిని. హరి—ముగ్గుర నెట్లు ప్రేమింతువు? రత్నా—ఎట్లు ప్రేమింతు వేమిటి? రంగనితో నాల్గునెలలుగా కాఁపురముచేయుచుంటిని. నీవు నన్ను ముట్టుకొనెదవు; కళ్ళుమూసెదవు; బుగ్గలు గిల్లెదవు; రాచుకొనిపోవుదువు. నిన్ను ప్రేమించనచో నీట్లు చేయనిత్తునా? నీలమోహనుఁడు మొన్న నా జడ తొమ్మ్మ మీఁదినుండి తీసి వీపుపై వేసెను. అతనిని ప్రేమించకపోయినచో నూరకుందునా?

హరి:—(ఆలోచించి) ఇది యంతయు చనవు; ప్రేమకాదు. రత్నా:—ప్రేమ యనినచో నెట్లుండును? హరి:— నీవు పెండ్లిచేసికొని వానితో శరీరసౌఖ్యము అనుభవించవలయు నన్నంత కోర్కి ఎవనిమీఁదఁ బుట్టునో వానినిమాత్రమే ప్రేమించుచుంటి నని చెప్పవచ్చును. రత్నా:— శరీసౌఖ్యము రంగనితో ననుభవించుచుంటిని. హరి:— అయినచో నీవు రంగనినే ప్రేమించుచుంటివి. రత్నా:—కాదు. నిన్నును ప్రేమించుచుంటిని. నిన్ను ప్రేమించుచుంటినో లేదో ఇంక కొందఱను జూచికాని చెప్పలేను. ఇది నామాటకాదు; రంగనిమాట. రంగఁడట్లు చెప్పుచున్నాఁడు. హరి:—నీ మాటలు నా కర్థ మగుటలేదు. రత్నా:— ప్రేమ యెట్లు పుట్టును? దానియంతటదె నది కారణము లేకుండఁ బుట్టునా? "హరి మాటాడలేదు. అతఁ డాలోచించెను. ఇట్లనెను. "కారణము లేకుండగనే పుట్టును." రత్నావళి:—మనుష్యునిమీఁదనే పుట్టవలయునా, పశువులమీఁదఁగూడ పుట్టవచ్చునా? బిచ్చ

గాండ్రమీఁద పుట్టవచ్చునా? తా నెఱుఁగని ఎవరి మీఁదనో పుట్టవచ్చునా? తా నెఱిఁగియున్న వారిమీఁదనే. మనుష్యుల మీఁదనే పుట్టినచో నం దొకకారణము లేదందువా? ఒకఁడు చనవుగొన్నాఁడని, యొకఁ డందకాఁడని, యొకఁడు మంచి వాఁడనికదా ప్రేమపుట్టును? కారణములేకుండ ఎట్లుపుట్టును? ఒకఁ డందకాఁడని ప్రేమింతును. వాఁ డబద్ధములు చెప్పును. మోసగించును. వాఁడు నీచుఁడు. వానిమీఁద ప్రేమనిలుచునా? ఈప్రేమ కారణములేకుండ పుట్టు నని నేను నమ్మను.

హరి:—ప్రేమ కారణము లేకుండనే పుట్టును. రత్నా:— కొన్ని కారణములు లేనట్లు కన్పించును. మనము సరిగా విచారించలేకపోవుటయే దానికి కారణము. సీత రాముని ప్రేమించెనని చెప్పుదుము. కారణము లేకుండ ప్రేమించెనందువు. కారణమెందుకులేదు? రాముఁడుగొప్పవీరుఁడు. శివధనుస్సువిఱిచెను. అందగాఁడు. దొడ్డరాజు కొడుకు. తన కీడైనవాఁడు. అందుకని ప్రేమించెను. ఈ సంగతులన్నియు విచారించకుండఁ బ్రేమించవచ్చును. కాని ఈ సంగతులన్నియు మనస్సునకుఁ దెలిసినవే. ప్రతిసంగతియు మనకు విచారించినట్లు కనిపించదు. కనుక కారణములేకుండ ప్రేమపుట్టదు. నిన్ను నాతో నింత చనవుగా నుండనిచ్చుచుంటిని. నీవు ఒక గుడ్డిబిచ్చగాఁడ వనుకొమ్మ. లోనికి రానిత్తునా? రంగఁడికి స్నేహితుఁడవు కావనుకొమ్మ. మా యింటిలో నిన్నాళ్లుందువా? ఈ చనవునకు నిన్నికారణము లున్నవి. ప్రేమ కారణము లేకుండఁ బుట్టదు.

హరి:—ప్రేమ కారణములేకుండనే పుట్టును. చంద్రునిమీఁద తారకుఁ బ్రేమ కలిగినది. చంద్రునికన్న బృహస్పతి గొప్పవాఁడు. అది కారణము లేకుండఁ బుట్టిన ప్రేమయే.

రత్నా:—కాదు కాదు ! బృహస్పతి ముసలివాఁడు. చంద్రుఁడు పడుచువాఁడు. చంద్రుఁ డందగాఁడు. తారమనస్సు సౌందర్యమున కంత దేవగురుత్వమునకు లోఁబడ లేదు. హరి:—సౌందర్యమున్నచోట ప్రేమింతువు. రత్నా:—మా యూరివద్ద సముద్రము మిక్కిలి సుందరముగా నుండును. దానిలోఁ బడి ప్రాణములు తీసికొందుమా? దానిని చూచి యానందించుదుము. కొన్ని సౌందర్యములు చూచి యానందించుటకు, మాత్రమే పనికివచ్చును. తాతలనాఁటిదివ్వెయనితలకుకొఱవి పెట్టుకొనము. అంతటనీలమోహనుఁడువచ్చెను. హరికిశోరుఁడు పుల్లవిఱిగిలేచి పోయెను. రత్నావళి:—'ఎచ్చటికిఁబోవుచుంటి' వనెను. హరి 'ఒకగంటసేపటిలో వచ్చెద'ననెను. నీలమోహనుని మొగములో కొంచెము విషాదముకనిపించెను. అతఁడురత్నావళితో మాటాడక గదిలోనికిఁబోయి కూర్చుండి చదువుకొనుచుండెను. రత్నావళి నవ్వుకొనెను. ఆమె గదిలోనికిఁబోయి యతనితోఁ బ్రసంగ మారంభించెను. రత్నా—హరి కేమాత్ర మాస్తి యున్నది? నీల:—నాకుఁ దెలియదు. రత్నా:—హరి నిన్ను గేడివాఁడనెను. నీల—అవును గేడివాఁడనే. వాఁడందగాఁడు. నేనుకాదు. రత్నా:—నీవు మంచివాఁడవు. అతఁడు కాదు.—నీలమోహనుఁడు తలయెత్తి చూచెను. 'అతఁడు మంచివాఁడే'యనెను. రత్నా:—అతనిని నీవు మంచివాఁ డనుచుంటివి. నిన్నతఁడు వెక్కిరించెను. నీలమోహనుఁడు పుస్తకము చదువు చుండెను. రత్నా:—పెండ్లి యనఁగా నేమి? నీలమోహనుఁడు మాటాడలేదు. రత్నా:—మాటాడవేమి? నేను నా భర్తను వదలిపెట్టి వచ్చితినిగదా? నే నెవరినైనను పెండ్లి చేసికొనవలయును. ఎటువంటివాని చేసికొమ్మందువు? నీల:—అది నీయి

ష్టము. రత్నా:—నీకు నామీఁద కోపముగా నున్నది. నీల:—నీమీఁద నా కేమి కోపము? రత్నా:— హరి నాతో చనువుగా నున్నాఁడని నీకు కోపము. నీవును నాతో చనువుగానుండుము. నేను వద్దనలేదే! చనువుగా నున్నచోఁ దప్పేమికలదు? నీల:—నీకుఁ గోపము వచ్చునేమో యని నే నుండుటలేదు. రత్నా:—హరి చనువుగా నున్నచో నేను కోపపడుచుంటినా? నిన్నుమాత్రము కోపపడుదునా? నీల:—హరి యందగాఁడు. రత్నా:—మీరిరువురును యమ్. ఏ., యల్. యల్. బీ. లు ప్యాసైనారా? నీల:—హరి యమ్.ఏ, పరీక్షకే కూర్చుండలేదు. యల్.యల్. బీ. తప్పినాఁడు. రత్నా:—నీ కేమాత్ర మాస్తియున్నది. నీల:—నాకుఁ దెలియదు. రత్నా:—షుమారు? నీల:—ఒక వంద యకరములపొలమున్న దనుకొందును. మేమిద్దఱ మన్నదమ్ములము. రత్నా:—పెండ్లినిగూర్చి, ప్రేమనుగూర్చి హరి చాల సేపు మాట్లాడినాఁడు; నీవు మాట్లాడువేమి? నీల:—ఇప్పు డెన్నిగంట లైనది? రత్నా:—ఇన్నిగంటల కెవరికైన పెండ్లి చేసికొనవలె నని యున్నదా?

నీలమోహనుఁడు వచ్చెను. రత్నావళి యతనిని చెంపకాయ కొట్టెను. అతఁడామెను కొంగు పట్టుకొనిలాగెను. రత్నా:—ఇంక నాతో సరిగా నుండుము. నీల.— సరే! ఆరాత్రి హరి రాలేదు. వారు ముగ్గురును భోజనము చేసిరి. రంగఁడు 'హరి ఏల రాలేదో' యనెను. రత్నావళి 'కోపమువచ్చినదేమో' యనెను. ఆమఱునాఁడురాత్రినీలమోహనుఁడును,హరియు లేరు. రత్నావళి "హరికి ఎంతయాస్తియున్న"దని రంగని నడిగెను. రంగ:— హరికాస్తిలేదు. నీలమోహనుఁ డాస్తి కలవాఁడు. నీలకన్న హరి యెక్కువ తెలివితేటలు కలవాఁడు. నీల కమ్మ

వారు గనుక నాస్తికలవాఁడు. రత్నా :- నీల కమ్మవారా? మఱి నాతో చెప్పలేదేమీ? రంగ:- చెప్పినచో నేమి చేసెదవు? రత్నా :- ఏమిచేసెద నేమిటి? అతఁడు మనతో కలసి భోజనము చేయుచుండెను. రంగ :- కమ్మవారైనచో మనుష్యులు కారా? మనుష్యులందఱు సమానులే. ఆభేదము లుండఁ గూడదు. రత్నా :- అయినచో నొక బిచ్చగానితోఁ గలసి భోజనము చేయుదువా? రంగ:- నీలబిచ్చగాఁడు కాఁడు. నిన్నను, నన్నను పోషించఁదగినంతవాఁడు. రత్నా:- అదిసరే! అయినచో ధనవంతు లందఱు నొక జాతియన్నమాట. రంగ :- ఔను. రత్నా:- ధనవంతుఁడైన ఒకకుష్ఠువానితోఁ గలసి భోజనము చేయుదువా? రంగ:- చేయను. రత్నా:- అయినచో నారోగ్యవంతులై ధనవంతులైనవా రందఱు నొకజాతి. రంగ:- అందఱు నొక్కటియే. రత్నా:- మాట్లాడుట చేతకానిచో నూరకుండవచ్చును. రంగ :- తొండముదిరి యూసరవెల్లి యగుచున్నది. తరువాత వారిరువురును కొంతసేపటివఱకు మాటాడలేదు.

రత్నా:- హరిది ఏ కులము? రంగ :- మాకు కులములు లేవు. రత్నా:- హరితల్లిదండ్రుల కున్నవా? రంగ:- తల్లి దొకకులము. తండ్రిదొకకులము. రత్నా:- తండ్రిగాని, తల్లిగాని బ్రాహ్మణులేనా? రంగ:- నీ కెందు కీ ప్రశ్నలు? రత్నా:- నేను పెండ్లి చేసికొనుటకుఁ విచారించ నక్కఱలేదా? రంగ:- పెండ్లి చేసికొనుటకు గులమక్కఱలేదు. మనిసిని చూచి ప్రేమించినచో వివాహము చేసికొనవచ్చును. రత్నా :- సీతారామయ్యను నట్లే చేసికొంటిని. రంగ:- నీవు చేసికొనలేదు. నీమేనమామ నీకు కట్టఁబెట్టెను. రత్నా:- సరే! హరి కాస్తి లేదుకదా! అతనిని చేసికొన్నచో నా కేమియు సుఖములేదు. రంగ:-

నీలను చేసికొనును. రత్నా:—వారు కమ్మవారు. రంగ:—హరి కమ్మవారుకూడఁ గాదు. అతనితల్లి బ్రాహ్మణస్త్రీ. తండ్రి ఎవఁడో పరకులస్థుఁడు. అతఁడు బ్రాహ్మణుఁడే. రత్న:—నేను సీతారామయ్యభార్యని. ఆరాత్రియిద్దఱును చెఱియొకచోటఁ బరుండిరి.—రత్నావళి మనస్సులోఁ బూర్వవాసనపోలేదు. నీలహరులు బ్రాహ్మణులే యని యామె తలఁచెను. ఆమెకు వివాహవిషయములోఁ దెగిన సూత్రములు వర్ణవిషయములోఁ దెగలేదు. ఆమె యిదమిత్థ మని నిర్ణయించుకోలేక పోయెను. అందఱును సమానులే. ఈ సిద్ధాంతమున కనేకవిప్రతిపత్తులు తోఁచెను. చివరకు మనస్సులో నున్నది. మనస్సు సరిపెట్టుకొన్నచో నంతయు నొక్కటియే యనిపించెను. ఆమనస్సుసరిపెట్టుకొనుటయే కుదురలేదు. ఈమనస్సు భేదములు మానివేయవలయును. ఒక విషయములో మానినచో నింకొకవిషయములో నీ భేదము పెరుఁగుచున్నది. ఎక్కడకుదిరినచో నక్కడనే ముక్తియా? అందఱును సమానమని భోజనము చేసినచోట ముక్తి; వివాహము చేసికొనినచోటముక్తి; ధనవిషయములో ముక్తిలేదు. సౌందర్యవిషయములో సమానత్వము లేదు. ఒకఁడు బలవంతుఁడు. మఱియొకఁడు బలహీనుఁడు. ఇచ్చటసామాన్యములేదు. ఒకఁడు వివేకి. మఱియొకఁడు అవివేకి. ఇచ్చట సామాన్యములేదు. ఒకనికి గౌరవ మున్నది; మఱియొకనికి లేదు. ధనము, విద్య, సౌందర్యము, కులము, అదృష్టముకలచోట్ల గౌరవింపఁ బడుచున్నవి. అవి లేనిచోట్లు నిరాదరింపఁబడుచున్నవి. సమానత్వ మెచ్చటనో కనిపించుటలేదు. నీలమోహనుఁడు ఆ స్త్రీపరుఁడు. హరి తెలివితేటలుకలవాఁడని రంగనికిహరిమీఁద నెక్కువగౌరవము. రత్నావళి రంగని పిలిచెను, రంగనికి నిద్రపట్టుచుండెను, అత

నికి మెలఁకువవచ్చి "ఎందు" కనెను?

రత్నా:—నీలకన్న హరి ఎక్కువ తెలివిగలవాఁ డందువా? రంగ:—అనియే నాయుద్దేశ్యము. రత్నా:—నాయుద్దేశ్యమది కాదు. రంగ:—కాకపోవచ్చును. రత్నావళిపోయి రంగనియొద్ద పండుకొనెను. రంగ:—నీవు నాయొద్ద పండుకొనవద్దు. రత్నా:—ఎందుచేత?రంగ:—నీవెవరినో పెండ్లి చేసికొని వానితోమాత్రమే యనుభవించవలయును. రత్నా:—అందఱును సమానులే.ఒకరితో ననుభవించుట ఏల? రంగ:—నీకుఁ బ్రేమకలిగినచోట ననుభవించవలయును. రత్నా:—నాకు ప్రేమయనుట చేతసమానత్వము లేదు. నా యిష్టము, నా కిష్టములైన హేతువులవలన కలుగును. అందఱను సమానముగా చూడవలయునన్నచో నా యిష్ట మేమున్నది.రంగ:—అందఱును సమానులుగా నుండిరను నూహ కలుగుటయే నీ యిష్టము కావలయును. రత్నా:—అప్పుడు నాయిష్టము కానక్కఱలేదు. అందఱ యిష్టము. ఇష్టమను మాటయే యక్కఱలేదు. అందఱును సమానులు.అంతే! నేను, ఇష్టము, ప్రేమ ఈమాటలేలేవు. అసలేమియునులేదు. రంగ:—నీవుయోగీశ్వరివైతివి.నాదగ్గఱ పండుకొనక్కఱలేదు. రత్నా:—నేనుకాలేదు. కాని నాకందఱును సమానులే. రంగ:—నీవు నన్నెత్తిపొడుచుచుంటి వెందులకు? రత్నా:—ఇందు నిన్నెత్తిపొడుచుట యేమున్నది? రంగఁ డటుతిరిగి పండుకొనెను. మఱునాఁడు నీలహరు లిద్దఱును వచ్చిరి. రత్నావళి వంకీపెట్టి దేమోయని రంగఁడు భయపడెను. కాని యామె యేమియు మాటాడలేదు. హరి చనవుగా మాటాడవచ్చెను. ఆమె ముభావము వహించెను. నీలమోహనుఁ డామె నొకసారి చూచి నవ్వెను. ఆమె మఱల నవ్వెను. ఆమె నీలమోహనునితో 'నీవు

నేను నిద్రఅమే ఈ నాఁడు సినీమాకుఁ బోద'మనెను. రంగఁడు తనపెదవి నెడమ వైపునకుఁ ద్రోసి కుడివైపుపంటితో నొక్కుకొనెను. హరికిశోరుని మొగములో నెత్తురుకూడు కట్టెను. ఆ సాయంకాలము వారిద్దఱును సినీమాకు బయలుదేఱిరి. హరి తానుకూడ వత్తునననెను. రత్నావళి "నీవు వచ్చినచో నేనునూని వేయుదును" అనెను. అతఁడుపసంహరించుకొనెను. ఇరువురును సినీమాకుఁబోయిరి. దారిలో రత్నావళి "నీలా! మీరు కమ్మవారటగదా?" అనెను. నీల:— అవును. రత్నా:—నీకు మంచి యాస్తికలదు. మీవాండ్రు నీకుఁదగిన సంబంధము తెత్తురు. నీవు మీవారినికాదని నీకిష్టము వచ్చినచోట వివాహము చేసికొనఁ గలవా? నీల:—మామేనమామకూఁతు రున్నది. నేను దానిని చేసికొనకతప్పదు. రత్నా:—ఆపిల్ల బాగుగానుండునా? నీల:— (సిగ్గుపడుచు) బాగుగనేయుండును. రత్నా:—మఱి వీరితోఁగలసి నీవు ఏల తిరుగుదువు? నీల:—మేము మేమును కలసి చదువు కొన్నాము. రత్నా:—నీకన్న హరి చాల తెలివికలవాఁడఁట. నీల:—అనియే అందఱునందును. రత్నా:—కాదని యొక్కరైన నందురా? నీల:—నీవందువు. రత్నా:—నీకెట్లు తెలియును? నీల:— నే ననుకొంటిని. రత్నా:—అందుకనియే నీవు తెలివికలవాఁడవు. సినీమానుండి ఇంటికి తిరిగి వచ్చుచుండిరి. నీల:—నీవు హరిని పెండ్లిచేసికొంటావా? రత్నా:—ఎంతమాట అడిగినావు? నీల:— క్షమించండి; పొరపాటుచేసితిని. రత్నా:—బాబూ!

రత్నావళి యొక్కసారిగాఁ దనకు ముప్పదియేండ్లు వచ్చినట్లు చిత్రమైన యనుభూతిపొందెను. నాలుగైదు నెలలలో నామె పెరిగినఁ పెరుగుట యామెకే యచ్చెరువుకొలిపెను. 'బాబూ' అని యేదియో చెప్పవచ్చి చెప్పలేదు. ఇరువురును మాటాడ

కుండ నింటికిఁబోయిరి. ఇంటికిఁబోయినంతనే యామె యద్దము తీసి చూచుకొనెను. ఆమె మొగము ముదుకఁబాఱినది. ఆమె మనిసిలావైనది. తాను ప్రతిష్ఠాపురములో నున్నప్పటి లేఁతఁదనము మొగములోఁ గన్పించలేదు. మొగము గండరించి యుబ్బియుండెను. ఇప్పు డామెను చూచినవారు తక్కువ కట్టినను నిరువదియేండ్లు దాఁటిన వనుకొందురు. ఆమె సినీమానుండి వచ్చినవెంటనే యద్దముచూచుకొనుటలో హరికిశోరున కీర్ష్యాగ్ని రేఁగెను. అతఁడు నవ్వుచు "బుగ్గలమీఁద నొక్కులు లే వనెను. రత్నావళి హరివంక చుఱుక్కునఁ జూచెను. ఆ చూపామె యెచ్చట నేర్చెనో తెలియదు. "అశిక్షితపటుత్వమమానుషీషు సందృశ్యతే కిముత యాః ప్రతిబోధవత్యః" యనుటయే దానికి సమాధానము. ఆ చూపుతో మెడకు బెత్తెఁదెబ్బ ములో దెబ్బతిన్న త్రాఁచువలె హరి యడఁగియుండెను.

రత్నావళి రంగని, హరిని భోజనమునకు రమ్మనలేదు. నీలకు వడ్డించి తానుపెట్టుకొనితినెను. తరువాత రంగడును, హరియు వడ్డించుకొనితినిరి. తిని వారిరువురు సినిమా రెండవయాటకని పోయిరి. రత్నా- నీలా! నీపెండ్లికి నన్ను పిలుతువా? నీల- తప్పకుండ పిలుతును. రత్నా-నన్ను చూచినచో నీకిప్పు డెట్లున్నది? మొదటి రెండురోజులలోఁ జూచినట్లున్నదా? నీల- లేదు. రత్నా—వారిరువురును మనయిద్దఱినుగూర్చి యేమనుకొందురు? నీల-రత్నా! నిన్ను రంగఁడన్యాయము చేసెను. రత్నా-కొంత నేనును కారణమే. నీల-ప్రోద్బలమమ్మా! ప్రోద్బలము! ఏమియు నెఱుఁగని చంద్రుని తార పాడుచేయ లేదా? రత్నా-మోహము పుట్టించవచ్చును. ఆకస్మికముగా, నవ్యాజముగాఁ బుట్టునందు రేమిటి? నీల-వారి సిద్ధాంతములు

నాకుఁ దెలియవు. రత్నా—నీవు తెలివితక్కువవాఁడవు. సరే కాని మనమిద్దఱమును ఇచ్చట నొంటరిగా నుంటిమిగదా! నీల—నన్ను వెళ్లిపొమ్మందువా? రత్నా—నీ కెన్నియేండ్లు? నీల—ఇరువది యెనిమిదేండ్లు. రత్నా—నాకన్న పదియేండ్లు పెద్దవాఁడవు. నేను నీకేమగుదును? నీల—నేను నీకేమగుదునో చెప్పను. నేననుకొన్నది సరిపోవునో లేదో చూచెదను. రత్నా—నేను ముందు చెప్పినచో నీవు దానినిబట్టి చెప్పుటకా? నీల—కాదు. నేనొక కాగితముమీఁద వ్రాసెదను. నీవు వేఱొక కాగితము మీఁద వ్రాయుము. అట్లే యని ఇరువురును చెరియొక కాగితముమీఁద వ్రాసిరి. రెండును తెఱచి యొక్కసారి చూచిరి. తమ్ముఁడు అక్క యని రెండుకాగితములమీఁదను వ్రాయఁబడి యుండెను. ఇద్దఱును నవ్వుకొనిరి. రత్నా—నీవు నాకన్నవు, నేను నీకు చెల్లెలను. నీవు నాకన్న పెద్దవాఁడవు. నీవు నాకు తమ్ముఁడవేమిటి? నేను నీకు నక్కగారి నేమిటి? నీలా—ఒక కడుపునపుట్టినచో నీవు చెప్పినవరుస. ఒక భావమునకు పుట్టినచో మనము వ్రాసుకొన్న వరుస. రత్నావళి 'నీలా!' అని యతని క్రాపింగును దువ్వెన దెచ్చి దువ్వెను. రత్నావళి యిట్లనెను; "మనస్సు చాల చిత్రమైనది. నేను నిజము చెప్పెదను. నీవు ఏమియు ననుకొనకు. నన్ను చూచినపుడు నీకు వాంఛ లేకపోలేదు. నిన్ను చూచినపుడు నాకు వాంఛ లేకపోలేదు. ఆ వాంఛ వాంఛగాఁ బరిణమించలేదు. మన యిరువురి ప్రకృతులకును స్త్రీ పురుషవాంఛేతరవిషయముల నున్నంత సంబంధము తద్వాంఛావిషయముల లేదు. మన యిరువురిమధ్య ప్రేమ యున్నది. అది స్త్రీపురుషవాంఛావిషయకమైననే యది ప్రేమ యగు నందువా? నీ వదివఱకే స్త్రీని ఎఱుఁగ వను కొం

దును. నీల—ఎఱుఁగను. రత్నా—నేనుగూడ సీతారామయ్యను, రంగారావ్రను తప్ప నెఱుఁగను. నాకుఁ దెలిసినంతవఱకు వయస్సో, సౌందర్యమో, ధనమో, కులమో కల పురుషవ్యక్తిని జూచినచో తెలియరాని వాంఛ లజ్జారూపముగనో, వడివడిగ నడచిపోవుటగనో, చప్పన కనులు వాల్చుటగనో, నాయెదలో గోచరించుట నాకుఁ దెలియును. లింగభేదబుద్ధిలో వాంఛ యున్నది. దాని నణఁచుట దాని నతిక్రమించి సాధన చేయుట. సాధన యనినంతనే దానిని పరిత్యజించుటకు అని యర్థముగదా? నీల—నీమాటలు నాకర్థమగుటలేదు. రత్నా—నీవు చదివిన చదువు అటువంటిది. నీల—అక్కా! నేను రేపు ప్రొద్దున వెడలిపోయెదను. రత్నా—రేపు సాయంకాలము మెఱుఁగుమీఁద పొమ్ము. రేపు పొద్దున నీకు విందుచేసి పంపింతును. నీ పెండ్లికినన్ను పిలువకుము. నేను రాను నీవెప్పుడైనా నీయూరు వచ్చినచో నన్ను చూచి పొమ్ము.

నీల—హరి న న్నసమర్థుఁ డనుకొనును. రత్నా—హరిసామర్థ్యమేమిపని చేసినది? నీ యసమర్థతకు లాభము లేదు. తగినంత సామర్థ్యము నాకున్నది. నీవు బంగారము వంటివాఁడవు. నీవు చెడిపోకుము. చెడిపోయి లాభములేదు. నిన్ను చెడఁగొట్ట దగినంత సామర్థ్యము నావద్ద నున్నది. కాని యిరువురను బాగు పఱచఁగలిగినంత సామర్థ్యముగూడ నావద్దనే యున్నది. హరి ని న్నట్లనుకొనె నని నీకు దిగులా? నీల—తల్లితోడు! వాని తెలివితక్కువ వనే విచారించితిని.

రత్నావళి నీలమోహనుని తలమీఁద ఎడమచేయి వేసి నిమురుచున్నది. ఆసమయములో హరియు, రంగఁడును వచ్చిరి. తరువాత నెవరును నెవరితోను మాటాడలేదు. ఎవరిదారిని వారు

పంపుకొనిరి. మఱునాఁడు నీలమోహనునకు నొక యుత్తరము వచ్చెను. అది అతని తండ్రి వ్రాసినది. నీలమోహనుని పెండ్లికి లగ్నము కుదిర్చి రనియు, వెంటనే బయలుదేఱి రమ్మనియు నందుండెను. హరి నీలతో "నిక్కడి పెండ్లి యేమిచేసెద" వనెను. రత్నావళి "ఈపెండ్లి రాత్రి యయినది. ఆ పెండ్లి వేఱు, ఈ పెండ్లి వేఱు" అనెను. నీలమోహనుఁడు "ఇప్పుడుమాటలకన్నింటికి వేఱర్థముకదా? పెండ్లి యనఁగా స్నేహమని మే మర్థము చెప్పెదము" అనెను. రంగఁడు "ఏ యర్థము చెప్పుకొన్నను చెప్పుకొనవచ్చును" అనెను. రత్నావళి రంగనితో "రంగా! నీ వేనా మాట్లాడునది" యనెను. అతఁడు తల వంచుకొనెను. హరి రత్నావళివంకఁ జూచెను. చూచి "ఏయర్థముపడిన నాయర్థము చెప్పుకొనవచ్చునా?" యనెను. రత్నావళి "ఎందుకుఁ జెప్పరాదు? ప్రేమకు మీరు చెప్పునర్థము కన్న పెండ్లికి మేముచెప్పు నర్థము చెడిపోలేదు. పెండ్లియన్నమాట యొక్కయర్థములో లోకము చెప్పుచున్నది. ప్రేమ మొదలైన శబ్దములకు మీరు చెప్పుట లేదా" యనెను. హరి 'పెండ్లికి మీరుచెప్పు అర్థము మాకుఁ దెలియుటలే' దనెను. రత్నావళి "తెలియలేదా? అతఁడు నాకు తమ్ముఁడు. నే నతనికి అక్కగారను. అతఁడు చెడిపోలేదు. నే నతనిని పాడుచేయలేదు. ఇది దానియర్థ" మని తాను లోనికిఁ బోయెను! రంగఁడును, హరియును నివ్వెఱపోయిరి.

ఆనాఁడు సాయంకాలమున నీలమోహనుఁడు రైలునకు వెడలిపోయెను. మఱునాటి ప్రొద్దున మఱియొక స్నేహితుఁడు వచ్చెను. అతఁడు పొడుగరికాఁడు; పొట్టివాఁడును కాఁడు. మొగములో మంచి చుఱుకుఁదనమున్నది. కనులలో నొక తీక్ష్ణతయున్నది. అతనిపేరు సీతారామశాస్త్రి; బక్కపలు

చనివాఁడు; నల్లనివాఁడు. బీడీకాల్చుచు వచ్చెను. ముఱికిగుడ్డలు కట్టుకొనెను. గడ్డము మాసియుండెను. రంగఁడును, హరియును 'శాస్త్రి', 'శాస్త్రి' యని అతని వెంటఁబడిరి. అతఁడు గడ్డముచేసికొని కూర్చుండెను. రంగఁడు రత్నావళిని పిలిచి "ఇతఁడు నా స్నేహితులలో నొకఁడు. గొప్పకవి. ఇటువంటి కవి మనదేశములో లేఁడు. అమోఘముగాఁ బాడఁగలఁడు" అని చెప్పెను. రంగఁడును, హరియును శాస్త్రిని అతఁడువ్రాసిన క్రొత్త పద్యములు చదువుమనిరి. అతఁడు కొన్నిపద్యములు చదివెను. అతని గొంతు కిన్నెరమీటినట్లు పలికెను. ఆ గదియంతయు మాధుర్యముచేత నిండిపోయెను. శాస్త్రి కనులు పద్యములు చదువుచున్నంతసేపు దొంగగా రత్నావళిపై పునఃపునః దక్కితారుచుండెను. శాస్త్రి పద్యములుచదువుచు నడుమ "నీల వెళ్ళిపోయినాఁడా" యని యడిగెను. "అతని పెండ్లియఁట. వాళ్లనాయన యుత్తరమువ్రాసెను. అతఁడు వెళ్ళెను" అని హరిచెప్పెను. శాస్త్రి "వాని పెండ్లికి నా పద్యములు చదువుట పెట్టింతు నన్నాఁడు. నాకు లేఖయినను రాలేదు వాఁడిచ్చుటనున్నాఁడని వచ్చితిని. అతనినడిగి యేదైన డబ్బు తీసికొందుననుకొంటి" ననెను. రత్నావళి యిట్లనెను. "నాచేతికి నీ కిమ్మని నీల పదిరూపాయ లిచ్చిపోయెను. శాస్త్రియని చెప్పినాఁడు. నల్లగా నుండునన్నాడు. మీరే కాఁబోలును" అనెను. హరియును, రంగఁడును నవ్విరి. శాస్త్రి "నేను బీడీలుకూడ కాలుస్తానని చెప్పాఁడా" అని పగులఁబడి నవ్వెను. రంగఁడును, హరియునవ్విరి. రత్నావళి నవ్వలేదు.

---

## తొమ్మిదవ అధ్యాయము

---

నీల పదిరూపాయలు తన కిమ్మనినాఁడని రత్నావళి చెప్పినం

తనే శాస్త్రి మొగము వికసించెను శాస్త్రిమొగము తేజోహీన ముగనుండును. అతనిశరీరములో నారోగ్యమనునది యున్నట్లు కనుపించదు. శరీర మంతయుఁ బొగచూరి యుండును. కాని యతఁడు నవ్వఁగ నతని నోరు కుదించుకొని యది యొక యందముగా నుండును. అతనికనులు సూదులవలెఁ గ్రుచ్చుచుండును. సామాన్యముగా నతని కనులు చూచినచో అతఁడు లోభి యని, కుత్సితుఁ డని తెలియుచుండును. కాని యతఁడొక్కొక్కప్పుడు నేత్రములు విశాలములు చేసి చూచును. అతఁడు తన పద్యములు చదువుచుండును. ఆ సమయమునందు అతని కన్నులు మంచి తీక్ష్ణతాస్ఫోరకములై ప్రకాశించును. హరియును, రంగడును శాస్త్రిని గౌరవింతురు. అతనిని హేళనయుఁ జేయుదురు. సామాన్యముగా నెప్పుడును హేళనమే చేయుదురు. ఆహేళనములోఁగూడ గొంతగౌరవము కలసియే యుండును. మిక్కిలిగా హేళనముచేయుటకు వారికిని ధైర్యం చాలదు. శాస్త్రి చాలవఱకు హేళనము నోర్చుకొనును. ఆ హేళనము గౌరవముతోఁ గూడుకొనినంతసేపు శాస్త్రి దానికి లొంగియే యుండును. ఆ హేళనములో నిరాదరణము, తిరస్కారము కనిపించెనేని శాస్త్రి ప్రళయకాలరుద్రుఁ డగును. అతనికిఁ గోపమువచ్చినచో నతని స్నేహితులలో నితనిముందు తట్టుకొనఁగలవారు లేరు. అతని స్నేహితులలో నతనిని హేళనముఁ జేయనివారు లేరు అతఁడన్నచోఁ బ్రేమించనివారును లేరు. అతఁ డన్నచో గౌరవము లేనివారును లేరు. అతని కవిత్వమునకు నతనిస్నేహితు లందఱును లుబ్ధులు. అతని గుణములయం దందఱును విముఖులు. ఈవైముఖ్యమున కన్న నాకవితాలోభమే యెక్కువగా నుండెను. హరియు, రంగఁడును శాస్త్రిని

వెక్కిరింతురు. శాస్త్రికి గట్టుకొనుటకు గుడ్డలుకూడ నుండవు. ఏస్నేహితునియింటికి బోయినను అతనివస్త్రములే ధరించును. తన మాసినగుడ్డలు వారియింట వదలును వారి యింటిలోని క్రొత్తవస్త్రములు ధరించి వానితో వెడలిపోవును. అతనికి స్నేహితులయొద్దనుండి డబ్బుతీసికొనుటకు వెఱపులేదు; సంకోచము లేదు. తీసికొంటినని కృతజ్ఞతలేదు. ఆ స్నేహితులు తనకు డబ్బిచ్చుటకు పూర్వజన్మములో వారుతన కష్టబడియుండిరని యతని యుద్దేశ్యము. అతని హృదయములో నింకొక సిద్ధాంతముకూడఁ గలదు. తాను మహాకవి; తనకన్న గొప్పవాఁడు తెనుఁగుదేశములో లేఁడు. కాని తెనుఁగుదేశము గుడ్డిది. ఆ దేశమునకుఁ దన గొప్పవారెవరో తనకే తెలియును. అట్టి తన్ను భగవంతుఁడు ధనవంతునిగాఁ జేసి యుండవలయును. ఆ భగవంతుఁ డట్లు చేయలేదు గనుక దేశములో నున్న ధనవంతులందఱును దనకుఁ గావలసినపుడెల్ల ప్రతిఫలాపేక్ష లేకుండ ధనమీయవలయును. ఇచ్చితి మని వా రనుకొన రాదు; పుచ్చుకొంటి నని యతఁ డనుకొనఁడు. అందు చేతఁ దాను వారియెడఁ గృతజ్ఞుఁడుగా నుండనవసరము లేదు. ఈ సిద్ధాంతము శాస్త్రియొక్క హృదయాంతరాంతరములో నిది శాస్త్రి తన మనోభావముల నెవ్వరితోడను జెప్పఁడు. అతఁడు ప్రసంగించునప్పు డతని హృదయగతసిద్ధాంతము లతని నోటివెంట రావు. స్నేహితులు నలుగురు కూర్చుండి లోకముసంగతి, జీవిత రహస్యములు మాటాడుచున్నచో శాస్త్రి తాను దూరముగాఁబోయి కూర్చుండును. రత్నావళి శాస్త్రిని జూచినంతనే, అతనిని గూర్చిన సంగతిలోఁ గొంత అతని ముఖమును బట్టియే తెలిసికొనెను. రంగని కింకెంత

మంది స్నేహితులు కలరో! తనకుఁ గనిపించిన ముగ్గురును మూఁడురకముల మనుష్యులు. నీలమోహనునివంటి స్నేహితుఁ డింకొకఁ డుండునా? అతఁడు గంజాయివనములోఁ దులసి మొక్కవలె నుండెను. రంగఁడు భోజనముచేసి యాఫీసునకుఁ బోయెను. హరియు, శాస్త్రియు గదిలోఁ గూర్చుండిరి. రత్నావళి సావడిలోఁ బండుకొని యేదో పుస్తకము చదువుచుండెను. హరి సావడిలోనికి వచ్చి "యేమండీ రత్నావళిగారూ! శాస్త్రిగారు పద్యములు చదువుదురఁట. చదువ మందురా?" యనెను. రత్నావళి "నన్ను 'ఏమండీ' యని పిలుచుచుంటిరేమి? నిన్నటివఱకు నేకవచనము, నేఁడు బహువచనమునా" యనెను. హరి:—నిన్నటివఱకు మీ రేకవచనమే నేఁడు బహువచనము. రత్నా:—ఎందుచేత? హరి—మీకు తెలియదా? రత్నా:—నాకుఁ దెలియదు. హరి:—ఇప్పుడదియంతయు నెందులకు? శాస్త్రి పద్యములు చదువును. మీరువచ్చి వినవలయు నని నా ప్రార్థన. రత్నా:—నేనురానన్నచో మిమ్ముఁ దిరస్కరించినట్లా, శాస్త్రిగారిని దిరస్కరించినట్లా? హరి—నన్నుఁ దిరస్కరించుటకిది మొదటిసారికాదు. రత్నా:—ఇదివఱకు మిమ్మెప్పుడు తిరస్కరించితిని? హరి—నీలమోహనునితో స్నేహము కట్టినప్పుడే నన్నుఁ దిరస్కరించితిరి. రత్నా:—నాకు మీరును, నీలమోహనుఁడును నొక్కటియే. హరి:—అతఁడు మీకు తమ్ముఁడు. నేను కాను గదా! రత్నా:—మీరుకాదు, మీ రెట్లగుదురు? నీలమోహనుఁడు పేదగుండెవాఁడు. అచ్చమైన పాలమీఁగడ. ఈసృష్టిలో నతనివంటి మనుజు లెందఱుందురు? ఉండరు. అతనివంటి మనుష్యులు మీ రెప్పుడును గాలేరు. హరి:—రంగఁడైనను గాలేఁడా? నీలమోహనుఁడు మంచి తెలివిగలవాఁడు. రత్నా:—మీరన్నమాట

కర్థము నాకుఁ దెలియును. తెలివియనఁగా మీభావము లెట్టివో నాకుఁ దెలియును. నీలమోహనుని కున్న తెలివి మీ తెలివివంటిది కాదు. హరి:—అది యెటువంటి తెలివి? రత్నా:—నేను పుస్తకము చదువుకొనుచున్నాను. హరి:—శాస్త్రిపద్యములువినరా? రత్నావళి మాటాడలేదు. హరి వెడలి పోయెను. శాస్త్రి లోనుండివచ్చెను. అతఁడిటునటుఁ గొంచెము తారాడిఁ కొంచెము దగ్గి, తటపటాయించి 'యేమండీ! ఆచదువు చున్న గ్రంథ మేమిటండీ" యని యడిగెను. రత్నావళి పుస్తకము మూసి 'ఏమండీ పద్యములు చదివెదరా? వినెదను' అనెను. శాస్త్రి యచ్చటనే కూర్చుండి పద్యములు చదువ నారంభించెను. ఆపద్యములలోనున్న విషయము ప్రేమ. అతఁడు 'నిరాకృతి' యనుశీర్షికతో నాలు గీతపద్యములు చదివెను. వాని యర్థ మిది. "ఓసిప్రియురాలా! నీ కాలిమంజీరాలు వెలుఁగుల నాహ్వానించుచుండఁగా, నీపయ్యెదచివళ్లు అప్సరసల కంటివెలుఁగులకు జక్కిలిగింతలు పెట్టఁగా నీవు క్షీరమార్గమునఁబోవుచుంటివి. నేను నిన్ననుసరించితిని. నీవు నాకు విషపుబిందువులనే విదల్చితివి." శాస్త్రిపద్యములుచదువుచుండఁగాహరిలోనుండివచ్చెను.అతఁడు ద్వారబంధమునొద్ద నిలుచుండి వీథివంకఁ జూచుచుఁ జెవులు మాత్రము వారి ప్రసంగముమీఁదఁ బెట్టియుండెను. రత్నావళి పద్యములు విని తనకు వాని యర్థము తెలియలే దనెను. శాస్త్రి "తెలియకపోవుట కిం దేమున్నది? సులభముగాఁ దెలియుచున్న" దనెను. రత్నావళి "మీకు సులభముగాఁ నున్నట్లు తోఁచవచ్చును. నాకేమియు చదువురాదు. మీ కవిత్వములో సంస్కృతపు మాట లెక్కువగా నున్నవి. నేను జదివిన పుస్తకములలోని భాష మిక్కిలి తేలికగా నుండును. మీ భాష

గొట్టుగా నున్నది" యనెను. శాస్త్రి "అట్లయినచో మీరు చదువుకొనరాదా?"యనెను.రత్నా:—నాకుఁ జదువెవరు చెప్పెదరు? శాస్త్రి:—నేను జెప్పెదను. రత్నా:—ఎప్పుడు మొదలు పెట్టెదరు? శాస్త్రి:—ఈవేళరాత్రి మొదలు పెట్టుదము. రత్నా:—ఏ పుస్తకము మొదలుపెట్టుదము? అస లింకొక పుస్తకమెందులకు? మీపద్యము లన్నియు నాకు వ్రాసియిచ్చి వాని యర్థము చెప్పుఁడు. అప్పుడు నాకు భాష వచ్చునుగదా! ఇంతలో హరి కలిపించుకొని యిట్లనెను: "మొట్టమొదటనే శాస్త్రిపద్యములు చదివినచోఁ గష్టముగా నుండును. అతని కవిత్వము సామాన్యముగా నందఱకును దెలియదు. హృదయము మిక్కిలి పరిపక్వమైనవారికి మాత్రమే తెలియును. అందుచేతఁ బూర్వకావ్యము లేవైన ముందు చదువవలయును. తరువాత శాస్త్రి కవిత్వ మర్థమగును."

రత్నా—అయినచోఁ బూర్వకావ్యములు తేలికగా నుండునా? హరి—వానికర్థములే వ్రాసియుండును. రత్నా—అయినచో నేనే చదువుకొనఁగలుగుదును. శాస్త్రి—కొన్నాళ్ళు పోయిన తరువాత మీరు చదువుకొనవచ్చును. మొదట నెట్లు చదువుకొనవలయునో నేను చెప్పెదను. రత్నా—అయినచో నేపుస్తకము ప్రారంభింతము? శాస్త్రి—మనుచరిత్రము మొదలు పెట్టవచ్చును. హరి—శాస్త్రీ! ఈమనువసుచరిత్రలలోఁ గవిత్వమేమియుండును? ఆమెచేతఁ గ్రొత్తకావ్యములు చదివింపుము. రత్నావళిగారూ! మీకుఁగొంచెముగా నింగ్లీషువచ్చును. ఇంగ్లీషులో కీట్సు, షెల్లీ మొదలైన మహాకవు లున్నారు. వారి కావ్యములు నేను చదివి మీకర్థముచెప్పెదను. భాషకోసము మీరు మనుచరిత్రము చదివినను భావములకోస మింగ్లీషుకవు

లను దెలిసికొనవలయును. పట్టి తెలుఁగు కావ్యములే చదివినచో మనస్సునకుఁ బరిపాకము కుదురదు. శాస్త్రి—ఎందుకుఁ గుదురదు? నేనింగ్లీషు కావ్యము లేవియుఁ జదువలేదు. హరి—నీకు మనస్సు పరిపాకము కుదిరినదందువా? శాస్త్రి—ఏమో! నాకేమి తెలియును? మీ రందఱును నాకవిత్వము మీఁదఁబడి చచ్చిపోవు చున్నారు! రత్నా—చచ్చిపోవు నంత కుదిరినది రత్నావళియు, శాస్త్రియు నవ్విరి. శాస్త్రి గొలుగఁబడి నవ్వెను. హరికి మొగము కందగడ్డ యయ్యెను. నీలమోహనుఁడు వెళ్ళినంతనే హరి రత్నావళి తనకు మరల సన్నిహితురాలైనదని యనుకొనెను. ఆ నిమ్నగ మరల నింకొకయెడకుఁ దిరిగినట్లు కన్పించెను. స్త్రీ విషయమున నీదృక్స్వల్పసంవిధానములు పరిణామిపరిథమావస్థలు. ఉత్కంఠుల కాశానిరాశాజనకములు. హరికి శాస్త్రిపైఁ గొంచెమసూయ, దానిముద్దుచెల్లెలుకోపము నిరువురి సంపర్కమును కలిగెను. హరి కామినీగోష్ఠీప్రౌఢుఁడు. కాని యాప్రౌఢిమయందు ముగ్ధత్వమును బ్రాతిపదికగాఁ జెక్కుకొన్నవాఁడు. అతనికి స్త్రీవిషయమునఁ బ్రథమదశానిరుత్సాహజనకసన్నివేశములు పునఃప్రయత్న సముత్సాహజనకములు. ఆయుత్సాహమున తొందరపాటు లేనిచోఁ గార్యసాఫల్యమెంత వఱకుఁ గలుగునో తెలియదు. తొందరపాటు మాత్రము నిశ్చయముగాఁ గార్యవైఫల్యహేతువు. కోప మా తొందరపాటునకు బీజనిక్షేపము. హరి—నేను శాస్త్రి కవిత్వమునకుఁ జచ్చిపోవుట లేదు. మేము మెచ్చుకొనకున్నచో శాస్త్రి దిగులుపడి పోవునని మెచ్చుకొందునే కాని యీయనకవిత్వమే మహాకవిత్వమని నాకు లేదు. శాస్త్రి—నీవట్లనుకొన్నచో నీకుఁగవితావిషయమే తెలియదు. హరి—నీకుఁ బాశ్చాత్యభాషాజ్ఞానము

లేదు. ఇంగ్లీషు భాషలోని యనేక విషయములు నీకు నేను తర్జుమా చేసి చెప్పితిని. నీవు వానినన్నింటిని తెలుగులో పద్యములుగా వ్రాసితివి. నీకు స్వతంత్రభావములన్నవి లేవు. ఇంగ్లీషు కవుల భావము లెవరివి వారికిఁ బంచిపెట్టినచో నీకవిత్వము పూర్ణానుస్వారము. శాస్త్రి– కవిత్వమనఁగా నుక్తివైచిత్ర్యము. ఇతరుని భావమైనను నేను క్రొత్తరీతిగాఁ జెప్పినచో నా భావము నాదే. ఎంతటికవియు భావములు క్రొత్తగా సృష్టింపఁడు. భావములు సృష్టిలోననే యుండును. ప్రతిభావమును నెప్పుడో యొకప్పు డెవనికో యొకనికి మనస్సులోఁ దట్టియే యుండును. కవి దానికిఁ దన మనోహరశబ్దజాలముచే నాకృతి కల్పించును. అదియే వాని కవితాశక్తి. హరి– అవునవును. నీ పాండిత్యము నాకుఁ దెలియును. కాని యొక్క–భేదమున్నది. ఇతరుఁడైనకవి భావమును దాను గొంచెము భేదముతోఁ దీసికొనుట వేఱు; కవి తనకే తోఁచిన యొకస్వతంత్ర భావమును నిర్మించుట వేఱు. శాస్త్రి– అసూయాగ్రస్తుని కవితానుభవము వేఱు, నిజమైన రసజ్ఞుని కవితానుభవము వేఱు. హరి–నీ వన్నచో నాకేమి యసూయ? రత్నా–ఆయన కేమియునసూయ లేదు. ఆ యసూయ నీలమోహానునితోఁ బోయినది. క్రొత్తగా మొదలుపెట్టినచో మొదలు పెట్టవచ్చును. శాస్త్రిపకాలునవ్వెను. రత్నావళి నెదిరించుశక్తి తనకు లేదని హరికి మున్నే తెలియును. వాంఛాసహితమైన స్థలమునందుఁ బెఱచోటు సింహమైనవాఁడుకూడ ప్రక్కలూడ్చినట్లు రత్నావళి శాస్త్రితో 'మనుచరిత్రముకొని తెత్తువా' యనెను. రత్నావళి శాస్త్రి నేకవచనసంబోధనము చేయుటకిది తొలిసారి. హరికి నీ యేకవచన ప్రయోగము రత్నావళికత్తికి రెండవవైపునఁగూడఁ బదనున్నదని తెలియఁజేసిన

ట్లయినది. శాస్త్రి సహజముగా స్త్రీ భీరుఁడు, ప్రేమభీరువు. ఆ సంబోధనముక్రొత్తలో హారినిగూర్చి యైనచో నతఁడా మెట్టు మీఁదఁ బదిమెట్లు కట్టును. శాస్త్రి కా సంగతి చేతఁ గాదు. అతఁ 'డక్లేతెత్తుసండీ' యనెను. కాని మనస్సులోఁగొంచెము కష్టపడెను. తనకు నీలమోహనుఁ డిచ్చిన పదిరూకలలో గొంత దీనికి ఖర్చగును. ఆమె వేఱే డబ్బిచ్చునో, యీయదో? వేఱే డబ్బిమ్మని తానడిగినచోఁ దన యాశాంకురమున కా పూఁట ప్రోదిచేసినట్లు కాదు. ప్రేమ యన్నది మిక్కిలి సుకుమారమైన వృక్షము. అది ప్రతినిమేషము ప్రోదిచేయించుకొను మొక్క. ఆకుచివర వాడుచూపినను నిముసములో మొక్కయంతయు మాఁడిపోవునట్టిది. శాస్త్రిహృదయము స్వార్థతాపుంజము. అతఁడు ప్రతిగ్రహించుటయే యెఱుఁగునుగాని దానమిచ్చుట యెఱుఁగఁడు. దానమిచ్చుటకుఁ దనకు శక్తిలేదని యతని యూహ. నిజమైనదాత తనశక్తినిగూర్చియూహింపఁడు.

సాయంకాలమున రంగఁడు వచ్చెను. రత్నావళి రంగనితో 'బజారునకుఁ బోద'మనెను. రత్నావళి శాస్త్రిని బిలిచి 'నీవును, హారియు నెచ్చటికి బోదురనెను. శాస్త్రి మనసులో నొకయానుకూల్యము, నొకయననుకూలత యేర్పడెను. శాస్త్రి రత్నావళితోఁగలసి సాయంవాహ్యాళి నూతనదోహదప్రాయ మగు నని తలఁచెను. ఆమె యిట్లడుగుట దాని కననుకూలము. పుస్తకమామెయే కొనును. ఇదియానుకూల్యము. హారి తనకు వేఱేపని యున్నదని చెప్పెను. శాస్త్రి యొంటరిగాడయ్యెను. ఆసందర్భములో హారియైనచోఁదానుగూడ బజారునకువత్తుననును. శాస్త్రి తా నింటియొద్దనేయుండిచదువుకొందుననెను. హారి యెచ్చటికో పోయెను, రంగఁడును, రత్నావళియు బయలుదేరిరి.

రత్నా:-రంగా, నీవు లక్నోనుండి వచ్చుటకు నా గాజులజత యొకటి పంపించితిని. ఈయూరిలో నింకొకజత నీ కిచ్చితిని. నా చేతుల రబ్బరుగాజులుమాత్రమేయున్నవి. రంగ:-రెండుజతలు నొక వందరూపాయలగును. నీ చెవిపోగులుకూడ నమ్మితిని. మొన్న నేను దెచ్చినడబ్బు బ్యాంకులో వేసితిని. నూటపాతిక రూపాయలు దానిలోనివి తీసి నీ కిచ్చెదను. రత్నా:-నీ చదువున కావందలు చాలునా? రంగ:-నేనింక జదువను. ముందు నెలనుండి యాఫీసులో నాకు నలువదిరూకలిత్తు మన్నారు. ఏపత్రికలోననో క్రమముగా సంపాదకుడనై యేవందరూపాయలో తెచ్చుకొందును. నేను జదువునకుం బోయినచో నీధనము చాలదు. చదువునకు, భోజనమునకు నొక సంవత్సరము నా డబ్బు మనలను బోషింపదు. రత్నా:-శాస్త్రి నాకు మనుచరిత్రము పాఠముచెప్పుదుననెను. నేడు మనుచరిత్రము కొనవలయును. రంగ:-కొందము. రత్నా:-ఇంక నీకుఁ బ్రతిష్ఠాపురములో నేమిపనియు లేదుకదా? రంగ:-నాకును లేదు; నీకును లేదు. రత్నా:-నాకున్నది. రంగ:-ఎట్లున్నది? రత్నా:-అది నీ కెందుకు? రంగ:-అయినచో సరే. రత్నా:-ఎట్లున్నదో చెప్పెదను. రంగ:-అక్కఱలేదు. రత్నా:-కాని చెప్పెదను. నేను మీ యన్నగారి భార్యను కాదని యెవరైన నందురా? ఆయనభార్య లేచిపోయినదందురు. లేచిపోయిన దందురు గాని యాయనభార్య కాదనరు. ఇట్లున్నది.

రంగ:-అట్లయినచో నాకును నున్నది. రత్నా:-నీకు లేదు. అన్నదమ్ములు త్రెంచుకుపోయిరి. విడివడి రందురు. ఇంకేమి సంబంధమున్నది! ఒకచెట్టునకు నొకతీగెను నున్నంత సంబంధము రెండుచెట్ల కుండదు. రంగ:-మనుచరిత్రము వెలయెంత

యగును? రత్నా:-నీకుఁ దెలియదా? రంగ:-తెలియదు. రత్నా:-'స్త్రీహక్కు'లన్న పుస్తకము వెల యెంతయగును? రంగ:-ఆపుస్తకము మనయింటిలో నున్నదికదా? కొననక్కఱ లేదు. రత్నా—ఆపుస్తకము మనము కొనలేదు. ఆగ్రంథకర్త నీస్నేహితుఁడు. నీకు బహుమానమంపెను. రంగ— నాకోసము కాదు, నీకోసము. రత్నా—నాకోసమని కొని నీకుఁబంపెను. రంగ— నీమాటలు నాకర్థముకావు రత్నా— నీవు నేర్పిన చదువే నీకర్థముకాదు!

ఆరాత్రి రత్నావళి యింటికిఁ బోవుచునే మనుచరిత్రముచదువ నారంభించెను. రంగఁడు వంటచేయుచుండెను. శాస్త్రి "శ్రీ వక్షోజకురంగనాభ మెదపై" ప్రారంభించెను. శాస్త్రిమనస్సు దాఁగుడుమూఁతవంటిది. మనుచరిత్రములోని శృంగారరసము నతఁడొక స్త్రీకిఁ బాఠముచెప్పుట యతని హృదయమునకు నిష్టతమమైన కార్యము. కాని యతని స్త్రీభీరుత్వము కంఠగతమై వాక్కునందు వెలువడును. అతఁడిట్లనెను. "ఈ పుస్తకములలో నసభ్యమైనభాషయుండును. వక్షోజములు, ఊరువులు, రతి-ఈమాటలు వచ్చుచుండును. అందుకనియే విశ్వవిద్యాలయములవారు గ్రంథములలో నీభాగములు తొలగింతురు.

రత్నా—ఆమాటలు కర్థమేమిటి?

శాస్త్రికిఁ దటాలున నర్థము చెప్పునంత సాహసములేదు. పుస్తకములో వ్రాసినయర్థమును రత్నావళికిఁ జూపించెను ఆమె నవ్వెను శాస్త్రికి ధైర్యమువచ్చెను. రత్నావళి "ఇందుతప్పేమున్నది. ముఖమున కొకపేరుండవలయునుగదా? అన్నింటికిని పేరులుండును. సర్వజంతువుల యవయవములకును పేళ్ళుండును. అవసరమున్నచో వానిని వాడరా? వాడనిచోఁ బేర్లే

యక్క-అలేదు'' అనెను. శాస్త్రికి రత్నావళియనిన మాట యర్థనైశిత్యము తెలియునంత సంస్కారము లేదు. భాషాజ్ఞానము వేఱు, సంస్కారము వేఱుకదా! సంస్కారము జనులకుం బూర్వజన్మములనుండి ప్రాప్తించునది. ఒక్కొక్కరియం దిది కాలతః ప్రాప్తించును. చదువుకొనునప్పుడు మందబుద్ధియగు వాఁడు స్వతంత్రజీవన మారంభించినంతనే నిశితవివేకుఁడై ప్రకాశించును. ఇది వసంతముల మామిడి పూచినట్లు. రత్నావళి మనస్సు మన్మథుని గొడుగునకు ముత్యాలు గుచ్చినట్లుపూచెను. రాత్రి పదిగంటలవరకును బాఠమే సాఁగెను. ఆమెచేతికిఁ దన చేయి తగిలింపవలయునని శాస్త్రి పదిసారులు ప్రయత్నము చేసెను. ఆపదిసారులు రత్నావళి మందహాసము చేసెను. శాస్త్రి గుండెకు ధైర్యమన్నది వెలివస్తువు. అతఁడప్పటికిఁ గాదుకదా యెప్పటికిని స్పృశింపలేఁడు. పదునొకండవసారి రత్నావళియే స్పృశించెను. శాస్త్రి ముగ్ధుఁడై నిశ్చేతనుడయ్యెను. అతని శరీరము త్రవ్వి దిబ్బలు పోసిననేల యయ్యెను. రత్నావళిలో వికారము లేదు. ఆమెహృదయములో హాస్యరసము తాండవించెను. హరి ప్రొద్దుపోయి వచ్చి తా నెచ్చటనో భోజనము చేసితినని చెప్పెను. రంగఁడు రత్నావళికిని, శాస్త్రికిని వడ్డించెను. రత్నావళి శాస్త్రిని భోజనము వేళ 'నీకిది కావలయునా, యిది కావలయునా' యని యడుగును. వల దన్నకొలఁదియు పదార్థములు వడ్డించును. మాటిమాటికిఁ దన హస్తాంగుళు లతని శరీరమునకుఁ దగిలించును. శాస్త్రి యా స్పర్శకు విపరీతార్థములు కలిపించుకొనును. రత్నావళి పట్టిన తాఁకును.

భోజనమైనతరువాత నందఱును బండుకొనిరి. ఒక్క శాస్త్రికిఁ దక్కఁ దక్కిన ముగ్గురికిని నిద్దురపట్టెను. శాస్త్రి తెల్లవాఱు

నాలుగంటలవఱకు రత్నావళి వచ్చి తన్ను నిద్రలేపునని ప్రతీక్ష చేసెను. అతని నెత్తురుడుకుచుండెను. అతని శరీరములోని నెత్తురులు నూటపది డిగ్రీల వేడితో నూర్ధ్వప్రసరణము చేసెను. అతని సర్వాంగకములు నూరకే యెనుబదియేండ్ల వృద్ధునికిఁబోలె వడఁకుచుండెను. అతనికి లోనుండి చలిపుట్టెను. దుప్పటి కప్పుకొని యతఁడు బిగించుకొని పండుకొనెను. అతని పని చలిజ్వరముకన్న నీరసపడెను. అతని పెదవి కదలఁజొచ్చెను. అతనికిఁ దెల్లవాఱుకడ నిద్దురపట్టెను.

ఇట్లు వారముదినములు కడచెను. శాస్త్రి ప్రతిదినము రత్నావళికిఁ బారము చెప్పును. రత్నావళి యాతనిని 'నీ'వనును. ప్రతి విషయమునం దాజ్ఞాపించును. "శాస్త్రీ! కొంచెము మంచితీర్థము తెచ్చిపెట్టు"మనును. శాస్త్రి తెచ్చిపెట్టును. బజారునకుఁబోయి దువ్వెనయో, రిబ్బనో తెమ్మనును. డబ్బు లిచ్చును. పగలు రెండుజాములు, రాత్రిపదిగంటలు. ఈవేళ యావేళయని లేదు; రత్నావళి శాస్త్రి. శాస్త శాసించువాఁడు. స్త్రీలింగము శాస్త్రి. శాస్త్రి శాస్త్రి. హరికి దిక్కు-మొక్కు-లేదు. శాస్త్రి తన సేవకుఁడగుట తన వాంఛాపూర్తికి బాట యనుకొనెను. హరి యిది యంతయుఁ దనకు రత్నావళి విముఖురాలగుట యనుకొనెను. శాస్త్రిలోనాశ, హరిలోనిరాశ, కారణరహితముగ విజృంభించెను. రంగనికి నెలజీతము వచ్చెను. అదికాక తన నిలువయున్న డబ్బులో నేఁబదిరూకలు వాడుకొనవలసివచ్చెను. రత్నావళి శాస్త్రినిగాని, హరినిగాని ప్రేమించుననన్నయాశ రంగనికిఁ బోయెను. కొన్ని దినములనుండి తనకును, రత్నావళికిని సంబంధము లేదు. హరికిశోర సీతారామశాస్త్రుల మూలముగా నింటిలో వ్యయ మెక్కు-వగుచుండెను. వారికి సిగరెట్లకడనుండి

తానేకొని యీయవలయును. వారు సినిమాకుఁ బోయినను రంగని నడిగి డబ్బుతీసుకొందురు వారి మూలముగా రంగఁడు తా నెచ్చటికిఁ బోవుటయుమానెను. వారిరువురును వదలిపోయి నచోఁ జాలు ననిపించెను. ఒకనాడు రంగఁడు వా రిరువురితోఁ బొమ్మని యనలేక యిట్లనెను. "ఎల్లుండి నీల పెండ్లియఁట. మనముగ్గురికి నాహ్వానములు వచ్చెను. మీరు పోరా?"

హరి:-రత్నావళిగారు వెళ్ళరా? రత్నావళి రంగని యుద్దేశము గ్రహించి తాను వెళ్లెద ననెను. ఆ మఱునాఁడు సాయంకాలము ముగ్గురును బ్రయాణమైరి. రంగఁ డాఫీసులో సెలవు దొరకదనెను. మఱునాఁడు ముప్వురును రైలుకుఁ బోయిరి. రత్నావళి తా నాఁడువారి పెట్టెలోఁ గూర్చుండెను. వారిద్దఱును పోయి ముందుపెట్టెలలోఁ గూర్చుండిరి. రత్నావళి తన టిక్కెట్టు తానేకొంటి నని చెప్పెను. ఆమె ప్లాటుఫారముటిక్కెట్టు మాత్రమే తీసికొనెను. రైలు బయలు దేఱువేళకు తాను దిగి యింటికిఁ బోయెను. శాస్త్రికిని, హరికిని నాసంగతి మఱునాఁడు ప్రొద్దుటికిఁగాని తెలియదు. రంగఁడు రత్నావళిని జూచి "నీవు వచ్చితి వేమి" యనెను. ఆమె తా నసలు వెళ్ళలే దనెను.

రంగ:-నీవు తిరిగి వచ్చుచుంటి వని వా రిరువురికిని దెలియునా

రత్నా:-తెలియదు. రంగ:-ఈ మోస మెందులకు? రత్నా:-కొన్నిశాస్త్రములలో నధికవిషయములలో మోసము మోసముకాదు; అల్పవిషయములలో మోసము మోసము.

ఆరాత్రి రెండుజాములవేళ రంగఁడు రత్నావళిని వాంఛించెను. రత్నావళి "మన మిద్దఱమును భార్యాభర్తలము కాము. నా భర్త యెవ్వడో నాకింకను దెలియలేదు. మనమిద్దఱ మీబ్రతుకు బ్రతుకరాదు" అనెను. రంగ:-నీ వింకొకనిని పెండ్లియా

డరాదు. నేను నిన్నుఁ బెండ్లియాడెదను. రత్నా:-రంగా నీకుఁ దెలియదు. ఈవేళ యటువంటిది. దాని బలవశుఁడవై నీ విట్లను చుంటివి. నీవు నన్ను బ్రేమించుటలేదు. నేనును బూర్వము నిన్నుఁ బ్రేమించిన ట్లిప్పుడు బ్రేమించుటలేదు. మనము కలసినచో నది పెండ్లి కాదు. ఇంకను నీ కెందఱో స్నేహితులుండి యుండవలయును. వారినందఱను నన్నుఁజూడనిమ్ము. నా మనస్సొక నిశ్చయమునకు వచ్చునేమో? రంగ:-రత్నా! నన్నుఁ జంపకుము. నేను నీయందుఁ దప్పుచేసితిని. నీవు నా సిద్ధాంతములకు లొంగలేదు. నేను నిన్ను భ్రష్టనుజేసితిని. నిన్ను నేను బెండ్లియాడెదను. రత్నా:-రంగా! పొరపాటు పడుచుంటివి. ప్రేమయే పెండ్లియంటివికదా! మన యిరువురిమధ్య ప్రేమ లేనప్పుడు పెండ్లి లేదు. పెండ్లి లేనప్పు డాడుటయెందులకు? రంగ-నిన్ను నేను బ్రేమించుచుంటిని. రత్నా:-ఎందుకుఁ బ్రేమించుచుంటివో చెప్పుదునా? స్నేహితులు వచ్చి నెలలతరఁబడి యుండఁగా నీవు వ్యయమోర్వలేకున్నావు. నీ చదువు సాగదని నీకుఁ దెలిసినది. నీవు నిర్మించుకొన్న సౌధము లాకాశములో నిలచినవి. నీ సిద్ధాంతములు నామీఁద వృథాయైనవి. నీవు దండయాత్ర యెత్తితివి. మొదటి యుద్ధములోననే యోడిపోయితివి. మీయన్న నోడించితివి. నీవు గెలువలేదు; గెలువలేవు.

---

## పదియవ అధ్యాయము

---

ఒకసారి రంగని కాదివారముతోఁగలిసి మూఁడునాళ్లు సెలవు వచ్చెను. వెనుకటి యధ్యాయాంతమునఁ జెప్పినకథజరిగిననాఁటి నుండియు రంగనికి మనస్సులోఁ దీవ్రవేదన ప్రారంభించెను. అతనికి రత్నావళి నొప్పించి వివాహముచేసికొనవలయునని గాఢ

వాంఛకలిగెను. ఇద్దరు నొకయింటిలో నుండిరి. ఇద్దఱు సంసారమును జేయుచుండిరని లోక మనుకొనుచుండెను. ఆమె మనస్సు మీఁదఁ దానధికారమును వహించి యామెను దెచ్చెను. కొన్నాళ్ళామె తనకధీనురాలై యుండెను. ఉన్నట్లుండి యింతలో నామె తన్ను మించిపోయెను. ఇదివఱ కామె మీఁదఁ దనకుఁ బ్రేమ లేదు. ఆమె తన్నుఁ బ్రేమించినది; తానామెను బ్రేమించ లేదు. ఆమె మీఁదఁ దనకుఁ బ్రేమ లేదు. ఇప్పుడీ ప్రేమ యెట్లు కలిగెను? ఆమెకు తనమీఁదనున్న ప్రేమ యెట్లువిఱిగెను? ఆమెకుఁ దన మీఁదనున్న ప్రేమ యెట్లువిఱిగెనో వానికిఁ దెలియదు. తనకు బ్రేమ యెట్లుకలిగెనో యతఁడు విచారించుకొన నారంభించెను. అది ప్రేమయవునో, కాదో తాను తొల్లిటి రంగారావు కాదు. తొల్లిటిరంగారావుఎమ్.ఏ.,ఎల్.ఎల్.బి. చదువుచుండెను. అతడు పరీక్షయగును; ఉద్యోగముచేయును; మంచి బ్రాహ్మణకుటుంబములోఁబుట్టెను. అతనియన్నగారు నలుగురిలోఁ దలయెత్తుకొని తిరుగుచుండెను. తొల్లిఁటిరంగారావు మంచి బుద్ధిమంతుఁడు; సంస్కారప్రియుఁడు. అతఁడు దుఃఖమెఱుఁగఁడు. అతనికి భవిష్యత్తంతయు రాఁబోవు శుక్లపక్షమువలె నుండెను. ఆరంగారావును బ్రకృతియంతయుఁ బ్రేమంచెను. ఆ ప్రేమించిన ప్రకృతిలో నే చోటు రంగారావు తిరిగి ప్రేమించవలయునో యతనికిఁ దెలియలేదు. ఆ ప్రకృతిలోఁ బ్రతియణువుఁ దన్ను రంగారావు ప్రేమించిననే చాలుననుకొనుచుండెను. ఇప్పటిరంగారావువేఱు. వీఁడు చదువు మానినవాఁడు. మఱల చదువుటకు శక్తిలేనివాఁడు. కులముచెడినవాఁడు. అన్నగారి సంసారమును బాడుచేసినవాఁడు. తాను బ్రేమింపని స్త్రీని వయోవనశుద్ధై, తానునమ్మిన సిద్ధాంతమును వదలి, స్వీకరించినవాఁడు. ఈ రంగఁడు దుఃఖ

మెఱిఁగినవాఁడు. కష్టములు పడినవాఁడు కొన్నిపూఁటలు తిండికి లేక యిబ్బందిపడినవాఁడు. దారివెంటఁబోవుచుఁ వాఁడుగో, వాఁడే తనయన్నగారి భార్యను లేవఁదీసికొనివచ్చెను'అని వ్రేలు పెట్టిచూపించుకొన్నవాఁడు. హాస్యరసమయములు,సీత్కారస్ఫోరకములు,తిరస్కారగర్భితములునైన కన్నులతోఁ జుఱుక్కునఁజూడబడినవాఁడు. ఎవరో స్నేహితులు తప్పఁ దక్కినవారిచేతఁ బథమునందుఁ బరిహరింపఁబడినవాఁడు. పరు లతనితో మాటాడినచో నేదో దాఁచుకొని మాటాడుచుండిరి. అతని యౌవనమే పోయినట్లుండెను. అతనితోఁ బెద్దలైనవారు, గౌరవముగలవారు మాటాడుచున్నట్లు లేదు. ప్రకృతి యంతయు నతనికి విముఖమైనది. ప్రకృతి యతనిని ప్రేమించుటలేదు. ప్రవాహము వదలిపోయిన కొన్నిచోట్ల దిబ్బలుపడఁగా వానివంటి కొందఱు స్నేహితులుమాత్రమే రంగనిఁ బ్రేమించుచుండిరి. ఆ యిసుకదిబ్బలకుఁ బ్రేమ యేమి తెలియును? అవియుఁ బ్రవాహము క్రమ్ములై మిట్టలు పడిన ప్రదేశములు. వానియం దొక పచ్చనిమొక్కయును మొలవదు. గాలియాడుటచేత నవినున్నగా గన్పించును. వానియందలి రేణువులను గాలి తరలించుకొని పోయి బాటసారులకనులలోఁగొట్టును. ఆ యిసుకదిబ్బలకదియే చారితార్థ్యము. గాలిసోఁకినకొలఁది నాదిబ్బలు నునుపుదేరి పనియుఁబాటయులేక వాహ్యాళికిఁ దిరుగుచున్న నిర్వ్యాపారులకవి స్పృహణీయములుగానే యుండును. ఈరంగఁడు తానేస్థలమును ప్రేమించును? మునుపటివలెఁ దన్నేస్థలమును ప్రేమించుటలేదు. ఆయిసుకదిబ్బలితనినిరమ్మన్నచో నితనికిఁబ్రయోజనము కన్పించలేదు. రంగఁడు రత్నావళినిఁ దాను బ్రేమించలేదు. ఆమె యందకత్తెకాదా? పూర్వమందకత్తెయే. తానప్పుడు ప్రేమించలేదు;

ఆయందఱకైనను రంగఁడేల ప్రేమించలేడు? అంతకన్న నందకత్తె యనన్యదత్త యొకయచ్చర తనకు లభించు నని వాని హృదయములో నెక్కడో వానికిఁ దెలియకుండ నొక యాశ యుండెను. ఆయాశ నిజమైన ప్రేమ పుట్టలేదని యొక మిథ్యాభావమును గల్పించి, రంగఁడు రత్నావళిని ప్రేమించలేదనిపించెను. ఆయాశ నేఁడు మటుమాయమైనది. ఆయాశ పోయినంతనే రంగనికిఁ బ్రాణము పోయినదా? రంగని మనోవ్యాపారమంతయు నశించినదా? ఏమియు నశించలేదు. ఆయాశయొక్కఁడే నశించెను. రంగని కింకొక్క వికల్పము తోఁచెను. ఆయాశ యున్నప్పుడు తదాశానుగుణమైన యొక స్త్రీని దాను బ్రేమించి నచో నాయాశతోఁ బాటుగ నా స్త్రీయు నశించియుండునా? నశించియుండవచ్చును. కాని యట్లందఱకును నశించదు. కొన్ని యున్నత ప్రకృతులకు నట్టి స్త్రీ ప్రళయము స్వప్రళయముగా భాసించును. కొందఱకా స్త్రీప్రళయము తాత్కాలికమహాదుఃఖాపాదియై యనంతర మది శాంతించును. ఈ హృదయగాఢత్వములోని తరతమభావము మనుష్యుల యున్నతత్వాధమత్వములకు సూచనయా? అట్లు తన యాదర్శభావముతో నశించువాఁ డుత్తముఁడని, దాని నతిక్రమించి బ్రతుకువాఁడధముఁడని ప్రతీక మెట్లేర్పడినది? ఆగోల తనకెందుకు? తానా? యధికుఁడుకాఁడు. ఆ యధికుఁడు కోటిమందిలో నొక్కఁడు నుండఁడు. ఆయొక్కఁ డాయాదర్శముతోఁ బాటు దాను జనిపోయి యేమి సాధించును? ఆదర్శముకొఱకుఁ జనిపోయె నన్న ప్రతిష్ఠనిలుచును. ప్రతిష్ఠయనఁగా జనోక్తి. రంగని నిఘంటువులో జనోక్తికి వెలలేదు. అది నీరసమైన వస్తువు.

ఇప్పుడు రంగఁడు రత్నావళిని బ్రేమించుచుండెను. ఈ ప్రేమ

యొక్క స్వరూపమేమి? అసలాపూర్వపుటాశ స్వరూపమేమిటి? తాను బురుషుఁడు. ఆపురుషునకుఁ గొన్ని హంగులున్నవి. అన్ని హంగులు కలస్త్రీ తనకుఁ గావలయును. ఇది ఆ యాశాస్వరూపము. ఇప్పుడు తనకాహంగులులేవు. తానువట్టి సామాన్యుఁడైన పురుషుఁడు. తనకు నిప్పుడు స్త్రీకావలయును. ఆస్త్రీ సామాన్యకావచ్చును. ఆహా! ఆశ! అదిచమత్కారముగా హృదయములోనుండియొక భ్రాంతిపిహితమయినప్పుడుదానిస్వరూపమును దెలియనీయదు. భ్రాంతి విచ్చిపోయినపుడు దాని స్వరూపము కొంతఁ దెలియవచ్చును. రంగఁడు రత్నావళిని బ్రేమించుచున్నాఁడు. రంగఁడు సంసారభారముచేత నిది పూర్వము భవిష్యత్తునఁ గనిపించిన శుక్లపక్షమిట్లుమాఱి కృష్ణపక్షము కనిపించునప్పుడు, తనయాశలువమ్మైనపుడు, తన హృదయము బేలువోయినపుడు, తనజీవికకు భవిష్యల్లాభానుగుణముగాఁ బ్రయత్నము చేయుటకువీలులేక యథాప్రాప్తముగసంతోషించవలసినప్పు, డన్యదుర్లభత్వము తెలిసినప్పుడు, మనస్సులోశరీరములో నలసత్వమేర్పడియు శరీరగతకామేచ్ఛ చావనపుడు రంగఁడు రత్నావళిని బ్రేమించుచున్నాఁడు. ఆమె యీ జీర్ణమైన సౌందర్యము వానికనులకు సౌందర్యముగానే కనిపించుచున్నది.

రంగఁడు చిత్రముగా మాఱిపోయెను. తాను రత్నావళిని బ్రేమించుచుంటి ననుటనిజమే. ఇదివఱకుఁ బ్రేమించలే దనుకొనుట యబద్ధము. సర్వపురుషుఁడు సర్వస్త్రీని బ్రేమించుచుండెను. అనఁగాఁ బురుషుఁడు స్త్రీనిఁ బ్రేమించుచుండె ననుట—ఈమూలతత్త్వమున కనేక ప్రకృతిసంధానము లేర్పడి భిన్నకాలికత్వము, భిన్నదేశత్వము, భిన్నవ్యక్తిత్వము పట్టుచున్నది.

రంగఁడు రత్నావళిని బ్రేమించుచున్నాడు. రత్నావళి రంగనిఁ

ప్రేమించుట లేదు. ఎందుకుఁ బ్రేమించుట లేదు? పూర్వము తానామెను బ్రేమించుట లేదనుకొన్నప్పుడు తన మనస్సునందున్నదొకానొక భ్రాంతివంటి భ్రాంతియామె నావేశించినది. ఆ భ్రాంతికిఁ గారణము లనేకము లుండవచ్చును. తానామెను బ్రేమించుట లేదని చెప్పుట యొకటి. తనస్నేహితులలో నెవరినో యొకరిని పెండ్లియాడు మనిచెప్పుట యొకటి. తాను గుణములచేత నుదాత్తుఁడు కాఁడని యామె యనుకొనెనేమో! అది యుఁగూడ నొకటి కావచ్చును. ఈ బహిరుపాధులను దాను దొలఁగింపఁగలఁడు. అప్పు డామెకుఁగూడఁ బ్రేమనిలుచునా? ఆహా! ఈ ప్రేమ బహిరుపాధుల నాశ్రయించి యున్నదా? తానామూలప్రేమ విషయమా యూహించుచున్నాఁడు?

అప్పుడు రంగఁడు తనయింటిలోఁ గుర్చీలోఁ బండుకొని యాలోచించుచుండెను. అతనిమనస్సొక్కసారి ప్రతిష్ఠాపురమువంకఁబోయెను; సీతారామయ్యవంకఁ బోయెను. అతఁడు కుర్చీలోనుండి బిగ్గరగా నేడ్చెను. రత్నావళి యింటిలో వంటచేయుచుండెను. ఆమె యీ యేడ్పు విని గదిలోనికిఁ బోయెను. రంగఁడు తనతల బల్లమీఁదఁబెట్టి వెక్కుచుండెను. రత్నావళి భయపడెను. ప్రతిష్ఠాపురమునుండి యేదో దుర్వార్త వచ్చెననుకొనెను. తనయత్తగారు చనిపోయిన దేమో యనుకొనెను. ఆమె రంగని యొద్దకుఁబోయి, యతనితల యెత్తి "రంగా! యెందు కేడ్చుచుంటి" వనియడిగెను. రంగఁడిట్లు చెప్పెను. "రత్నా! ప్రేమ యనునది బహిరుపాధుల నాశ్రయించి యుండును. ఇప్పటిపరిస్థితులలో నేను నిన్నుఁగాక మఱియొక్కరిని బ్రేమింపఁజాలను."

రత్నా—నామీఁద జాలిచేతనా? రంగ—కాదు, కాదు. నామీఁదనాకే జాలిచేత. నే నింకొక్కయెడఁ బ్రేమించుట కస

మర్యుడ నగుటచేత. ప్రేమయనునది శరీరముతోఁబుట్టు నొక ప్రకృతిదోష మగుటచేత. ఈ సహజదౌర్బల్యము శరీరము నాశ్రయించి గుణముగా భాసించుటచేత! రత్నా—ఏమో వేదాంతము మాటాడు చున్నావు. నాకుఁ దెలియదు. రంగ— వేదాంతముకాదు. నీవు నన్నుఁ బ్రేమించుచుంటివి. ఆ ప్రేమ నేను విడఁద్రొక్కితిని. నీవునన్నుఁ బ్రేమించుట లేదు. దానికిఁ గారణము లేమిటి? నేనునీచుడఁననినీకుఁదోఁచినదికాఁబోలు. నేను నీచుఁడనుగానిచో నీవునన్నుఁబ్రేమింతువు. నీచుడనని ప్రేమించుట లేదు రత్నా! ఇది ప్రేమస్వభావము. ఇక ప్రేమయేమిటి? రత్నా- ప్రేమయనునదివీనినన్నిటిని దాఁటియుండుననినీవుచెప్పితివిగదా? అదియేదో దివ్యమైనవస్తువంటివికదా. అదిమానుషప్రకృతికతీత మైయెందుకో, యెప్పుడో, యెక్కడో ప్రకాశించు నంటివికదా! రంగ—అదియొకభ్రాంతి. ప్రకృతి చిత్రముగా నున్నది. నాకు నాకే కన్నులు విప్పారినట్లున్నవి. దీనికంతకు నీవే కారణము. లోకదృష్టి, యథార్థదృష్టి-రెండును నీప్రపంచమునకు రెండు తుదలయందున్నవి. ఈమధ్యభాగమున నొకదృష్టియున్నది. దానినే రసదృష్టి, ప్రేమదృష్టియందురు. అదియట్లు యథార్థ దృష్టికాదు. ఇట్లు లౌకికదృష్టి కాదు. లౌకికదృష్టి కొంతవికా రముపొంది, సూక్ష్మములైన మఱికొన్ని వ్యామోహములతోఁ గలసికొని ప్రేమదృష్టియగుచున్నది. గుణరహితమైనది, గుణ సంబంధము లేనిది, తద్వ్యామోహము లేనిది వస్తువుయొక్క యథార్థస్వరూపజ్ఞానము గుణమునందుత్కర్ష కలిగించుకొని వస్తువును లౌకికముగానే చూచుచు లౌకికేతరముగాఁ జూచు చున్నాననుకొన్నది ప్రేమదృష్టి. రత్నా-నీవు మాట్లాడునది నాకేమియుఁ దెలియుట లేదు.

రంగ:_తెలియకపోయిన మానె లే. నీవునన్నుఁ బ్రేమింతువా? ప్రేమించుచుంటివా? రత్నా:-ప్రేమించుట లేదు. రంగ:_మన మీయూరు వచ్చిన మొదటిదినములలోఁ బ్రేమించుచుంటివా? రత్నా:-ప్రేమించుచుంటిని. రంగ:_ఆ ప్రేమ యిప్పు డేమై పోయినది? ఎందుచేత పోయినది? ఉండి పోయినదన్నచో నొక కారణమువలననేకదా పోవలయును? కనుక ప్రేమ కారణముల నాశ్రయించియుండును. రత్నా:_దానియంతట నది పుట్టు నన్న సిద్ధాంతము పోయినదా? రంగా! నీకుఁ బూర్వ మా సిద్ధాంతముండెను. దానితో నన్నీయూరు తెచ్చితివి. ఇప్పు డీసిద్ధాంతము పెట్టితివి. దీనితో నేయూరు తీసికొనిపోదువో! నీ విప్పు డే మనెదవు?

రంగ:_ఆ కారణములు చెప్పుము. నేను వానిని దొలఁగించెదను. నీవు నన్నుఁ బ్రేమించవచ్చును. రత్నా:_నీ సిద్ధాంతము మారి నంతనే నేను నీ యన్నభార్య నగుచున్నాను. అప్పుడు నేను నిన్నుఁ బ్రేమించను. రత్నావళి యింటిలోనికిఁ బోయెను. ఈ లోపుగాఁగూర చిమిడి మాఁడి యట్టలుకట్టెను. ఆపూటఁ వా రిరువురును గూర లేనిభోజనముచేసిరి. రత్నావళిని నాల్గురోజులు రంగారావుతో మాటాడ లేదు. పగలామె వంట చేయునప్పుడు రంగారా వామెతో మాటాడుటకుఁ బోవును. ఆమె వంటవదలి పెట్టి గదిలోనికిఁ బోవును. అతఁడు గదిలోనికిఁ బోయినచో నామె వంటయింటిలోనికిఁ బోవును. అతఁ డాఫీసునకుఁ బోయి చీఁకటిపడి వచ్చును. భోజనమునకుఁ బిలువదు. అతఁడే రెండు మూఁడు సారులు తొంగిచూచి వంటయైనదని గ్రహించి పోయి భోజనమునకుఁ గూర్చుండును. ఆమె భోజనముచేసి గదిలోనికి బోయి గడియ వేసికొని పండుకొనును. అతఁడు వాకిటిలోఁ

జాఁపవేసికొని నిద్రించును. అయిదవరోజున నీలమోహనుఁడు తనభార్యతో దిగెను. నీలమోహనునిభార్య పదునేనేండ్లబాలిక. ఆమె బక్కపలుచనిది. చామనచాయ మేను. పెద్దకన్నులు. కొంచెము కోలమొగము. పెండ్లియై యిప్పటికే మూఁడునెల లైనను నామె మొగములోఁ గ్రొత్తపెండ్లికూఁతురుతనము పోలేదు. ఆమె మాటిమాటికి సిగ్గుపడును. సిగ్గుపడినప్పు డెల్లఁ బ్రక్కవాటుగాఁ దనభర్తను జూచును. లోనికి వచ్చుచునే యామె బెదరుచు వచ్చెను. నీలమోహనుఁడు రత్నావళినిఁ జూచి 'యక్కా! నీమఱఁదలినిఁ దెచ్చితి' ననెను. రత్నావళి నిలచి నీలభార్యను జూచెను. నీలభార్య యామె కనులలోఁ గనులుంచలేదు; కళవళపడెను. కనులువంచెను. కాళ్ళు నిలువ లేదు. నీలమోహనునివంకఁ జూచెను. మఱలఁ గనులు వాల్చెను. రత్నావళివంకఁ జూచెను. రత్నావళి 'నీ పేరేమిటే పిల్లా!' యనెను. ఆమె బదులు చెప్పలేదు. నీల నవ్వి 'పేరు చెప్ప రాదా' యనెను. ఇంతలో రంగఁడు వచ్చి 'నీవు చెప్పరాదా? నేఁడు క్రొత్తగాఁ జెప్పుటయా' యనెను. రత్నావళి నీల మోహనుని గడపవెనుకకుఁ బొమ్మనెను. అతఁడు పోయెను. అతని భార్యను దాను జేయిపుచ్చుకొని గడప వెనుకకు దీసికొనిపోయి నీలమోహనుని ప్రక్క నిలుచుండఁబెట్టెను. 'ఇప్పుడు మీరిద్దరు పేరులు చెప్పి లోనికిరావలయు'ననెను. నీల మోహనుఁడు 'అక్కా! నీయాజ్ఞయైనది. ఇదిగో చెప్పుచున్నాను; రాజహంసా, నేనును వచ్చితిమి తలుపుదీయుము' అనెను. రాజ హంసయును 'నీలమోహనుఁడూ, నేనును వచ్చితిమి దలుపుఁ దీయు'మనెను. అన్నంతలో సిగ్గువచ్చి నీలమోహనుని వీఁపు మీఁదఁ దలపెట్టి నక్కెను. రంగఁడును, రత్నావళియు నవ్విరి.

రత్నావళి యెత్తుగిన్నె తెచ్చి దృష్టితీసెను. వెంటనే రత్నావళి రాజహంసచేయి పట్టుకొనెను. రాజహంస కెక్కడలేని చనవు వచ్చెను. రత్నావళి 'పిల్లా! నే నెవరినే' యనెను. రాజహంస 'వదినె! నీకు నే నెవ్వర' ననెను. రత్నావళి రాజహంస బుగ్గ కందునట్లు గిల్లెను. రాజహంస 'యబ్బా!' యనెను. నీలమోహనుఁడు తిరిగిచూచెను రత్నావళి 'యాఁడుబిడ్డ సగము మగఁ' డనెను. అందఱును భోజనముచేసిరి. రత్నావళియు, రంగఁడును క్రమముగా మాటలాడుట యారంభించిరి. రాజహంసానీలల ప్రత్యక్షములో వారి కడచిన తూష్ణీంభావము పనిచేయలేదు. అది చెదరిపోయెను. నలుగురును గలసి మాటాడుకొందురు. నలుగురును గలసి చీట్లపేక యాడుదురు. కలసి సినీమాలకుఁ బోదురు. వారు నాల్గురోజులుండిరి. రంగఁ డాఫీసునకుఁబోవును. వారు మువ్వురునుగలసి యూరివెంటఁ జూచుటకుఁ బోదురు. మూఁడవరోజున నీలమోహనుఁడును, భార్యయు నిద్దఱే అడ యూరు చూచుటకుఁ బోయిరి దారిలో రాజహంస నీలమోహనునితో రత్నావళి మంచితనమునుగూర్చి చెప్పుచు నిట్లనెను. 'వారెంత శుభ్రముగా నుందురో చూచితివా? వారినిఁ జూచి నచోఁ గమ్మవా రనిపించదు.' నీల—వారు కమ్మవారుకారు. రాజ–మఱియెవరు? నీల–బ్రాహ్మణులు. రాజ—మనతోఁ గలిసి భోజనముచేయుదురే! రంగారావుగారుకూడ బ్రాహ్మణులేనా? ఆయన చిన్నవాఁడును, ఆవిడ పెద్దదియుఁగాఁ గనఁబడెదరుగదా! మగఁడు చిన్నవాఁడు, భార్య పెద్దది యేమిటి? నీల–వా రిద్దఱును భార్యాభర్తలుకారు. ఆమె రంగని యన్నగారి భార్య; ఆయన ముసలివాఁ డగుటచేత నామె భర్తను వదలిపెట్టి వచ్చెను. రాజ–మఱదితో లేచివచ్చినదా? నీల–ఇంచుమించుగా

నంతే. రాజ—నన్నీకొంపకుఁ దెచ్చితివేమి? నే నీయింటిలో నుండను. నేను వీరెవరో మనవాండ్రనుకొంటిని. భార్యాభర్తలనుకొంటిని. మనము వీరియింటికి వచ్చితిమని మాయమ్మకుఁ దెలిసినచో నన్ను బ్రతుకనిచ్చునా? నీల–ఇంత ముందువఱకు రత్నావళి మంచిదంటివికదా! రాజ–వారిమంచితనము మన కెందుకు? మనము పోదము. నీల–తొందరపడకు; రేపుపోదము. హఠాత్తుగాఁ బోయినచో వారేమైన ననుకొందురు. రాజ—వా రేమనుకొందురు? అనుకొన్నచో మన కేమి? ఆరాత్రి రాజహంస రత్నావళితో సరిగామాటాడలేదు. రత్నావళియామెకు సుస్త్రీచేసిన దేమో యని చాల నుపచారములు చేసెను. నీలమోహనుఁడు మఱునాఁడు వెళ్ళిపోయెద ననెను. మఱునాఁడు ప్రొద్దున రత్నావళి రాజహంసను దలంటిపోసికొమ్మనెను. రాజహంస యంగీకరించలేదు. చాలసేపటికి రత్నావళికనుమానము తోచెను. రత్నా—ఏమమ్మా! నేను కులస్త్రీని కానని యా నామీఁదనీకీకోపము? నన్నీమాత్రముక్షమింపరాదా? నీవుమఱల మాయింటికి రానక్కఱలేదు. ఈసారికెట్లో వచ్చితివి. ఏకటైనను నిప్పున్న నాకట్టెయే హరించును. ఈపాపము నిన్నంటుకోదులే. రాజహంస యీమాటలతోఁ జల్లపడెను. తానును మనసు నొచ్చుకొనెను. తలంటిపోసికొనెను. రత్నావళి పిండివంట చేసి భోజనము పెట్టెను. రంగనిచేతఁ గ్రొత్తబట్టలు తెప్పించి భార్యాభర్తలకుఁ కట్టఁబెట్టించెను. ఆనాఁడురాత్రి రత్నావళియు, రంగడును వారిని రైలుస్టేషనునకుఁబోయి సాఁగనంపిరి. ఆవేళ రత్నావళి రాజహంసతో 'అమ్మాయీ! నేను చెడిపోయితిని. నన్ను నీలమోహనుఁడు క్షమించెను. నీవతని భార్యవుకదా! నీవుకూడ క్షమింపరాదా?' యనెను.

రాజ:-ఇందు నీతప్పేమియున్నది? నీభర్తముసలివాఁడు గనుక వదలిపెట్టితివి. రంగారావుగారితో నీవుసుఖముగానుండుము. ఆయనతో మాత్రము నీవుకలసియున్నచో సంసారిణిని కాఁగూడదా? రాజహంస యీమాటలని తాను మనసులోఁ గష్టపడెను. అయినను నామె నోదార్చుట కట్లనక తప్పలేదు.

రంగఁడును, రత్నావళియు నింటికివచ్చిరి. రత్నావళి గదిలోఁ బండుకొనెను. రంగఁడు సావడిలోఁ జాపమీఁదఁ బండుకొనెను. రంగఁడు నిద్రపోయెను. రత్నావళికి నిదురపట్టలేదు. ఆమె యాలోచింప నారంభించెను. కులస్త్రీకిఁ దా నన్నచో నెంత యనిష్టము కలుగును? కాని రాజహంస ముసలిభర్తను వదలి పెట్టుట తప్పుకాదనెను. ఏమో! ఆభర్త ముసలివాఁడని యెట్లు చెప్పవచ్చును? తనకన్న నేండ్లు మీఁటినవాఁడు. అంతలో ముసలితనము వచ్చెనా? ఇప్పటికైనను రంగనితో సంసారిణినిగా వచ్చునా? ఎట్లుకా నగును? కాక యేమిచేయవలయును? అతని స్నేహితులు ముగ్గురు వచ్చిరి. అందొకఁడు తనకుఁ దమ్ముఁ డయ్యెను. తక్కిన యిద్దఱును మనుష్యులాదురో! కారో! వారితోఁబోల్చిచూచినచో రంగఁడే యుత్తముఁడు. ఇదివఱకు దాను రంగనిఁ బ్రేమించెను. ప్రేమించుట యనఁగానేమి? తానతనియందుఁ గామోద్రేకము పొందెను. ఈకామోద్రేకము నకుఁ బ్రేమ యను క్రొత్తపేరుపెట్టిరి. తానును, రంగడును నేకగృహవాసము చేయుచుండిరి. తానతనితో సంసారము చేయకున్నను, చేయుచున్నట్లే లోకులు భావించుచుండిరి. తనకు రంగనియం దీవైముఖ్యమెందులకు? తాను మఱల సీతారామయ్యకు భార్యయగుటలేదు. రంగని వదలి మఱియొక్కనిఁ జేసికొన్నను, వాఁడెటువంటి వాఁడగునో? ఒకవేళ రంగఁడు తన

బ్రతుకు దన్ను బ్రతుకుమని చదువుకొనుటకు వెడలిపోయినచోఁ దానేమి కావలయును? తా నిట్లు రంగని నిరాదరించియున్నచో రంగఁడు పోకతప్పఁడు. అప్పుడు తన బ్రతుకు మఱింత నికృష్ట మగును. ఓహో! ప్రేమదేవతా! ధనము, కులము, మర్యాద, గౌరవము, తెలివితేటలు మొదలైనవి సృష్టిలో భేదములు కల్పించి, మనుష్యలోకమునకుఁ దెచ్చు కష్టములతో బాటు నీవును గొన్ని కష్టములు తెచ్చుచున్నావు. నీవు దివ్యురాలవందురు. అయినచోఁ దెలివితేటలేల దివ్యములుకావు? తక్కినవేల కావు? ఈసృష్టిలో భేదముకల్పించి యొకనికిఁ బ్రాప్తించి, యొకనికిఁ బ్రాప్తింపక మనుష్యుల సుఖదుఃఖములకు హేతువులగుచున్న మీరందఱు నక్కఱ సెల్లెండ్రు. ఒకనికి వాఁడు కోరినకోర్కె సిద్ధించును. వాఁడుదాని నదృష్టమనును. ఒకనికిఁదానుగోరిన స్త్రీ దొరకును. వాఁడుదానిని బ్రేమయనును ఒకానొకఁ డొకానొక స్త్రీ కొఱకు రాజ్యము పరిత్యజించును. మఱియొకఁడు తానుగోరిన స్త్రీనైనను బరిత్యజించి రాజ్యమునే వాంఛించును. మొదటివానిది ప్రేమ యందురు. రెండవవాఁ డాదేశమును బాగుచేసి సరిగాఁ బాలించినచో, నాదేశశత్రువుల నిర్మూలించినచో వాఁడు మహావీరుఁ డందురు. దేశభక్తుఁ డందురు. ఈదేశభక్తి యాప్రేమ కేమి తక్కువ? ఆప్రేమ దివ్యమై, యీ దేశభక్తి దివ్యము కాకపోయెనదా? ఆ ప్రేమ శరీరసుఖముతోఁ గూడినది. ఈదేశభక్తి యధికారవాంఛతోఁ గూడినది; ధనతృష్ణతోఁ గూడినది. ఈమనుష్యజాతి తన మనోభావములకు పెద్దపెద్దపేర్లుపెట్టి భావములను దివ్యములుగా భాసింపఁజేసి యనర్థచయంబులందు దుశ్శీలతనర్థ కల్పనముచేసెను. రంగనివంటి బాలబుద్ధులు సృష్టి యేమో తెలియక వారిసిద్ధాంతములతో భూమిని కుద్దాలించుచున్నారు.

నాకీ సిద్ధాంతము లెందుకు? నేను మఱలఁ బ్రతిష్ఠాపురమునకుఁ బోవు యోగ్యత నాకు లేదు. నేను బడిన కష్టములవలన నాకుఁ గలిగిన యూహాలు సిద్ధాంతములు చేసి లోకము నాచరింపుమని నేనెక్కడ బలవంత పెట్టను? పదిమంది స్నేహితులున్న వారాపని చేయవచ్చును. నే నుభయభ్రష్టనుగాకుండఁ జూచుకొనవలయును. రంగఁడు, నేను నెట్లో కాఁపురముచేయక తప్పదు. ఈ జన్మ కింతియేయని సరిపెట్టుకొనక తప్పదు. ఈ సరిపెట్టుకొనుట ప్రతిష్ఠాపురములోఁ జేయలేక పోయితిని. అప్పటికి నాకుఁ బ్రపంచము తెలియదు. తెలిసెడు వేళకుఁ దెలిసి ప్రయోజనము లేదు. ప్రతివారును దెలిసి యాచరించుట యెట్లు? అందఱకు నొక్కఁడే యనుభవ మెట్లువచ్చును? అనుభవముదాని కిష్టమువచ్చినకాలమున, నిష్టమువచ్చినచోట, నిష్టమువచ్చిన వ్యక్తికిఁ గలుగును. లోకములోజనులెక్కువమందిమూఢులుఆవేశముకొలఁదిపరుల యనుభవము తమదిగా స్వీకరింతురు. ఆవేశములేకుండఁ బూర్వుల యనుభవము సాంప్రదాయమనుపేరస్వీకరించుటతప్పును, దోడివాని యనుభవము నావేశములోఁ గ్రొత్తయని స్వీకరించుటయొప్పును నగునో! ఈ సంప్రదాయమునకును, సంస్కారమునకు నేమిభేదము? సంప్రదాయము పూర్వులైన వారు కొందఱేర్పఱచినది. సంస్కారము క్రొత్తవారు కొందఱు చేసినది. అదికొందఱకు నచ్చును, ఇది కొందరకు నచ్చును. ఈభేదము లన్నియుఁ గొందఱు వ్యక్తుల సుఖదుఃఖములకు హేతువు లగుటగాక మఱియొక్కఁ డేమియు లేదు. సంస్కారము వలనఁ గ్రొత్తలోఁ గొంత సుఖము కనిపించవచ్చును. సంస్కారములో సంప్రదాయములో నున్న భద్రత లేదు. నా కేమియుఁ దెలియుటలేదు. నే నీనాఁటినుండి భగవంతునిచేతిలో బిడ్డను. వాని

యిష్టము వచ్చినట్లు నడచెదను. రంగారావు తలుపు త్రోసెను. రత్నావళి లోపలగడియ వేయలేదు. తలుపువచ్చెను. రంగఁడు దీపమును బెద్దచేసి యేదోపుస్తకము కొనము వెదకుచుండెను. రత్నావళి యతనివంకఁజూచెను. రత్నా:-రంగా! ఏమిటి వెదకుచుంటివి ? రంగ:-నాకు గంటసేపైనది మెలఁకువ వచ్చి. నిద్ర పట్టలేదు. ఏదైనను పుస్తకము చదువుదమనివచ్చితిని. రత్నా:-ఈపాటికి నీల యెంతదూరము పోవును ? రంగ:-నెల్లూరు దాఁటియుందురు. రత్నా:-నాకును నిద్రపట్టలేదు. ఒకటే యాలోచన. నీవు నన్నుఁ బ్రేమించుచుంటివి. నాకుఁ బ్రేమ యనునది లేదు. ప్రేమ నాగుండెలోనుండి పోయినది. కాని కామేచ్ఛ లేదని కాదు. కామేచ్ఛకే మీరు రంగులువేసి ప్రేమయని చెప్పుచున్నారు. రంగ:-నిజమే కావచ్చును. ఆ సంగతిపోనిమ్ము. రత్నా:-నీవు నన్నింకను బ్రేమించుచుంటివా? రంగ:-నేను బ్రేమించుచుంటినని చెప్పలేను. కామించుచుంటిని. నీవును గామించినచో మంచిది. మన కీ సంబంధము తప్పదు. ఇంకొకమార్గము వెదకుటయు దుష్టము, దుర్లభము. రత్నా:-నేనును నట్లే యనుకొనుచున్నాను. నే నిప్పుడు నిన్నుఁ బ్రేమించుచున్నాను. ఈ పేమించుచున్నా నన్నమాటలో లేనిపోని బడాయియర్థము లేదు. దాని కెంత యర్థముండునో యంతియే యర్థము. రంగఁడుగడియారమువంక జూచెను. సరిగా పండ్రెండు గంట లయ్యెను.

---

## పదునొకండవ అధ్యాయము

---

"పడుచూదనమును చూచీ-పగలాబడబోకే,
పొంగిపోకే, మనసా, పొంగిపోకే-
ఓ పాడుమనసా

నీ వుబలాటపడియేవు,
పాపము పుణ్యము పాలించబోయేవు,
పొంగిపోకే - పగలాబడిపోకే -
తోడలోతూ బురదాలో
పడి కూరుకొనిపోయీ
అడుగూ పెగలబోక
మిడుకరించేవే - పొంగిపోకే"

అని వాకిట బిచ్చగాఁడు పాడుచుండెను. రత్నావళి వంటచేయుచుండెను. రంగఁడు గదిలోఁ గూర్చుండి చదువుచుండెను. రత్నావళికిఁ బాట వినిపించెను. వానిగొంతు బాగుండెను. మాటలు సరిగా వినిపించలేదు. ఆమె "చేయి తీరుబడిలేదు. పో, అబ్బీ!" యని కేకవేసెను. రంగఁ డాపాట వినెను. మొదట నశ్రద్ధ వహించి 'పో అబ్బీ! పో' మ్మనెను. ఆ యబ్బి పోలేదు. వాకిటనుండి మఱల పాట వినిపించెను.

"మనసు గుఱ్ఱము రోరి మనిసీ
మనసు కళ్ళెము లాగు మనిసీ
కళ్లెమ్ము వదలితే కంచెలోఁ బడఁద్రోయు
కనులు తేలేస్తావు జనుఁడా! ఆపైన
కార్య మేమున్నదిర జనుఁడా!"

రంగారావాలకించెను. పుస్తకముమూసి వాకిటిలోనికి వచ్చెను. నాఁటిబైరాగి ప్రత్యక్షమయ్యెను. అతఁడు మఱల పాడఁజొచ్చెను.

"మాయ అంటే యేమిటీ! ఓ జీవుఁడా! వెను
మాయ అంటే యేమిటీ!
మాయ అంటే మనసులోఁ బెను
మంటరేపుక ధర్మవనమూ
కాయలూ కాపించకుండా
కాల్చివేనూకొనటమే... మాయ అంటే॥
మనసె మాయా, మాయె మనసూ,
మనసుమాయలు రెండు కలసీ

మనిసి పాపపుగోతిలోపల
గునిసి పూడిచి పెడతవే. మాయ అంటే॥

రంగఁడు బైరాగివంక నివ్వెఱపోయి చూచుచుండెను. అతని నోటివెంట మాటరాలేదు. వాకిటిలో బిచ్చగాఁడింకను బాడుచుండుటచేత రత్నావళి వంటయిల్లు వదలివచ్చెను. రంగఁడు నిలుచుండి చూచుచుండెను. రంగఁడు నిలుచున్న వైఖరిలో రత్నావళి కేదో వింత గోచరించెను. ఆమె వచ్చి రంగని ప్రక్క నిలుచుండెను. రంగడు బైరాగివంకనే జూచుచుండెను. బైరాగి యింకొకపాట మొదలుపెట్టెను.

"ఏన్నాళ్లీ సుఖమూ! జనుఁడా! - ఎన్నాళ్లీ సుఖమూ!
కన్నులకూ పొరలు కప్పి - కాయమ్మూ ముడుతలుపడి
మన్నూ మన్నూనా కలసి - మంటలోపడిపోయే వకటూ. ఎన్నా॥
కన్నూ కనిపించినపుడె - కాయము కదిలాడినపుడె
వెన్నూని తలవంగఁబోక - వెఱ్ఱితలఁపు లేల సేయ. ఏన్నా॥
ఉండిఉండి బడుగుమేను - ఉండకయే పోవు తేవు
గండిపడును, తూటుపడును - కాయము మాయలాబొంత. ఎన్నా॥
క్షయవ్యాధి పుట్టవచ్చు - జ్వరికఫములు కలుగవచ్చు
కాలుసేయి పడవచ్చును - కనులు గుడ్డి కావచ్చును. ఎన్నా॥

రంగఁడు:_బైరాగీ! నీ వీయూ రెప్పుడు వచ్చావు? బైరా:_ బాబూ! ఒక నెల్లాళ్ళయింది. రంగ:_ఈ ఊళ్ళో తెలుఁగు బిచ్చగాళ్ళెక్కువ ఉండరు. బైరాగు లసలేరారు.

బైరా:_మా కొక ఊరేమిటి బాబూ! ఎక్కడికి పడితే అక్కడికే పోతాము. రంగ:_నీవు నన్నెఱుఁగుదువా? బైరా:_ ఎఱుఁగను. చూచిన జ్ఞాపకం లేదు. రంగ:_ప్రతిష్ఠాపురంలో సముద్రం దగ్గఱ ఒక రోజున నువ్వు పాడుతోంటే నే నక్కడ ఉన్నాను. నిన్ను పాడమన్నానుకూడా. బైరా:_జ్ఞాపకం లేదు బాబూ! ఏమో! మే మనేకచోట్ల తిరుగుతాం. కాదు కామ,

అవు నవును. జ్ఞాపకం వచ్చింది బాబూ! నువ్వు చాలా మారి పోయావు. రంగ—మారాను, మారటంలేదు. రత్నా— రంగా! నీకు పాటలంటే చాలా ఇష్టం. రంగ—నాకు ఇష్టం లేదు. కాని యీ బైరాగి పాడుతోంటే వినక తప్పకవచ్చింది. అతని పాటలూ నాకిష్టం కావు. రత్నా-ఎందుకు ఇష్టం లేదు. అట్లా నిల్చొని వింటోంటే? రంగ—కుష్ఠువాడు అద్దంలో చూచుకుంటాడు చూచుకోటం ఇష్టమే; కాని ఆచూచు కోటం యిష్టమూ లేదు. రత్నావళి బైరాగికి బిచ్చము పెట్టెను. వాడు వెళ్ళిపోయెను. ఆనాడు రాత్రి రత్నావళి పండుకొని మంగళహారతి యొకటి పాడెను. రత్నావళి పాడఁగా రంగఁ డెప్పుడును వినలేదు. రత్నావళికిఁ బాటలు వచ్చుననియే యతనికిఁ దెలియదు. అంత మంచిగొంతు రత్నావళి కున్నదని యెట్లు తెలియును? రంగ—నీవు పాడఁగలుగుదు వని నాకుఁ దెలియనే తెలియదు. ఎన్నఁడును పాడలే దేమి? మన మీయూరు వచ్చిన క్రొత్తలోనైనను పాడలేదు. తరువాత నన్నచో నేవో కష్ట ములు వచ్చినవి. ఆ మొదటిదినములలో సుఖముగానే యుంటిమికదా! రత్నా:-నాకు పాట చేతఁగాదు. చిన్నప్పుడు నేర్చుకొన్న పాటలుపాడఁగలను. మీయింటికిఁ గాఁపురమునకు వచ్చిన తరువాత పాడవలసిన యవసరమే కలుగలేదు. రంగ:- నేడు పాడవలసినయవసర మేమి కలిగినది? రత్నా.—ఏదో కలిగినది. నీ కెందుకు? రంగ:-చెప్పరాదా? రత్నా:-నాకే యిష్టములేదు. రంగ:-వినవలె నని నాకు మిక్కిలి కోరికగా నున్నది. రత్నా:-రంగా! మనుష్యజీవితము విచిత్రమైనది. మనుష్యజీవిత మేమిటి? జీవితమే విచిత్రమైనది. గాడిద బ్రతుకు చున్నది. నీచజంతువు లెన్నియో బ్రతుకుచున్నవి. వానిని

మనుష్యులు నీచముగాఁ జూతురు. కాని యవిమాత్రము సుఖ పడవా? నీచజంతువుల సుఖము సుఖము కాదందువా?రంగ:- అదియు సుఖమే. కాని నీచసుఖము. రత్నా:-సుఖములో నీచము,నధికము నని లేదు. సుఖము ననుభవించుటలోఁ దక్కువ యనుభవించుట, యెక్కువయనుభవించుట యుండవచ్చును. రంగ:-అయినచో నొకప్పుడు నీచప్రాణి యెక్కువసుఖ మనుభవించి, యుత్తమప్రాణి తక్కువసుఖ మనుభవింపవచ్చును. రత్నా:-అది నే నొప్పుకొనను. నీచప్రాణి యెక్కువసుఖ మనుభవించలేదు. ఉత్తమప్రాణి యనుభవించు సుఖములలోఁ దారతమ్యము లుండవచ్చును.

రంగ—ఇప్పుడు నీ వనుభవించిన సుఖమెట్టిది? రత్నా—ఒక జంతుసుఖము. ఇనాళ్లకు నే నేదో యొకమోస్తరు భార్యను. రంగ—రత్నా! నీవు నన్నుఁ బ్రేమించుచున్నంతగా నేను నిన్ను బ్రేమించుటలేదు. రత్నా:-నేను నిన్నుఁ బ్రేమించుటయే లేదు. నేను నీతోఁగాఁపురము చేయుచుంటిని. రంగ—ప్రేమించుట యనఁగా నీయుద్దేశ మేమి? రత్నా—భ్రష్టులమధ్య ప్రేమ యుండదు. అదివట్టియిచ్ఛ. రంగ:-మఱి ప్రేమయనఁగానేమి? రత్నా—ఈయిచ్ఛ ధర్మబుద్ధితోఁగలసి స్త్రీ పురుషుల సంసార మునకు హేతువైనప్పుడు దానిని బ్రేమ యనవచ్చునేమో! రంగ—నీ నిర్వచనము నాకర్థము కాలేదు. రత్నా—నేను నీ కర్థమగునట్లు చెప్పలేకున్నాను. నాకుఁ గొన్నిభావములు పుట్టుచున్నవి. వానిని జక్కఁగా నిర్ణయించుకొనుటకు నాబుద్ధి చాలకున్నది. నేనుచదువుకొని వానిని నిర్ణయించుకొనవల యును. శాస్త్రి మఱల రాలేదేమి?

రంగ—నీ వతనియొద్ద చదువుకొందువా? రత్నా—అత

దును మీా సమాజములోనివాఁడే. అతఁడు మనుచరిత్రమునే సరిగా పాఠము చెప్పలేకపోయెను. రంగ– నీవేచదివితివికదా! రత్నా– నాకు వట్టి యర్థము మాత్రమే తెలిసినది. నాకనేకసందేహము లున్నవి. అవి తీర్చెడివాఁడు కావలయును. రంగ–ముకుందరావను నింకొక కవి కలఁడు: ఆయనకును, శాస్త్రికినిపడదు. అతనితోనాకుఁ బరిచయమేకాని స్నేహము లేదు. అతఁడుపండితుఁడనికూడఁ జెప్పుదురు. నాకతనికవిత్వము రుచించదు. రత్నా–ఆయనను బిలిపింతువా? ఆయన చదువుచెప్పఁగలఁడేమోచూచెదను. రంగ– నీకోసమని తప్పక వ్రాసెదను. అతఁడు వచ్చునో రాఁడో! నాయంతట నేనైనచో వ్రాయను. కాని యతఁడు మంచివాఁడుకాఁడని వాడుక. రత్నా–మంచివాఁడు కాఁడనఁగా? రంగ– కాఁడనగా నేమున్నది? రత్నా– ఆ లెక్కను మన సమాజమంతయు మంచిదికాదు. రంగ– అయినచో తేపుత్తరము వ్రాసెదను. అతనికి రాను పోను రైలుఛార్జీకూడఁ బంపవలయును. రత్నా–రమణిల నాకు గాజు లెప్పుడు చేయించెదవు? రంగ– అంతకును గలిపి బ్యాంకులో నుండి డబ్బు తెచ్చి తీసికొందును. రత్నా–ఆ బైరాగిపాట నీకెందు కిష్టమైనది? రంగఁడు "మనసు గుఱ్ఱము రోరి మనిసీ, మనసు కళ్ళెములాగు మనిసీ!" అని పాడనారంభించెను. రత్నావళి పలుకరించలేదు. కొంతసేపటికి రత్నావళికి నిదురపట్టెను. రంగఁడును సోలిపోయి నిదురించెను. రత్నావళికిఁ దరువాత వారము దినములకుఁ బ్రొద్దుటిపూఁటఁ జేతులకు గాజులు వచ్చెను. సాయంకాలమున ముకుందరావు వచ్చెను. ముకుందరావు పొడుగైన మనిషి, ఎఱ్ఱనివాఁడు, కనులు విశాలములైనవి, కొంచెము బొద్దుగానుండును, బలిష్ఠుఁడు, సూక్ష్మచిత్ర

వస్త్రము ధరించియుండెను. క్రాపింగుతల. కళ్ళద్దాలు, ఎడమచేతికి బంగారు మణికట్టు గడియారము, ఎడమచేతివ్రేళ్ళకు రెండుంగరములు, జరీ యుత్తరీయము, కాళ్ళకు ముఖమల్ చెప్పులు, మనిసిని జూచినంతనే యందగాఁ డనిపించును. సామాన్యముగా బురుషులుగాని, స్త్రీలుగాని వానినుండి చూపుమరలించుకొనలేరు. అతనికి ముప్పదియైదేం డ్లుండును. అతఁడు తనపెట్టె సరాసరి వచ్చి గదిలోఁ బెట్టెను. అప్పుడు రంగఁ డింటిలోననేయుండెను. "ఏమండీ! రంగారావుగారూ! వచ్చితిని. మిమ్ముగుఱించి హరికిశోరరావు నాతోఁ జెప్పినాఁడు. మీ యుత్తర మందినది. మీయన్నభార్య – కాదు, మీభార్య – చదువుకొనునా?" రంగఁడు రత్నావళివంకఁ జూచెను. రత్నావళికి దానియర్థము తెలిసెను. ముకుందరావు పరులకుఁ గష్టము కలిగించునట్లు మాటాడును. ఎదుటివారిని లెక్కచేయఁడు.

ముకుంద:– నే నొక నెలనాళ్లు మాత్రమే యుండఁ గలను. ఈ లోపుగా నామెకు సొంతముగాఁ జదువుకొను మార్గము లన్నియు నేర్పెదను. రెండుమూఁడేం డ్లుండి చదువు చెప్పుట కష్టముకదా! ఈ నెలనాళ్ళు నేనిచ్చట నున్నందుకు మీరేమి యిత్తురు? రంగఁడుమఱల రత్నావళివంకఁజూచెను రత్నావళి ముకుందరావువంకఁ జూచెను. ముకుందరావు రత్నావళివంకఁ జూచెను. ఆ చూపు చుఱుక్కుమని మర్మఘాతినిగా నుండెను. సామాన్యముగా మనుష్యులు మనుష్యులవంకఁజూతురు. స్త్రీపురుషు లొకరివంక నొకరు చూచుకొనవచ్చును. ఆయొక్క చూపులో ముకుందరావు రత్నావళిని నేల నిలువనీయలేదు. రత్నావళి కళవళపడెను. క్రొత్తబెడఁద తెచ్చి పెట్టుకొంటినే యనుకొనెను. ఆ కన్నులు చూడలేక రత్నావళి తనచూపు

వాల్చుకొనెను. ఆమె తలవంచుకొని "మీరు నెల కింత యిమ్మనినచో నిత్తు" మనెను. ముకుందరావు పకాలున నవ్వెను. "నా కేమియు నీయవద్దులే. నేను నవ్వుచు నంటిని. పాపము : మీరును నిబ్బంది పడుచున్నారని హరికిశోరరావు చెప్పెను. నా దారిద్ర్యము నిత్యము నాతోడనే యుండును. నేను ధరించిన యీదుస్తు లన్నియు నావికావు. ఈ గడియార మొక స్నేహితునియొద్ద కాఁజేసితిని. ఈయుంగరములు నట్టివే. నాకాఁకలియగుచున్నది. వంటయైనదా! లేవయ్యా, రంగారావు! స్నానము సేయుము" అని తాను స్నానమునకు బయలుదేఱెను. రత్నావళి ముకుందరావునడవడి చూచి 'ఇది యేదో యొక యందమైన యుప్పెనగాలి వచ్చె' ననుకొనెను. ఆమెమనసు చిత్రముగా నుండెను. ముకుందరావు నాకారము, వానిశరీరముస్పృహణీయములుగానుండెను. అతఁడుచూచినచూపులువిషదిగ్ధబాణములవలె నుండెను. ఆచూపులలోమార్దవము లేదు.ఆచూపులుకఠోరములై వానికాంతులునిండియొక పట్టరాని కామము వెల్లివిరియుచుండెను.ఆతఁడేచూపు చూచినను దాని వెనుకనుండి యొకగాఢతరమైన కామవాంఛయే కనిపించుచుండెను. ఆకన్నులయెదుట నిలుచుండుట యెట్లు? ఆకన్నుల వంకఁ జూచుట యెట్లు? అతఁడు భోజనముచేసి లేచువఱకు రత్నావళి తహతహలాడిపోయెను. అతఁడు తనకు దగ్గఱగాఁ బోయినచో, నతఁడు తనకు విసిపించవలయు నని మాటాడినచో నామెమనస్సు కొట్టుకొనెను. అతని సర్వవ్యాపారములయందు నింతటి బలాత్కార మేమి?అతఁడు తన కిష్టములేకుండా లాఁగదీయునట్లు కనిపించెను. రత్నావళిహృదయ మతనియం దేలకో ప్రసన్నముకాలేదు.ప్రసన్నతయనునది క్రమపరిణామము పొందు

నొక మృదుభావము. హఠాత్ప్రవాహతాడితమైన యొకగట్టు విరిసి పడిపోవునుగాని నీర మింకించుకొని తడిసిబిగిసి ప్రవాహము రాచుకొని నిలిచిన గట్టువలెనిలువలేదు. రత్నావళి భోజనము చేసి, లోనఁ దలుపుగడవేసికొని పండుకొనెను. ముకుందరావు రంగనితో బిగ్గరగా మాటాడుచుండెను. తన కవిత్వమును గూర్చి, పాండిత్యమునుగూర్చి ప్రగల్భముగాఁ జెప్పుచుండెను. ఇతరకవులకుఁ జదువే రాదనుచుండెను. తన ననేకస్థలములగౌర వించిరని చెప్పుచుండెను. రత్నావళిచేతి క్రొత్తగాజులు ప్రాంత గాజులతోఁగలసి గలగలలాడెను. రత్నావళి కాగాజులు ప్రోఁ గుట యిష్టముగా నేయుండెను. కానియామోఁత బయటికి విని పించునని, వినిపించ కుండఁ జేయవలయు నని యుండెను.

ముకుందరావు తెల్లవాఱుకడ మేల్కని కృష్ణకర్ణామృత శ్లోకములు చదివెను. అతని కంఠముకూడ మంచిదే. శీతలప్ర శాంతవాయుపథములపై నది చల్లగాఁ బారాడెను. భోజనము చేసి రంగారావు ఆఫీసునకుఁ బోయెను. ముకుందరావు రత్నావళిని బుస్తకము పుచ్చుకొనిరమ్మనెను. ఆమె వచ్చెను. అతఁడు "వరణాద్వీపవతీతటాంచలమునన్ వప్రస్థలీ" దగ్గఱ మొదలుపెట్టెను. "నీ వెంతచుఱుకుగా గ్రహించెదవో యంత తొందరగాఁ జదువు వచ్చును. చెప్పిన యే మాటయు మఱచి పోరాదు. నాలుగైదు దినములు నీవు గ్రహించు నేర్పుచూచె దను. సరిగా గ్రహించలేనిచో వెడలిపోయెదను. వరణా— స్త్రీలింగము. నదులపేరు లన్నియు స్త్రీలింగములే. సంస్కృత ములో స్త్రీలింగము లెక్కువగా దీర్ఘాంతములై యుండును. ఆ, ఈ, ఊ, ఇ,— ఈ యైదక్షరములు స్త్రీ లింగముల చివర నుండును. రమా, సీతా, జానకీ, మతి, ధేనువు — ఇట్టివి.

సాయంకాలమున శబ్దమంజరి తెచ్చి వీనిని నీకుగుఱుతులు చూపించెదను. ద్వీపవతీ —ఇదికూడ స్త్రీలింగము. 'జానకీ' వంటిది. ద్వీపము అనఁగా లంక. ద్వీపము కలది ద్వీపవతి. ఇది మతుప్పు ప్రత్యయము. ఈప్రత్యయములో మత్ మాత్రమే మిగులును. ద్వీప × మత్ అని యుండఁగా అకారము తరువాత వచ్చిన మకారము వకారమగును. అందుచేత ద్వీపవత్ అయినది. పుంలింగమైనచో 'ద్వీపవాన్' అగును. స్త్రీలింగము 'ద్వీపవతీ' యగును. ఈ మతుప్ప్రత్యయము ఇకార, ఉకారములపైని వచ్చినచో మకారము మకారముగానే యుండును. బుద్ధిమాన్ బుద్ధిమతీ; ధేనుమాన్ ధేనుమతీ; శీలవాన్ శీలవతీ — ఇట్లు తెలిసికొనవలయును. సమాసములోనున్నచో స్త్రీప్రత్యయము లోపించదు. దీనిని విడిగాఁ దెలుఁగులో వాడినచో ద్వీపవతి యని మాత్రమే యుండును. పుంలింగము తెలుఁగులో వంతుఁడు, మంతుఁడు అని యగును. ద్వీపమున్న శబ్దము చమత్కారమైనది. ఆపః అనఁగా నీరు. ద్వి × ఆపః—ద్వీపః అగును. ందులో అకారమున్నదని గుర్తుపెట్టుకొనవలయును. ఇట్లు పద్యమంతయు నగువఱకు గంటసేపు పట్టెను. చెప్పినవిషయములే మఱల మఱలఁ జెప్పి రత్నావళి యేసంగతియు మఱచిపోకుండఁజేసెను. ఆనాఁటికిఁ బాఠమైపోయెను. రత్నావళికి మొదట నతనియొద్ద చదువుకొనఁగూడదనిపించెను. పాఠమైన తరువాత నతని యొద్దనే చదువుకొనవలె ననిపించెను. పాఠము చెప్పినంతసేపు ముకుందరావు కన్నులు తమ ప్రయత్నము మానలేదు. అతని చేతు లా ప్రయత్నమును మఱికొంత కొనసాగించకపోవనులేదు. రత్నావళిమనసులోఁ జాలభయపడెను. పాఠమైనంతనే ముకుందరావు నవ్వెను. రత్నావళి నవ్వలేదు.

అతఁడు 'భయపడుచుంటివేమి?' యనెను. రత్నావళి "భయము
కాదు. మీరు నావంక నట్లుచూడవద్దు. నాతో నట్లు మాటాడ
వద్దు. నేను చెడిపోతినని మీకుఁ జులకనగా నున్న దేమో? నే
నేదో దారితప్పి యిట్లువచ్చితిని. నేనుపడినదారి తప్పని నాకుఁ
దెలిసినది. ఆతప్పు సవరించుకొనుటకుఁ జదువు కొనవలయు
నని తలంచుచున్నాను. ఆ తప్పును మఱింత వృద్ధిచేయుటకుఁ
గాదు. నే నిట్లంటినని కోపగించుకొనకుఁడు. నాకు తొందరగాఁ
జదువు రావలెననినఁ దమవంటివారియొద్దనే చదువుకొనవల
యును. మీరు కోపగించుకొని వెడలిపోయినచో నాకుఁజదువు
రాదు. మీరెంత బాగుగాఁ జదువుచెప్పఁగలరో నాకీ కొంచెము
సేపటిలోననే తెలిసినది. నన్ను దయతోఁజూచి చెల్లెలుగా
భావించి చదువు చెప్పుటకు మీ కనుగ్రహము కలిగెనా,
చెప్పుఁడు. లేనిచో మీవంటి మంచిగురువులవద్ద చదువుకొన
లేకపోతినని జీవితాంతముదుఃఖించెదను" అని తలపంచుకొనెను.
ముకుందరావు దృష్టి యామెపాపటపైఁ బడుచుండెను. అతని
దృష్టిలోఁ గ్రమముగా మార్పుగలిగెను. ఆమె మాటలలోఁ
గాలుష్యము లేదు. కొంత దాఁచి చెప్పుటయు లేదు. మనో
భావమును మల్లించుకొని యన్యాసక్తహృదయ చెప్పినట్లును
లేదు. పండితుడు, వాగ్లక్షణములు తెలిసినవాఁడు నైన
ముకుందరావు రత్నావళి మాటలను, జూపులను, వైఖరిని
యథార్థముగఁ దెలిసికొనెను. అతని కన్నులలో నున్న
కామతైక్ష్ణ్యము, కొంచెము విరక్తి, కొంచెము కోపము
కొంచెము నిస్పృహ, కొంచెము జాలి యన్నియుఁ బెన
గొని క్రమముగా జాఱి కన్నులు చల్లబడెను. అతని కన్నులు
ప్రసన్నము లయ్యెను. అట్లగుటకు నైదునిముసములు పట్టెను.

అతని కన్నులతోఁ పాటు వాని కూర్చున్న వైఖరిలోఁ బూర్వపు కౌర్ణ్యము, నౌద్ధత్యమును బోయి సౌకుమార్యము, ప్రసన్నత్వము గోచరించెను. ఆ కూర్చున్న వైఖరి మాఱుట రత్నావళి చూచెను. ఆమె తలయెత్తెను. ముకుందరావు కన్నులోక పురుషుఁడొక స్త్రీని సామాన్యముగాఁ జూచుచున్నట్లుండెను. ముకుందరావు "అమ్మాయీ! క్షమింపుము. ఏమియు ననుకొనకుము. నిన్నుఁగూర్చి హరికిశోరుఁడు నాతో నబద్ధములు చెప్పెను. నాప్రకృతికూడఁ గొంతవఱకు చెడ్డది. కాని నేను పుట్టుకలోననే రాక్షసుఁడనుగాను" అనెను. రత్నావళికిఁ గన్నులలో నీళ్ళు గిఱ్ఱునఁ దిరిగెను. ఆమె యేమ్ప దిగ్భ్రమించెను. 'హరికిశోరుఁడు నన్ను గుఱించి యేమిచెప్పె"నని యామె నెమ్మదిగా ననెను. ముకుంద—నేను వానిమాటలు నమ్మను. నాకు నిజము తెలిసినది. ఇప్పుడు నీమనస్సునకుఁ గష్ట మెందుకు కలిగించవలయును? రత్నా—కాదు, చెప్పుడు. విందును. కొంత పాపము వినుటచేతనే పోవును. ముకుంద-ఓసితల్లీ! వాఁడు పశువు. అయినను నీవు విన్నచోఁ దప్పులేదు. నీవు శాస్త్రితో, నీలమోహనునితోఁ, దనతో వ్యభిచరించితి వని చెప్పెను. వాఁడు నీ కేఁబది రూపాయ లిచ్చితినని చెప్పెను. నీకుఁ బట్టుచీరెలుకొని పెట్టితినని చెప్పెను. అట్టి దుర్మార్గులు కొందఱు లోకములో నుందురు. వారికట్లు చెప్పుకొనుట గొప్ప. అదియొక వ్యర్థశీలత్వము. అట్టివారిలో వీఁడగ్రేసరుఁడు. పురుషులలో నెంత మందియో స్త్రీమృగయులు. తల్లీ! నేనుగూడ నటువంటి కిరాతుఁడనే! వచ్చినప్పటినుండి చూచుచుంటిని. నీ నడకలో, నీ తీరులో, నీ మాటలో, నీచూపులో నా కాగాఢకాముకీత్వము కనుపించలేదు. రత్నా—అయ్యా! నేను భర్తను విడలివచ్చితిని, ఇంటిలోదొంగ

తనమును నాభర్త పట్టుకొనలేకపోయెను. నాకీతెలివియప్పుడు లేకపోయెను. ఇది యంతయు గ్రహచారము. గ్రహములు చేసిన యపకారము మనుష్యులబుద్ధి కంటెఁ గట్టిదరు. అదియు నదియు నొకటిగా నడుచునా? హరికిశోరుఁ డట్లనవలసినదే. వాఁడు మాయింటఁ దిని పోయినాఁడు. నీలమోహనుఁడు నా తమ్మునివంటివాఁడు. నావంటిదాని నతనితోఁ గలిపి చెప్పినను జెప్పవచ్చును. శాస్త్రిగారు నాకొక్కపూఁట పాఠముచెప్పెను. ఆయనచదువు నాకక్కఱలే దనిపించినది. ముకుంద—వాని కేమివచ్చును? చెడిపె! అకారమున కెన్నివంకరలో వానికిఁ దెలియదు. నిన్ను నేను బండితురాలిని జేసెదను. నెలకాదు. సంవత్సర మిందే యుండెదను. నేనుగూడ నిన్ను 'రత్నా'యని పిలిచెదను. రత్నా! నేను జదువుకొన్నాను గాని నావద్ద వినయము లేదు. నానోరు మంచిదికాదు. ఆచదువు నాకడ భాసించుటలేదు. ఆచదువు నీకుఁ జెప్పెదను. ఇతరులాఱునెలలలోఁ జెప్పుచదువు నీకాఱుదినములలోఁ జెప్పెదను. మేధాశాలియైన శిష్యుఁ డున్నచోఁ జదువు చెప్పుట తేలిక. ఊహాకొలఁదియు ననేకవిషయములు సుగమము లగును. రత్నా—హరిచెప్పిన మాటలు మీరు నమ్మితిరా? ముకుంద—అప్పుడు నమ్మితిని. నమ్మితినిగనుకనే మీరు పిలిచినంతనే వచ్చితిని. రాకపోతినో నీవంటి శిష్యురాలికిఁ జెడిసివాఁడను. దైవము ప్రతిదియు నేదో మంచికే చేయును.

రత్నా—అందఱకు నట్లే. నాకుమాత్రము ప్రతిదియుఁ జెడుగాఁ బర్యవసించుటకే చేయుచున్నట్లున్నది. ముకుంద—రత్నా! అట్లను కొనకుము. జరిగినదానికి నీవేమియుఁ జేయలేవు. నీవిట్లులేచి వచ్చితివో, యదియు మంచికేనేమో? కాలములో మన మేక

దేశమునే విచారింతుము. మన జీవితమంతయుఁ బూర్తియైన తరువాతగదా యీ జీవిత మెట్టిదో చూచుకొనవలయును. ఒక కొన్ని యేండ్లు కష్టములే రావచ్చును. తరువాత సుఖపడ వచ్చును. కాదు, తొంబదియేండ్లు బ్రతికి యెనుబదియైదేండ్లు నిర్ధనుఁడై చివరియైదేండ్లలో మహాశ్రీ యెత్తుకొనవచ్చును. జీవితము వర్తకమువంటిది. ప్రతిదినము లాభనష్టములు చూచుకొనినచోఁ దెలియదు. ఒక్కొక్కప్పుడేసంవత్సరమున కాసంవత్సరము లెక్క చూచినను లుగసాను కనిపించవచ్చును. పది యేండ్ల మొత్తముమీఁద నెంత పెట్టుబడి పెట్టితిమో, యెంత తిరిగివచ్చినదో, యెంత సరకు మిగిలినదో చూచుకొని లాభనష్టములు తేల్చుకొనవలయును. రత్నా:—నాయదృష్టముకొలది తమవంటి మహామేధావులుగురువులుగాదొరికినారు. ముకుంద:— ఛీ! ఛీ! నాకన్న నెక్కువకవు లున్నారు! నాకన్న నెక్కువ పండితు లున్నారు కాని నాయందు ధార్ష్ట్య మెక్కువ. కాని నా కొక్క గర్వమున్నది. సామాన్యముగా భాషాజ్ఞానము, కుదుర్చుటకుఁ గొన్ని తేలికమార్గములు నాకుఁదెలియును. అవి యన్నియు నీకుఁ జెప్పెదను. ఆమాట పోనీ. నేను కొంచెము సుకుమారుఁడను. ఎక్కువభాగము తెచ్చిపెట్టుకొన్నదే ననుకో. మధ్యాహ్నపుపూఁట నాకేదైనను జేసిపెట్టుచుండవలయును. (నవ్వుచు) నీవు నాకు జీత మిచ్చుటలేదు గనుక దానిబాపతుగ నీ మధ్యాహ్నఫలహారములు చేసిపెట్టుచుండుము.

అంతట రత్నావళి ముకుందరావునకు గారెలు వండిపెట్టెను. రెండుగారెలు రంగారావుకొఱకట్టిపెట్టెను. సాయంకాలమున రంగారావు వచ్చెను. అతనికి ముకుందరావులో మార్పు కనిపించెను, రాత్రిటిప్రొద్దుటిముకుందరావు వేఱు; ఈసాయంత్రపు

ముకుందరావు వేఱు. అతఁడు ఉద్ధృతవాంఛుఁడు; ఇతఁడు శాంత వాంఛుఁడు. అతఁడు వ్యగ్రమనస్కుఁడు; ఇతఁడు ప్రసన్నమనస్కుఁడు. అతఁడు వాచాలుఁడు; ఇతఁడు మృదువాక్కు. రత్నావళి గారెలు తెచ్చిపెట్టెను. రంగఁ'డెందుకు జేసితి'వనియడిగెను. రత్నావళి 'మాగురువుగారికిఁ బ్రతిదినము మధ్యాహ్నముల ఫలహారము చేసిపెట్టవలయును. అందుకని చేసితి'ననెను. రంగారావు మొగములో నిదమిత్థమని చెప్పరాని యొకనీడ కనిపించెను.

రంగారావు సిద్ధాంతములు పూర్వము వేఱు; నేఁడు వేఱు. పూర్వ మననుభూతదశలో సిద్ధాంతములు నిష్కలుషములై, యనన్యభావస్పృష్టములై యుండెను. అనుభవదశలో వానిఛాయలు వేఱు. మొదటిదినములలో రత్నావళి హారితో, నీలతో, శాస్త్రితో చనవుగానుండుట రంగనికి మనోవికారము కలిగించలేదు. క్రమముగా నతనికి రత్నావళిపైఁ బ్రేమకుదిరినకొలఁదియు నామెయందునొక స్వత్వభావము వ్యాపించనారంభించెను. ఆమె తన్ను నిరాకరించినను నామెయందు నొక మమత్వ మాతని కేర్పడెను. ఈమమత్వములోననే యీర్ష్యాబీజములున్నవి. అతనికి ప్రపంచజ్ఞానము మిక్కిలిగా లేదు. స్త్రీపురుషుల ప్రథమసమాగమానంతరపరస్పరాలోకనములకు, శాంతవాంఛులై, విముఖులై, శృంగారేతరభావప్రదీప్తులైనవారి యవలోకనములకుఁ గలభేదము నిర్ణయించుకొనుశక్తి యాతనికి లేదు. ఆరాత్రి రత్నావళి గదిలోఁ బండుకొనెను. తలుపు తెఱచియేయుంచెను. ముకుందరావును, రంగడును సావడిలోఁ బండుకొనిరి. ముకుందరావు గుఱ్ఱు కొట్టి నిద్రపోయెను. రంగనికి నిద్దురపట్టలేదు. ఆ మఱునాఁడు రంగారా వాఫీసునకు బోయెను. ముకుందరావు రత్నావళి పాఠ మైన తరువాత నామెతో నిట్లనెను. "నిన్నొక

మాటయుడగెదను. నీకుఁ గోపము రాదుకదా!" రత్నా-రాదు. ముకుం—నీ వీ రంగారావుతో సంసారము చేయుచుంటివా? రత్నావళి బదులు చెప్పలేదు. ముకుం—నే నెందుకడుగుచుంటి ననఁగా నీమనస్సుయొక్క స్థితి నా కబ్బురము కలిగించుచున్నది. నీ వితనితోఁ గూడ సంసారము చేయ వని నాకుఁ దెలియును. అయినను అడుగుచున్నాను. రత్నా—నేను మీ రనుకొన్నంత దూరము రాలేదు. దైవము రక్షించినచో వత్తునేమో? నా కతనియందుఁ బూర్వము వ్యామోహముండెడిది. ఇప్పుడతనితోఁ గలసియే యున్నాను. దానికి రెండు కారణములు; ఒకటి వాని యందు నాకుఁగల జాలి; రెండవది నా నిస్సహాయత్వము. ముకుంద—నేను నేటిరాత్రినుండి యిక్కడ భోజనముచేయను; ఇక్కడఁబండుకొనను. నా కీ పట్టణములోఁ జాలమంది స్నేహితులు కలరు. నీకుఁజదువుచెప్పుటకుఁ బ్రతిదినమును మధ్యాహ్నము వత్తునా, సాయంకాలము వత్తునా? రత్నా-మీ రిచ్చటనే యుండవలయును. మీకు వేఱేఖర్చుకూడనా? ముకుంద—నాకొక జమీందారు నెలకు నేఁబదిరూకలిచ్చుచున్నాఁడు. నా భార్య కేడవమాసము. పుట్టింటివారు తీసికొని పోయినారు. ఆఱు నెలలవఱకు నాకు బాదరబందీ లేదు. నాకు నాలుగెకరముల మాగాణి యున్నది. నీవు నన్నుఁగూర్చి విచారింపనక్కఱలేదు. రత్నా—మీ రట్లనుచుండఁగా నేనేమియు ననలేను. ముకుంద—నే నిప్పుడే వెడలిపోయెదను, ఱేపు మధ్యాహ్నమువత్తును. నా పెట్టె ఱేపు తీసికొనిపోదును. మఱి కొన్నాళ్ళుపోయిన తరువాత రోజునకు రెండుపూఁటలు పాఠము చెప్పెదను. రెండు నెలలైనతరువాతఁ దెలుఁగుకావ్యము లన్నియు నూరకే కలసి చదువుకొని పోదము. నేను వెళ్ళుచున్నాను.

రత్నావళి యుండు మనలేకపోయినది; వెళ్ళు మనియు ననలేక పోయినది. రాత్రికి రంగఁడువచ్చెను. ముకుందరావుకథ వినెను. రత్నావళి తమ సంభాషణ ప్రత్యక్షరము చెప్పెను. రంగఁడు దీర్ఘాలోచనపరుఁ డయ్యెను; "నా యందు జాలి, తన నిస్పృహాయత్వము! బాగుగానున్నది. నేనెవరియందు జాలిపొందుదును? నా యందే నాకు జాలి. నా నిస్పృహాయత్వమువలన నెవరి నాశ్ర యింతును ? నన్ను నేనే యాశ్రయించుకొందును."

ఆరాత్రి రత్నావళి రంగనిప్రక్కపండుకొనెను. తనచేయిరంగ నిపై వైచెను. రంగఁడా చేతినిఁదీసి యామెప్రక్కనే యుంచెను. రంగఁడు కన్నీళ్ళు కార్చుచుండెను. రత్నావళి కా సంగతి తెలి సెను. ఆమె యిట్లనెను. "నీవు కన్నీళ్ళు కార్చినచో నాకు జాలిలేదు. నీవు నన్ను గాఢముగా వాంఛించుము. నీయందు నాకు జాలిపుట్టును. ఆ వాంఛ పూర్తిగాఁ గామేచ్ఛచేయుము. అప్పుడు నీయందు నాకు జాలిపుట్టును. ఆ వాంఛను మృదువును జేసి దానియం దింకొక సుకుమారభారమును వ్యాపింపఁజేయ కుము. నీయందలి నా జాలి నాకుఁ గోపముగా మారును." రంగఁడు కన్నీళ్ళు తుడుచుకొనెను.

## పన్నెండవ అధ్యాయము

తరువాత రెండునెలలు సాఁగెను. ముకుందరావు చదువుచెప్పు విధానము చిత్రముగానుండెను. అతఁడు తెలుఁగు ప్రబంధముల లోని రసవద్ఘట్టము లన్నియు రత్నావళికి వినిపించెను. ఆయన తాను జదువుచునే వానిలోని రస ముట్టిపడునట్లు చదువును. అందందు మాటలు తెలియకపోవుటయే తప్ప రత్నావళి కర్థము

కానిది మిక్కిలలేదు. ముకుందరావు మాటలయర్థము మిగుల్ప లేదు. ముకుందరావు తత్సమ తద్భవ దేశ్యశబ్దముల విన్యాసము, సంస్కృత సమాసముల కూర్పు రత్నావళికిఁ జెప్పి, యామెయంతట నామె చదువుకొను మార్గముల నేర్పఱచెను. తెలుఁగు వ్యాకరణములోని రహస్యములును, తెలుఁగునకుఁ గావలసినంత సంస్కృతవ్యాకరణరహస్యములును నతఁడు బోధించెను. రత్నావళిబుద్ధి భాషావిషయములో మంచినీటికిఁ జేఁప యెక్కిన ట్లెక్కెను. మొదటినెల గడచునప్పటికే రత్నావళి యొక్క చదువు ప్రకాశింపఁజొచ్చెను. రంగఁడు ముకుందరావు నెడల మిక్కిలి సుముఖుఁడయ్యెను. ఆయన పరగృహవాసము చేయుట, పరగృహభోజనము చేయుట రంగఁడంగీకరించలేదు. రెండవనెల ముకుందరావు వారియింటిలోననే యుండెను. భోజనము, నిద్ర మినహాగాఁ దక్కినకాల మంతయు నానెలయంతయు రత్నావళి బహువిషయములు నేర్చుకొనుటలోడనే యైనది. రత్నావళి కౌముది తీసి యొకానొక శబ్దస్వరూపము కావలయు నన్నచోఁ గొంతవఱకు వెదకికొనఁ గలదు. తద్ధిత కృత్సంధి పరిచ్ఛేదములు ఫలానా ఫలానా చోట్లనున్నవి, సూత్రార్థము తెలియకపోయినను నుదాహృతములైనశబ్దస్వరూపములను జూచుకొనవచ్చునని ముకుందరావు చెప్పెను. ధాతుపాఠమునుగూడఁ జూపెను. పది వికరణముల తరహాలు చెప్పి, వలసినప్పుడు చూచుకొనునట్లు చేసెను.

రత్నావళి యొకనాఁడు ప్రొద్దున ముకుందరావుతో నిట్లనెను. "అయ్యా! చదువింత తేలికగాఁ జెప్పవచ్చును. ఇంత తేలికగా వచ్చును. దీనికై సంవత్సరముల తరబడి పాఠశాలలలో వృథా చేయుచున్నారు." ముకుంద—గురువు లందఱును ముకుంద

రావులు కారు, శిష్యులందఱును రత్నావళులునుకారు. శిష్యులు రత్నావళులు కాకపోయినను, గురువులు ముకుందరావులైనచోఁ గొంతమేలు కలదు. అసలీ విద్యాపద్ధతిలో గురువుచేయున దేమియులేదు. ఒక కృతకవిద్యాపద్ధతి గురుస్థాన మాక్రమించు కొని గాడిదలను, గుఱ్ఱములను నొక్కగాటఁ దోలుచున్నది.

రత్నా——మొదటివాని కేమినష్టము? రెండవవానికే నష్టము.

ఆనాఁడు ముకుందరావున కొకయుత్తరము వచ్చెను. అతనిభార్య ప్రసవించిన దని, చాల జబ్బుగానున్న దని, వెంటనేబయలుదేఱి రమ్మని.ముకుందరావు వెళ్ళిపోయెను. ఆమెకెట్లున్నదో వెంటనే యుత్తరము వ్రాయవలసిన దని రత్నావళి తన గురువుతో పదేపదేచెప్పెను. రంగనికి రెండుమూన్నాళ్లు జ్వరముకాఁచెను. ఆఫీసునకుఁ బోలేదు. రంగఁడు గృహమునం దున్నంత సేపు రత్నావళివ్యాలోలుఁడై యుండెను. అతని మనస్సు మొదటి రోజులలో రత్నావళినిఁ దెచ్చినందులకును, దన చదువు పాడై నందులకును, దనమిత్రులలోఁ జాలమంది రానందులకును, వచ్చినవారు వ్యర్థులైనందులకును గష్టపడుచుండెను. చాల మంది నూతనోత్సాహవంతులై సంస్కారోక్తులు పలికెడివారే కాని, సంస్కారకార్యాచరణము సలుపనివారని యతనికిఁ దెలి సెను. అతని యౌవనము ప్రథమదశనాఁటి తాత్కాలికోద్రేక ముకాక నిత్యోద్రేకమును బొందెను. అతఁడు రత్నావళిని వదలి యుండలేక పోయెను. మోహ మంటువ్యాధివంటిది ఒక రీతివైముఖ్యము కలిగినరత్నావళి మనస్సుకూడరంగని మోహ సంపర్కముచేత మోహభాజనమయ్యెను. రంగనికిజ్వరము నెమ్మ దించెను, ముకుందరావు పోయి పదునేనుదినము లైనది.అయన యొద్దనుండి యుత్తరము లేదు. రంగఁ డాఫీసునకుఁ బోవుటయే

యాలస్యముగాఁ బోవును. వచ్చుట వెందలకడ వచ్చును. ఇంటిలోనున్నపుడు వ్యాధియు లేదు, డుంగిడియు లేదు. ఆఫీసులో నేదో వ్యాధిబాధితునివలె నటించును అది యంతయు నచ్చటివారు జాలిపడి, యతడింటికిఁ బెందలకడఁబోవుటకు ననుమతించుటకు. అతఁడు రత్నావళితో 'నొకనెలనాళ్లు సెలవుపెట్టెద' నని చెప్పెను. రత్నావళి 'పాతికరూపాయలు నష్టముకదా'యనెను. అతఁడు "రత్నా! నిన్నువదలి యుండలేను. నిన్నుఁజూడని నిముసము, నిన్ను స్పృశించని నిముసము, నిన్నుఁ గౌఁగిలించని నిముసము, నిన్ను ముద్దాడని నిముసము నాకు యుగములుగా నున్నవి. న న్నేదో మహాభూత మావేశించినది. నేను నిలువలేను. ఒకమాసము రోజులు సెలవుపెట్టి యింటిలోనేయుండెద" ననెను. రత్నావళి "సరే! యట్లే కాని" మ్మనెను. అతఁడు బహుకష్టము మీఁద నొక నెల సెలవు తీసికొనెను. ఆ నెలయును రంగడు మనుష్యునివలె నుండలేదు. ఆ నెలలోఁ బది రోజులు గడుచునప్పటికి రత్నావళికి విసుగుపుట్టెను. ఆమెలోఁ దొలుతఁ దలచూపిన వైరాగ్యము, వైముఖ్యము మఱలఁ బిలకలు వేసెను. తరువాత పదిరోజులు రత్నావళి తూష్ణీంభావము వహించెను. రంగని యుద్రేకము గాని, యుద్వేగముగాని తగ్గలేదు. చివరి పదిరోజులలో నొకనాఁడు రంగఁడు రత్నావళి వంటచేయుచుండగాఁ బోయి కౌఁగిలించుకొనెను. రత్నావళి "ఛీఛీ! యవతలకుఁ బో"మ్మనెను. రంగడు బలవంతముగాఁ గౌఁగిలించు కొనెను. రత్నావళి యతనిని ద్రోసెను. అతఁడు క్రిందఁబడెను. అతనికిఁ గోపమువచ్చెను. "నన్నుఁ బడద్రోయుదువా?" యని ప్రక్కనున్న గరిటెతో నామె కాలిపైఁ గొట్టెను. ఆదెబ్బ రత్నావళి సీలమండలమీఁద

దగిలి యామె కూలఁబడెను. ఆమె బిగ్గఱగా నేడ్వసాఁగెను. రంగఁడు కోపముతో నంత పెద్దదెబ్బ తగులు నని యనుకొన లేదు. ఆసీలమండ వాఁచి కట్టుకట్టవలసివచ్చెను. అది మూన్నాళ్ళవఱకును నెమ్మదించలేదు. ఆ మూనాళ్ళు రంగఁడేవంటచేసి యామెకుఁ బెట్టెను. ఆవిరి కాఁపుచేత మూఁడవరోజున నావాఁపు తీసెను. ఆమూన్నాళ్ళును రత్నావళిరంగనితో మాట్లాడలేదు. రంగఁడు రత్నావళియొద్దకుఁ బోవుటకే వీలులేకపోయెను. ఆమె కూసమువిడిచిన త్రాఁచువలెనుండెను. అతఁడామూన్నాళ్ళును వంటచేసి తాను దిని వెడలిపోవును. ఆమె కిష్టమువచ్చినప్పుడామె వడ్డించుకొని తినును. ఆ నాఁడు సాయంకాలము రంగఁడు రత్నావళితో 'రత్నా! క్షమింపుము. కామోద్రేకముచేత నా యొడలు తెలియలేదు. నేను దప్పుచేసితిని. నేను గొట్టవలయు నని కొట్టలేదు. అది నిజముగాఁ గోపముకాదు; వట్టి కామోద్రేకము. అది యాయుద్రేకముయొక్క వికారముకాని కోపము కాదు'అనెను. రత్నా—అన్నిభావములు నొక యుద్రేకము యొక్క వికారములే. ఆ యుద్రేకమే పలురీతులుగా నుండును. కోపమే మిక్కిలిగా రానప్పుడు బిగించుకొని ముభావముగా నుండును. సామాన్యమానవునిలో నది యెక్కువగా నున్నపుడు దేహబలమును జూపించుటకుఁగా బయటికివచ్చును. ఆలోచనాపరుఁడు, కుత్సితుఁడు నైన వానిలో నదియే రాక్షసత్వముగా మాఱి నిత్యముగానపకారము చేయించును. ఈ కామోద్రేకమే యిరుపక్షముల నున్నప్పుడు ప్రేమగా, నన్యోన్యానుకూలముగాఁ బ్రకాశించును. స్త్రీపురుషుల కిర్వురకును సంతానము కలుగవలయు నని యేకభావము కలిగి కలసిమెలసి యుండినపు డది ప్రేమయనియు, నట్టిది దాంపత్యమనియుఁ జెప్పుదురు. ఆ కామో

ప్రదేశమే యేకస్త్రీనిష్ఠముకాక, బహుస్త్రీనిష్ఠమై యది ఫలించు నపుడు జారత్వమందురు. ఆయుప్రదేశమే బహుస్త్రీనిష్ఠమైఫలించ నపుడు, ఫలింపించుకొన శక్తిలేనపు డాపురుషునకు వివేక మధికముగా నున్నపుడు, పదిమంది స్నేహితులున్నపుడు, తనకుఁ గలిగినయేభావమైనను బదిమందిలో వ్యాపింపఁజేయ వలయునని యాపురుషున కుత్సాహమున్నపుఁ డాయుత్సాహమునకుమార్గములు కనిపించినపు డదియే సంస్కారబుద్ధిగాఁ బరిణమించును. ఒక్కటియే మనోవికారము భిన్నావస్థలయందు భిన్ననామములతో వ్యవహరింపఁబడును. ఒకనీచభావము పురుషుఁడుకాని, స్త్రీగాని స్వార్థముకొఱ కుపయోగించుకొనినచో, స్వవిషయమున ఫలవంతముచేసికొనఁగాఁ బ్రయత్నించినచో వాని నధమ మందురు. అది పరోపకారార్థము వినియోగించి నపుడు — వినియోగింప నక్కఱలేదు. దాని కట్టి వినియోగముకలిగి నచో—దాని నుదారభావమందురు. ఒక కవి తన యబుసు పోకకై తాను గవిత్వమువ్రాయును. కీర్తియును, ధనమును వాంఛించి కవిత్వమువ్రాయును. తాను గొప్పవాఁ డనిపించు కొనుటకుఁ గవిత్వము వ్రాయును. అతఁ డొక పెద్దగ్రంథము వ్రాసినచో నతఁడు భాష నుద్ధరించె ననియు, లోకమునకు సేవ చేసెననియు వానిని బొగడి, నివ్వాళిపట్టుదురు. నీ లౌకికమైన సర్వవిషయములును మనోవికారము లేనోయిా, మనోవికారములు. నేను నీమీఁదఁ గోపమువచ్చి నీతో మాటాడకపోవుట లేదు. చెంబెఁడునీళ్ళు మీయన్నగారు నామీఁదఁ బోసినందులకు నీవెన్నియో చెప్పితివి. ఆ నీళ్ళుపోయుటలోఁగల పశువృత్తి కొంచెమేకదా! ఆసమయములోఁగూడ మీయన్నగారికి మడి చెడిపోవునేమో యన్నంతపఱకు నొడలు తెలిసినది. నీకో, నీల

మంచముమీఁద దెబ్బ తగులునేమో యన్నంత మాత్రమైనను నోడలు తెలియలేదు. నీకును మీయన్నగారికిని భేదము చూ మును. ఇరువది దినములు నీయయోగ్యత్వమునకు నేను భాజ నమనై, యొక నిముసములో వ్యతిరేకభావము పొందినందుకు నీవు నన్నింతదెబ్బ కొట్టితివి. మీయన్నమిగిలిన జీవితమంతయు జంతుసహజమైన కామవ్యాపారమునుండి నామూలముగా విర హితమైపోయినది ఆయన కెంతకోపము రావలయును? నన్నును నిన్నును రహస్యముగా నాశనము చేయవచ్చును. ఆయూరిలో నతఁడు తలఁచుకొన్నచో మనమిరువురమును సుఖముగా బండి యెక్కి రాఁజాలియుండము. అందఱు మనుష్యులును ప్రాణులే- అనఁగా జంతువులు. జంతుధర్మమును దాఁటి మనుష్యుఁడు కావ లయును. కామేచ్ఛ మఱియు జంతుధర్మము. దానియందు మనుష్యుడు మనుష్యుఁడగుటకు సంస్కారము పనిచేయదు. ధర్మమైన దాంపత్యమే పనిచేయును; ఏమందువు ?

రంగఁడు రత్నావళి మాటాడినంత సేపు తలవంచుకొని కూర్చుం డెను. ఆమె యూపిరాడకుండ నొకబిగువున నంత యుపన్యాస మీయఁగా నతఁడు నివ్వెఱపోయెను. ఆమె మాటాడుటలో ముకుందరావు మాటాడుచున్నట్లు తోఁచెను. ఆమె యప్పుడు చెప్పిన భావములు ముకుందరావువే ముకుందరావు కొన్ని మాటలమీఁద నొక్కును; కొన్ని శబ్దములమీఁద దీర్ఘములు తీయును. రత్నావళి యచ్చుముగా నట్లేచేసెను. ముకుందరావు నిజముగాఁ జదువుచెప్పెను. శిష్యు లేగురువు ననుకరింతురో, వానికిఁ దెలియకుండ నేగురువుయొక్క వాగ్వైఖరీముద్ర వారి వాగ్వైఖరియందు హత్తుకొనునో యాగురువు గొప్పగురువు. వానిభావములుమంచివో, చెడ్డవో యట్లుంచుము. వానియందు

శిష్యుని మనస్సును నొకమార్గమునకుఁ ద్రిప్పగలశక్తి యుండును. రంగఁడు కొంతసేపు కూర్చుండి వెడలిపోయెను. రాత్రి ప్రొద్దుపోయివచ్చెను. రత్నావళి వంటచేసి యతనికొఱకెదురు చూచుచుండెను. అతఁడామె భోజనము చేసి పండుకొనును తాను వడ్డించుకొని తినవలయు'ననుకొనెను. ఆమె యతనికి వడ్డించి తానువడ్డించుకొనెను. రంగఁడుమాటాడకుండభోజనము చేయుచుండెను. రత్నావళియిట్లు మొదలుపెట్టెను. "రంగా! మీయన్న నన్నుఁగొట్టినపుడు మఱలఁగొట్టుమంటివి. నేనుగొట్టితిని. మీయక్క సరస్వతమ్మవచ్చి నన్నుఁజావమోదెను. నీవునన్ను గొట్టఁగా నేను దిరిగి కొట్టవలెనా? మీయన్న బలహీనుఁడని నీవు నన్ను దిరిగి కొట్టుమంటివి." రంగ—ఆయన బలహీనుఁడు కాఁడు. నేను బొరపడితిని. మనము బయలుదేఱిన వెనుకటి రాత్రి నాచేతులు పట్టుకొని నన్నుఁగూలఁబడఁద్రోసెను. నా కప్పుడు తెలిసినది. రత్నా—ఆయన బలముగలవాఁడో, కాదో నాకది ప్రధానముకాదు. నీవు నాకన్న బలముగలవాఁడవు. నేను దిరిగి కొట్టినచో నీవు నన్నుఁ జావఁజిదుక మోదెదవు. రంగ—నేనట్లుచేయను. అప్పుడు కోపములో నామొడలు నాకుఁ దెలియలేదు. నిన్ను నేను గొట్టుట తప్పు. క్షమింపుము.

రత్నా—కోపముతరువాత శాంతించినమాటకాదు. ఆ కోపములో నీవేమిచేయుదువో చెప్పితిని. పురుషులు స్త్రీలనుగోపము వచ్చినప్పుడే కొట్టుదురు. శాంతించి ప్రేమించినపుడు లాలన చేయుదురు. స్త్రీ లెదుకుతిరిగినను సంతియే. కోపమువచ్చుట ప్రతివానికిని గలదు. అది కొందఱిలో హద్దుమీఱిపోవును. కొందఱిలో నియమింపఁబడియుండును. వారేనాగరకులు. నియమము నాగరకత. నియమమును దాఁటిపోవుట పశువృత్తి. ఈ

నీ సంస్కారభారములన్నియు నియమదూరములగుటచేత నొక రీతిగాఁబశువృత్తి. పశువృత్తికూడఁగాదు, రాక్షసవృత్తి. రాక్షస వృత్తికిని బశువృత్తికిని భేదమేమో తెలియునా? పశువృత్తి జంతుసహజమైనవృత్తి. అది యెప్పుడును శరీరమున కపకార మునే చేయుట భావించుచుండును. రాక్షసవృత్తి శరీరమున కప కారము చేయుటమాని యొకనిజీవితమునకునపకారముచేయుట కొఱకుఁ జూచుచుండును. కోపమువచ్చి కొట్టినచో వాఁడొక పశువు. ఆకోపమును లోపలఁబెట్టుకొని, యెవనిమీఁదగోపము వచ్చినదో వాని జీవితమునకు, వాని పురోభివృద్ధికి సర్వదా భంగము కలిగించువాఁడు రాక్షసుఁడు. భర్తభార్యను గొట్టినచో నతనియందుఁ బశుత్వము చావలేదని యర్థము. కామవ్యాపార మెట్టిదో యీ కోపవ్యాపారము నట్టిదే. ఆ భర్త యామెను గొట్టినపుడు దానియందునఁ గామవాంఛ లేనివాఁడని యర్థము కాదు. స్త్రీలను సముద్ధరించుటకు నీవు ప్రయత్నించునపుడు నీ యందుఁ గామవ్యాపారము లేకపోలేదు. నన్ను నీవు పెడ మార్గము త్రొక్కించినపుడు నా జీవితమున కంతకును భంగము కలిగించితివి. ఇది రాక్షసత్వము. ఈ రాక్షసత్వములో భేద మున్నది. ఈరాక్షసత్వము నీరక్తములో సహజముగా నున్నది. అది నీ వూహించుకొని చేయనక్కఱలేదు. నీయూహ లేకన్మ ఖముగాఁగలుగును. కోపవిషయికమైన రాక్షసత్వము దీనికన్న మంచిది. రంగ—నీవు నన్ను మిక్కిలిగా నిందించుచుంటివి. నేను జేసిన దొక్కతప్పు.-రత్నా—మీయన్న యసలే చేయ లేదు. నేను నిన్ను నిందించుటలేదు. అసలుసంగతి చెప్పుచున్నాను. నీ సిద్ధాంతముల యడుగున నున్న తత్త్వము చెప్పుచున్నాను. రంగ—నీవు చెప్పిన తత్త్వము నిజమని నాకు నమ్మకములేదు.

రత్నా:- ఉండదు. నాకుఁ దెలియును. కరచరణాద్యవయవము లున్నంతనే ప్రతిమనుష్యునకును వివేకము సమానముగా నుండదు. వివేకములోఁ దారతమ్యము లుండును.

తరువాత నాల్గుదినములు గడచెను. ఒకనాఁడు రాత్రి రంగఁడు రత్నావళితో నిట్లనెను. "నేను నీ జీవితమును బాగుచేయుటకే ప్రయత్నించితిని. దానిని నీవు రాక్షసత్వ మని యెట్లందువు?"

రత్నా:- సింహము జన్మముచేత సింహము. దానియందు సింహత్వము తెలిసికొనుట తేలిక. అట్టి ప్రకృతి మనుష్యుని యందున్నపుడు దాని నొప్పించుట యెంతయో కష్టము. రంగ: ఇవి యన్నియు ముకుందరావుమాటలు. రత్నా:- నీ సిద్ధాంతము లన్నియు నీ సొంతములా? ఎవరి సిద్ధాంతము లెవరి సొంతములు? ముకుందరావుగారి మాటలు వారు చదివిన చదువునుబట్టి, యాయన బుద్ధినైశిత్యమునుబట్టి వచ్చినవి. నీ మాటలు, నీ సిద్ధాంతములును నీకు నేర్పినవారిమాటలు; వారి యాచార్యులైనకొందఱభావములు ఇందెవరును తల్లికడుపునుండియూడిపడినతోడనేయవతారములవలెసొంతభావములతోఁబుట్టలేదు.

రంగ— ఆ యవతారములుకూడ వారిపూర్వుల భావములనే తమ వివేకముతోఁ గలిపిచెప్పెదరు. లేనిచోనొక్కొక్కయవతారమూర్తియతఁడుజన్మించిన దేశమునకనుగుణముగా నేలచెప్పును?

రత్నా:- మంచిమార్గము పట్టితివి. పూర్వమునఁ గొందఱవిజ్ఞానము లేకుండ నెవ్వఁడును సొంతముగా నూహింపలేఁడు. ఒకని యూహ యింకొకని యూహకన్న గొప్ప యెట్లగును? అందుచేత నెవనిమార్గమును వాని ననుసరింపనిచ్చుట లోకమునకు శుభదాయకము. వానియంతట వాఁడు నీమార్గమునకు వచ్చినచో నీవు స్వీకరింపవచ్చును. బలవంతముచేసి, యాశలుపెట్టి,

వానిని నీవు మఱియొక ప్రయోజనము వాంఛించి నీమార్గమునకుఁ ద్రిప్పుకొన్నచో నది యన్యాయముకదా! నేను దీనినే రాక్షసత్వ మనుచుంటిని. రంగ:—తోడిమానవుఁడు పశుప్రాయుఁడై యున్నపుడు వానినిమఱలించుట ప్రతివివేకియొక్క యుధర్మము. రత్నా:—తాను వివేకి ననుకొనువాఁ డట్లు భావించును. అది యట్లుంచుము, అవతలివాఁడు పశుప్రాయుఁడని నీ వెట్లు నిర్ణయింతువు? నీకున్నస్థితి నీవునాగరకత యనుకొని, పరులస్థితినీస్థితితోఁబోల్చి యదియనాగరకతయనుకొని, వాఁడు పశుప్రాయుఁడని నీవు భావింతువు. అది నీయం దున్న యహంకారము కావచ్చును. రంగ:—నేను బోల్చి చూచుచుంటిని గనుక నిర్ణయము చేయుచుంటిని. తర్కముపయోగించుచుంటిని. ఊరకే యనుకొనినచో నహంకారము కావచ్చును. విషయమును బరామర్శించుటచేత నహంకారము లేదు. రత్నా:—నీ తర్కము నీ సంస్కారమునుబట్టి యుండును. నీ కదివఱకే కల కొన్ని యూహలనుబట్టి, కొన్నివిశ్వాసములనుబట్టి తర్కించెదవుకాని యచ్ఛమైన తర్కమునీకుఁ దెలియదు. నీ తర్కము నీ విశ్వాస దూషితము. రంగ:—అట్లయినచో నెల్లవారితర్కమును దూషితమే. రత్నా:—అట్లుకాదు.తర్కము రెండువిధములు; సామాన్యమానవుని బుద్ధిజన్య మొకటి; రెండవది శాస్త్రవిషయకము. రంగ:—ఆ శాస్త్రము కొందఱు మనుష్యులచేత వ్రాయఁబడినది. వారిబుద్ధికి దోషము పట్టలేదని యెట్లు నిర్ణయించఁగలవు? రత్నా:—మంచిప్రశ్న చేసితివి. నే నీ పరిశ్నయే ముకుందరావుగారి నడిగితిని. ఆయన చెప్పిన సమాధానము చెప్పుచున్నాను. శాస్త్రము, ప్రయోగము—ఇవి రెండు. ప్రయోగవిషయమున వస్తుసంపర్కముకలిగి తర్కము దూషితము కావ

చ్చును. శాస్త్రము వట్టి మనోవ్యాపారమును బదార్థస్వరూప ములను బోధించు సూత్రజాలము. 'లోకములో మన స్మృతి, యీరీతి సంచలించుట కలదు' అని పదార్థస్వభావనిర్ణయము చేయుటయందు దోషమురాదు. వ్యక్తిగతాభిప్రాయములు దానిని బట్టవు. అట్లు సూత్రితములైన విషయములు బహు కాలగతమహాపురుషబుద్ధినికషమును పొంది యథార్థతను సంపాదించును. అది శాస్త్రము. దానియందు నీవు శాస్త్రీయ చర్చతో దోషము చూపింపుము. అట్టిసూత్రము లున్నప్పుడు వాని ననుసరించి నీవువాదించుట న్యాయము. అప్పుడు నీ వాదములోని దోషము తెలియఁగలదు. వట్టి ముఖదృష్టివాద ముతో నేదియు నిర్ణయింపఁబడదు. రంగ:—నీ సూత్రములు లోకవ్యవహారము, సర్వమనోవ్యాపారము—వీనినుండి తీసిన సా మాన్యధర్మములే. అవి యందఱకును దెలియును. అవి శాస్త్ర మునుండి నేర్వఁబనిలేదు. రత్నా:—అయినచో శాస్త్రములెందు కున్నవి? రంగ:—అవితోఁచియుఁదోఁచనివారి యభూతకల్పనలు. రత్నా:—లోకములో సర్వగ్రంథములు నట్లే. నీ మిత్రులు వ్రాసినగ్రంథములునట్లే. మనుష్యుఁడుస్వయంవ్యక్తి. ఇంక వేఱే గ్రంథములెందుకు? చదువులెందుకు? నీవు చెప్పుటయెందులకు, నేను వినుట యెందులకు? రంగ:—గ్రంథములు మనము మా టాడుకొనుటవంటివే. రత్నా:—శాస్త్రము మనమెట్లు మాటాడు కొనవలయునో చెప్పునది. రంగ:—ఆ సంగతి మనకుఁ దెలి యును: శాస్త్రముచెప్పనక్కఱలేదు. రత్నా:—మనముమాటాడు కొనుచునే యున్నాము; గ్రంథము వ్రాయ నక్కఱలేదు. రంగ:—అందఱకు నన్నియుఁ దెలియవు. అన్నియు మాటాడు టకు వీలులేదు. అందఱు నన్నివేళలను గలసికొనఁగు. రత్నా:—

అందఱు నన్నియు మాటాడలేరు. అందఱకు నన్నియుఁ దెలియవు. మాటాడఁగల ప్రతివానికిని మాటాడు శక్తి లేదు. అట్లు మాటాడినపుడు వచ్చుదోషములు తెలియవు. అందుచే నా దోషములెట్టివో, మాటాడుట యెట్లో చెప్పునది శాస్త్రము. ఊహించుట యెట్లో చెప్పునది శాస్త్రము. ఈవాదములో నిరువురకుఁ గనులు జేవురించెను. ఒకరియందొకరికిఁ బ్రత్యర్థిత్వము బలిసెను. తరువాత రోజులలో వారినడుమ ముభావము పెరిగెను. ప్రతిచిన్నవిషయములోనను వారిమాటలు వాదోపవాదములుగాఁ దేలుచుండెను. చివరకుఁ జిన్నవిషయములు మాటాడుకొనుచున్నను సమాధానములు చెప్పుట, తర్కముచేయుటయు నయ్యెను. "ఈచాప యిచ్చటినుండి యేల తీసితివి?"— "ఇది కాలికిఁ దగులుచున్నది. కావలసినప్పుడు మఱల వేసికొనవచ్చును"; "ఈచెంబు మకిలిగానున్నది."—"ఇంటిలోఁ జిడత పండు లేనపుడు మకిలిపోదు." ఇట్టిప్రశ్నలు, సమాధానములు కూడ నుద్వేగముతో, నొకపట్టుదలతో సాగఁజొచ్చెను.

రెండు నెలలైనది. రత్నావళి విద్యాపరీక్షకుఁ గట్టినది. పరీక్ష రెండునెల లున్నది. ముకుందరావు రాలేదు. సాయంకాలముల రత్నావళిత్రోవ వేఱు; ఆమె చదువుకొనుచుండును. రంగని త్రోవ వేఱు; అతఁడు స్నేహితులతోఁ గలసి కాలము వెళ్లబుచ్చి రాత్రి ప్రొద్దుపోయి యింటికి వచ్చును. రత్నావళి ముకుందరావునకు నుత్తరము వ్రాయుటకుఁగూడ నతని చిఱునామా తెలియలేదు. ఒకనాఁడు రంగని నడిగెను. అతఁడు "పరీక్షయిచ్చి యేమి చేయుదువు?" అనెను.

రత్నా:—ఏపత్రిక యాఫీసులోనైనను సంపాదకురాలుగాఁ జేరుదును. రంగఁడు మఱల మాటాడలేదు; చిఱునామా చెప్పను

లేదు. మఱునాఁడాఫీసునకుఁ బోవుచుఁ జిఱునామా యొకకాగి తముమీఁద వ్రాసి బల్లమీఁద నుంచిపోయెను. రత్నావళి యదిచూచి చింపివేసెను. తరువాతరెన్నాళ్ళకు 'ముకుందరావు నకు జాబు వ్రాసితివా?' యనిరంగఁడడిగెను. రత్నా-నీవిచ్చిన చిఱునామా నాకక్కఱలేదు. చింపివేసితిని. రంగ-మనకిర్వుర కును బడుటలేదు. నీవు ముకుందరావును బెండ్లియాడరాదా? అతఁడు నాకన్న నందగాఁడు. నీకు నచ్చినవాఁడు. నీయూహ లకు సరిపోయినవాఁడు.

రత్నావళి చేతిలోనున్న యూముక్రమాల్యాదను రంగారావు మొగముమీఁదవేసెను. అతనికి పెద్దదెబ్బతగిలెను. ముక్కునుండి నెత్తురు కారనారంభించెను. ఆతఁడు మొగము తుడుచుకొని,తడి గుడ్డతో నద్దుకొని యింటినుండి వెడలిపోయెను. రెండుదినములిం టికిరాలేదు.రత్నావళి కొంతసేపు పశ్చాత్తాపపడెను.కొంతసేపు తన కోపమును సమర్థించుకొనెను. కొంతసేపతనిని క్షమార్ప ణము వేఁడుకొనవలయునని యనుకొనెను. కొంతసేపు రంగఁడే వచ్చి క్షమాపణ మడుగవలయు ననుకొనెను. ఆమె ముకుంద రావునకు జాబువ్రాసెను. జాబతనికిఁ జేరనేలేదు. అతని కీమె జాబు వ్రాసినదనియే తెలియదు. ఆమఱునాఁడు ముకుంద రావు వచ్చెను. అతని శిరసుపై క్రాపింగులేదు. పూర్వపుమీస ములులేవు. మనిసి సగమునకు సగము కృశించిపోయెను. నల్లఁ బడిపోయెను. మాసినగుడ్డలు కట్టుకొనెను. జానపదునివలె నుం డెను రత్నావళి మొదట గుర్తుపట్టలేదు. అతఁడు నవ్వెను. రత్నావళికి గుర్తు తెలిసెను. 'ఇదియేమి యిట్లున్నా?' రనెను. ఆయన 'నాభార్యపోయి మూఁడునెలలైనది. నే నిట్లయితిని' అనెను, రత్నావళి "అయ్యో" అనెను.

ముకుంద—నీ పరీక్షయింక రెండు నెలలున్నది. నామూలమువ నీవు చెడిపోవుట యెందుల కని వచ్చితిని. ఈరెండు నెలలు నీవు జాగ్రత్తగా చదువుము. రంగారావుగారేరీ? రత్నా—ఆయన నామీఁదఁగోపమువచ్చి యెక్కడికోపోయెను. రెన్నాళ్ళనుండి యింటికి రాలేదు. ఆరాత్రి రంగఁ డింటికి వచ్చెను. ముకుంద రావును జూచెను. అతనిమార్పు రంగనికిఁగూడ విషాదమును గల్పించెను. భోజనములు చేయువేళ ముకుందరా విట్లనెను. "మీ రిద్దరును పోట్లాడుకొనరాదు. కోపములు తెచ్చుకొన రాదు. తెచ్చుకొని యేమిచేయుదురు? ఇద్దఱును గలసి బ్రతు కుట భగవంతుఁడు వ్రాసెను. అదిప్రకృతిసిద్ధము. భగవంతుడే మార్పు తెచ్చినచో మనమేమియుఁ జేయలేము. మన చేతు లారఁ దెచ్చుకొని బ్రతుకు కష్టభూయిష్ఠము చేసికొనరాదు. మీ రిదివఱకే యొకతప్పు చేసితిరి. ఆ తప్పును ద్విగుణించుటయు, త్రిగుణించుటయు నెందులకు? ఎత్తినజన్మము నొకరీతిగా సాఁగి పోనీవలయును. ప్రతిపదమున నవరోధముకలిగించినచో దశధా విశీర్ణమైన నదివోలె వేణి సన్నగిల్లి పలుచఁబడును. ప్రతి చిన్న విషయమునను శక్తి చాలదు." ఆ మఱునాఁటినుండి మఱల రత్నావళియును, రంగఁడును మాట్లాడఁజొచ్చిరి. రెండు నెలలు శాంతముగా సాఁగిపోయెను. రత్నావళిపరీక్షకుఁ గూర్చుండెను. పరీక్షలైనతరువాత ముకుందరావు వెళ్ళిపోవుదు ననెను. రత్నా వళి మనస్సు మఱియు వికాసము పొందెను. ముకుందరావు పూర్వముచెప్పిన చదువువేఱు. ఇప్పుడు చెప్పిన చదువు వేఱు. ఎంతసేపటికిని గర్భానుభూతి, వైరాగ్యము, జీవితములోయథా ప్రాప్తముగా సంభవించిన విషయములను స్వీకరించి యనుభ వించుట; ప్రాణము నొక శాంతమార్గమున నడుపుకొనుట—

ఈసారి ముకుందరావు నుపన్యాసములన్నియు నీమార్గము పట్టెను. రత్నావళికి మునుపటి యుద్వేగము లేదు; వాదించు నహంకారము లేదు. ముకుందరావు వెడలిపోయెను. ఏదో కాల ముగడచెను. మఱల మూఁడునెలలయ్యెను. రత్నావళి పరీక్షలో ప్రథమ తరగతిలో నుత్తీర్ణురాలయ్యెను. ఆమె కొక యున్నత పాఠశాలలో నాంధ్రపండితపదవి లభించెను. అది బాలికా పాఠశాల. నెలకు వేతనమేబది. రంగారావు మఱియొక పత్రి కకు సంపాదకుడయ్యెను. అది ఇంగ్లీషుపత్రిక. అతఁడు నెలకు డెబ్బదియైదు రూకలు తెచ్చుచుండెను ఒకనాఁడు రత్నావళి “రంగా! ప్రేమయన్నచో బ్రహ్మపదార్థముకాదు. అది దివ్య మైన వస్తువు కాదు. ‘ప్రీఙ్ తర్పణే కాంతౌ’ అను ధాతువు నుండి పుట్టినశబ్దము. దానిమీఁద ‘ఇమనిచ్’అను ప్రత్యయము చేరి ‘ప్రేమ’యైనది. ప్రేమయనఁగా సంతోషించుట, తృప్తి కనుట, ఇష్టపడుట, ప్రకాశించుటయనియర్థము. ఒకపురుషుఁడు గాని, స్త్రీగాని తాను మఱియొక వ్యక్తియం దిష్టపడుటప్రేమ. వారిర్వురును గలిసి పోరును, పొక్కును లేకయుండుట. అప్పు డొకరియం దొకరు స్నిగ్ధు లగుదురు. వారు చేసిన పనులు వీరి కిష్టము; వీరు చేసినపనులు వారి కిష్టము—కామవిమయికమైన తృప్తి యొకరియందొకరికిఁగలుగును గనుక అట్టితృప్తి మోక్షము కాదు అది వైరాగ్యము కాదు. జీవితములో నొక సుఖ సాధనము”అనెను. రంగడు—ప్రేమ యనునది దివ్యము. వేదాం తము లన్నియు దొంగవి. వైరాగ్యము, మోక్షము నను నవి నిర్వ్యాపారులు చెప్పుమాటలు; క్రియాశక్తిరహితు లను మాటలు. రత్నా—నీకు నీజన్మకు యథార్థవస్తుపరిజ్ఞానము కలుగదు. నేను నీతో నింక వాదించను. పోట్లాడను.

ఆమఱునాఁడు ప్రొద్దుననే వాకిటిలోఁ దొల్లింటి బైరాగి పాడు చుండెను.

"మూఢతకు మొదలేమి తుదియేమి- మొగిడిపోయెడి మనసు
గాఢమగు చీఁకటిని గ్రప్పుకొన్నదిలే-జమిలి దుప్పటివోలె కప్పుకొన్నదిలే.
మూడమంచే క్రమ్ముకొనువేళ-మొగుడు కన్నులముందు
కూడి యేవస్తువును గోచరించదులే-ప్రతిబింబముంబోలె గోచరించదులే.
వాడవాడల తిరుగు బైరాగి - బోడిపాటలయందు
కాడి నీ వొకవెలను కట్టబోవవులే-చిల్లిగవ్వంతైన కట్టఁబోవవులే.

రత్నావళి వెలికివచ్చి "బాబాజీ! క్రొత్తపాటలు నేర్చుకొన్నావే" యనెను బైరాగి "అమ్మా! నేర్చుకొనుటలేదు. నోటికి వచ్చినట్లు పాడుతున్నాను" అనెను. రంగఁడు నివ్వెరపోయి చూచెను. "నీ విం కెన్నాళ్ళీ యూళ్ళోవుంటావు?" అనెను. బైరాగి బిచ్చము వేయించుకొనకుండ వెడలిపోయెను

---

## పదుమూడవ అధ్యాయము

---

రంగఁడు రత్నావళిని పదిపదునొకండుసార్లు తన్ను వివాహము చేసికొమ్మని యడుగుచువచ్చెను. అతఁడట్లడిగినప్పుడెల్ల నామె యిట్లు బదులుచెప్పెను. "మన మిరువురముకలసి బ్రతుకుచుంటిమి. వివాహము చేసికొనినతరువాతకూడ నిట్లే బ్రతుకుదుమా, మఱియొకరీతిగా బ్రతుకుదుమా? పైఁగా నీవును; నేనును చేసికొనఁబోవునది వివాహము కానేకాదు. అది ఒక ఖరారు, అనఁగా వ్యావహారికమైన యొక నిబంధనగాని వివాహము కానేరదు. వివాహమనఁగా వేఱు." చివరకొకసారి రంగఁడామెను బలవంతపెట్టెను. రత్నావళి యిట్లనెను. "నీవు నన్ను బలవంతపెట్టినచో నేనునీతోఁగలసియుండను. నాజీతముతో నేను బ్రతుకగలను. నీవు నీజీతముతో బ్రతుకవచ్చును. మన కింక సంబంధ

ముండదు" రంగఁడు మఱల నాప్రస్తావన తేలేదు. ఒకనాఁడు రాత్రి రత్నావళి యేదో చదువుకొనుచుండెను. రంగఁడామెను 'వివాహ మనఁగానేమి' యని యడిగెను. రత్నావళి నవ్వెను. రత్నా—విశేషముగా వహించునది యని యర్థము. విశేషముగా ననఁగా, నైహికముగా మాత్రమేకాక పారలౌకికముగా కూడనని యర్థము. పరలోకమునందు, చనిపోయినతరువాత మనము కాఁబోవుమార్పులకు సానుకూలపడుటకు నీజన్మములో కొన్ని కార్యములు చేయవలసియుండును. అట్టికార్యములుస్త్రీపురుషులు కలసిదంపతులుగా నేర్పడియిచ్చుటఁజేయుదురు.అప్పుడది వివాహమగును. రంగ—పరలోక మెట్లుండును? రత్నా—నేను చూడలేదు. రంగ—ఆచూడని దానిని గుఱించి నీ వెట్లుచెప్పుదువు? రత్నా—'తీఁగ కదపినచో డొంక కదలును. మనము చూచినవానినిగుఱించియే విశ్వసింపము. కొన్నిటిని అనుమానముచేత విశ్వసించుదుము.' రంగ—అనుమానము కలిగినపుడు విశ్వసించుటతప్పు. రత్నా—అనుమానమనఁగా నీవనుకొనుసందేహముకాదు. ఊహచేత నిర్ధారణచేయునది యనుమానము. ఆ మాటకు తెలుఁగులో నింకొకయర్థము వచ్చినది. మనదేశమునకు దొరలు వచ్చుచున్నారు. వారందఱు యూరపుదేశమునుండి వచ్చుచున్నారని మన మనుకొనుచున్నాము. మనము యూరపుదేశమును చూడలేదుగదా! చూడకపోయినను ఆదేశమున్నదని నమ్ముచున్నాము. కనుక నొకదానిని నమ్ముటకు దానిని మనమే చూడనక్కఱలేదు. రంగ:—మనస్నేహితులు చూచివచ్చిరి. భూగోళశాస్త్రము చదువుకొనినచో, నా దేశము లున్నవని తెలియును. రత్నా—అట్లే మనశాస్త్రములు చదువుకొనినచో,పరలోకములున్నవని తెలియును.రంగ:—అవినిజమా,

అబద్ధమో! ఎవరును చూచివచ్చినవారు లేరు. రత్నా-మఱి కొంచెము నిశితముగా నాలోచించుము. వారుచూచిరో, లేదో మనకుఁ దెలియదు. వారు చూచివచ్చితిమని చెప్పఁగా మనము విశ్వసించుచున్నాము. అంతియేకదా! రంగ-నీవనినమాటలు నాకర్థ మగుటలేదు. రత్నా:- అందుకనియే నిశితముగా నాలోచింపు మంటిని. రంగ - సరే! లోకములో వివాహము చేసికొనుచున్నవారందఱును నీవు చెప్పిన ధర్మము లేమి చేయుచున్నారు? రత్నా-వారికి కర్మములు చేయుటయందు నధికారమున్నది. తక్కినయేకర్మలు చేయకపోయిననుచచ్చిపోయినపుడు వారికొడుకులుపితృకర్మలైనచేయుదురు. మనకు సంతానముగలిగినచో వారికి మనకు కర్మలుచేయు నధికార ముండదు. రంగ:- ఎందు కుండదు? ఉండును. గొప్ప శాస్త్రజ్ఞులుకూడ నిట్టివివాహములుకూడ ధర్మశాస్త్రము లొప్పుకొనునని చెప్పుచున్నారు. రత్నా-వారు చెప్పుసందర్భములు నాకు తెలియవు. కాని నా భర్తచనిపోలేదు. నపుంసకుఁడు కాఁడు. పరమవృద్ధుఁడుకాఁడు. కుష్ఠవ్యాధిగతుఁడు కాఁడు. నేను లేచిపోయివచ్చితిని. ఇట్టి నా వివాహముకూడ ధర్మశాస్త్రము లొప్పునని వారు చెప్పుదురేమోకనుఁగొనుము. రంగ-మఱి నీ వెందుకు లేచివచ్చితివి? రత్నావళిచేతిలోని పుస్తకము నేలపై విసరి గిరాటువేసెను. కుపితవిధురతనూరేఖయై చరచర నడచి వాకిటిలోనికిఁబోయెను. ఆమెయొక గంటసేపటికి వచ్చి తనదారిని తాను బండుకొని నిదురించెను. తరువాత నాల్గుదినములకు హరియు, శాస్త్రియు వచ్చిరి. వారితో మఱి యిరువురు వచ్చిరి. వారు వచ్చుట రంగనికిగిట్టలేదు. రత్నావళి సుముఖురాలో, విముఖురాలో తెలియలేదు. వారు ప్రొద్దుననే కాఫీ త్రాగుదురు. భోజనమువఱకు

జగత్సిద్ధాంత రాద్ధాంతములను గూర్చి వివాదములు చేయుదురు. భోజనముచేసి రంగఁడును, రత్నావళియును తమ యుద్యోగములకొఱకుఁ బోవుదురు. వారు రంగని సెలవుబెట్టుమందురు. రంగఁడు వెడలిపోవును. వారుసాయంకాలము సినీమాలకుఁ బోయి రాత్రి పొమ్మిదింటికి తిరిగివత్తురు. రత్నావళి మొదటి రెండుదినములు వారికి వంటచేసిపెట్టెను. మూఁడవరోజు వంట చేయలేదు. వారువచ్చినతరువాత వంటయారంభించెను. భోజన మగుసరికి రాత్రి పదునొకండుగంట లయ్యెను. నాల్గవనాఁడు వారే వంటచేసుకొని భుజించిరి. అయిదవనాఁడు హోటలులో తినివచ్చిరి. ఆఱవదిన మాదివారము. ఆనాఁడు మధ్యాహ్నము భోజనముచేసి యందఱును కూర్చుండిరి.హరికిశోరరావిట్లనెను; "రత్నావళిగారు వివాహముచేసికొనుట మంచిది. ఆమె యిట్లుండుట బాగుగా లేదు." రత్నా:-ఎట్లుండుట? శాస్త్రి—అది కాదండీ! వివాహము చేసికొన్నచో మంచిదని హరి యభిప్రాయము. రత్న:-హరి నీ యభిప్రాయ మెవ రడిగినారు? హరి:-నేను మీకు స్నేహితుఁడను. మీ మేలుకోరి చెప్పుచున్నాను. వీరిద్దఱు నా స్నేహితులు. ఇద్దఱును ధనవంతులు. ఇద్దఱిలో మీ రెవరిని కోరినను వివాహము చేసుకొనుటకు వారు సిద్ధముగా నున్నారు. రంగని యభిప్రాయముకూడ నదియే. రత్నా—రంగా! నీ యభిప్రాయ మదియేనా? రంగ—కాదు. రత్నా—తెలిసినదా? ఇంక మీరు వెళ్ళవచ్చును. హరి కిశోరరావు మఱియేమోమాట్లాడఁబోయెను. రత్నావళి "హరీ, నీ వింక మాట్లాడవద్దు. మీరు నలుగురును నా యింటినుండి వెంటనే వెడలిపోవలయును. నీవు నన్నుగురించి చేయుచున్న ప్రచారము నాకుఁ దెలియును. ముకుందరావుగారు నాతోఁజెప్పినారు.

దానికిఁ బదిరెట్లు ప్రచారము చేయుము. నాకుఁజెడిపోవున దేమి యులేదు. నీవు ప్రచారముచేయుటకుఁ బుట్టితివి. గొప్ప బుద్ధిమంతుడవు" అనెను. హరి—ముకుందరావు దొంగ. అతఁడు నేను చెప్పినిమాటలుకూడ చెప్పినాఁడు కాఁబోలును. అతఁడు నాకీసారి కనిపించినచో తన్నుదును. రత్నా:—మిగులుమాటలు రానీయకుము. నీవు ముకుందరావుగారి యెదుట నిలఁబడినచో నాయన నిన్ను తన్నునో, నీవాయనను తన్నుదువో నాకుఁ డెలియును. వృథామాట లెందుకు? మీరు మా యింటనుండి తత్‌క్షణమే పొండు"అని యామె వారి పెట్టెలు, బేడలు బయట వేసెను. శాస్త్రి పోయి రెండురిక్షాలు తెచ్చెను. వారు వెడలి పోయిరి. ఆ నలుగురును మదరాసులో నాల్గుదినములుండిరి. ప్రతి హోస్టలుకు బోయిరి; ఒక్కొక్క-హోస్టలులో రెండురెండురోజులు మకాము. ప్రతిస్థలమునందును రత్నావళిని, రంగనిగుఱించి యభూతకల్పనలు చేసి చెప్పిరి. కొందఱు విద్యార్థులు పనిపెట్టుకొని ప్రతిదినము రత్నావళి యింటిముందుగాఁ బోదురు. ఆ యింటివంకఁ జూచుచుఁబోదురు. నవ్వుచు నేమో చెప్పుకొనుచుఁ బోదురు. ఒకనెలదినములలో మదరాసులో నున్న యాంధ్రులందఱకు రత్నావళిసంగతిఁ దెలిసెను. ఆమెవీధి వెంటఁ బోరాదు. పాఠశాలకుఁబోరాదు ఎక్కడపడిన నక్కడ నెవఁడో యొకఁడు రత్నావళివంక నొక వికారపుచూపు చూచుచునే యుండును. ఒకనాఁడు ముకుందరావు వచ్చెను. అతఁడు భార్యావియోగ దుఃఖమునుండి కొంత తేరుకొనెను. మఱల మునుపటివలె పుష్టి చేరుకొనెను. శరీరమునకుఁ జాయవచ్చెను. మొగములో తొలుతటి సౌందర్యము ప్రకాశించెను. రత్నావళి యతనితో హరికిశోరుని చేష్టలన్నియుఁ జెప్పెను, ముకుందరావు హరికిశోరుని



కొఱకు మదరాసంతయుఁ దిరిగెను. వారు నలుగురు ముకుంద రావును జూచిననాఁడే రైలునెక్కి వెడలిపోయిరి.

ఆ వారము ఆంధ్రపత్రికలో నొకకథ ప్రచురింపఁబడెను. అది వ్రాసినది ముకుందరావు. ఆకథసారాంశ మిది. "ఒక స్త్రీ తన భర్తను వదలి లేచిపోయెను. ఆమె యట్లు లేచిపోయినందులకు మిక్కిలి దుఃఖించి తపస్వినియయ్యెను. ఆమెనుగూర్చి లోకులు పలువురు పలువిధములఁ జెప్పుకొనిరి. ఆమె వారి దుష్టపుమాట లకుఁ గ్రుంగిపోయి యాత్మహత్య చేసికొనెను. తరువాత యథా ర్థము తెలిసెను. జను లందఱును జాలిపడిరి."

ఆ కథలో హరికిశోరరావుపేరు లేదు. కాని చదివినవారికి వాని స్వరూపము కనిపించుచుండెను. అందఱకు నది రత్నావళికథ యని తెలిసెను. రత్నావళిలో గొప్పమార్పు వచ్చెను. ఆమె కాషాయవస్త్రములు ధరించుచుండును. తలదువ్వుకొనుటమాని వేసెను. చేతులకు గాజులుతప్ప నగలన్నియుమానివేసెను. మొగ మున తిలకము ధరించుటలేదు. ఒకనెలదినములలో రత్నావళి వంక నెవరును చూడలేదు. ఆమెపాఠశాలకుఁ బోవును, వచ్చును. ఎవరితోను మాటాడదు, నవ్వదు; అటు నిటు చూడదు.

రంగడు రత్నావళిమార్పునకు విచారించెను. ఒకనాఁడురత్నా వళితో నతఁ డిట్లనెను. "ఎవరో యన్నా రని నీ విట్లు మాఱ వలసిన యవసరములేదు. బైరాగిదానివలె కనిపించుచున్నావు."

రత్నా—నే నెవరో అన్నారని మాఱలేదు. అయినను మాఱిన దేమియు లేదు. ఉద్యోగము చేయుచునే యుంటిని. నీతోనే యుంటిని. భోజనము చేయుచునే యుంటిని. చీరరంగు మార్చి తిని. నగలు తీసివేసితిని. దొరసానులు నగలుపెట్టుకోరు. బొట్టు పెట్టుకోరు. పెద్దమార్పేమి యున్నది? రంగడు—ఈరంగుచీరలు

మానివేసి తెల్లచీరలుకట్టుకొనుము. లేదా,యీరంగులోనవేపట్టు చీరలు కట్టుకొమ్మా." ఆమె కాషాయవర్ణముగల పట్టుచీరలు ధరింప నారంభించెను. రంగనికనుల కామె మునుపటికన్న నందముగాఁ గనిపించెను. ఒకనాఁడురాత్రి రంగఁడు రత్నావళి నిట్లడిగెను. "నీకుఁ బ్రపంచము మీఁద వైరాగ్యము కలిగినది. ఎప్పుడో నన్నుకూడ వదలిపోయెదవు." రత్నా—నిన్ను సామాన్యముగా వదలిపోను. నీవలన నే నిట్లయితినో, నావలన నీవిట్లయితివో నాకుఁ దెలియుటలేదు. నేను నిన్ను వదలిపెట్టినచో నీ వేమగుదువో నాకుఁ దెలియదు. నీకోసమే యీసంసారముచేయుచున్నాను. నేను లేకుండ నీ జీవిత మెట్లో యొకట్లు పరిష్కారమగునని నాకుఁ దెలిసినవెంటనే నిన్నువదలి పోవుదును. రంగ—నామీఁద నీకంత ప్రేమ లేనప్పుడు న న్నేల వదలిపోవు?
రత్నా—ఒకప్పుడు నిన్ను నేను ప్రేమించితిని. అప్పుడు నామీఁద నీకుఁ బ్రేమలేదు. ఆ లేకపోవుటవలన నేను పడినబాధ నాకుఁదెలియును.ఇప్పుడునామీఁదనీకుఁబ్రేమకలదు. నేనునిన్ను వదలిపోయినచో నే నెటువంటిబాధ పడితినో నీవు నటువంటి బాధపడుదువు. రంగ—నామీఁద నీకు ప్రేమ లేదన్నమాట.
రత్నా—లేనిచో నీ పాటికే వెడలిపోయియుందును. ప్రేమలో తారతమ్యము లుండును. ఒకరిని మనయంతట మనమే ప్రేమింతుము. ఇది యొకరకపు ప్రేమ. ఒకరు మనలను ప్రేమించుచుండఁగాఁ మనము వారిని తిరిగి ప్రేమింతుము. ఇది యింకొకరకపుప్రేమ. కొంచెము భేదమే తప్ప రెండును నొకటియే." తరువాత కొన్నాళ్ళకు రంగఁ డొకనాఁడు సాయంకాలమున నింటికి వచ్చెను. రత్నావళితో "రత్నా! నేఁడు నీలాంబరుఁడు కనిపించె" నని చెప్పెను. రత్నావళి "నీలాంబరుఁ డెవ" రనెను.

రంగ:-నీలాంబరునే యెఱుఁగవా? మా మేనల్లుఁడు. మా సర స్వతికొడుకు. వాఁ డిచ్చటికి 'ఇంటర్మీడియేట్' చదువుటకు వచ్చెను. ఇంతవాఁడు సాఁగెను పొడుగెదిగెను. ఇంతయొమ్మను, వాఁడును వస్తాదువలె నుండెను. నేను వానిని మనయింటికిరమ్మం టిని. వాఁడు నన్ను చూచి దూరదూరముగాఁ దొలఁగిపోయెను. నేనుపోయి పట్టుకొంటిని. మనయింటికి రేపుసాయంకాలము తీసికొని వచ్చెదను. రత్నా:-అతఁడువచ్చునో,రాఁడో? రంగ:- నేనేపోయి తీసికొని వచ్చెదను. ఆరాత్రి పండుకొనఁ బోవునపుడు రత్నావళి రంగని నడిగెను. "ప్రతిష్ఠాపురములో నందఱును క్షేమముగా నున్నారేమో." రంగఁడిట్లు చెప్పెను. "మాఅమ్మ కులాసాగానే యున్నదఁట. సరస్వతికూడ క్షేమముగానే యు న్నదఁట" రత్నావళి రంగనివంకఁజూచెను. రంగఁడు తరువాత నేమియుఁ జెప్పలేదు. రత్నావళి యడుగలేదు. ఆరాత్రి రత్నా వళికి నిదురపట్టలేదు. పూర్వకథ లన్నియు నామెకు జ్ఞాపకము వచ్చెను. తా నిప్పుడు 'విదుషి'. లోకజ్ఞానము చక్కఁగా కుదుర్చుకొన్నది. కాని జీవితపాత్రలో విష మొలికిపోయినది. ఈ విషము తొలఁగించుటకు వీలులేదు.

ఆమె కనులు మూసికొన్నది. ఆ నాఁడు తాను లేచివచ్చిన వేళ బండి మలుపుతిరిగినవేళ సీతారామయ్య నడివీథిలో జదికిలఁబడి మీ రనుభవింతు రనుభవింతు రని యేడ్చెను. ఆ యేడ్చుచున్న సీతారామయ్య యామెకనులకుఁ గనుపించెను.

ఆహా! యేమియనుభవము! శాపమువలె తగిలివచ్చెను. ఈ యనుభవములో నొక వాడిమి యేర్పడెను. ఒక వ్యాధియో, ఒక శరీరకష్టమో, ఒక దారిద్ర్యమో యయినచో నీయనుభ వమున కింత పద నుండదు. రత్నావళి నాల్కఁ దడియారెను.

ఆమె మంచితీర్థము త్రాగి పండుకొనెను.

ఆ మరునాడామె లేచి స్నానము చేసెను. మడి కట్టుకొనివంట చేసెను. వంటచేయుటకు మడికట్టుకొని చాల దినములయ్యెను. రంగఁడు భోజనముచేసెను. ఆమె విస్తరిలో వడ్డించుకొని మఱల నేమనుకొనెనో మఱల భోజనము చేయకుండనే పాఠశాలకుఁ బోయెను. ఆ సాయంకాలమున తొందరగా నింటికి వచ్చెను. రాత్రి యెనిమిదింటివఱకును రంగడు వచ్చునని యెదురు చూచు చుండెను. అప్పటికి రంగఁడు వచ్చునట్లు వాకిటిలో కాలి చప్పుడు వినిపించినది. ఆమె యింకొక కాలిచప్పుడు కోసము జాగ్రతగా వినెను. లోనికి నిద్దరును వచ్చిరి. నీలాంబరుఁడు సిగ్గు పడుచు వచ్చెను. ప్రతి యడుగునందును వెనుకడుగు వేయుచు నున్నట్లుండెను. తలయెత్తి చూచుటయే లేదు. కుఱ్ఱవాఁడు మంచి రూపసి. వయస్సుకు దగిన పొడుగు, నురువును కలిగియుండియుఁ గ్రుంగియున్నట్లు కనుపించెను. రంగఁడు 'అదిగో! మీా మేనత్త' అని నీలాంబరునకుఁ జూపించెను. రత్నావళి 'నేను మేనత్తను కాను! అతని మేనత్త చనిపోయి మూఁడేండ్లు కావచ్చినది' అనెను. నీలాంబరుని భుజములు, నరములు నిలువత్రొక్కు-కొని కొంచెము నిలచెను. రత్నావళి నీలాంబరునితో మాటాడ లేదు. రంగఁడే మాటాడుచుండెను. రంగ డెంతసేపటికిని తన యన్నగారి ప్రస్తావన చేయఁడు. రత్నావళి యింటిలో నేవియో లేవని బజారునకుఁబోయి వెంటనే తీసికొనిరావలయునని రంగని బొమ్మనెను. రంగడు నీలాంబరుని దిగవిడిచిపోవుట యెట్లనెను. రత్నావళి యతనితో నేను మాటాడుచుందును. నీవు పోయి రమ్మని పంపెను. నీలాంబరుఁడు తానుకూడ పోవుదుననెను. రత్నావళి" మీా మేనమామ యిప్పుడేవచ్చును. ఫరవాలేదుండు

మనెను. రంగఁడు నిప్పుడే వత్తునని వెళ్ళెను. రత్నావళినీలాంబ రునివంకఁ జూచుచుండెను.నీలాంబరుఁడు తల వంచుకొనికూరు చుండెను. రత్నా—ఇంటివద్ద నందరును బాగున్నారా? నీలా— ఊఁ! రత్నా—నాయనా! నీవు కొంచెము పెద్దవాడవయినావు; నాతో మాట్లాడుటకు నీకు బిడియముగా నున్నది. కోపముగా నున్నదేమో? అవును. నేను చేసిన పనికి నా మీఁద నీకు కోప ముంఘుటలో దోషమేమియును లేదు. కాని నేను చేసిన పాప మునకు నే ననుభవించుచుంటిని. నీలా – ఏమి అనుభవించు చుంటివి? నీవు విద్వాన్ పరీక్ష ఇచ్చితివి. ఏబది రూపాయలు తెచ్చుచుంటివి. ఆయన యొక యఱువదియో డెబ్బదియో తెచ్చుచుండెను. మాకు సుఖముగా నున్నది.

రత్నా—నాయనా! క్షమింపుము. నీ వింతవాఁడ వైనందుకు సంతోషించుచున్నాను. నీవు ముకుందరావుగారివలె నిర్భయ ముగా మాటాడుచున్నావు. నాయనుభవము మనస్సులో నను భవించుచున్నాను. నీలా—అప్రతిష్ఠ మాటయా? దాని కేమి? అది ఒకలెక్కలోనిది కాదు. రత్నా – అప్రతిష్ఠ కాదయ్యా! రత్నావళి తలవంచుకొనెను. నీలాంబరుఁ డామెవంకఁజూచెను. ఆమె కన్నులవెంటనీళ్ళుజొటజొటకారుచుండెను.నీలాంబరుఁడు కొంచెము మెత్తపడెను. రత్నావళి తనకన్నీళ్ళు నీలాంబరుఁడు చూడకుండ తుడుచుకొనెను; ఆమెయిట్లనెను."నేనడుగుటకునా కధికారములేదుకాని నిన్నొకమాట యడిగెదను. సమాధానము చెప్పెదవా?" నీలా – అడుగుము. రత్నా – మీ మామగారు క్షేమముగా నున్నారా? నీలా – అది నీ కెందుకు? రత్నా— అయ్యో!నీవు చిన్నవాఁడవు. నీకాళ్లు పట్టుకోరాదు. మీ చిన్న మేనమామ ఎన్ని ప్రశ్నలు వేసినను ఆప్రశ్న వేయలేదు. నేను

ప్రొద్దుటినుండి భోజనము చేయలేదు. ఈమాట నిన్నడిగి భోజనము చేయుదమని యూరకుంటిని. నీకు దయయున్నచో చెప్పుము; లేనిచో లేదు. నీలా—నేను చెప్పనిచో నీ రాత్రి కూడ భోజనము చేయవా? రత్నా—నీవు వలదన్నచో చేయను. ఆత్మహత్య చేసికొమ్మన్నచో చేసికొందును. నీలా – నే నెవఁడను, ఆత్మహత్య చేసికొమ్మనుటకు? రత్నా – నా కిదివరకే యాత్మహత్య యయినది. ఇప్పుడు చేసికొన్నచో శరీరమునుమాత్రమే చంపునది. నీలా – మామామ క్షేమముగానే యున్నాఁడు. మరల వివాహము చేసికొన్నాఁడు.ఆమెయంతయందకత్తెకాదు. కాని మంచియింటిపిల్ల. రత్నా—నేను మంచియింటిపిల్లనుకాను! అవునయ్యా! నేనును మంచి యింటి పిల్లనే. నా పూర్వకర్మమిట్లున్నది. నా అందము నన్ను చెఱచినది. నీలా – అందకత్తెలు చాలమంది సరిగానే కాఁపురము చేయుచున్నారు. రత్నా:– నీవు చిన్నవాఁడవు. నీచేత నీమాటలుపడుటకు నేను తగను అనను. నీలా:—నేను కోపములో నన్నాను. క్షమించుము. రత్నా:—నీవు రత్నమువంటి తండ్రివి పుట్టినావు. నీలా:— నీ వింత తెలివికలదానవు. ఈలాగెట్లయితివో తెలియదు.

రత్నా:—నీవు ముకుందరావుగారి నెఱుఁగుదువా? నీలా—నేనాయనదగ్గఱ చదువుకొన్నాను. రత్నా:—ఆయన నాసంగతి నీ కెప్పుడును చెప్పలేదా? నీలా:—చెప్పలేదు. ఆయన నిన్నెట్లెఱుఁగును. రత్నా:—నేనాయనయొద్ద చదువుకొన్నాను.ఆయనయొద్ద చదువుకొనక పోయినచో నీ వింత నిశితమైన బుద్ధికలవాఁడ వెట్లగుదువు? నీవును, నేనును ఒక్క గురువునొద్దనేచదివినాము. నన్నింక సరిగా నర్థము చేసికొందు వనుకొందును. నీలా—నీవు మొదటనే ఈసంగతి చెప్పినచో నేనిట్లు మాటా

జేసివాఁడనేకాను. రత్నా——మీ మామగారు సుఖముగా నున్నారని చెప్పితివి. మరల వివాహము చేసికొని రంటివి. నా కంతియేచాలును. నీలా——ఏమి లాభము? నీ వాయనకు కాక పోతివి. ఇంత మంచియామెతో యాయన యెంత సుఖపడెడి వాఁడో. నేనింకపోవుదును. రంగఁడు రాకముందు పోయెదను. నాకు పనియున్నది. రత్నా—మరల నెప్పుడైన వచ్చుచు పోవు చుందువా? నీలా——రంగఁడున్నచో రాను. రత్నా——శని వారములు నాకు సెలవు. రంగని కాఫీసుండును. నీలా——అయి నచో వచ్చెదను. నీలాంబరుఁడు వెళ్ళెను. రత్నావళి కతనితో మాటాడుట చిత్రముగాఁదోఁచెను. పదునెనిమిదేండ్లకుఱ్ఱవాఁడు. అతనిమనస్సెటువంటి పరిణామమునుపొందెను. అతనిమనస్సెంత సుకుమారము. ఎంతకఠినము. ఎంత సూక్ష్మగ్రాహిత్వము! ఏమి వివేకము! రంగఁడువచ్చెను. రత్నావళి స్నానముచేసి, వంటచేసి భోజనము చేసెను. రంగఁడుతరువాత తానువడ్డించుకొనితినెను. రంగఁడు పండుకొన్న తరువాత రత్నావళి యతసని పలుక రించెను. "మీ యన్నగారిసంగతి మీమేనల్లుని నేమైన నడిగి నావా?" రంగ——అడుగలేదు. రత్నా——ఎందుచేత? రంగఁడు మాటాడలేదు; రత్నా—నీకాయనసంగతి ఏమియు పట్టలేదా? రంగ—ఆయనకు నాసంగతి పట్టినదా ? రత్నా——ఎందుకు పట్టలేదు? నీవీనాఁడు సుఖముగా నున్నచో నాయనచేసినదే. నీవొకచోట పదిరూపాయలు తెచ్చుకొంటి వనఁగా నాయన చేసినమేలేకదా నీయొద్దనీనాఁడు నిలువ వైదువందలరూపాయ లున్నవి; నావద్ద ఒక నాలుగువంద లున్నవి. ఈమేలంతయు నెవరుచేసిరి? రంగ—ఆయన లేకపోయినచోఁ జనిపోయెడి వార మందువా? రత్నా—బిచ్చ మెత్తుకు తినెడివారము. ఆయన నీకీ

చదువు చెప్పించనిచో నీకుద్యోగము దొరకునా? రంగ—నీ కాయనమీఁద నంతప్రీతిగా నున్నచో మరల పోయి యాయ నను పెండ్లి చేసికొనుము. రత్నా—ఆయనను నేనుమరల పెండ్లి చేసికొననక్కఱలేదు. నేనిదివఱకే యాయన పెండ్లమను.రంగ:— అవును, భార్యవు. రత్నా:—నీకుమాటలకు సరిగా నర్థము తెలి యదు. పెండ్లిచేసికొన్నచో పెండ్లమగును; భరింపఁబడినచో భార్యయగును. రంగ:—నేను విద్వాన్ పరీక్షకాలేదు. రత్నా:— మీాయన్నగారు మరల వివాహముచేసి కొన్నారఁట. రంగ:— మంచిపనిచేసినాఁడు. ఆమెగొంతుకఁగూడ కోయునుకాఁబోలు. రత్నా:—ఆ యింటిలో నింకొకరంగఁడు లేఁడుకదా! రంగ— నీ వనినమాట నాకర్థము కాలేదు.

రత్నా—అర్థము కాలేదా! నీవు వచ్చి వేసితివి. ఆపిల్లను లేవఁ దీసికొనిపోవువారెవ్వరు? రంగడు—నీలాంబరుఁడు లేఁడా?రత్నా— లేపు నీలాంబరుఁడు వచ్చినప్పుడు నీవిట్లంటి వని చెప్పెదను. రంగ—నిజముగాఁ జెప్పెద వేమి? వాఁడు నాతో మాట్లాడు టకే యిష్టపడలేదు. ఈమాటవిన్నచో వానికికోపమువచ్చును. రత్నా—కోప మెందుకు? మేనమామభార్యను లేవఁదీసికొని పోయి సుఖముగా నుండును. అన్నభార్యను లేవఁదీసికొనిపోవుట కన్న చెడిపోయినదా? రంగ—నిజముగా నాయన మరల వివా హము చేసికొనెనా? రత్నా—అనియే నీలాంబరుఁడు చెప్పెను. రంగ — అబద్ధము. రత్నా — అందఱు నబద్ధములు చెప్పరు. రంగ—నిజమేయైనచో నా పిల్ల ఏమి సుఖపడును? రత్నా— నీతో నుండి నేనేమి సుఖపడుచున్నాను? రంగఁడు మరల మా టాడలేదు. అతడు మనస్సులోఁ గ్రుంగిపోయెను. శనివారమునాడు నీలాంబరుఁడు వచ్చెను. రత్నావళి నీలాంబరునకు పూరీలు

చేసి పెట్టెను. నీలాంబరుఁడు తినుటకు సంశయించెను. రత్నా—ఫరవాలేదు తిను! నేతితో వండినవి; తినవచ్చును. నీలాంబరుడు తినెను. రత్నా—నేను వచ్చిన తరువాత నింటిలో నెట్లున్నది? నన్నింటిలో నెప్పుడును తిట్టుచుందు రనుకొందును. నన్ను తిట్ట వలసినదే. నీలా—నీసంగతియే మా యింటిలో ననుకొనరు. రత్నా—అవును. అనుకొనఁగూడదు. ఈమాట లాపిల్ల విన్నచో నామెకూడ చెడిపోవునేమో? ఆమె కాఁపురమునకు వచ్చి నదా? నీలా—ఆఁ! వచ్చి యేఁడాది అయినది. రత్నా—ఆమె పేరేమి? నీలా—నాకు తెలియదు. పెండ్లి జరిగినప్పుడు నేను లేను. ఇంటిలోనెవ్వరును నామెనుపేరుపెట్టి పిలువరు. నేనెప్పుడు నడుగలేదు. రత్నా—నీ వామెతో మాట్లాడుదువా? నీలా—మాట్లాడుట కేముండును? ఆమె మసికట్టుకొన్నచో వడ్డించు నపుడు నా కేదైన కావలసినపుడు 'అత్తయ్యా' అని పిలుతును. రత్నా;—ఆమె వంటచేయునా? నీలా—రెండుపూఁటలు నామె యే చేయును. రత్నా—మీ అమ్మ ఏమి చేయును? నీలా—ఆమె యింటిలోని పై పనులన్నియుచేయును. బావికిపోయినీళ్లు తెచ్చును. రత్నా—పసిపిల్ల నలిగిపోదా? నీలా—నా కేమి తెలియును? ఊరకే పనిలేక కూర్చున్నచో నదిమాత్రముమంచిదా? రత్నా:—నిజమే. మంచిదికాదు. ఎంత మంచిదో నా మూలముననే తెలిసినది కదా? నీలా:—నీవు సుఖపడు చుంటివికదా! మాటిమాటికి నట్లనుకొనెదవేమి?

రత్నా—సరేకాని అత్తయ్యగారు కులాసాగా నున్నారా?నీలా—మా అమ్మమ్మ మునుపటివలె లేవలేదు. ఇంటిలో పని చేయ లేదు. మొన్న ఒకనాఁటిరాత్రి లేవఁబోయి క్రిందఁబడినది. మో చేయి విఱిగినది. అది నెమ్మదించుటకు నెలనాళ్ళు పట్టినది.

రత్నా—ఇంక నేమైన కబురులు చెప్పుము. నీలా—చెప్పుట కేమి యున్నది? ఏమియును లేవు. రత్నా—మీ పెద్దమేనమామగారు నేను వచ్చినతరువాత చిక్కిపోయెనా? నీలా—ఏమి ప్రశ్నలమ్మా అవి? ఆయన చిక్కిన నీ కేమి, చిక్కకున్న నీ కేమి? రంగఁడు బొద్దుగానున్నాఁడుకదా! రత్నా—అవిపారవేసితివేమి? ఆరెండు పూరీలుకూడ తినుము. నీలా—నేను తినలేను. రత్నా—మీమామ గారు క్రొత్తగా పొలము కొన్నారా? నీలా—పదియెకరాల మాగాని తన పేర నుంజూరు చేయించుకొన్నాఁడు. దాని మీఁద నీయేఁడే మొదటిపంట వచ్చినది. శిస్తుకు దానికి సరిపోయినది. క్రమముగా నది యెక్కువ పండునని యనుకొను చున్నాము. రత్నా—అందులో నీకు కొంత యిచ్చునా? నీలా—ఆయన నా కేమి ఈయవలయును? నాకు చదువు చెప్పించుచున్నాఁడు చాలదా? నాకు పెండ్లి చేయును. ఎక్కడనో నేనే సంపాదించు కొందును. రత్నా—మీ మేనమామ నీ కందులో కొంత పొల మిచ్చును. ఆయనను నేనెఱుఁగుదును. నీలా—నీ వెఱుఁగుదువు! రత్నా—నీవును కొన్ని చులుకుమాట లాడుదువు నీలా—నే నేమాడితిని? రత్నా—నాకు తెలియును లే! ఆ కుఱ్ఱవాఁడు—నీ బావమఱఁది చనిపోయినాఁడు. మఱల నీ సంబంధమునకైన నొక కొడుకు పుట్టినచో బాగుగా నుండును. నీలా—అదినీ కేమి లాభము? రత్నా—వాఁడు నాకుమాత్రము తద్దినము పెట్టఁడా? నీలా—నీకు కొడుకులు గలుగరా? రత్నావళి వడమటింటి లోనికిఁ బోయెను. ఎంతసేపటికిని రాలేదు. నీలాంబరుఁడుకొంత సేపు కూర్చుండి వెడలిపోద మనుకొని, యామెతోఁ జెప్పవలె నని, యెట్లు పిలువవలెనో తెలియక లోనికిఁబోయి చూచెను. రత్నావళి యచట కూర్చుండి యేడ్చుచుండెను. ఆమె నీలాం

బరునిఁ జూచి కళ్ళు తుడుచుకొని లేచివచ్చెను. "కన్నులలో నేదో పడినది. పొయ్యియూదఁబోయితిని. ఆ దుమ్ము వచ్చి కన్నులలోఁ బడిన"దనెను. నీలాంబరుఁడు రత్నావళి యెందు కేడ్చుచున్నదో తెలిసికొనలేకపోయెను. అతఁడు "నేను పోవుచుంటిని. నీతో చెప్పుటకు వచ్చితి" ననెను.

రత్నా:—నీవు మొన్నను, నేఁడునుకూడ నన్ను "నత్త" యని పిలువలేదు. పూర్వము నన్ను 'అత్తా' యని పిలిచెడువాడవు. జ్ఞాపకమున్నదా? ఇప్పుడు క్రొత్తగా నున్నదకాఁబోలు. న్యాయమే. నీలా:—నీ వేడ్చుచుంటివి. ఎందు కేడ్చెదవు?

రత్నావళి బిగ్గఱగా నేడ్వనారంభించెను. నీలాంబరున కేమియు దోచలేదు అతఁడు తాను వెళ్ళెద ననెను. రత్నావళి ఏడ్పు మాని 'మరల శనివారమునాఁడు వత్తువుకదా' యనెను. అతఁడు 'వత్తు'ననెను. నీలాంబరుఁడు వెడలిపోయెను.

రత్నావళి యింటిలో నటునిటు తిరుగును. ఎక్కడ కూర్చున్నను నామెకు తోఁచలేదు. నీలాంబరుఁడు సరిగా పెద్ద మేనమామ పోలిక. నీలాంబరుని చూచినంతసేపు రత్నావళికి సీతారామయ్య తన యెదుట కనిపించుచున్నట్లుండెను. ఆమెకు చనిపోయిన తనసవతి జ్ఞాపకమువచ్చెను. ఆమె తనవలెఁ జేయునా? ఆమె పేరుమీఁద నా నలుసైన మిగులరాదా? ఆమెకూఁతురు కాఁపురముచేయుచున్నది ఆపిల్ల తనవెంట 'పిన్నీ! పిన్నీ!'యని పడి తిరుగుచుండెను. ఆమె యిప్పుడు తననుగుఱించియే యాలోచించదు. తన ప్రసక్తి వచ్చినచో నామె యేమనునో! 'ఛీ! తప్పుడుముండ. నాపిన్ని ఏమి'టనను కాఁబోలు. అయ్యో! తనమామ తననుగూర్చి యేమనుకొనెనో? తనబంధువు లేమను కొందురో? తనవలన వారి కెంత యప్రతిష్ఠయో? లోకములో

నొక్క శరీరసుఖము వాంఛించి యెన్ని బంధములు కోసికొం దురు? ఎందఱకు తలవంపులు తెత్తురు? ఈ శరీరసుఖము ఎంత వఱకు నిజమో! అయ్యయ్యో! ఒక పురుషుడు, నొక స్త్రీయు కనీ సము ఒక రెండేడ్లయినను కలసి కాపురము చేయనిచో నీ సౌఖ్యముయొక్క యథార్థ స్వరూపము తెలియదే! అందము చూచి, యౌవనముచూచి స్త్రీపురుషులు తక్కినదృఢానుబంధ ములు త్రెంచుకొని పోవుచున్నారు. అహా! ఎంత అంధలోకము! స్త్రీపురుషుల సమాగమము చిత్రమైనది. దానిలో అనేక రహ స్యము లున్నవి. ఏమియుఁదెలియని యజ్ఞానులు - నావంటివారు వృథావ్యామోహితు లగుచున్నారు, మోహము వేఱు; ప్రేమ వేఱు; స్త్రీ పురుషసుఖము వేఱు; సంసారసుఖము వేఱు; చిఱు తిండి ఎంత తిన్నను నన్నము తిన్నట్లుకాదు.

ప్రొద్దుక్రుంకుసరికి రంగఁడు వచ్చెను. రత్నావళి కనులు ఉబ్బి యెఱ్ఱపడియుండెను. మొగము గండరించియుంచెను. శరీరము స్రుక్కియుండెను. అతఁ 'డట్లుంటి వేమి' యని యడిగెను.

రత్నా:—రంగా! యౌవనము శాశ్వతము కాదు. రంగ:— శాశ్వతమని ఎవరుచెప్పిరి? రత్నా:—నీకు మునుపటి యారోగ్య మిప్పుడు లేదు. రంగ:—నేను వ్యాయామము చేయుట మానివేసితిని. వేళ కాహారముకూడ లేదు. తొందరగాఁ బ్రొ ద్దుటిపూఁట నాల్గుమెతుకులు నోటిలో వేసికొనిపోదును. రాత్రి యొక్కొక్కప్పుడు నేనే వంటచేసికొనవలయును. ఆపూఁట కేది యున్నచో నదియే వేసికొనితిందును మధ్యాహ్నమా కాఫీహో టలులలో నేదైన తిన్నచో నాకు పడుటలేదు. రత్నా:—నీకిప్పు డెన్ని ఏండ్లు? రంగ:—ఆ లెక్క ఇప్పు డెందుకు. నలువదిఏండ్లు. రత్నా:—అట్లే కనిపించుచున్నావు. ఇప్పుడు నీభార్యనెవ్వఁడైన

లేవదీసికొనిపోయినచో నేమి చేసెదవు? రంగ:— నాకు భార్య యేదీ? రత్నా:—నేను నీకు భార్యనేకదా! రంగ:— మనకు వివాహమే కానిదే! రత్నా:—ఓయీ నీకన్న మూర్ఖుఁ డింకొకఁ డుండఁడు. వివాహము వివాహ మని గోలపెట్టెద వెందులకు? వివాహముచేసికొనిఎవరుసుఖించిరి? చేసికొనినవారినిఎవరుసుఖ పడ నిచ్చుచున్నారు? నేను నీకుభార్యను. వివాహము చేసికోని భార్యను.నేను నీచేత భరింపఁబడుచున్నాను.రంగ:—నీజీతమునీవే తెచ్చుకొనినిన్నునీవేభరించుకొనుచున్నావు.రత్నా:—భరించుట యనఁగా శరీరమును భరించుట కాదోయీ! లోకములో నా ప్రతిష్ఠనో, అప్రతిష్ఠనో భరించుచున్నావు. నా మర్యాదను భరించుచున్నావు, నా బ్రతుకులోని లౌకిక సామంజస్యమును భరించుచున్నావు. నీవు భరింపకపోయినచో నన్నీవఱ కెంత మందియో వాంఛించియుందురు. మొన్న హరికిశోరరావువచ్చి చేసినయల్లరి యెఱుఁగుదువు కదా? రంగ:—దానిని ముకుంద రావు భరించినాఁడు. రత్నా:—ఒక్కొక్కప్పుడు బిడ్డ ధర్మము లను తండ్రి భరించును. అటులనే డామె భర్తకొఱకు భరించును. ముకుందరావుగా రది నీకొఱకు చేసెను. రంగ:—సరే. ఏమం దువు? రత్నా నేను నీకు భార్యను. రంగ:—ఒప్పుకొన్నాను. రత్నా:—నీవు నలుబది ఏండ్లవానివలె నున్నావు. రంగ:—మనో వ్యాధిచే నిట్లయినాను. రత్నా:—కారణము లెవరికిఁ గావల యును? నీవు వయసు మీఱినవానివలె కనిపించుచున్నావు.అం తియే కావలయును. రంగ:—సరే! తరువాత నే మందువు? రత్నా:—ఇప్పుడు నీ భార్య నెవఁడో లేవఁదీసికొని పోవును. కాదు, ఆమెయే ఎవనికొఱకో లేచిపోవును. నీ వేమి చేసెదవు? రంగ:— ఇంతకును నీవు లేచిపోదు నందువా? రత్నా:—అప్పుడు

నీవేమి చేసెదవు? రంగ:-ఎవనితో లేచిపోదువు? రత్నా:-నే నొకనితో లేచిపోదును! నీ వేమగుదువు? రంగ:-వాఁ డెవడో వాని ప్రాణములు తీసెదను. రత్నా:-వాఁ డిదివఱకు నీప్రాణములు రక్షించినవాఁ డనుకొమ్ము. రంగ:-అట్లయినను వానిని వదలిపెట్టను. రత్నా:- అబ్బా! అట్లనా! ఎవఁడు పూర్వము నీవలన నిట్టి యుపకారము పొందెనో వాఁడే యట్టి యుపకారము మరల నీకుఁ జేయు ననుకొనుము. ఏమిచేసెదవు? రంగ:-మా యన్న నిన్ను మరల స్వీకరించఁడు. ఆయన నిన్ను లేవదీసికొని పోఁడు. రత్నా:-నేనే ఆయన కొఱకు లేచిపోదును. రంగ:- ఆయన నిన్ను రానీయఁడు. నీకీ పిచ్చియూహ లెందుకు? ఈ పరీక్ష లెందుకు? రత్నా:-నే నాయన కొఱకుఁ బోయెదను. ఆయన నన్ను రానీయఁ డని నాకుఁ దెలియును. ఆయనకడకే పోను. ఆయనదగ్గఱకు కాకపోయినను ఆయనకొఱకే పోయెదను. రంగ:-నీకు వేదాంతము ముదిరిపోవుచున్నది. మరలశని వారమునాఁడు నీలాంబరుఁడు వచ్చెను. రత్నావళి యతనికి ఫలహారముపెట్టెను. అతఁడు రెండు గంటలసేపు కూర్చుండెను. రత్నావళి ఏమియు మాటలాడలేదు. నీలాంబరుఁడును మాటలాడలేదు. ఆమె నీలాంబరుని వంకనే చూచుచుండును. అతఁడు తనవంకఁ జూచినచోఁ దాను తనచూపు వేఱువైపునకుఁ ద్రిప్పుకొనును. చివరకు నీలాంబరుఁడు వెడలిపోయెను. రత్నావళి నాఁడు రంగనితో ననెను." నీవు కూరుఁడవు. నన్ను లేవదీసికొని పోయినవానిని పొడిచి చంపెదనంటివి. మీయన్నగారు నిన్నా పని చేయలేదు."

# పదునాల్గవ అధ్యాయము

ఒకరోజున రత్నావళి పాఠశాలలో నొకతరగతిలోఁగూర్చుండి పాఠములు చెప్పుచుండెను.కళాశాల బంట్రోతువచ్చి"అమ్మా! మిమ్ము నెవరో టెలిఫోనులో పిలుచుచున్నా"రనిచెప్పెను. ఆమె వెంటనే వెళ్ళి టెలిఫోనుగొట్టము చెవియొద్ద పెట్టుకొనెను. "రత్నావళిగారు వచ్చిరా?""వినుచున్నది రత్నావళియే, నేనే రత్నావళిని. మీరెవరు? ఎందుకు?" "-పత్రికాఫీసునుండి-రంగారావుగారికి హఠాత్తుగా పక్షవాతము వచ్చెను. పడిపోయి నారు." ఏరంగారావు?" "మీరంగారావుగారే." "పక్షవాతమా? ఎందుకు వచ్చినది? ఎప్పుడు వచ్చినది? ఎట్లువచ్చినది? ప్రొద్దున సరిగానే ఉన్నాఁడే!" "మీరు వెంటనే రావలయును. ఆఫీసు ఫలానాచోట" "ఇప్పు డెట్టిస్థితిలో నున్నాఁడు?" "మాటాడుట లేదు. పడిపోయినాఁడు. మేము డాక్టరును పిలిపించి చూపించితిమి. ఆయనయే పక్షవాత మని చెప్పినాఁడు. అపాయము లేదన్నాఁడు." రత్నావళి ప్రధానోపాధ్యాయిని కడకుఁబోయి ఈ సంగతి చెప్పి సెల వడిగెను. ఆమె "ఇంక నొక రెండుగంటలే కదా! పాఠశాల మూసిన తరువాత పో వచ్చు" ననెను. రత్నావళి"అయ్యో!. అట్లందురేమి? అతని నింటికి వెంటనే తీసికొని రావలయును. లేనిచో నాఫీసులో పండుకొనఁబెట్టుటకు వీలా?" అనెను. ప్రధానోపాధ్యాయురాలు "ఆయన మీకేమి యగు" ననెను రత్నావళి సమాధానము చెప్పలేదు. ఆమె 'ఇంకొక గంట పనిచేసి పో"మ్మనెను. రత్నావళి "కాదు కూడ దిప్పుడే పోవలయు" ననెను. ప్రధానోపాధ్యాయిని "అయినచోఁ దనబదులు మఱి ఎవ్వరినైన పనిచేయుటకు కడిగి పో"మ్మనెను. రత్నావళి ఇంకొక

యుపాధ్యాయను బతిమాలి యొప్పించి తాను బయలుదేఱు వరకు నరగంట యయ్యెను. ఆమెవద్ద తగినంత డబ్బులేదు! ఇంటివద్దనులేదు. డబ్బంతయు రంగఁడిపేర బ్యాంకులోనుండెను. ఆమె అక్లే పత్రికాఫీసునకుఁ జేరెను. రంగఁడు కన్నులు తెఱచి చూచుచుండెను. రత్నావళిని జూచి యతనికిఁ గన్నులవెంట నీరు వచ్చెను. రత్నావళికిని కన్నీరు క్రమ్మెను. డాక్టరు రంగని పరీక్షించి "ఇప్పుడుచేయునది ఏమియులేదు. వెంటనే ఇంటికిఁ దీసికొనిపోవలయును తగినంత విశ్రాంతి కావలయు" ననెను. ఇట్లున్న వానిని ట్రామ్‌బండిమీఁద తీసికొనిపోవుటకువీలులేదు. రిక్షాలోఁ గూర్చుండఁబెట్టుటకు రంగఁడు కూర్చుండలేఁడు. చిన్న మోటారుకారులోనైన సులభముగాఁ జేర్చవచ్చును. రత్నావళి తనవద్ద ప్రస్తుతము డబ్బులేదని చెప్పెను. రంగని స్నేహితుఁడొకడు కారును పిలుచుకొని వచ్చెను. అతఁడే కావలసిన దంతయు ఖర్చుపెట్టెను. రంగని నింటికి జేర్చిరి. మంచముమీఁద పఱపువేసి రంగనికి సుఖముగా నుండు నట్లు రత్నావళి పరుండఁబెట్టెను. సాయంకాలము మఱల డాక్టరు వచ్చెను. రత్నావళి "అయ్యా! ప్రాణమునకు మోసము లేదుకదా! ఈ వ్యాధి యేల వచ్చెను? నిన్న ప్రొద్దున కులాసాగా నున్నా" డనెను. డాక్టరు "ప్రాణమున కేమియు భయములేదు. ఈ వ్యాధికిఁ గారణము లనేకము లుండును. ఈయన రాత్రులం దెప్పుడును చాలసేపు మేల్కొని యుండునా" అనెను. రత్నా:- రాత్రి పదకొండు దాఁటి సామాన్యముగా మేల్కొనడు. డాక్ట:-ఆఫీసులో నెక్కువ పని యుండునా? రత్నా:- ప్రొద్దున పదిగంటలకు పోవును. సాయంకాలము ఆఱు ఆఱున్నఱకు తిరిగి వచ్చును. డాక్ట:- ఈయనకు కోప

మెక్కువగా నుండునా? రత్నా:—ఎప్పుడో కోపము అందఱకు వలెనే వచ్చును. ఎక్కువగా రాదు. డాక్ట:-(ఆలోచించి) మీా రీయన కే మగుదురు? రత్నా:— నే నీయన కన్నభార్యను. డాక్టరు—అయినచో నే నేమియు ననలేను. ఈయన కేదో మనస్సులో గొప్పబాధ ఏర్పడియుండవలయును. ఆ బాధ ఈయన మనస్సును దివారాత్రములు కష్టపెట్టియుండవలయును. ఇదివఱకెప్పుడైననితనికిఁ బత్తవాతమువచ్చెనా?రత్నా—రాలేదు. డాక్టర్—ఎక్కువగా జ్వరము వచ్చుచుండునా? రత్నా-అసలు జ్వరమేరాదు. డాక్టర్—మొట్టమొదటిసారియే ఈ వ్యాధియింత హెచ్చుగా వచ్చుటకు నేదో ప్రబలకారణ ముండవలయును. ఈయనమనస్సునకు బాధకలిగించు మహాకారణ మేదో యుండ వలయును. ఎవరైన నీయనను మాటిమాటికిని కష్టపెట్టుచుం దురా? రత్నా:—ఈ ఇంటిలో మే మిద్దఱమే యున్నాము. డాక్టర్:—క్షమించవలయును. మీాభర్తపోయినారా? రత్నా:— క్షమించ నక్కఱలేదు. జీవించియే యున్నారు. నే నీయనతోఁ గలిసి కాఁపురము చేయుచున్నాను. డాక్టర్ మందిచ్చి, రాత్రి గంటగంటకుపోయుమనిచెప్పి, తాను జేప్పుప్రొద్దునవత్తునని వెడలి పోయెను. రత్నావళి రంగనివద్దకూర్చుండెను. అతఁడూరకేకన్ను లతోఁజూచును. ఆతని స్నేహితుఁడు వెడలిపోయెను. రత్నావళి యతనిని రాత్రికి వచ్చి యచ్చటనే పండుకొమ్మని యడిగెను. అతఁడు తనకు వచ్చుటకు వీలులేదని, ప్రొద్దుననే వచ్చిచూచి పోదునని చెప్పెను. రంగఁడు మాటాడలేఁడు. ఒకవైపంతయు కాలుసేతులు కదుపనేలేఁడు. ఆవైపునకు త్రిప్పి పరుండఁబెట్టు టకు వీలులేదు. తనయంతటతానుతిరుగలేఁడు. రెండవవైపునకు ద్రిప్పి పరుండఁబెట్టుటకు రత్నావళికి సాధ్యముకాదు. అతఁడు

మిక్కిలి బాధపడుచుండెను. దిక్కులేదు. ఆదరించు దిబాసు లేదు ఆహా! ఇంటివద్ద నున్నచో సతనితల్లి యుండెను. అక్కగారున్నది. అన్నగారున్నారు. తానిప్పుడు సీతారామయ్యగారికి తంతివార్త యిచ్చినచో, ఆయన వచ్చునా? రాఁడు. తల్లి బయలుదేఱివచ్చునేమో? మంచములో నుండి లేవలేనిది ఆమెవచ్చి ఏమిచేయును? సరస్వతమ్మ వచ్చునేమో? ఆమెకతను రాలు, రాదు. నీలాంబరమునకు కబురంపించినచో? కబురెవరు తీసికొని పోదురు? నీలాంబర మేకళాశాలలో చదువుచుండెనో? ఎక్కడ బసచేసెనో, తా నడుగనైన లేదే? తాను పాఠశాల కొకవారము దినములు సెలవుపెట్టవలయును. ఆ ప్రధానోపాధ్యాయని సెలవీయదు. తనపని ఏమికావలయును? తనవలె నిట్లు లేచివచ్చినవారు కష్టము లిట్లేపడుదురా?

డాక్టరు రంగనికి మనస్సు మిక్కిలి బాధపడె ననెను. అతఁడు చేసిన పాపకృత్యమువలన పడెనా, తా నన్నమాటలమూలముగాఁ బడెనా? తానతనిని ప్రాణములు తఱుఁగుకొనిపోవు మాటలనెను. ఇంతవ్యాధి వచ్చునని తెలిసినచో ననకుండెడిదే! ఆహా! ప్రాయశ్చిత్తము! ఈవ్యాధి తనకువచ్చి యతఁడు క్షేమముగా నున్నచో నెక్కువ బాగుండెడిదే! పాపమతని దేమి తప్పు? తనదేతప్పు. ఒకగంట యయ్యెను మందిచ్చెను. ప్రొద్దు క్రుంకెను. వంట చేయవలయును. రంగని కాహారమేమియీయవలయును? తా నడుగలేదే! ఆడాక్టరిల్లెక్కడ. ఎక్కడనైనను తానురంగని వదలియెట్లు పోవును? ప్రక్కమీఁదినుండి లేచినచో రంగడు లేవనిచ్చుటలేదు తనచేతితో రత్నావళినిపట్టుకొని కన్నీళ్లు పెట్టుకొనుచుండెను. అయ్యో! మాటయైనను లేదే? రత్నావళి కేమిచేయుటకును దోఁచలేదు. సుమారొకగంటసేపైన తరువాత

లేచి 'కుక్కరు' మీఁదనన్నముపెట్టి తాను మరలవచ్చిరంగని వద్ద కూర్చుండెను. మరల గంటకుపోయి యన్నము పెట్టుకొని తినెను. పాలు పోయించుకొని రంగనికిఁ ద్రాగించెను. అతఁడు త్రాగలేకపోయెను. నోరేసరిగా తెఱవలేక పోయెను. మఱు నాఁడు డాక్టరు వచ్చినచో ఆయన నడుగవలె నని కొన్ని ప్రశ్నలు కాగితముమీఁద వ్రాసెను. ఒకటి-రంగనికాహారమేమి? అతఁడు నోరు తెఱవలేఁడుకదా! ఎట్లీయ వలయును? రెండు-డాక్టరు బస ఎక్కడ? మూఁడు-రంగని కెన్నిదినములలో నయ మగును? ఇఁకొక ప్రశ్నతోచలేదు. మొదట తనకును నూహాల మీఁద నూహాలుగా వచ్చిన మనస్సు స్తంభించిపోయెను. ఏ యూహాయును వచ్చుటలేదు. అట్లే శిలాప్రతిమవలె రత్నావళి కూర్చుండెను. కొంతసేపు రంగనివద్దనే పరుండెను. అప్పుడప్పు డేదో యొకయూహా వచ్చుచుండెను. రంగని నిట్లు పాడుచేసి నది తాను. తానెవ్వరినో పెండ్లిచేసి కొన్నచో రంగఁడు తన కిష్టమువచ్చిన స్త్రీని పెండ్లియాడి సుఖముగా నుండెడివాఁడు. మాటిమాటికిని దానే యతని నెత్తిపొడుచుచుండెను. అతఁడు పైకిఁజెప్పకుండ లోపలలోపలనే కుమిలిపోయినాఁడు కాఁబోలు పాపము! మఱి యింకొకసారి రంగఁడింకొకరీతిగానైనచోఁ దా నేమికావలయును? తనమొగమెవరు చూతురు? తన కాధార మేది? నీలాంబరుఁడు వచ్చి మేనమామకుఁ బరిచర్యచేయునా? అతనిచదువు చెడిపోదా? అతనిచదువు చెడినచో నతని నింటి వద్దకోపపడరా? మఱునాఁడు బ్యాంకులోనుండిడబ్బెట్లువచ్చును? రంగఁడు దస్కతు చేయలేఁడు. బ్యాంకువారు డబ్బిత్తురో, యీయరో? తన డబ్బుకూడ రంగనిపేరనే బ్యాంకులోనున్నది. ఇపుడేమి చేయవలయునో తెలియలేదు. రత్నావళి తానులేచి

బ్యాంకుపుస్తకముచూడవలెననుకొనెను.రంగఁడు లేవనీయలేదు. ఆమె మరల నట్లే పండుకొనెను. మరల గంటలు కొట్టుట వినఁబడెను. అప్పటికిపదునొకండు గంటలయ్యెను. లేచిమందిచ్చెను. పోయి బ్యాంకుపుస్తకము చూచెను. రంగనిదస్కతుగల యొక "బట్టీచెక్కు" కనిపించెను. ఆమెసంతోషించెను. గ్రుడ్డిలోమెల్ల. ఆమె యప్పుడే "చెక్కు"మీఁద వ్రాయవలయు ననుకొనెను. బ్యాంకులో తొమ్మిదివందల రూపాయలున్నవి. ఎంత "డ్రా" చేయవలయును? మరల కావలసివచ్చినపుడు రంగఁడుదస్కతు చేయఁగలఁడా? ఒకపదిరోజులలో నెమ్మదించదా? డాక్టరుకెంత ఈయవలసియుండును? సరే, రేపే వ్రాయుద మనుకొనెను.

రాత్రి పన్నెండుకొట్టెను. రంగఁడు కొంచెము మగతగా పండుకొనెను. తానును క్రింద చాపమీఁద నొత్తిగిల్లెను. రంగఁడు మూలుగు చుండెను. ఆమెకు మెలఁకువవచ్చెను. కొంతసేపటికి మూఁడుగంటలు కొట్టెను. ఆమెకు మరల నిద్రపట్టలేదు. ఒంటరిగా నాయింటిలో నామెకు భయమువేసెను. రంగనికి నింత వ్యాధి యెందులకు వచ్చెను? తానొక్కతెయు నతనివద్ద నంత నిర్భయముగానుండెను? తనకంత ధైర్యమెచ్చటినుండి వచ్చెను? కాలము గడుచుటలేదు. ఆమెమనస్సులో బరువెక్కువయ్యెను. తానుమాత్రము మనసులో నెక్కువ బాధపడలేదా? ఆవ్యాధి తనకేల రాలేదు? అప్పుడు మొదలు తెల్లవారి ఎనిమిదిగంటల వఱకు మహాశూన్యము. ప్రతిగంటయు నొక యుగము. కాలము. గడవలేదు. కాని ఎనిమిదిగంటలైనది. అప్పటికి రత్నావళిమనస్సుతో చచ్చిపోయెను. ఆమెపట్టి జీవచ్ఛవమువలె చూచుచుండెను. రంగనిస్నేహితుఁడువచ్చెను.ఆమెఅతనితో "అయ్యా! నీవీనాఁడుసెలవుపెట్టియిచ్చటనుండుమనెను.అతఁడంగీకరించెను.

కొంతసేపటికి రత్నావళికి తన సెలవుమాట జ్ఞాపకము వచ్చెను. ఆమె కేమియుం దోఁచలేదు. తాను పాఠశాల కెట్లుపోవును? తన యుద్యోగము పోవుననిపించెను. తన సెలవుచీటి ఎట్లు పంపించ వలెను? రత్నావళికి జ్ఞాపకమువచ్చెను. ఆనాఁడు శనివారము. మఱునాఁ డాదివారము. ఆమె ప్రాణముల కొక్కసారి తాను పడిన వైదుగంటలబరువును దిగిపోయెను. నీలాంబరమువచ్చును. తనకష్టము లన్నియు దీఱిపోవును. తొమ్మిదిగంటలకు డాక్టరు వచ్చెను. "పాలుమాత్రమే యాహారము. అట్లే పోయవలయు" ననిచెప్పెను. తన చిరునామా చెప్పెను. వెనుకటిదినము తాను మూఁడుగంటలు రోగితో నున్నందుకు, రెండుసార్లు చూచినం దుకుఁ బాతిక రూపాయలు బిల్లుచేసెను. రత్నావళి ఏమియు మాటాడలేకపోయెను. డాక్టర్ రోజునకు రెండుసార్లు వచ్చెద నని, మందు ఖరీదు కాక వచ్చినపుడెల్ల రెండురూపాయ లగు నని చెప్పెను. డాక్టరు వెళ్ళిపోయెను. మందున కెవరినైన పం పించినచో పంపించెదననెను. రంగని స్నేహితుఁడు పోయి మందు తెచ్చెను. రోజున కైదు రూపాయలు. తమకు నిలువ యున్న డబ్బెన్నాళ్ళు వచ్చును? అయిదునెలలు వచ్చును. ఒక నెలలో రంగనికి వ్యాధికుదురదా? మధ్యాహ్నము నీలాంబరము వచ్చెను. అతఁడు రంగనిచూచి యాశ్చర్యపోయెను. రత్నా వళి నీలాంబరమును మేనమామవద్దనుంచి, తాను బ్యాంకుకు పోయి రెండువందల రూపాయలు తెచ్చెను. నీలాంబరముతో "నింటికి తంతివార్త పంపింతమా"యనెను. నీలాంబరము వల దనెను. రత్నా:—మీయమ్మమ్మ కొడుకును చూడవలె నను కొనును. నీలా:—అవును. రత్నా:—మఱి తంతివార్తపంప వలదా? నీలా:—నేను త్తరము వ్రాసెదను. నీవూరకుండుము.

రత్నా:—నాకు సెలవుదొరకదు. ఎల్లుండి నీవు కనిపించవు. మేమేమి చేయవలయును. రంగఁడి యుద్యోగము పోయినది. నాయుద్యోగమునుపోవును. నిలువయున్నడబ్బుక్రమముగాఖర్చు పడిపోవును. ఏమి కావలయును? నీలా:—మామను జనరలు ఆస్పత్రిలో ప్రవేశపెట్టుదము. నీఉద్యోగము నీవుచేయవచ్చును. ప్రతిదినము సాయంకాలముపోయి చూడవచ్చును. రంగనిస్నేహితుఁడును నాయూహ బాగున్నదనెను. రంగనికిష్టము లేనట్లు తల యూఁపెను. రంగనిస్నేహితుఁడు "ఈవ్యాధికి నాయుర్వేదములో మంచిమందులుండును. ఈడాక్టరును మానిపించి గురుస్వామి మొదలియారుగారికి చూపించినచో మంచి"దనెను. రత్నావళి తాను తపాలాకచేరికి బోయి ముకుందరావును, నీలమోహన రావును రమ్మని తంతివార్తలిచ్చెను. అమఱునాఁడు పదిమంది డాక్టర్లనుతీసికొనివచ్చిచూపించెను. కొందఱాయుర్వేదవైద్యులు కొందఱిల్లోపతీవైద్యులు. అందఱికివందరూపాయలుపంచిపెట్టెను ఏ వైద్యుడో వ్యాధి నిర్ణయము కాలేదు. మఱునాఁడు తాను పాఠశాలకుఁబోవలయును. ఆమెనీలాంబరమును 'సెలవు పెట్టి మేనమామవద్దనుందువా?"యని యడిగెను. 'రేపే పొక్క నాఁడే. రేపుసాయంకాలమునకు ముకుందరావుగారు వత్తురు' అనెను. నీలాంబరము మొదట సంశయించి తరువాత నొప్పు కొనెను. మొదటిడాక్టరే మందిచ్చుచుండెను. ఆమెచేతిలో రెండు వందల మిగులుమరల అఱువదిమైదు రూపాయలు మాత్రమే మిగిలెను. ఆమె యపుడు 'అయ్యో! ఇంకొకవందకూడ తీసి కొనకపోతినే' యనుకొనెను.

ఆనాఁడు సాయంకాలముననే ముకుందరావువచ్చెను. ముకుంద రావును చూచినంతనే రత్నావళి కెక్కడలేని ధైర్యమువచ్చెను.

ముకుందరావు నీలాంబరమును చూచి 'నీ' విచ్చట నుంటివే మని యడిగెను. నీలాంబరము తమ చుట్టరికమును చెప్పెను. ముకుందరావు 'అల్లనా' అనెను. రత్నావళి తనకు నూటయేఁబదిరూపాయలు ఖర్చగుట చెప్పెను. తనకు పాఠశాలలో సెలవు దొరకకపోవుట చెప్పెను. ముకుందరావు 'భయములేదులే' యనెను. ఆ సాయంకాలమే రంగని స్నేహితుఁడును,నీలాంబరమును వెడలిపోయిరి. ముకుందరావు సాయంకాలము వచ్చిన డాక్టరును మానిపించెను. తనయూరిలో నొక హోమోపతి వైద్యుఁడుండెను. అతఁడు మిక్కిలి సమర్థుఁడు. అతనిని రమ్మని 'జరూరుతంతి' యానాఁడాదివారమగుటచేత నిచ్చెను. రత్నా—ఆయన వచ్చునో, రాఁడో? ముకుంద—తెల్లవాఱువఱకు వచ్చును. నాకు ప్రాణస్నేహితుఁడు. ఒకవేళ జేపు మెయిలుకు రాకపోయినచో ఎక్స్ప్రెస్నకైనను వచ్చును. రత్నా—మఱి మందు మాన్పించితిరేమి? అంతవఱకును మందు లేకున్నచో నెట్లు? ముకుంద—నేనున్నానుగదా! నీకెందుకు?

ముకుందరావు తాను హోమోపతి యౌషధాలయమునకుఁ బోయి రెండు మందులు కొనితెచ్చెను. అవి వాడెను. మఱునాఁటి ప్రొద్దుటికి సౌభాగ్యరావు వచ్చెను. అతఁడే ముకుందరావు స్నేహితుఁడైన హోమోపతివైద్యుఁడు. అతఁడు చూచి నయమగుటకు రెండుమూఁడు నెలలు పట్టుననెను. "పదునేను దినములలో కొంతగుణము కన్పించును. ఒకనెలలో లేచితిరుగగలఁ"డని చెప్పెను. ముకుందరావు తాను 'నిన్న సాయంకాలము ఫలానా మందు వాడితి'నని చెప్పెను. సౌభాగ్యరావు నవ్వెను. సౌభాగ్యరావు తానాసాయంకాలమే వెళ్ళెను. మందిచ్చెను. ప్రతిరోజునను నెట్లున్నదో యుత్తరమ్ము వ్రాయుచుండు

నని రత్నావళితోఁ జెప్పెను. వారమున కొకసారి తాను వచ్చి చూచిపోవుదుననెను. రత్నావళి రైలుఖర్చు లీయబోయెను. సౌభాగ్యరావు నవ్వి వలదనెను. ఆడబ్బు ముకుందరావున కిమ్మనెను. ముకుందరావు 'ఫరవాలేదు, పుచ్చుకో. ఈరెండురోజులలో నాకు నూటయేఁబదిరూపాయలు ఖర్చుపెట్టెను. నీవాయెకు చేయులాభ మేమియును లే'దనెను. సౌభాగ్యరావు పుచ్చుకొనలేదు. నెమ్మదించినతరువాత నీయవచ్చుననెను. ఆనాఁడు రత్నావళి పాఠశాలకుఁ బోయెను. ముకుందరావు రంగనివద్ద కూర్చుండెను. ప్రతిమూఁడు గంటలకు నొక రెండుమాత్రలు చొప్పున వేయుచుండెను. మూఁడుదినములు గడచెను. నీలమోహనుఁడువచ్చెను. రంగనిచూచి మిక్కిలి విచారించెను. ముకుందరావునకు నీలమోహనునితోఁ బరిచయములేదు. అతఁడుహరికిశోరుని స్నేహితుఁడని మాత్రమే ముకుందరావునకుఁ దెలియును. ముకుందరావు 'నీల'తో సరిగామాట్లాడలేదు. రత్నావళి 'నీల' సంగతి ముకుందరావుతోఁ జెప్పెను. వా రిరువురకును స్నేహమయ్యెను. పగలెల్ల ముకుందరావు రంగని చూచుచుండెను. తక్కినయప్పుడు రత్నావళి రంగనివద్ద కూర్చుండును. నీలమోహనుఁ డొకటిరెండుదినములుండి వెడలిపోయెను. ముకుందరావు రత్నావళి యింటికివచ్చినవెంటనే తాను వాహ్యాళికై పోవును. పదునేనుదినములు గడచెను. సౌభాగ్యరావు లోపుగా మఱియొకసారివచ్చెను. రంగనికి కొంచెమునెమ్మదించినట్లే కనుపించెను. అతఁడు కొద్దిగా మాటాడును. ప్రక్క కొత్తిగిల్లును. ఆహారము బాధలేకుండఁ దీసికొనును.

నీలాంబర మింటికి జాబు వ్రాసెను: "మదరాసు.

మామగారికి నమస్కారములు. నేను బాగుగనే చదువుకొను

చున్నాను. నేనిక్కడ నొక ట్యూషను కుదుర్చుకొంటిని. దాని వలన నాకు నెలకు పదునేను రూకలువచ్చును. అందులో నైదు రూపాయలకు ట్రామ్‌టిక్కెట్టు కొంటిని. మీరు ఒక్క సూ్కలు జీతము పంపినచో చాలును. నాకు డబ్బు పంపించుటకు మీ రెంత కష్టపడుచుందురో నాకు తెలియును.

నాకు నెలనాళ్ళక్రింద చిన్నమామ కనుపించెను. నే నాయనతో మాటాడలేదు. ఆయనయే నన్ను పలుకరించెను. ఆయనతో మాటాడుట నాకిష్టములేనట్లుకూడ చూపించితిని. ఆయనయే నావెంటఁబడి తిరిగెను. నాకు మాటాడక తప్పినదికాదు. వారి యింటికి రమ్మని నాప్రాణములుదీసెను. నే నెట్టకేలకుఁ బోయి తిని. నన్ను క్షమించవలయును. విధేయుఁడు, నీలాంబరము.

తా. క. వారమురోజులక్రిందట చిన్నమామకు పక్షవాతము వచ్చెను. పడిపోయెను. నోట మాటలేదు;"

ఈ యుత్తరమునకు వారముదినములలో సమాధానము వచ్చెను. వ్రాసినది సరస్వతి. "నీలాంబరమున కాశీర్వచనములు. నీజాగ్రత చూచి మామయ్య చాలా సంతోషించినాఁడు. అమ్మమ్మ చాలా దిగులుపడుచున్నది. రంగఁడి కెట్లున్నదో మఱల నుత్తరము వ్రాయుము. ఇట్లు అమ్మగారు, సరస్వతి," ఆ యుత్తరమునకు వెనుక మఱియొక వాక్యము వ్రాయఁబడి యుండెను—"నీవు వారి యింటికి ఎక్కువగా పోవద్దు. రత్నావళితో మాటాడవద్దు" అని. నీలాంబరము శనివారమున రత్నావళిని చూచుటకుఁ బోయెను. తానింటికి జాబువ్రాసితి ననీ, తన యమ్మమ్మగారు మిక్కిలియాదుర్దాపడుచుండెనని యతఁడు రత్నావళితోఁ జెప్పెను. రంగఁ డామాటలు విని కన్నీళ్ళు కార్చెను. ఏదో చెప్పఁబోయెను. కాని మాటలు సరిగా రాలేదు.

రత్నావళి "నన్నుగుఱించి యేమైన వ్రాసితివా?" యని యడిగెను. నీలాంబరుఁ "డేమియు వ్రాయలే" దనెను.

మరల ప్రతిష్ఠాపురమునుండియొకజాబువచ్చెను. ఈ జాబుసీతారామయ్యయే వ్రాసెను. అందులో రంగఁడికెట్లున్నదో వ్రాయుమనెను. నీలాంబరమునకు ధైర్యమువచ్చెను. ఆహా! విచిత్రము! రక్తసంబంధము చెడ్డది. ఒక మధురప్రకృతివిషయములో రక్తసంబంధ మెంతయైనను జేయును. ఆ ప్రకృతి యెంతయైనను క్షమించును. నీలాంబర మిట్లనుకొనెను. తన భార్యను లేవఁదీసికొనిపోయిన తమ్మునికి భాగము పంచియిచ్చి సుఖముగా జీవించుటకు మార్గమేర్పఱచిన ప్రకృతి యెంత క్షమానిధి! ఆ మేనమామకుఁ దాను మేనల్లుఁ డగుట తనభాగ్యము. నీలాంబరము మఱల నుత్తరము వ్రాసెను.

మామగారికి నమస్కారములు! "మదరాసు

చిన్న మామకు నెమ్మదిగానే యున్నది. మీరు ముకుందరావుగారి నెఱుగుదురు కదా! వారు మనయింటిలో మూఁడునెలలున్నారు. వారినిగూర్చి మీ కెక్కువగా వ్రాయనక్కఱ లేదు. వారు తమస్నేహితుఁడైన ఒక హోమోపతివైద్యునిచేత చిన్నమామకు మందిప్పించుచున్నారు. అమ్మ నన్ను వారి యింటికి వెళ్ళవద్దని వ్రాసినది. కాని నేనువెళ్ళకుండా మానలేకున్నాను. ఎందుచేత వెళ్ళుచుంటినో నాకుదెలియదు. రత్నావళి ముకుందరావుగారివద్ద చదువుకొన్నదట! ఆమె విద్వాన్పరీక్ష నిచ్చినది. ఇచ్చట నొకబాలికాపాఠశాలలో నుపాధ్యాయిని. ఆమె ముకుందరావుగారియొద్ద చదువుకొనుటచేత నాకామెతో మాటాడుట కష్టముగాఁ దోఁచుటలేదు. ఆమెతో మాటాడఁగా నా కామెవలన తప్పున్నట్లు కన్పించుటలేదు. తాను జేసినపాప

మున కామె యెంత దుఃఖపడుచున్నదో చెప్పలేను. ఒకనాఁడు నాయెదుట నేడువలేక యింటిలోనికిఁబోయి కూర్చుండి ఏడ్చుచుండెను. తల దువ్వుకోదు. మొగమున బొట్టు పెట్టుకొనదు. కావిగుడ్డలు కట్టుకొనును. ఆమె చాల వివేకవతి. మంచిచదువు చదువుకొన్నది. నేనిట్లు వ్రాయుట తప్పే. క్షమింపవలయును. రంగఁడిప్పుడు కొంచెముగా మాటాడుచున్నాఁడు. మునుపటికన్న చాలానయము. ముకుందరావుగారే రంగనికిఁ బరిచర్య చేయుచుండురు. రత్నావళి పాఠశాలకుఁ బోవుచుండును. నే నింకొక ట్యూషను కుదుర్చుకొంటిని. రెండును గలిసియే చెప్పుట వలన కాలము వ్యయమగుటలేదు. మొన్న ఒక కథ వ్రాసి, యిచ్చట నాంధ్రపత్రికకు నిచ్చితిని. వారొక రైదురూపాయ లిచ్చిరి. నెల కొక పదిరూపాయలు పంపించినచో నాకుజాలును. పుస్తకములు స్నేహితులయొద్ద తెచ్చి చదువు కొనుచున్నాను.

చిత్తగించవలెను, నీలాంబరము.

ఈయుత్తరమునకు పదిరోజులవఱకును సమాధానము రాలేదు. వచ్చిన సమాధానములో రంగని ప్రస్తావన లేదు. రత్నావళి ప్రస్తావన యంతకుముందే లేదు. ముకుందరావుగారికి నా నమస్కారములు చెప్పుమనిమాత్రి మున్నది. అది సీతారామయ్య వ్రాసెను. తరువాత రెండునెలలు గడచెను. రంగనికిఁబూర్తిగా నెమ్మదించెను. అతఁడు లేచి యింటిలోఁ దిరుగుచుండెను. నాలు గైదు నెలల వఱకు నేపనియుఁ జేయగాదని సౌభాగ్యరావు చెప్పెను. ముకుందరావు వెడలిపోయెను.

నీలాంబరము శనివారము, నాదివారము రెన్నాళ్లును మధ్యాహ్నములందు రంగని యింటికిఁబోవును. రంగఁడు కొంచెముగా మాట్లాడును. రత్నావళినీలాంబరునితోమునుపటి కన్న నెక్కువ

చనవుగా మాట్లాడుచున్నది. ఒకనాఁడు నీలాంబరము తెలుఁగు పుస్తకము చదువుచు తప్పు చదివెను. రత్నావళి దిద్దెను. ఆశబ్దముయొక్క వ్యుత్పత్తి చెప్పెను. ఉపసర్గను, ధాతువును, ప్రత్యయమును జెప్పెను. ఆప్రత్యయము చేరినప్పు డేలింగ మగునో, మఱి నాలుగైదు ధాతువులతో నారూప మెట్లుండునో యామె చెప్పెను. నీలాంబరుఁడు ముగ్ధుఁడయ్యెను. అప్పటినుండియు నతఁడు తనకేమైనను తెలియకపోయినచో నచ్చియామె నడుగును. ఆమె సమాధానములు చెప్పును. నీలాంబరము మరల నొకనాఁడింటికి జాబు వ్రాసెను. ఆజాబు తల్లిపేర వ్రాసెను: "అమ్మగారి పాదపద్మములకు నమస్కారములు. నేనుకులాసాగానే యున్నాను. మామయ్య పంపించినడబ్బు ముట్టినది. ఆయనను నామూలమున నెక్కువ శ్రమపడవల దని చెప్పవలసినది. నేనిక్కడ ఎట్లో అట్లు జరుపుకొందును. మునుపు రంగఁడిచదువు ఇప్పుడు నాచదువు. ఆయనపడుకష్టముల కంతు లేకుండనున్నది నేను అత్తయ్యతో మాటాడు చుంటిని. దీనికి నీవేమియు ననుకొనరాదు. ఆమె నాకుఁ దెలియని అనేకవిషయములు చెప్పుచున్నది. స్త్రీలు చదువుకొన వలయును. పాఠశాలలో చెప్పు చదువులతోఁ బిల్లల కెంతో చదువురాదు. తల్లి పండితురాలైనచో పిల్లల కెన్నోవిషయములు చెప్పవచ్చును. అసలు పండితురాలైనచో ననేకదోషములు చేయదు. ఆమెకుఁ బూర్వమే ఈచదువు వచ్చినచో నట్టి పాపకృత్యము చేసెడిదికాదు అట్లు చేసినందుల కామె కుమిలి పోవుచున్నది. ముకుందరావుగారి తరువాత నామె ముకుందరావుగారియంతది యైనది. ఆమె యనేకశబ్దములు ఎట్లుపుట్టెనో చెప్పును. వాని యంతరార్థములు చెప్పును. ధర్మమెట్లుండవలయునో చెప్పును. మన సంప్రదా

యము లామెకుఁ దెలిసినట్లు మఱియెవ్వరికిని దెలియవు. రంగఁ డితో నామె యప్పుడప్పుడు వాదించును. ఆమె వాదించినప్పుడు వినవలయును. మనమతములనుగూర్చి యామె కంత బాగుగా నెట్లు తెలియునో నా కాశ్చర్యముగా నున్నది. ఇంకొక నెలలో మాకు సెలవులిత్తురు. ఇంటికిరాను. ట్యూషనులు చెడిపోవును. మామయ్యకు నా నమస్కారములు.

నీ ప్రియమైన పుత్రుఁడు, నీలాంబరం."

ఆయుత్తరముచూచి ప్రతిష్ఠాపురములో నలుగురునునాలుగువిధముల ననుకొనిరి. మాణిక్యమ్మ "అవునమ్మా! తెలివికలదే. కాని భగవంతుఁడట్లు వ్రాసెను"అన్నది. సరస్వతి 'దాని తెలివి తగులఁబడినట్లేయున్నది. ఈ దౌర్భాగ్యుని వారి యింటికి వెళ్ళ వద్దనఁగా వెళ్ళుచున్నాఁడు. వీనిని చీవాట్లుపెట్టుచు నుత్తరము వ్రాసెదనుండుము. తాను వెళ్ళినదికాక ఈ కబురులన్నియు మనకుర వాణా యెందుకు?"అన్నది. సీతారామయ్యగారి కొత్తభార్య పేరు రాజ్యలక్ష్మి. ఆమె యాయుత్తరము తీసికొని చదివినది. సీతారామయ్య యెవ్వరేమన్నను మాటాడలేదు. ఆమూఁడవ నాఁడు సరస్వతి నీలాంబరమున కుత్తరము వ్రాసెను. అన్నగారితో 'నీలాంబరానికి వారియింటికి వెళ్లవద్దని గట్టిగా వ్రాసెద' ననెను. సీతారామయ్య 'వ్రాయుము' అనెను. అని, పోనిమ్ము మన కేమినష్టము? వాఁడక్కడ నొంటరిగానున్నాఁడు. మనము వ్రాసినచో వాఁడువినునా? వెళ్ళుట లేదని వెళ్ళినచో మనమేమి చేయఁగలుగుదుము?"అనెను. సరస్వతి యుత్తరములో నా సంగతియే యెత్తుకొనలేదు. మరల సంవత్సరముగడచెను. నీలాంబరము యఫ్.ఏ. పరీక్షయందు తీర్ణుఁడయ్యెను. రంగనికి పూర్తిగా నారోగ్యమువచ్చెను. అతఁడు హిందూపత్రికలో గుమాస్తాగాఁ

జేరెను. కొంత సంపాదకీయపుపనికూడఁ జూచుచుండెను. అతనికి వ్యాధి నెమ్మదించినతరువాత పూర్వముకన్న నుత్సాహముగానుండెను. ఆయిల్లు వదలిపెట్టి మఱియొక పెద్దయిల్లద్దెకుఁ దీసికొనెను. మూఁడువందలుపెట్టి సోఫాలు, కుర్చీలు, కాఫీత్రాగు పాత్రలు, ఫ్యాన్సీసామానులు, ద్వారబంధములకు కలంకారి తెరలు కొని యిల్లంతయు నలంకరించెను. సౌభాగ్యరావునకు రైలుఖర్చులకు నొకవందయు, వైద్యమున కొకవందయుఁ బంపించెను. ముకుందరావునెడల నతని హృదయము బహుకృతజ్ఞతామయమయ్యెను. అతని కిప్పుడు ముకుందరావు దేవుఁడు. ముకుందరావు చెప్పినమాట వేదాక్షరము; రత్నావళి దేవత. ఆమె యెంతచెప్పిన తానంత. ఒకసినీమా చూచినచో రత్నావళి యది బాగుగా లేదన్నచోఁ దనకు బాగుగా నున్నను బాగుగాలేదు. ఈవస్తువు కొని తెచ్చినది రత్నావళి బాగుగా లేదన్నచో నది మఱునాఁ డింటిలో నుండదు.

ఇప్పటికి బ్యాంకులోనున్న తన డబ్బంతయు నైపోయినది. రత్నావళివి ఒకవంద ఏఁబదిమాత్రము మిగిలెను. నీలాంబరమునకు రంగనికి మిక్కిలిస్నేహమయ్యెను. నీలాంబరము ఇంగ్లీషులో నొకపద్ధతిగా వ్రాయనేర్చెను. అతనివ్యాసము లప్పుడప్పుడు హిందూపత్రికలోఁ బ్రచురింపఁబడును. అతనికి కొంత డబ్బు ముట్టుచుండును. నీలాంబరమునకు రంగఁడు రాజనీతి, అర్థశాస్త్రము, పత్రికానిర్వహణము మొదలైన విషయముల లోని మర్మములు చెప్పుచుండును. రత్నావళి క్రమముగా ననేకగ్రంథములుచదివెను. సంస్కృతముబాగుగానభ్యసించెను. ఉపనిషద్భాష్యములు, మఱికొన్ని చిన్నవేదాంతగ్రంథములును చదివెను. తర్కశాస్త్రము లేకుండ తెలిసికొనఁదగిన వేదాంత

మంతయుఁ దెలిసికొనెను. తెలుఁగులో ననేక గ్రంథములు చదివెను. ఆమెవలన నీలాంబరము సంస్కృతాంధ్రములయం దనేకవిషయములు తెలిసికొనెను. నీలాంబరము బి. ఏ. చదువుచుండెను. అతనికిఁ గావలసినచో రంగఁడు డబ్బిచ్చుచుండును: రత్నావళియుఁ గొంచెముకొంచెముగా నిచ్చును. అతఁడు నాటకములకు, సినిమాలకుఁ దనడబ్బు ఖర్చుపెట్టఁడు. వారమునకు రెండురోజులు రంగని యింటిలోననే భోజనము చేయును. చొక్కాలు, దోవతులు రంగఁడే కొనిపెట్టును. ఆతని బరువు సీతారామయ్యకు లేనే లేదు. ప్రతిష్ఠాపురములో సరస్వతి తన కొడుకు చెడిపోయినాఁడనుకొన్నది. వానిమీఁదతనకధికారము లేదు. సీతారామయ్యకును లేదు. వానిడబ్బు వాఁడు తెచ్చుకొని చదువుకొనుచుండెను. తా నేమిచేయఁగలదు? అన్నగారితో రెండుమూఁడుసారులు చెప్పెను. ఆతఁడేమియు మాటాడలేదు. 'సెలవులలోఁగూడ నిచ్చటికిరాఁడాయెను. వానిసంగతియిట్లున్న దని మన కెట్లు తెలియును! తెలియనంతవఱకు బాగుగనే యున్నాఁడని మనమనుకొనవలయునుగాని చెడిపోయినాడనియెందుకనుకొనవలయు'నని సీతారామయ్య యనెను. సరస్వతి కొడుకునకు రెండుమూఁడుసారులు రమ్మని యుత్తరములు వ్రాసెను. అతఁ 'డిప్పుడువచ్చుటకు వీలులే' దనుచునే సమాధానములు వ్రాసెను. ఒకసారి సరస్వతి తానుబయలుదేరిపోయి కొడుకును చూచివత్తునన్నది. సరస్వతి తాను వచ్చుచున్నానని కొడుకునకు వ్రాసెను. అతఁడు "రావలదు. నేను హాస్టలులోనివసించుచున్నాను;నీవువచ్చినచోనెవరియింటిలోనుందువు? చిన్నమామయింటికిఁబోవుగదా!హాస్టలులోనీవుండుటకువీలు లేదు;రావ"ద్దని వ్రాసెను. ఆమె మానుకొన్నెను. రత్నావళి క్రొత్తయింటికి

వచ్చినది మొదలుకొంచెము మూరెను తలదువ్వుకొనుచుండెను. రాత్రులందు మొగమున తిలకము ధరించుచుండెను. కాషాయ వస్త్రములు మాని తెల్లచీరలు కట్టుచుండెను. రంగనివ్యాధి యామెకతనిమీఁదనున్నకోపమును చాల తగ్గించెను. ఇప్పుడామె యతనినేమియుననదు. అతనితో వాదించదు. ఆమె యేదిచెప్పిన నతఁ డొప్పుకొనును. ఇంక వాదనయేమున్నది? రంగనికి మఱల పక్షవాతము వచ్చునేమో యని ఆమెకుభయము. అది జీవితములో మూఁడుసార్లువచ్చుననిఎవరో చెప్పిరి. మిక్కిలిజాగ్రత్తగా నున్నచో మొదటిసారియే వచ్చి యాఁగిపోవునఁట. సౌభాగ్యరావు మందు నెల కొక మాత్రచొప్పున రంగఁడిప్పటికిని సేవించుచునేయుండెను. రత్నావళిలో మార్పు రంగనిక్కిఁ దెలిసెను. ఇప్పుడామె తనను ప్రేమించుచున్నదని యతఁ డనుకొనెను. అది ప్రేమయో కాదో? జాలి యేమో! అతఁ డామెతో నీ ప్రసక్తి తేఁడు. తా నొక సుఖభావము ననుభవించుచున్నాఁడు. దానిని తానే యేల పాడుచేసికొనవలెను ?

రంగనికి పట్టణములోఁగొంచెము గౌరవ మేర్పడెను. పెద్ద పత్రికాఫీసులో నున్నవారికిఁ గొంత పలుకుబడి కలుగును. లక్షమందికి లక్షణను లుండును. ఒకనితోఁ బని లేకపోయినను వాఁడుద్యోగము చేయుచుండె ననఁగా లోకము గౌరవించును. కొందఱు నీచులు తమకుఁ బ్రయోజనము లేకపోయినను నొకఁడు పలుకుబడిగల యొకపదవిలో నుండినచాలును, వాని కొఁదిగి యొదిగి నమస్కరించుచుందురు. రంగని కట్టి నమస్కారములు బలిసెను. రత్నావళి యతనికి రెండుపూఁటలును రుచికరముగా బలమైన పదార్థములు వండిపెట్టును. మధ్యాహ్నము గారెలో పూరీలో చేసిపెట్టును. రంగనికిఁ బూర్వముకన్న నెక్కువ

యారోగ్యము కుదిరెను. నీలాంబరము ప్రతిష్ఠాపురపు సంగతు లెత్తఁడు. రత్నావళి యాసంగతులు మఱచిపోయెను. మహూచికముతో సర్వవ్యాధులును పోయినట్లు, ఇంగ్లండునకుఁ బోయి వచ్చుటతో ఇచ్చట పరీక్షలు తప్పుట మానినట్లు, రంగని పక్షవాతముతో రత్నావళి పూర్వపు మనస్సు మాఱిపోయె నని పించెను. ముకుందరావు నెలకొకసారియైనను మదరాసువచ్చును. ఆయనను జూచినంతనే రత్నావళికిఁ దనపూర్వపుకథ జ్ఞాపకమునకు వచ్చును. ముకుందరావునకుఁ బూర్వకథకుఁగల సంబంధ మెట్టిదో ఆమెకు తెలియలేదు. ముకుందరావుభార్య చనిపోయెను. అతఁడు మరల వివాహముచేసికొనలేదు. అందగాఁడు, మహామేధావి. బలిష్ఠుఁడు. చక్కఁగా సంగీతము పాడగలఁడు. దయాస్వరూపుఁడు. పరులకుపకారము చేయుటలో నాయనను చెప్పి మఱొకరిని జెప్పవలయును. ఆయనకు ధర్మభావమునకు నేదో సంబంధ ముండెను. ముకుందరావు కనఁబడినచో ముగ్గురును లేచి నిలుచుందురు. ముగ్గురును నమస్కారములు చేయుదురు. ముకుందరావు నవ్వును. రోజులు గడచు చుండెను. ఏఁడాది దాఁటెను. రెండేండ్లు కావచ్చెను. నీలాంబరము బి. ఏ. పరీక్షకుఁగూర్చుండెను. పరీక్షలైపోయిన తరువాత నతఁ డింటికిఁ బోవును. ఇంక తప్పదు. రంగనిజీవితము మఱల కొంత ప్రాఁత పడెను. అతనినిగుఱించి రత్నావళి మునుపటియంత శ్రద్ధచూపుట లేదు. పక్షవాతముసంగతి విస్మృతిలోఁబడినది. ఆహారవ్యవహారములు దైనందినకృత్యములుగాఁగడచుచుండెను. మునుపటి శ్రద్ధలేదు. రంగనికిని, రత్నావళికిని కొద్దికొద్దిగా మాటలును, చిన్నిచిన్ని కోపములును పొడసూపుచుండెను. వానితోఁ బూర్వపుటెత్తిపొడుపులును పొటమరించుచుండెను.

ఒకనాఁడు సాయంకాలము రంగఁడు రత్నావళితో "మనకొక పిల్లవాఁడైన లేకపోయెను" అనెను. రత్నావళి మొగము క్రమముగా నెఱుపెక్కెను. ఆమెకన్నులలోఁ గోపము వచ్చెను. ఆమె యొడలంతయుఁ గదలిపోయెను. ఆమె గుండెలోమానినపుండు సెల వేసెను.

## పదునైదవ అధ్యాయము

ఒక బ్రాహ్మణుఁడు మతాంతరుఁ డయ్యెను. ఆయన భార్య కూడ భర్తతోపాటు పరమతమును స్వీకరించెను. వారికి సంతానము కలిగెను. ఆకుటుంబమునకు తాము మతాంతరుల మైతిమని పశ్చాత్తాపము కలిగెను. పూర్వఋషుల మతములోపుట్టి చెడిపోయితిమే యని వారికి దిగులు కలిగెను. తమపుత్రపౌత్ర పారంపర్యమును మతాంతరులుగా నుండుటకు వారికిఁ బ్రాణ మొప్పలేదు. కొడుకులు, కూతుండ్రు జీవితాంతమును వివాహము లాడలేదు. వారి కుదురు ఆ ప్రకారముగా నశించిపోయెను. పాపము వా రెంత కష్టపడిరో! రత్నావళి మనస్సు వారిమనస్సువలె నయ్యెను. తానొక మహాపాపముచేసెను. ఆ పాపము తనతో నాఁగిపోక తరతరములుగా వృద్ధిపొందవలయునా? తనకు సంతానము కలిగినచో నా బిడ్డలకుఁ దండ్రి యెవరు? వారు సవర్ణులేనా? వారికి వివాహము లెట్లగును? తనవలెనే జీవితమును గడపిన మఱియొకరి సంతానముతో వారు వివాహ మాడవలయునా? ఇది వఱకున్న వర్ణములు చాలక నిది యొక క్రొత్తవర్ణమా? ఈదోషము తా నెన్నితరములలో మాసిపోవును? అన్నితరముల వెలివాండ్రను కలుగుటకు తా నేల కారణభూతురాలు కావలయును? తనకు సంతానము కలుగు

నేమో యని రత్నావళికి భయము వేసినది. ఒకనాఁడు సాయంకాలమున రంగారావింటికి వచ్చెను. అతఁడు మిక్కిలి యుత్సాహముగానుండెను. ఆతఁడు రత్నావళివంకఁ జూచెను. రత్నావళి మొగమున విషాదచ్ఛాయ లావరించియుండెను. రంగ:—రత్నా! అట్లుంటివేమి? రత్నా:—రంగా! నే నుద్యోగము మానివేసెదను, ఈయూరు విడిచిపోయెదను. రంగ:—ఎచటికిఁ బోయెదవు? రత్నా:—ప్రతిష్ఠాపురము పోయెదను. రంగ—పోయి? రత్నా—సముద్రములో దిగెదను, నీ కెందులకు? రంగ:—నన్నేమి చేసి పోయెదవు? రత్నా:—రంగా! నే నిందుండుటకు నాకిష్టములేదు. నీతో సంసారము చేయుటకు నా కిష్టములేదు. ఒకవేళ మనకుసంతానము కలిగినచో నేనుచేసినంత పాపము మఱియెవ్వరునుచేయరు. ఆసంతానము నీకుకలిగినట్లా, నీయన్నకుఁ గల్గినట్లా? రంగ:— కౌరవపాండవులవలె మన సంతానముకూడ మహాపరాక్రమవంతులగుదురు. రత్నా:—వారిలో వారు కొట్టుకొనికూడ చనిపోవచ్చును. రంగ:—అయిదేండ్లనుండి పుట్టనిసంతానము ఇంక పుట్టుననియెట్లు? రత్నా:—పుట్టరని ఎట్లు? రంగ:— నీవు డాక్టరులవద్దకుఁ బోయి చూపించుము. వారు సంతానపుతిత్తిని తీసివేయుదురఁట. రత్నా:—నేను చేయఁదలఁచుకొన్న పనికి నట్టిపని చేయరాదు.

రంగ:— ఏపని చేయఁదలచికొంటివి? రత్నా:— నే నిప్పుడు చెప్పను. రంగ:— ఆత్మహత్య చేసికొందువా? రత్నా:—ఆత్మహత్య ఇదివఱకే చేసికొంటిని. ఇప్పుడు శరీరహత్య మాత్రమే చేయవలయును. రంగ:— రెండేండ్లుగా నీ గోల లేదు. నేను సుఖపడుచుంటి ననుకొంటిని. మఱల మొదలు పెట్టితివి. రత్నా:— ఓయీ! ఏమిసుఖము! వ్యాధితో నాటు

నెలలు తీసికొంటివి.అప్పుడీసుఖ మేమైనది? ఆవ్యాధి నిర్మూలించ లేదనుకొనుము. ఈసుఖ మేమైనది? నీవు జీవితాంత మావ్యాధితోఁదీసికొంటి వనుకొనుము. అప్పుడు నేనేమి చేయవలయును? మఱియొకనితో కాఁపురముచేయవలయునా?పాపమో పుణ్యమో యొకనితో నుండుటమేలుకదా! అందఱును పడుచువాండ్రు కారు.అందఱునువృద్ధులుకారు.అందఱునుకురూపులుకారు.అందఱును సౌందర్యవంతులేకారు. లోకములోనున్న స్త్రీలందఱును తమకు వయసులోనివాండ్రేకావలయును,విద్యావంతులేకావలయును, అందగాండ్రేకావలయును, అన్నచో తక్కిన పురుషులందఱునేమగుదురు? వివాహమనుసంస్థ స్త్రీపురుషసుఖవ్యవహారములందు రాజ్యాంగ విషయములలో ప్రజాస్వామిక మెట్టిదో యట్టిది. అందఱు ప్రజలకు ఓటునందు హక్కున్నట్లే అందఱు పురుషులకును స్త్రీసుఖమునందు హక్కున్నది. ఒక పలుకుబడి కలవాని చేతిలో వందఓట్లుండును. వానికార్యములు తేలికగా నగును. అట్లే ఒకానొక భాగ్యవంతునకు సౌందర్యవతియు, విద్యావతియు నైన స్త్రీ వచ్చును. ఒకని ఓటునందలి హక్కు నీవుహరింపలేనట్లే హరింపరానట్లే నీవొకని స్త్రీని హరింపరాదు. అట్లు చేసినచో దుష్టుఁడైనరాజువలె రాజ్యమునుకోలుపోదురు. దురాగ్రహావిష్టుడైన నియంతవలె తాను చనిపోయిన తరువాత తాను నిర్మించినరాజ్యముయొక్క అతిగతులెఱుఁగక మోసపోవుదురు. ఎవనిహక్కు వానిది. రంగ:- రత్నా! నే నొప్పుకొన్నాను దుష్టుఁడైన రాజువలె, దురాగ్రహుఁడైన నియంతవలె ప్రవర్తించినాను.ఆఫలము నేనుచనిపోయినతరువాత నన్ను భవింపనిమ్ము. నేను కూడఁబెట్టిన రాజ్యమును నా తరువాత ముక్కలుముక్కలుకానిమ్ము. నేను బ్రతికియుండగా నానియం

కృత్యమును సాగనిమ్ము. రత్నా—నీవు బ్రతికియుండఁగా నియంతవుకమ్ము. నీవు బ్రతికియుండఁగా నియంతవైన దేశము లోఁ బ్రాహ్మణస్వామికసంస్థలు పాడుచేయకుము. ఇవి రెండు నొక్క-సారి యెట్లు కలసివచ్చును? మనకు సంతానము కలిగినచో వారి బ్రతుకు లేమగును? వారెవరు? వారి జాతకములమీఁద మన కేమి యధికారము కలదు? లౌకికమైన సంపదయుండునో, యుండదో? వారికొక వర్ణముకూడ లేకుండఁజేయుదుమే! రంగ—మన మిరువురమును బ్రాహ్మణులము. మన సంతానము బ్రాహ్మణులగుదురు. రత్నా:—బంగినపల్లి చెట్టున కాయకాచును. ఆకాయలో పురుగుపడినచో దానిని సేవింపరు. స్నేహము స్వత్వాపహరణనిష్టమై యేమి శోభించును? దానియందు స్వచ్ఛత్వముకూడ నుండవలయును. రంగ:—రత్నా! నీతో నేను వాదింపఁగలుదునా! రత్నా:—కావుననే నన్ను నాదారిని పోనిమ్ము. నీవు బ్రహ్మచారివై యుండుము. బ్రహ్మచర్యముకూడ తపస్సే. మనస్సు దుష్టకామావేశము చేసికొనకుము. ఏమి కామమోయీ! ఏమికామము? తాను ప్రేమించిన స్త్రీ తన్ను ప్రేమించనిచో నాకామము వ్యర్థము. తనకుజబ్బుచేసినచో నాకామము వ్యర్థము. తన కకాలమరణము ప్రాప్తించినచో నా కామము వ్యర్థము. తాను పరదేశగతుఁడైనచో, నా స్త్రీకి వ్యాధివచ్చినచో, తాను కార్యాంతరాసక్తుఁడైనచో నా కామ మంతయు వ్యర్థము. ఈకొంచెము జీవితములో కామ మెంత స్వల్పముగా ఫలించునో చూడుము. ఈ కామభావమునకు నీవు దేవాలయము కట్టితివి. దానికిఁ బ్రేమయని పేరుపెట్టితివి. బ్రహ్మాండగుణము లన్నియు దానికి పట్టించితివి. చిత్రముకదా! రంగ—ఔనమ్మా ఔను! రత్నా—ఎన్నాళ్ళకొప్పుకొంటివి? ఒక

విషయ మెట్లా కొనుటకు సంస్కార మెట్లా కావలయును! ఆ సంస్కారము లేనివాడు దాని నెట్లు గ్రహించుకొనును? దాని నొప్పుకొనుట యతని యనుభూతికి బహిర్విషయము. ఒక యనుభూతికి బహిర్విషయము మఱియొక యనుభూతి కంతర్విషయము కాక పోదు. రంగ—నా పూర్వప్రస్తుతావస్థలే నీ వాక్యములకు నిదర్శనములుగా నున్నవి. రత్నా—అనుభవము రెండురకములు: ఒకటి మానసికావస్థకలది; రెండవది క్రియావస్థకలది. నా యనుభవము క్రియావస్థోన్ముఖముగానున్నది. నీవుకూడ నట్లయినచో మనము కొంత గడచితిమి. రంగ—రత్నా! నా మనస్సు నీ మనస్సువలె పరిపక్వముకాలేదు. మనోవిషయకమైన యవస్థలో ననే తారతమ్యము లున్నవి. నీ మనస్సు స్వయముగా నాలోచించి యొక మార్గమును తీర్చుకొన్నది. నా మనస్సు నీ మార్గమున కంగీకారముమాత్రము చూపించుచున్నది. రత్నా—ప్రకృతిలో నిశితత్వ మేర్పడినచో నీ రెంటికిని తారతమ్యము గోచరింపదు. వ్యాసుడు వ్రాసిన భారతము కవిత్రయము వారు తెలుగుచేసిరి. వీరుకూడ వ్యాసులవలెనే ప్రకాశించుచున్నారు. రంగ—తెలుగుభాషలో మాత్రమే యట్లు తోచుచున్నారు. రత్నా—అదియే యనుభూతిప్రథము! బహిరుపాధుల కన్న ననుభూతిసాంద్రత్వమున విశిష్టత యున్నది. అనుభూతి లోకములే వేఱు. వానికి భాష పట్టదు. ఉపాధులు పట్టవు. కాని యనుభూతి లేనప్పుడు ఉన్నట్లుగా భావించును; ఆ భ్రాంతి చెడ్డది. మనసుచేతఁ దెలిసికొని, మనసుచేత ననుభవింపలేని యొకస్థితియందుండును. వాఁడు కర్మాచరణమునకుఁ గాక మహానుభూతికిఁగాక చెడిపోవును. రంగ—రత్నా! నీ మాటలు నా కర్థమైనవి. లోకమునందు ననేకోదాహరణములు కూడ

నామనస్సునందు భావించుచున్నవి. నేను నీవు చెప్పినమార్గము నవలంబింతును. రత్నా:—ఇంకను కొంచెము వివరింతును. వివరించుటవలన విషయము మనస్సునకు దృఢపడును. "ఆత్మవత్సర్వభూతాని" యన్న వాక్యమున్నది. ఆ వాక్యమునే మాటిమాటికిని చెప్పుట, వ్యవహారములో ప్రసంగములయందుపయోగించుట యా యనుభవము మనస్సునకు వచ్చినట్లు కాదు. నేను బ్రహ్మచర్య మవలంబించుచుంటినని యనుకొనుచున్నచో నది యవలంబించుట కాదు. రంగ—నిజమే! రత్నా—నేను నేటినుండి నీ యన్నగారిభార్యను. రంగ:—నీవు మొదటి నుండియు నా యన్నగారిభార్యవే. రత్నా:—ఈ సడుమ కొన్నాళ్ళు కాను. నా పాపమునకు నిష్కృతి చేసికొనుట కారంభించితిని. రంగ:—నేను నిష్కృతి చేసికొనుట యెట్లు? రత్నా:—ఆయూహ యున్నచో దైవమే మార్గము చూపించును. రంగ:—నీవు ప్రతిష్ఠాపురము పోయెదవా? రత్నా:—ఇంకను కొన్నాళ్లాగి పోయెదను. ఆనాఁ డిద్దరు శోకోన్మత్తులు. ఇద్దరు బాష్పనేత్రులు. ఆనాఁ డిద్దఱు నియమవంతులు.

నాఁడు మొదలు వారియింటిలో మార్పులేదు. కాని మనసులలో మార్పువచ్చెను. ఇద్దఱు బైరాగులు. సాలంకృతమైన మఠమునందువలె వారిరువురును నివసించుచుండిరి. వారు మానసికముగా నెన్ని యిక్కట్టులు పడిరో యంతస్సాక్షికి మాత్రమే తెలియును ఎన్ని వాంఛాతరంగము లొడ్డుకొనిరో యెన్ని యెక్కిన సోపానములు జారి దుఃఖించి యెక్కిరో, యెన్నిసార్లు ఒకరికొకరికి సాయపడిరో వారికే తెలియును. సంవత్సరము గడచెను. వానికా బైరాగితన మలవాటుపడెను. శీలాంబరము న్యాయవాదపరీక్షకుఁ జదువుచుండెను. అతని

గడు నొక నోవేడాదియయ్యెను. రత్నావళియు, రంగడును నాహారనియమము పాటించుచుండిరి. వారు ధనము నిలువ చేయుచుండిరి. ఇంటిమధ్యతోనహా వారిరువురికు నెలబదిరూకల కన్న నెక్కువ వ్యయమగుటలేదు. తక్కిన డబ్బు బ్యాంకులో నిలవయుంచెను. బ్యాంకులో పదునేనువందలకుపైన నిలువ చేసెను. నీలాంబరము వారియింటికి తఱచు వచ్చుటలేదు. రెండు మూడుమార్లు మేనమామను డబ్బడిగెను. రంగడియ్యలేదు, మేనత్తనడిగెను. ఆమె "నీకష్టములు నీవు పడి చదువుకొనుము. మా తరువాత మా డబ్బు మీకు కావలయును. మే మెవరికో యిచ్చుకొందుము. నీకిచ్చుటకవీలులే"దనెను. నీలాంబరమునకుఁ గొంచెము కోపమువచ్చెను. కాని యతఁడు మరల డబ్బడుగ లేదు. కొంతడబ్బు సీతారామయ్యయే పంపించుచుండెను.

రత్నావళికి జబిలోఁగకారిణిపదవి వచ్చెను. ఆయుద్యోగము మీఁద నామె రాజమహేంద్రవరము పోవలసివచ్చెను. ఆమె తిరిగియు మదరాసు వచ్చుచుండెను. ఆమె మూఁడవతరగతిలో నొక చిన్నపెట్టెలోఁ గూర్చుండెను. పలువారుస్టేషనులో నొక వృద్ధబ్రాహ్మణుఁడును, నొక పదునైదేండ్లబాలిక మగశిశువును జేతులలో నెత్తుకొనియు నామెయున్న బండిలోని కెక్కిరి. వారు మొదట రత్నావళినిజూచి యెవరో చదువుకొన్న స్త్రీ యని జంకుచుల కుండు బెదరుతోఁ బోఁబోయిరి. రత్నావళి యాదరముతో వారిని లోనికిరమ్మనెను. వారు వచ్చిరి. రత్నా: మీ దేయూరు తల్లీ? ఆమె:—మాది వసంతవాడ. రత్నా:— ఈ పిల్లవాఁడు మీ కొడుకేనా?——ఆమె కొంచెము సిగ్గుపడెను. వృద్ధుఁడు:—అవునమ్మా? ఈమెకొడుకే! ఇది నా కూఁతురు. పిల్లవానికి మూఁడవనెల. పుట్టినిఁ దీసికొనివచ్చితిని. మఱి

భర్తృయింటికి పంపించువారిని. మనదేశమున్నది ? వారిసొత్తు వారికి దక్కించవలయునుగదా! రత్నావళీ యత్తగారు చేయునామె ? ఆ మోసముప్రతిష్ఠాపురము. రత్నావళి గుండెలో కలుక్కు మన్నది. ఆమెకు తనవారి తిప్పి ఆడుచున్నయాడ లేదు. నట్టింటవస్తువును వచ్చెను. పిల్లవాడు గుక్కను తడిపెను. ఆమె తన పిల్లవానిని రత్నావళి చేతి కిచ్చి పొయిపొత్తులు తీయఁబోయెను. రత్నావళి యాపిల్లవానిని తీసికొనక తప్పినదికాదు. ఆ జానపదురాలికిఁ జారమర్యాదలేమి తెలియును? అచ్చమైన,మానవసమాజములైన స్నిగ్ధభావములు మాత్రమే యెఱిఁగిన యా పిల్లకుఁ దన పిల్లవానిని రత్నావళి చేతి కిచ్చుట మర్యాద యగునో, కాదో తానంత చనవుతీసికొనవచ్చునో రాదో తెలియదు. ఆమెకాయూహయే లేదు. సర్వజనులును ఒకరికొకరు సామాన్యవిషయము లందు తోడుపడుట నిత్యమైన యొకసహధర్మముగా నామె మనస్సులో నుండెను. రత్నావళికిఁ గన్నులవెంట నీరువచ్చెను. ఆమె మనస్సులో నేమి యూహించుచుండెనో తెలియదు. రత్నావళి పిల్లవానిని మఱల తల్లి చేతి కిచ్చి "నీ పే రేమి ట"ని యడిగెను. ఆమె "రాజ్యలక్ష్మి" యని చెప్పెను. రత్నావళి "అయ్యో! నీలాంబరమును ఆయన క్రొత్తగాఁ జేసికొన్న భార్య పేరేమిటో కనుఁగొనకపోతినే" యని యనుకొనెను. ఆమెతండ్రిని "మీ పిల్లను ప్రతిష్ఠాపురములో నెవరి కిచ్చితిరి?"అని ప్రతినిముసమును అడుగవలయు ననియే తలఁచెను; అడుగలేకపోయెను. కొంతసే పటికి తానే యడిగి పిల్లవానిని తీసికొనెను. ఆ పిల్లవాని మొగములో, చేతులలో, కాళ్ళలో సీతారామయ్యపోలికలే కనిపించు చుండెను, పిల్లవాఁడచ్చముగా నీలాంబరమువలె నుండెను. రత్నావళికి ఏడ్పువచ్చెను. కాని మొగము కిటికీలోఁ బెట్టిచూచు

చుండెను. మరల పిల్లవానివంకఁ జూడసాగెను. రాజ్యలక్ష్మితండ్రి రత్నావళి పిల్లవానిని ముద్దుగాఁ జూచుచుండుటచేత నిట్లనెను. "అమ్మా! పిల్లవాఁడచ్చముగా తండ్రిపోలిక. మూఁడుమూర్తుల సీతారామయ్యయే యూడిపడెను. వాని తండ్రిపేరు సీతా రామయ్యయే."

రత్నావళిగుండెలో పదనుగల నాఁగటికఱ్ఱు లాగినట్లయ్యెను. ఆమె వలవల నేడ్వ నారంభించెను. రాజ్యలక్ష్మియు, నామె తండ్రియు నాశ్చర్యపడిరి, భయపడిరి. వృద్ధుఁడు "ఎందుకమ్మా ఏడ్చెద?" వనెను. రత్నావళి "యేదో జ్ఞాపకమువచ్చి యేడ్పు వచ్చినది. ఏమియును లేదని" కనులు తుడుచుకొనెను. వృద్ధుఁడు "అమ్మా! నీభర్తపోయిన ట్లున్నాఁడు. నీకును నెంతో వయసు లేదు. ఇటువంటి కొడుకు నీకుఁగూడ పుట్టిపోయెనా యేమి? మే మీబండిలోనికి వచ్చి నీకెంత కష్టము కలిగించినాము!" అనెను. కొంతసేపటికి రత్నావళి దుఃఖముతగ్గెను. గన్నవరము స్టేషనువచ్చెను. ఇంకొక స్టేషనుమాత్రమే యున్నది. బెజవాడలో వారు దిగిపోదురు. రైలంతతొందరగా నడుచుచున్న దేమి? వారు మద రాసు రాఁగూడదా? ఛీ! ఛీ!—వృద్ధుఁడు మరల నిట్లనెను. "మా యల్లునకు నలువదియైదేం డ్లుండును. మూఁడవసంబంధ మిచ్చితిమి. కొడుకు పుట్టినందుకు సంతోషించుచున్నాము. సీత బాగుగా నుండవలయునుగాని కొంచె మేండ్ల తారతమ్యములో నేమున్నది? నా పిల్ల నలువదియేండ్లవృద్ధునకీయలేదు. మగ వాండ్రకఱువదియేండ్లవఱకు వయసుండును. స్త్రీలకు నలువది యేండ్లతో వయసుడిగిపోవును. ఈతారతమ్యము చూచుకొని యిచ్చితి"ననెను. రాజ్యలక్ష్మి తనతండ్రి పల్లెటూరివాఁడగుట చేత చాదస్తముగ మాటాడుచుండెనని "ఊరుకో నాన్నా!"

యనెను. వృద్ధుఁడు మరల నిట్లనెను: "ముప్పదియేండ్ల పురుషుఁడు, మూఁడేండ్లయాఁడుది యని మనదేశములో వాడుక. ఈ మరబియ్యముతో, కాఫీహోటళ్ళతో, వెఱ్ఱికాఁయి వేషములతో నీ కాలములో నాయుర్దాయము తగ్గిపోయినది. కాని ఆఱువదియేండ్లవఱకును పురుషున కారోగ్యముచెడదు. నాకు నలువదియేండ్లు దాఁటినవి. నేనిప్పుడు పదిమైళ్ళు తేలికగా నడువఁగలను. ఇద్దుము నేనొక్కఁడను ఎత్తి బండిమీఁద వేయఁగలను. నాకు దీని తరువాత నిద్దఱు మగపిల్లలు, నొక యాఁడుపిల్ల. ఆఁడుపిల్ల ఏఁడాదిది. నాకు వివాహము నలువదవయేఁట జరిగెను" అనెను. రాజ్యలక్ష్మి "ఎందుకయ్యా! పిచ్చిగోల! నిన్నెవ రడిగిరి!" అనెను.

రత్నావళి "చెప్పనీవమ్మా, చెప్పని"మ్మనెను. వృద్ధుని మొగము వికసించెను. ఆయన కుత్సాహముకలిగెను. "నేను పాతికయేండ్ల క్రిందివఱకును జొన్నన్నమే తిన్నాను. పగలు పన్నెండు గంటలకు భోజనము చేయుదును. రాత్రి పదింటికి భోజనము చేయుదును. ప్రొద్దుటిపూఁట కాఫీ గ్రీఁ మాకేమి యలవాటు? నాకు నాలుగెకరముల కొండ్రున్నది. దానితోనే క్రింద, మీఁదపడి యెట్లో లాగుకొని వచ్చుచున్నాను. అందని పండ్లకు అఱ్ఱులు చాఁచి యేమిలాభము? నేను వేలుకట్నాలు ఇయ్యలేను. ఎవరిని కదలించినను "వెండిచెంబులు, పట్టుబట్టలు, ఆఁడుపడుచులకు నవరసులు, మాకు బి. ఏ. దాఁక చదువు చెప్పింతువా?" అనెడువారే. చదువు చూచినచో పొలముండదు. పొలమున్నచో చదువుండదు. మా అల్లుఁడు చాల మంచివాఁడు తల్లి. ఆశ్రేయము పౌరుషేయము గల కుటుంబము. ఏదో పాపము! అతనికి వచ్చిన చిక్కులు అతనికి వచ్చినవి. మా ధర్మమా అని

మా పిల్లకడుపునఁగూడ నొకకాయ గాచిన"దనెను. రాజ్యలక్ష్మి "మధ్య ఆమె ధర్మమేమిటయ్యా" అనెను. వృద్ధుఁడు "ఏదో మాటసామెతగా అన్నాను. తప్పు పట్టించుకొనకు తల్లీ"అనెను. రైలు ముస్తాబాదుస్టేషను దాఁటెను. ప్రతినిముసమునకు బెజవాడ స్టేషను వచ్చునేమో యని రత్నావళి తొంగిచూచుచుండెను. రత్నావళిపెట్టెలో పన్నెండురూపాయ లున్నవి. ఆమె మదరాసునకు టిక్కెట్టు పూర్వమే కొనెను.

రత్నావళి "పిల్లవానికిఁ బేరేమిపెట్టితిరి?" అని యడిగెను. వృద్ధుఁడు "వాని తండ్రియే తన తండ్రిపేరు పెట్టెను. పదునొకండవరోజుననే బారసాలచేసికొన్నాఁ"డనెను. రత్నావళికిఁ దన మామగారిపేరు జ్ఞాపకమునకు వచ్చెను. ఇంతలో బెజవాడస్టేషను వచ్చినది. వారు దిగిపోఁబోవుచుండిరి. రత్నావళి పెట్టెదీసి పది రూపాయలనోటు పిల్లవానిచేతిలోఁ బెట్టెను. రాజలక్ష్మి "ఇది ఎందుకమ్మా! వద్దు" అనెను. వృద్ధుఁడును వద్దనెను. రత్నావళి బలవంతము చేసెను. "పిల్లవానికేమైన చేయించిపెట్టుఁడు. నాకు నెల కఱువది రూపాయల జీతము. పదిరూపాయలు పిల్లవానికిచ్చినచో నష్టములేదు. దీనివలన మీకును నమర్యాద లేదు. నా కట్లు కోరికపుట్టినది. మన్నించి తీసికొని పిల్లవానికి నాపేరు మీఁదుగ నేదైన చేయించిపెట్టు"డనెను. రాజ్యలక్ష్మి "మీ పేరేమిటండీ" యని యడిగెను. రత్నావళికనులలో తెల్లపోయెను. ఆమె యామాట వినిపించనట్లు తనపెట్టె సద్దుకొనసాగెను. రాజ్యలక్ష్మి మఱల నామె నడిగెను. ఇంతలో నాంధ్రదరైలు బయలుదేఱుచున్నదని తండ్రిపిలిచెను. రాజ్యలక్ష్మి "అమ్మా! సెలవుతీసికొందు"నని వెళ్లెను. వెళ్లినంతసేపు వెనుదిఁగి రత్నావళిని జూచుచునే యుండెను. ఆ చూచుచున్నప్పుడు రాజ్య

లక్ష్మి మొగము ఏమి మొగము! ప్రొద్దుపొడుపు పూలు వికసించినట్లుండెను. ఆమె మొగములోని నవ్వులు ఏమి నవ్వులు! తెల్లగన్నేరులు గుప్పుచున్నట్లుండెను.

ఆమె చూచినంతమేఱ రత్నావళియుఁ జూచుచుండెను. ఆ చూచుచుండిన రత్నావళి మొగముఏమి మొగము! వాడుటయు, వికసించుటయు నొక్కసారి తోఁచినశరత్కాలాదివారిజమువలె నుండెను. ఆమె రాజ్యలక్ష్మి తనవంకఁ జూచినపుడు నవ్వును; ఆమె వెనుదిరిగినపుడు మొగములో విషాదము తెచ్చుకొనును. ఆమె నవ్వులు మొగిళ్ళచాటునఁ బోవుచు నచ్చుచున్నచంద్రాభిముఖముగా నున్న కలువపూవువికాసమువలె నుండును.

రైలు బెజవాడలో చాలసేపు నిలిచెను. ప్లాటుఫారమువెంట బీడీలను, సిగరెట్లను నమ్ముచుండిరి. ఒకఁడు రత్నావళిపెట్టెలోఁ దల పెట్టి "సిగరెట్లు సిగరె"ట్లని యఱచెను. కొంతసేపటికి మఱియొకఁడువచ్చి "దమనము, చేమంతిపూ" లని యఱచెను. వాఁడు దాఁటిపోయెను. రత్నావళి వానిని మఱల పిలిచెను. ఇంతదమనమును, ఇన్ని చేమంతిపూలును కొనెను. అవి తీసికొని రాజ్యలక్ష్మియెక్కిన బండియొద్దకుఁ బరుగెత్తెను. ఆబండి యది వఱకే వెడలిపోయెను. ఇంతలో తనరైలు కదలఁబోవుచుండెను. ఆ పువ్వులను, దమనమును ప్లాటుఫారముమీఁదనే వదలిపెట్టి తానుబోయి తన బండియెక్కెను. అటు తిరిగిచూడఁగాఁ బువ్వులును; దమనమును గాలి కెగిరిపోవుచుండెను. తనరైలు సాగిపోవుచుండెను. స్టేషనడ్డమువచ్చెను. పువ్వులు కనిపించలేదు.

రత్నావళి మదరాసు చేరెను. ఆ మూఁడవరోజున రంగఁడును, రత్నావళియు భోజనముచేయుచుండిరి. రత్నా:—రంగా! రంగ: ఏమమ్మా! రత్నా:—నన్ను 'ఏమమ్మా' యని పిలుచుట మొదలు

పెట్టియున్నాళ్ళయినది? రంగ—(మాటాడలేదు) మఱలకొంతసేప టికి రత్నావళి 'రంగా' యనెను. రంగ:—ఏమమ్మా! రత్నా:— మీ యన్నగారికి కొడుకుపుట్టెను. మీ నాయనగారి పేరుపెట్టిరి. రంగ:—నీలాంబరము చెప్పెనా? రత్నా:—కాదు, నేనే చూచి తిని. రంగ:—నీవు ప్రతిష్ఠాపురము పోయితివా? రత్నా:—ఇంకను వెళ్ళలేదు. రంగ:—మఱియెక్కడచూచితివి? రత్నా:—రైలులో మీవదినెగారు పిల్లవాసినెత్తుకొని నేనున్నబండిలోనికే వచ్చెను. రంగ:—నీవెవరో యామెకు తెలిసెనా? రత్నా:—నాకాగండము తప్పినది. తరువాత మూఁడవరోజున రత్నావళి పాఠశాలనుండి వచ్చి ముందుగదిలో కుర్చీలోఁగూర్చుండెను. రంగఁడువచ్చెను. అతఁడు రత్నావళి చదువుచున్న పుస్తకమువంకనే చూచుచుం డెను. ఆమె కన్నులెత్తి రంగనివంకఁజూచెను. రత్నా:—ఏమిటి, అట్లు చూచుచున్నావు? రంగ:—నాపాపము కొంతపోయినది. రత్నా:—మూఁడునాళ్లాలోచించితివా? రంగ:—ఆలోచించితిని. తక్కినపాపము మనమిరువురము తలఁచుకొన్నచో పోవచ్చును. రత్నా:—నే నీనాఁడు నాయుద్యోగమునకు రాజీనామా యిచ్చి తిని. రంగ:—మంచిపనిచేసితివి. బ్యాంకులోనీధనమెంతయున్నది? రత్నా:—నాకేమి తెలియును. రంగ:—మనమిరువురవికలిసిమూఁడు వేలున్నవి. అందులో నాది వేయి, నీవి రెండువేలు. రత్నా:— నాదే వేయి, నీవి రెండువేలు. రంగ:—కాదమ్మా! ఇంటిలోని ఖర్చంతయు నాదే! నీకు పరీక్షడబ్బు కొంతవచ్చినది. రత్నా:— ఇంటిఖర్చు చెఱిసగము. రంగ:—నీవు మఱల నామాటయన్నచో నేటినుండి మన మిరువురమును బ్రతికియున్న నాల్గునాళ్ళను విడివిడిగా వంటచేసికొని తిందుము. రత్నా:—నీ యిష్టము. రంగ:—నాడబ్బు నీలాంబరమునకిచ్చెదను. వాఁడు ఈ సంవత్స

రము పరీక్షయగును. ముందునాటి కెక్కునాయక్కడ బట్ట కట్టును. వానికి ప్రొద్దుబడికి నొక వేయిరూపాయలు కావలసి యుండును. రత్నా:- మఱినీ వేమగుదువు? రంగ:- మఱినీవే మగుదువు? రత్నావళినవ్వెను. రంగఁడును నవ్వెను. ఆ నవ్వులు అతివిచిత్రముగానుండెను. గడ్డిపూవులయందువలె వానిలో తావిలేదు. అవురుపూవులయందు పుష్పత్వము లేనట్లు వాని యందు హాసత్వములేదు. ఆశ్రమములందు నవ్వెన ట్లున్నదం దుమా? అందచ్చమైన, ధర్మమైన పరిష్కృతిశోభ యుండెను. వారినవ్వులలో నవ్వియును లేవు. తరంగములను వదలి నురుసు లోడ్డులందు నెమ్మదిగా జాఱునట్లు వారు నవ్విరి. నురుసులో చెమ్మ యెంత యుండును? వట్టి గాలిబూఁడులు.

తరువాత వారముదినములు రత్నావళి నిదురపోవును; లేచి కూర్చుండును; ఎదురుగానున్న గోడవంక నూరకేచూచు చుండును. రంగఁడు పత్రికాఫీసునకుఁ బోవును. సాయంకాలము లందు తిరిగివచ్చును. రత్నావళినంకకుఁ జూడఁడు. తాను ముందు వసారాలో గుర్చిలోఁ గూర్చుండి దారి వెంటఁ బోవువారివంకఁ జూచుచుండును. ఆసందులో నొకవైపున నొకమనిసి తనదృష్టి పథమునఁ బడును. వాఁడు రెండవవైపున తన దృష్టిపథము దాటిపోవువఱకును వానివెంటనే కన్నుపోనిచ్చుచుండును. ఒక యిల్లడ్డమువచ్చి వాఁడు కనిపించుట మానివేయును. మఱల నింకొకమనిసిని చూచుట కారంభించును. ఈ లోపుగా నా మనిసి తనవంకఁ జూచినచోఁ దనకన్ను మఱియొక చోటికిఁ ద్రిప్పుకొనును. చీఁకటి పడును. మనుజులు కనపించరు. క్రమముగా వీథి దీపపువెలుతురుగల గొందులు కనిపింతురు. రాత్రి మనిసి కనిపించఁడు, రత్నావళి యెప్పుడో యన్నమునకుఁ

బిలుచును. ఇద్దఱును మాటాడకుండ భోజనము చేయుదురు. ఆనాఁడురాత్రి రత్నావళి యిట్లనెను: 'కాదయ్యా! కాము యాత్రచేయుదుము. ఏవ్యాధియో వచ్చి చచ్చిపోయినచో నేమగును? వయసుడిగినచో నే మగును?" కొంతసేపు గడచెను. రత్నావళి మఱల నిట్లన్నది. "అని వివాహము చేసికొనినవారు మానివేయుచున్నారా యందువు. వారికి సంతానము కలుగును. ఆ సంతానము తల్లిదండ్రులకు తర్పణములు వదలును."

మఱల నిరువురును మాటాడలేదు. భోజనమైపోయెను. రంగఁడు పోయి వాకిటిలో బండుకొనఁబోవుచున్నాఁడు. రత్నావళి యిట్లన్నది. "ధర్మ్యముకాని సంతాన మెందుకు? అట్టి దిదివఱకు లోకములో లేదా యందువా? ఉండవచ్చును. నాకెందుకు?" రంగఁడు పోయి పండుకొనెను. రత్నావళి కొంతసేపటికి బయటికివచ్చెను, మఱల నిట్లనెను. "ఇది పాప మనుకొనుచున్నావు కావున నిదిపాపము. ఎంతమందియో నిట్లుచేసి నీవలెకాలేదు అని యందువా? బాగుగా నున్నదే! పుట్టె కొక బుద్ధి. నాకిట్లు తోఁచినది. నాకిది ధర్మమనిపించెను. వారందఱకు నిట్లనిపించ లేదు. అవును నేను ధర్మమనుకొన్నది నేనే మొదటిసారి అనుకొనలేదు నా దేశమునం దిది ధర్మము. నామతమునం దిది ధర్మము. నావంశములో నిది ధర్మము. నేను నిదియే ధర్మమనుకొనుచున్నాను"—ఆమె పోయి పండుకొన్నది. రాత్రి రెండు జాములైనది. ఆమె మఱల బయటికివచ్చెను.

రత్నా:— రంగా! రంగ:— ఊఁ! రత్నా:— మేలుకొనియే యున్నావా? రంగ:—అవును. రత్నా:-ఒక విశేషము ప్రాప్తించినది. కనుక నీవు విశేషప్రక్రియగా పరధర్మమేల యనుష్ఠించరాదందువు. రెండు భిన్నసంప్రదాయములున్నవి. ఏ సంప్రదాయ

ములో బుట్టినవారికి దియే సంప్రదాయము. నీవు పరాధీనజాతిలో బుట్టితివి. ఎంత గొప్పవాఁడవైనను నిన్నుపాలించు దేశములో నిన్ను పాల్యదేశస్థునిగానే చూతురు. నీవు నల్లి యనుకొందువు. ఈ మాత్రము నిబంధన సంఘమతాచారములలో లేదా? కాదు. నీమతముకన్న వారిమతము గొప్పదందువేమో? రెండు మతములలో నేది శ్రేష్ఠతరమో ఎవ్వరు చెప్పుదురు? లోకములోనున్న జనులందఱు నేదోయొకమతమునకుఁ జెందుదురు. ప్రతివానికిని తనమతమే శ్రేష్ఠతమ మని యనిపించును. ఈమతసులు పదిమందియొకచోట కూర్చుండినను నిజము తేలదు. రాజకీయములలోఁ జూడుము. రాజు రాజ్యముచేసినపుడు రాజపాలనమే యుత్తమమని మహామేధావు లభిప్రాయపడిరి. ప్రజాస్వామికమువచ్చి యిది యుత్తమము అని యనిపించినది. నియంతృదేశములలో నది యుత్తమ మనిపించుచున్నది. ఇప్పుడుకొందఱి యుద్దేశ్యములో "బోల్షివిజము" ఉత్తమముగా నున్నది ఒక వ్యక్తియొక్కయో, ఒకదేశపు ప్రజలయొక్కయో బలమునుబట్టి యీ యీ భావములకుఁ బ్రాబల్యము కాని వస్తుతః నిర్ణయింపరాదు. జనమేజయుఁడు సర్పకులమునంతయు నశింపజేయుఁదు ననెను. మఱియెవ్వరో దైత్యకులము నాశనముచేయుదు ననెను. ఋషులు వారించిరి. ఒకజాతిని నశింపఁజేయుటకు నీకధికారము లేదు. ఒక సంప్రదాయమును నశింపఁజేయుటకు నీకధికారము లేదు. సృష్టిలో వానిస్థానములు వానికున్నవి. నీ కేదోయొక యూహపుట్టి నీవు తాత్కాలికముగా బలవంతుఁడ వగుటచేత నీ యూహచే సర్వజాతులకును ధర్మము లనలేవు. నా ధర్మము నాది. నాజాతికొఱకు, నా సంప్రదాయముకొఱకు నే నాహుతి యైపోదును. రంగఁడు మాట్లాడలేదు, రత్నావళి లోనికిఁబోయి

పండుకొనెను. ఆమెకు నిద్రరాలేదు. బయట రంగఁడును నిదురించుటలేదు. రెండుగంటలు కొట్టిరి. మూఁడుగంటలు కొట్టిరి, రత్నావళి లేచెను. ఒకగంటసేపు లోనుండి బయటికి, బయట నుండి లోనికిని తిరిగెను. నాలుగుగంటలు కొట్టిరి. ఆమె ముఖప్రక్షాళనము చేసికొనెను. రంగఁడును ముఖప్రక్షాళనము చేసికొనెను. రంగఁడు నిదురఁబోయెను. రత్నావళి ఒక కాగితము తీసికొని దానిపై నిట్లు వ్రాసెను. "నిప్పు ముట్టుకొందుము. కాలును. ఏడ్చినచో బొబ్బపొక్కకుండ పోవునా? పుండుపడకుండ మానునా? పాపము చేయుదుము. పశ్చాత్తాపపడినచో పోవునా? దానికి ఫలముండదా?" "ఒక వ్యాధి వచ్చినపుడు ఆత్మహత్య చేసికొందుము. బాధపోయినదా? ప్రాణముపోయినది; బాధపోవుట కాదు. ప్రాణము పోయినతరువాత బాధ యుండకపోవుట అత్యంతాసంభవము కనుక." "పశ్చాత్తాపపడి యాత్మహత్య చేసికొందును. పాపఫలము పోయినదా? ప్రాణముపోయినది. వ్యాధిబాధ ఈ శరీరముతో ననుభవించునది. పాపఫలము ఈ శరీరముదాఁటికూడ ననుభవించునది."

## పదునాఱవ అధ్యాయము

రత్నావళి నిదుర లేకుండనే బయలుదేఱెను. ఎక్కడికిఁ బోవుచుంటివని రంగఁడడుగలేదు. ఆమెమోము తీరుచూచినచో నామె గ్రామాంతరము పోవునట్లు కనిపించెను. రంగఁడు తానప్పుడే నిద్రమేల్కనెను. ఆమెవంకఁ జూచెను. ఆమెను పల్కరించుటకుఁ గూడ నతని కోపిక లేకుండెను. అతఁ డెందుచేతనో యామె గ్రామాంతరమునకుఁ బోవుట లేదనుకొనెను. ఎక్కడికో పోయి తిరిగివచ్చు ననుకొనెను. రంగఁడు పోవుచున్న రత్నావళి [illegible]

కాంతియును మాసెను. రత్నావళి పూర్వము బక్క పలుచగా నుండెడిది. ఇప్పుడు లావుపాటెను. పూర్వ మామెశరీరము లావణ్యముచే నిగనిగలాడుచుండెను. ఇప్పు డామెశరీరము కప్పువాలెను. పూర్వ మామె మొగము సౌందర్యముచేత ధగధగలాడుచుండెను. ఇప్పు డామె మొగము కొద్దిగా ముడుతలుపడి ముఖమునందలి కండరములు మొగము గండరించినట్లు అసుందరముగా బలిసి మొగములో నందమే లేకుండెను. పూర్వ మామెశిరోజములు నిత్యసంస్కృతములై తుమ్మెదరెక్కలవలె సుస్నిగ్ధములై యుండెను. ఇప్పు డామెతల బుట్టవోలె నుండెను. రాగివెండ్రుకలయ్యెను. తల చాలభాగము నరసెను. తాను ఆనాఁడు ప్రతిష్ఠాపురమునుండి తీసికొని వచ్చిన రత్నావళి యీమెయేనా ? ఆమెకు నీమెకు నేమియు సంబంధము లేదు. శరీరములో సంబంధము గోచరించుటలేదు మనస్సులో నా సంబంధము గతించి కొన్ని యేండ్లయినది

అంత నిద్రమత్తెందుకు ? ఎక్కడకుఁ బోవుచుంటి వని యడుగరాదా ? ఆమె యేదైన పనిమీఁద పోవుచుండె నేమో ? అడిగినచో నపశకునము. రంగఁ డీనాఁడు పత్రికాఫీసునకుఁ గూడ పోఁడా ? అతనియొడ లంతయు విఱుగఁబొడిచినట్లుండెను. తెల్లవాఱులును నిద్రలేక వానికి బడలికగా నుండెను. ఒడలంతయు నేదో దిమ్మెక్కినట్లుండెను. అతనికి మఱల పక్షవాతము దెబ్బ తగులునేమో యని భయము వేసెను. అతఁడు నుఱలముసుఁగు పెట్టుకొని పండుకొనెను. రత్నావళి యట్లే తల మొత్తకుండ పోయెను. అది పోయి యెక్స్ప్రెసు నందుకొనెను. ఆఁడువాండ్ర పెట్టెలోఁ గూర్చుండెను. ఒక పెద్ద యుద్యోగస్థుని భార్య—దాసిది; యొడలెల్ల నగలు పెట్టుకొని, బోలెడంత

సామాను బంట్రోతుచేత బండిలోఁ బెట్టించుచు రత్నావళిని తొలఁగుమని గద్దించెను. రత్నావళి మాటాడకుండఁ దొలఁగెను. ఆమె రత్నావళి ప్రక్కనే కూర్చుండెను. ఆమె తన సామానులను పఱచి రత్నావళి కులాసాగాఁ గూర్చుండుటకుఁ గూడ వీలులేకుండఁజేసెను. రత్నావళి యొత్తిగిలి కూర్చుండెను. ఆ యుద్యోగస్థుని భార్య ముగ్గురు పిల్లలతో నెక్కెను. వాండ్రు నలుగురును పదిమందికూర్చుండు స్థాన మాక్రమించిరి. ఆమె 'టిఫిన్ కారేజ్' తెఱచి ఇడ్డెనలును, పచ్చడియు పిల్లలకు ముగ్గురకు మూఁడుపళ్ళెములలోనను, తనకొక పళ్ళెములోను పెట్టుకొని యారగించుచు మరచెంబుతో నీళ్ళు తెమ్మని బంట్రోతు మీఁద కేకలు వేయుచుండెను. రైలు కదలెను

ఉద్యోగస్థునిభార్య చేతులు కడుగుకొనకుండనే 'ఫ్లాస్కు' తెఱచి కాఫీ తాను త్రాగెను; పిల్లలకిచ్చెను. ఆపిల్లలు కాఫీ క్రిందను, పైనను పోసి బండియంతయు కిచాటుచేసిరి. ఆమె చేయి సరిగా కడుగుకొనక కూర్చుండుచోటను, ఆనుకొనుచోటను చేయి పులిమెను. కొంతభాగము చీరకే రాచుకొనెను. ఆ చీరకొంగుతోనే పిల్లవాండ్ర మూతులును, ముక్కులును తుడిచెను. తరువాత నామె తన పిల్లలకు, తనకు ప్రక్కలుపఱచి, రత్నావళిని రెండవ యరలోనికిఁబోయి కూర్చుండు మనెను

రత్నావళి లేచి రెండవయరలోఁ గూర్చుండెను. ఆ యుద్యోగస్థునిభార్య పండుకొని 'ఆనందవికటన్' పత్రిక చదువుచుండెను. రత్నావళి కిటికీలోనుండి తూర్పువంకఁ జూచుచుండెను. వంతెనలు, చిన్నస్టేషనులు గబగబ దాఁటిపోయెను. కొబ్బరితోఁటలు వచ్చెను. ద్రావిడులు కొబ్బరికల్లు తీయుచుండిరి. సముద్రము కనిపించెను. సూర్యకిరణములు సముద్రముపైఁబడి వెలిఁగిపోవు

చుండెను. ఆ నడుమగా వచ్చిన కాలువలో జాలరులు చేపలు పట్టు చిన్ని పడవలు పలుచోట్ల పడియుండెను. రైలు మఱల పోవుచుండెను. రత్నావళికి తెల్లవాఱులును నిదుర లేదు. ఆహారము లేదు. ఆమెకు నిదురవచ్చుట లేదు. ఆఁకలియగుట లేదు. ఆమెకూర్చున్న యరలో మఱియొక స్త్రీ యొత్తిడి యెక్కువయ్యెను. రత్నావళి తానుకూర్చున్నచోటనుండి లేచి మఱియొకచోట కూర్చుండెను. ఆ కూర్చున్నచోటనుండి తక్కిన యందఱు స్త్రీలయు మొగములుమాత్రమే కనిపించుచుండెను. రైలు నాయఁడుపేటలో నాగెను. మఱియొక స్త్రీ లోనికి వచ్చెను. ఆమె పండుకొనిన యుద్యోగస్థుని భార్యను లెమ్మనెను. ఆ యుద్యోగస్థునిభార్య తనకు వినిపించనట్లు చదువుకొనుచుండెను. ఆ వచ్చినయామె యొక కుఱ్ఱవానిని లేపి తానచ్చట కూర్చుండెను. వారిరువురును పోట్లాడుకొనిరి. పెట్టెలోని తక్కినవారందఱు క్రొత్తగా వచ్చినయామె పక్షముచేరిరి. ఆక్రొత్తగావచ్చిన యామె పూర్వపుటామెను గద్దించి యింకొకపిల్లనుకూడ లేపి రత్నావళిని వచ్చి యచ్చటఁ గూర్చుండుమనెను. రత్నావళి పోలేదు. మఱి యెవ్వతెయో పోయి కూర్చుండెను. మఱల రైలు సాగుచుండెను. గూడూరులో మఱి నలుగురు స్త్రీలెక్కిరి. వారందఱు నిలుచుండిరి. అందులో నొక వృద్ధురాలుండెను. ఆమె నిలుచుండ లేకపోయెను. రత్నావళి తానులేచి తన స్థలములో నాముసలామెను కూర్చుండఁబెట్టెను. తాను నిలుచుండెను. ఆ ముసలిది వడఁకుచు "అమ్మా! నీకొడుకు వేయికాలాలపాటు సుఖముగా ఉండాలి" అనిదీవించెను. రత్నావళి కన్నులలో గిఱ్ఱున నీరు తిరిగెను. ఆమె మనస్సులో ననుకొనెను: "ఈతల్లి యాశీర్వాదమువలన మాబిడ్డఁడు వేయియేండ్లు సుఖముగా

రత్నావళి "నాకేమీ ఆకలిగా లేదు" అనెను.
అఱవతల్లి తరువాత నామెను పూరీలు తీసికొమ్మని యడుగ లేదు. తాను మఱల ప్రశ్నవేయ నారంభించెను. "మీకును మీచెల్లెలికిని విరోధమా?" రత్నా:—న న్నావిడ యెఱుఁగనే యెఱుఁగదు. ఉ. భా:—మీమాటలు నాకు తెలియటంలేదు. రత్నా:—మీ రేవూళ్ళో దిగుతారు? ఉ. భా:—బాపట్లలో దిగుతాను. మావా రక్కడ జిల్లామున్సబుగా ఉన్నారు. రత్నా:— మీ కెంతమంది బిడ్డలు? ఉ. భా:— వీళ్ళుముగ్గురే. ఆయిద్దఱూ ఆఁడపిల్లలు. వాఁడు మగపిల్లవాఁడు. మఱల కొంతసేపు వా రొకరితో నొకరు మాటాడలేదు. ఒంగోలు, చీరాల, చిన గంజాములు దాఁటిపోయెను. బాపట్ల వచ్చుచుండెను. రత్నా:— మీ రిక్కడ దిగుతారు కాబోలు. ఉ. భా:—దిగుతాను.మీరు కూడ దిగండి. ఈపూఁటఉండి రేపు పోవుదురుకాని. టికెట్టు వృథాఅవుతుందని అనుకోవద్దు. నేను టికెట్టుకొని పంపిస్తాను. రత్నా:—కాదమ్మా కాదు. నే నీరాత్రికే పోవాలి. అంతలో నాకాశమున మేఘములు పట్టుచున్నట్లుండెను. చల్లపడెను. గాలి నెమ్మదిగా వీవ నారంభించెను. బాపట్లస్టేషను వచ్చెను. అప్పటికి గాలి పెద్దదయ్యెను. చిన్న తుప్పర పడుచుండెను. అఱవ తల్లి పిల్లలతో, సామానుతో దిగిపోయెను. రైలు మఱలసాఁగెను. ఝంఝామారుతము ఆరంభించెను. ఒక చెవిలో నుండి యొకచెవిలోనికి గాలి రివ్వుమని దూసికొని పోవుచుండెను. రైలు బోల్తాపడునేమో యనిజనులందఱును భయపడఁజొచ్చిరి. తెనాలిలో రైలాఁగిపోయెను. ప్రచండమారుతము వీవసాఁగెను. రైలుస్టేషను మీఁది 'టిన్' రేకు లెగిరిపోయెను. తెక్కలు విఱిగి పోయెను. కొన్ని పట్టాలుతొలఁగిపోయెను. మనుష్యులునిలుచుండ

టకును, నడుచుటకును వీలు లేకపోయెను. రైలుదిగి చాలమంది జనము ఊరిలోనికిఁబోయిరి. గాలిపాటుకు స్టేషనద్దముగానుండుట చేత రైలుపడిపోలేదు. ఒక పాతికమంది మాత్రము రైలు బండిలోపలనే కూర్చుండిరి. వారిలో రత్నావళి యొకతె. అప్పటికి ప్రొద్దుక్రుంకెను. రత్నావళి కాఁకలివేయుచుండెను. ఆమె కాఁకలివేయుచున్న దని తెలిసెను. రెండుగంటలు గాలిరివ్వున విసరి తగ్గిపోయెను. మారుతము మదరాసువైపునకుఁ బోయెను. రత్నావళికి రైలులో నిద్రపట్టెను. కొంతసేపటి కొక టికెట్టు కలెక్టరు వచ్చి చేతితాళపు చెవితో రైలుపెట్టెమీఁద కొట్టి "దిగండి దిగండి. రైలు రేపు మధ్యాహ్నముగాని పోదు. ఈ టికెట్టు రేపటికి పనికివస్తుంది" అనెను. రత్నావళి దిగక యేమి చేయును? దిగియెచ్చటికిఁబోవును! అయినను దిగకతప్పినదికాదు. ఆమెదిగి రెండరఁటిపండ్లు కొని భుజింతమనుకొన్నది. స్టేషనులో దుకాణము మూసివేసిరి. చుట్టుపట్ల నెవ్వరును మనుష్యులే కన్పించలేదు. ఊరిలోనికిఁబోవుట కొక్క బండియైనను లేదు. ఆమె కొక యూహ తోఁచెను. రైలురోడ్డు వెంటఁబడిపోయి నచో బెజవాడ చేరవచ్చును. ఎన్నిమైళ్ళున్నదో? తానునడవఁ గలదా? గాఢాంధకారముగా నుండెను. ఆమె కాదని స్టేషను లోననే యొకగోడ కానుకొని పండుకొనెను.

ఆ ప్రాణ మెచ్చటికో పోయెను. ఆమెకు మెలకువ వచ్చుసరికి తెల్లవారెను. స్టేషనులో నెవ్వరును లేరు. తెల్లవారుఝాము వాన కురిసెను కాఁబోలు! దూరమున నేలయంతయుఁ దడిసి యుండెను. ఆమెకు మెలకువయే రాలేదు.

మబ్బులు తగ్గలేదు కాని గాలి లేదు; వాన లేదు. స్టేషనులో జనము క్రమముగాఁ బ్రోవుపడుచుండిరి. రైలు పద్దింటికిబయులు

దేశానని చెప్పెను. ఆమెకు శరీరములో నీరసమే యెక్కువగా నుండెను. కాని యాకలి కనిపించలేదు ఆమె యట్లే కూర్చుండెను. నిముషములు, గంటలు గడచుచుండెను.

రైలు బయలుదేరెను. రాజనాడవు నొంటిగంటకుం బోయెను. సాయంకాల మైదింటికింగాని తమయూరుపోవుటకు బండిలేదు. స్టేషనులోనున్న హోటల్లో నామె భోజనము చేసెను. తెల్లవారులు నిదురపోయిన యామెకు మబ్బల నిదుర వచ్చెను. స్త్రీల విశ్రాంతి స్థలములోనికిం బోయి పండుకొని నిద్రించెను. అయిదుగంటలకు రైలెక్కి తమయూరివద్ద బస్తీలో దిగెను. అబ్బా! తమ స్టేషనుకు బోవుటకు యేడుగంట లయ్యెను. చీకటిపడెను. అక్కటినుండి ప్రతిష్ఠాపురము నడచిపోవలయును. లేదా? బండికట్టెద రేమో కనుగొనవలయును. ఆమె బండ్లవాండ్ర నడిగెను. వారు "వానలు కురిసెను. ఇప్పుడు బండిపోదు" అనిరి. మఱియొకడు "ఆ సముద్రములోనికి నేను బండికట్టను" అనెను. ఇంకొకడు "ఇంకా ప్రతిష్ఠాపురమేమిటి? ఈపాటికే సముద్రంలో మునిగిఉంటుంది" అనెను. రత్నావళి ఒకతె తాను నడచిపోయినను మఱునాడు పొద్దుననే నడచి పోవలయు ననుకొనెను.

ఇంతలో నొకమనిసి తనప్రక్కగా నడచిపోవుచు తనవంక నిదానించి చూచెను. ఆమెయుంజూచెను ఆతడు హరికిశోరరావు. అతండామెను పలుకరించెను. "ఏమండోయి ఇల్లావచ్చారు.?" రత్నావళికి హరికిశోరునితో మాట్లాడుట యిష్టములేదు. కాని యెందుచేతనో ఆమె సమాధానము చెప్పెను. "ప్రతిష్ఠాపురము పోదామని వచ్చాను. బండ్లు కుదరటంలేదు."

హరి:-- ఈయర్ధరాత్రివేళ ఏంపోతారు? [illegible] చుట్టూ యున్నారు. ఇవ్వాళరాత్రియిక్కడ ఉండిపోదురుగాని. ప్రొద్దున్న

తోఁచెను. ఆమె "అయ్యా! మీ పేరేమి" అని పిలిచెను. ఆ పోవుచున్న మనిషి యాఁగి నెమ్మదిగా దగ్గఱకువచ్చెను. అతఁడు దీపపు వెలుతురులోనికి వచ్చెను.

రత్నా:- అమ్మయ్యా! ముకుందరావుగారు! ముకుం:-ఓహో! రత్నావళి! ఎక్కడి కిట్లు వచ్చితివి? రత్నా:- నేను ప్రతిష్ఠాపురము పోవాలని వస్తున్నా. నిన్నటిగాలికి తెనాలిలో రైలాగి పోయింది. ఇవ్వాళ వచ్చాను. హరికిశోరరావు స్టేషనువద్ద కనిపించి నన్నిక్కడకు తెచ్చాఁడు. రేపుప్రొద్దున బండి కుదిర్చి ప్రతిష్ఠాపురము పంపిస్తాననాఁడు. నాకు ధైర్యం చాలటంలేదు. పాలూ, పళ్ళూ తెస్తానని ఊరిలోకి వెళ్ళాఁడు. మీ రెక్కడనుంచి వస్తున్నారు? ముకుం:-ప్రతిష్ఠాపురంనుండేవస్తున్నాను. ఆవూళ్ళో ఉప్పెనవస్తుందని భయంగావుంది. కలెక్టరు 'టముకు' వేయించాఁడట. ఆ ఊళ్ళోవాళ్ళు ఎవళ్ళదారిని వారు వెడుతున్నారు. రత్నా:-నేనుపిల్లవాణ్ని చూద్దామని వెడుతున్నాను. వాళ్లు కూడా వెళ్లారా? ముకుం-వాళ్లు రేపుసాయంత్రం వెళతారు. నీవు ప్రొద్దున్నే ప్రతిష్ఠాపురం వెళ్లవచ్చు. ఈవూళ్లో మాచుట్టాలున్నారు. అక్కడికి పోదాం రా. రత్నా:-ఇతను తలుపుతీసి పెట్టిపోయినాడే! మీరు రావటంమూలంగా నాకీనాఁడు గణ్డం తప్పింది. ముకుం-ఏడిశాఁడు, గోరీకట్టించేవాణ్ణి. తలుపుగొళ్లెము పెడతాను. పోదాం రా. ముకుందరావు తలుపు గొళ్ళెము వేసెను. ఇద్దఱును కలసిపోయిరి. రత్నా-మనము ప్రక్కసందులోనుండి పోవుదము. అతడీదారినే వచ్చునేమో? ముకుం-అంతభయమెందుకు? రత్నా:- మఱల వానిమొగము చూచుటకు నాకిష్టములేదు. వా రిరువురును ప్రక్కసందులోనుండి వెడలిపోయిరి. ఆ రాత్రి రత్నావళి సుఖముగా నిదురించెను.

ఏడేండ్లక్రిందట మెట్టిన గడప మరల మెట్టెను. ఇంటిలో నంద ఉను ప్రయాణసన్నాహముమీఁద నుండిరి. ఆమె కెదురుగా నామెభర్త కనిపించెను. ఆమె పోయి యాయనకాళ్లు పట్టుకొని యేడువ నారంభించెను. సీతారామయ్య యామె యెవరో బిచ్చపుది యనుకొనెను. "ఎవరు నీవు? ఏమికావలయు" ననియత డడిగెను. ఇంతలో కొడుకును చంక కెత్తుకొని రాజ్యలక్ష్మి యచ్చ టికి వచ్చెను. సరస్వతియు వచ్చెను. రాజ్యలక్ష్మి రత్నావళిని గుర్తించెను. ఆమె యాశ్చర్యపోయి భర్తతో "యీామెయే అబ్బాయి చేతిలో పదిరూపాయలు పెట్టినది." అని, రత్నా వళితో "ఏమండీ! ఇట్లు వచ్చితిరేమి?" అనెను. సీతారామ య్యకు మనోభావములు చిత్రములుగాఁదోఁచెను. ఆమెయెవ్వరు? పిల్లవానిచేతిలో పదిరూపాయ లేల పెట్టెను? రాజ్యలక్ష్మి యామె యెవ్వరో ఉద్యోగస్థురా లని చెప్పెనే? ఈమెబిచ్చపు దానివలె నేలఉండెను? ఆమె యేడ్చుచు వచ్చి తనపాదములపై నేలఁబడెను? అతఁడు స్తబ్ధుఁడై నిలచిపోయెను.

సరస్వతి దూరముగానుండి చూచుచుండెను. ఆమె క్రమక్రమ ముగా గుర్తుపట్టిన చాయలు తోఁచెను. ఆమె గుర్తుపట్టినది. "రత్నావళి! రత్నావళి" యని చెప్పక యింటిలోనికిఁ బోయెను. సీతారామయ్య "ఎవరమ్మా మీారు? ఎందు కట్లా ఏడుస్తావు? కారణంచెప్పు" అనెను. రత్నావళి "అయ్యా! నాకొక్కకోరి కుంది. అది ఏమీా కష్టమైనకోరిక కాదు. నా దగ్గఱ రెండు వేలరూపాయ లున్నవి నేను చచ్చిపోతే నాకు తద్దినాలు పెట్టే వారు లేరు. ఆ రెండువేలరూపాయలు నీ కొడుకున కిస్తాను. ఇచ్చాను. మద్రాసులో ఫలానా బ్యాంకులో ఉన్నవి. మీా కొడుకుపేర ఆర్డరు వేశాను. పిల్లవాఁడికి మైనారిటీ వెళ్ళిన తరు

వాత ఆ డబ్బు ఆ కుఱ్ఱవానిచేత వసూలుచేసికోవచ్చును. ఇంపీరియల్ బ్యాంకులో ఎక్కడైనా నగదు చేసుకోవచ్చును. పిల్లవానికి మెజారిటీ వెళ్ళేటప్పటికి యీ డబ్బు పదెనిమిదివే లవుతుంది. దీనికి ప్రతిఫలంగా నా కేమీ అక్కరలేదు. నా అబ్దికాలు మీ పిల్లవానిచేత పెట్టించండి. మీరు వొప్పుకుంటే మీ కాళ్ళు వదిలిపెడతాను. బ్యాంకుపుస్తకము, కాగితాలూ నాచేతి సంచీలో ఉన్నవి. మీరొప్పుకుంటే తీసిఇస్తాను" అని యేడువ నారంభించెను. సీతారామయ్య కా వెంకటరత్న మెచ్చటనో విన్నట్లుండెను. ఆమె రత్నావళి యేమో యను ననుమానము సీతారామయ్యకుం గలుగలేదు. తా నెఱింగియున్న రత్నావళికి, యీ స్త్రీకి నేమియు సంబంధము కనిపించలేదు. సీతారామయ్య "మనగోత్ర మొకటి కావలయును గదా!" యనెను. రత్నావళి "గోత్రమొక్కటే" యని సమాధానము చెప్పెను. సీతా:—అయితే ఇబ్బంది లేదు. అబ్దికములు పెట్టుటకు పెద్ద అభ్యంతరం ఉండాలిసిన అవసరం లేదు. మా పిల్లవాడికి నీ డబ్బు కూడా అక్కర్లేదు. ఒక అనాథజీవికి పరలోకాల్లో గతికలిగిస్తే నాదేమి పోతుంది? వాడి దేమి పోతుంది? అల్లాగే పెట్టిస్తాను. ఆ డబ్బు తీసుకువెళ్ళి మీ చుట్టాల కెవరికైనా ఇచ్చుకో. రత్నా:—నాకు చుట్టాలు వేటే ఎవరూ లేరు. అయ్యా! మీరు వాగ్దానంచేశారు. తరువాత నే నెవ్వరినైనా సరే! మాట వెనక్కితీసుకోకూడదు. భగవత్సాక్షిగా ఈమాటమీద నిలుస్తారా? సీతా:—నీవు బ్రాహ్మణజాతి స్త్రీవేనా? రత్నా:—నేను బ్రాహ్మణజాతి స్త్రీనే. సీతా:—అయితే నా మాటమీద నేను వెనక్కిపోను; రత్నా:—ఉప్పెన వస్తుందంటగదా! మీ రిక్కడ నుంచి వెళ్ళిపోదామనుకొంటున్నారంటగదా! ఎప్పుడు వెళతారు?

ఉంటే ధర్మమే దూరమవుతున్నట్టవుతుంది. మొదట ధర్మం తెలియక సంప్రదాయాన్ని పాటించి, తర్వాత ధర్మం తెలిసి తాను చేసిన పాపం ఇంతా అంతా కాదని తెలిసికొన్న స్త్రీ ఏం చేస్తుంది? కుక్కలకన్నకూడా కనాకష్టంగా శరీరాన్ని అధర్మ మార్గాల్లో పెట్టి ఆపాపమంతా చివికి జీర్ణించిన శరీరం బ్రతికి ఉన్నట్లా, చచ్చిపోయినట్లా? ఆ స్త్రీ చావక ఏంచేస్తుందో చెప్పు. యౌవనం క్షణికంగా ఉంటుంది. శరీరం అంతకన్నా క్షణికం. ఆశరీరం ధర్మాన్ని చేస్తున్నంతసేపు నిలిచిఉండటం మంచిది. శరీరం ఉంటేనే ధర్మంచేయటానికి వీలు కనుక ఆశరీరాన్ని రక్షించుకోవాలి. బుద్ధిపూర్వకంగా ఒక స్త్రీ తన శరీరం ధర్మాచరణ జరపటానికి అనర్హంగా చేసుకుంటే ఆశరీరం ఉండి ఏంలాభం? ఆస్త్రీ ఇంకా ఎందుకు బ్రతకాలి? నేనెవ్వరినో వారికి తెలిసినది. రాజ్యలక్ష్మీ! నీకు తెలియదు. నేను వారికాళ్ళు పట్టుకునేందుకు వగను. కాని ఆసుఖంకూడా నేనెవరినో ముందే తెలుస్తుకుంటే నాకు దక్కదని తెలియకుండా కాళ్ళుపట్టుకొన్నాను. ఆ కాళ్ళు ఆయనను తెలియకుండా నారొమ్ముకి అద్దుకొన్నాను. నాఒళ్ళంతా మళ్ళీ స్వర్ణఖండంగా ఉంది. నేనుచేసిన పాపాలన్నీ పోయినవి. ఏశరీరంతో ఆపాపాలు చేశానో ఆశరీరంమాత్రమే పోవాలి. ఉప్పెన తప్పకుండా వస్తుంది. సముద్రుడు చెలియలి కట్టను దాటివస్తాడు. నన్ను తనలో ముంచివేసికొంటాడు. నాలోనున్న ప్రకృతికీ, సముద్రుడిలో నున్న ప్రకృతికి భేదంలేదు. నేనూ చెలియలికట్ట దాటాను. ఆయనా దాటుతాడు. అదుగో బండీ వచ్చింది. బ్యాంకుపుస్తకం జాగ్రత్త చేసికొన్నావా? వీరాభద్రుడు పిల్లవాణ్ణి నన్నొక్కసారి ముద్దుపెట్టుకోనిస్తారా?

రాజ్యలక్ష్మి పిల్లవానిని [illegible] కియ్యక పోవుచుండగా

సీతారామయ్య పిల్లవానిని తనచేతిలోనికి దీసికొని రత్నావళి చేతికిచ్చెను. ఆమె పిల్లవానిని కన్నుల కద్దుకొనెను. ముద్దుపెట్టుకొనెను. ఏడ్చెను. అట్లు పదినిముసములు జరిగెను. తరువాత పిల్లవానిని రాజ్యలక్ష్మి చేతికిచ్చెను. సరస్వతి లోపల ఇంటిలోని సామానులన్నియుఁ దెచ్చి బండిమీఁద నెక్కించెను. రాజ్యలక్ష్మి దిగాలుపడి రత్నావళివంక నే చూచుచుండెను. రత్నావళియింటి గడప దాఁటిపోఁబోయెను. రాజ్యలక్ష్మియామెను పట్టుకొనెను. "అక్కా! ఈకుమారుని తీసికొని నీవు కాఁపురముచేయుము. నేను సముద్రములోనికిఁబోయెదను. వానిని నీకన్న నే నెక్కువ ప్రేమించలేను. ఆయనను నీవు సుఖపెట్టినట్లు నే ను సుఖపెట్టలేను. నీవు చదువుకొన్నదానవు. డబ్బుకలదానవు. పాపము చేసి తెలిసికొనినదానవు. పిల్లవానిని నీవు తీసికొమ్ము" అనెను.

సీతారామయ్య యట్లే నిలుచుండెను. రత్నావళి రాజ్యలక్ష్మి చేతిలోననేయుంచి పిల్లవానిని ముద్దుపెట్టుకొనెను. "అమ్మా! నిజమే! నాకు తెలుసు - నే నెంతసుఖపడతానో, ఆయన యెంత సుఖపడతాఁడో నాకు తెలుసు. కాని నాకడుపున యింకొకబిడ్డ పుడితే నీబిడ్డవంటివాఁడు కాఁడు వాఁడొక గోళకుఁడు. వాఁడొక కుండకుఁడు. వాఁడొక కింకులుఁడు. అట్టికొడుకునే కంటినా వాఁడు నాకు తర్పణము లిచ్చునా? తల్లీ! నీకొడుకు చాలునమ్మా, చాలు. నీకొడుకుఁ గడచిన మూఁడుపురుషాంతరాలదాఁకా చాలు. తల్లీ! నీకు తెలియదు. నీవు శరీరాన్ని చూస్తున్నావు. ఆత్మను చూడు. మనస్సును చూడు. ప్రేమనిచూడకు: ధర్మాన్ని చూడు. సుఖాన్నిచూడకు; సంప్రదాయాన్ని చూడు. బయట చూడకు తల్లీ! లోపలచూడు! నన్నూ నీభర్తనూ చూచుకోవద్దు. నీకొడుకును చూచుకో! సంతానాన్ని చూచుకో! నెత్తురు

చెడిపోకుండా చూసుకో! అదే వర్ణం. దానిలోనే గుణాలు ఉంటవి. గుణాలలో కలీవస్తే వర్ణంపోతుంది. ధర్మం నశిస్తుంది. సుఖాల కేమి, దుఃఖాల కేమి, ఉద్యోగాల కేమి, ధనాల కేమి? నేను వెళుతున్నా. మీరు మీవాగ్దానం మఱచిపోఁగూడదు" అనెను. రత్నావళి సముద్రాభిముఖముగాఁ బోయెను. సీతారామయ్య యామె పోవుచున్నవారివంకనే చూచుచుండెను, రత్నావళి కొంతదూరము పోయెను. రాజ్యలక్ష్మి తన భర్తతో "మీరు పోయి పట్టుకుంటే ఆఁగుతుంది" అనెను. సీతారామయ్య రత్నావళియొద్దకుఁ బోయెను. ఇట్లనెను. "నీవు రా! నేను లోకానికి వెఱవను. నాకు రాజ్యలక్ష్మి యెటువంటిదో రత్నావళియు అటువంటిదే." రత్నావళి సముద్రాభిముఖముగాఁ బోవుచునే యుండెను. సీతారామయ్య ఆమె రాదని తెలిసికొనెను. ఇట్లనెను; "నాకు చనిపోయిన రత్నమ్మ యెటువంటిదో సముద్రాభిముఖముగాఁ బోవుచున్న నీవును అటువంటిదానవే." రత్నావళి వెనుదిరిగి నమస్కారముచేసెను. రత్నావళి సముద్రాభిముఖముగా బోయెను.

---

## పదునేడవ అధ్యాయము

---

వెనుకటి యధ్యాయములో రత్నావళి ప్రతిష్ఠాపురమునకు బయలుదేఱిపోవునప్పుడు రంగఁడు నిదురమత్తులోనుండెను. ఆమె వెడలిపోయినతరువాత రంగఁడు మఱల నట్లే కొంతసేపు నిద్రించెను కొంతసేపటికి లేచెను. రత్నావళి యెచ్చటికిఁ బోయెనో? ఊరిలోనికి పోయి యుండును. పదిగంటలయ్యెను. రత్నావళి రాలేదు. పదునొకండుగంటలయ్యెను. ఆమెరాలేదు. ఎవరో స్నేహితుఁడు వచ్చి రత్నావళికై లెక్కఁగాఁదానుచూచితి

నని చెప్పెను. రంగని కేమి తెలిసినదో యామె ప్రతిష్టాపురము నకుఁ బోవుచుండెనని వెంటనే తెలిసెను. అతఁడు తొందరపడెను. అతని కేమి చేయుటకును దోఁచలేదు. రత్నావళి ప్రతిష్టాపుర మెందులకు వెళ్ళెను? తనయన్నగారిని బతిమాలి మఱల నతనితో గాపురము చేయుటకు వెళ్ళెనా? రంగఁడు నమ్మలేకపోయెను. రత్నావళి యొకవిధమైన సన్యాసిని యయ్యెను, ఆమెకు సంసారమునం దాశలేదు. ఆమె ధర్మసన్యాసినిగా బయల్వెళ్ళెను. సంసార సుఖ మనుభవింపవలెనని యామెకు లేదు.

ఒకవేళ రత్నావళి తనయన్నగారితోఁ గాపురము చేయుటకు నొప్పుకొనునేమో? సీతారామయ్య యొప్పుకొనఁడు. తనభార్య పాపము చేసి పశ్చాత్తాపపడి మఱల తనయొద్దకు వచ్చినప్పుడు తా నామెను స్వీకరించుటకు పురుషున కెంతయౌదార్య ముండవలయును? ఈ యౌదార్యమును రంగఁడు సంస్కార మనును. ఇంగ్లీషులో 'కల్చర్' అన్నమాట కర్థము. అట్లు స్వీకరించుటకు చదువు, జ్ఞానము కావలయునని యతని యభిప్రాయము. సీతారామయ్య కట్టి సంస్కారము లేదు. రత్నావళి వెళ్ళిన ప్రయోజనము లేదు. రంగని కాలోచన హెచ్చెను. సీతారామయ్య నిరాకరించినచోఁ దాను పోయి రత్నావళిని మఱల తీసికొనివత్తు ననుకొనెను. రత్నావళికి సంసారమునం దిష్టము లేనిచో నేదైన నొక యాశ్రమమునం దుండవచ్చును.

రంగఁడు బయలుదేఱుటకు రాత్రివఱకును బండిలేదు. అతని తొందర పట్టునట్లు లేదు. ఒంటిగంటకు 'కావలి' వఱకు నొక బండి పోవును. దానిమీఁద బోవలెననుకొనెను. కావలికిఁబోయి యేమిచేయును? అక్కడ మెయి లెక్కును. అక్కడ మెయిలెక్కుటకు బదులు నెల్లూరినుండియే మెయిలులోఁ బోవచ్చునుగదా!

ఏమో! ఒంటిగంటబండికిఁబోయినచోఁ దాను బయలుదేఱి పోవు చుంటె నను తృప్తి కలుగును. రంగఁడు ప్రయాణమునకు సర్దు కొనుచుండెను. రంగని కంతలో నొకభయము వేసెను. తాను తిరిగి చెన్నపురికి రానేమో యనిపించినది. ఎందుకు రాఁడు? ఏమో, ఎందుకు రాఁడో! అట్లనిపించినది. అనిపించుటయే కా కుండ నతని కాభావము నిశ్చయమైనది. తానుగూడ రత్నా వళితోఁగలసి యేదైన నాశ్రమమునం దుండిపోవునా? లోకము మీఁద నతని కంత వైరాగ్యము లేదు. కాని యతనిమనస్సతనిది కాకుండనుండెను. తానుతిరిగిరానిచో జెన్నపురిలోనున్నకుర్చీలు, పఱుపులు, మంచములు, దోమతెరలు నివి యన్నియు నేమి కావలయును? బ్యాంకులో తనకొక వేయిరూపాయలున్నవి. అవి ఏమికావలయును? రత్నావళిబ్యాంకుపుస్తకముకూడ పెట్టెలో నున్నది. అది యేమికావలయును? రంగఁడు పెట్టెతీసి చూచెను. తన బ్యాంకుపుస్తక మొక్కటియే యుండెను, రత్నావళిబ్యాంకు పుస్తకము లేదు. రత్నావళి తన బ్యాంకుపుస్తకమును తన వెంటఁ గొనిపోయెనా? కొనిపోయి యేమిచేయును? సీతారామ య్య కిచ్చునా? సీతారామయ్య పుచ్చుకొనునా? ఏమో! పది పదునేనువందలతో వచ్చిన స్త్రీ నెవఁడు గాదనును?

ఇంతకును దానేమికావలయును? తానుగూడ ప్రతిష్ఠాపురము పోవునా? పోఁడు? ఇంతలో నీలాంబరుఁడు వచ్చెను. అతఁడు మేన మామ పెట్టెలన్నియు సర్దుటచూచెను. నీలా:—మామా! అత్త ఏది? రంగ:—ప్రతిష్ఠాపురమునకు వెళ్ళెను. ఎందుకు? నీలా:—నా కొక యనుమానము కలిగినది. ఆమె నడిగి తీర్చుకొనవలయును. రంగ:—ఏమిటా యనుమానము? నీలా—నీతో చెప్పి యేమిలాభము?

నీ కర్థశాస్త్రము తెలిసినంత భాషావిషయము తెలియదు. కామ శాస్త్రము తెలిసినంత ధర్మశాస్త్రము తెలియదు. రంగ:—నీకును నట్లే తోఁచినదా? నీలా:—నాకు తోఁచుట యేమున్నది? నీవు చెప్పికొన్న విషయమే కదా! రంగ:—నేను సమాధానము చెప్ప లేను. సరే! ప్రశ్న ఊరకే వినరాదా? నీలా:—వినవచ్చును. రంగ:—చెప్పుము. నీలా:—నీవు రైలునకు పోవుచుంటివికదా! రంగ:—నేనొంటిగంటకు పోదును. ఇప్పుడు పదునొకండు న్నఱయే యయ్యెను. నీలా:—అయినచో వినుము. ఒకభార్య భర్తను వదలిపెట్టి పోయెను. ఆమె తరువాత పశ్చాత్తాపపడి మఱల భర్తవద్దకు పోయి తనను స్వీకరింపు మనెను. అతఁడు స్వీకరించవలయునా, వలదా? రంగ:—ఈప్రశ్ననీ కేల పుట్టెను? నీలా:—ఇట్టిదొకకథ జరిగెను. రంగ:—ఆ భర్తస్వీకరించెనా? నీలా.—స్వీకరించెనో, స్వీకరించలేదో యింకను దెలియలేదు. రంగ:—నే నయినచో తప్పక స్వీకరింతును. నీలా—మనమాట కాదయ్యా! స్వీకరించుటలో నున్న ధర్మ మెట్టిది? స్వీకరించక పోవుటలో నున్న ధర్మమెట్టిది? అది నా ప్రశ్న. రంగ—రత్నా వళినే యడిగి తీర్చుకొందువుగాని. రా! పోదము. నీలా—నేను రాను. నా కింక నెలదినములలో పరీక్ష లున్నవి. రంగ:—పరీక్ష మైనతరువాత నేమిచేసెదవు? నీలా:—ఎక్కడనైనను 'బల్లకట్టె దను. రంగ:—బల్లకట్టుటకు మొదట డబ్బు కావలయును. ఒక వేయిరూపాయలైన నుండవలెను.నీలా:—నారుపోసిన దేవుఁడునీరు పోయఁడా?ఏదోదారి వాఁడే చూపించును. రంగ:—నావద్ద వేయి రూపాయ లున్నవి. అవి బ్యాంకులో నున్నవి. నీకోసమే యట్టె పెట్టితిని. ఇదిగో పుస్తకమును దీసికొనుము. నీ పేర నార్డరు వ్రాసి

యిచ్చెదను. నీలా:—ఆ డబ్బు నాకిచ్చినచో నీ వేమగుదువు? రంగ:—నేను ప్రతిష్ఠాపురము పోవుచున్నాను. ఈ యింటిలోనున్న సామానంతయు నీకేయిచ్చివేసెదను. ఇచ్చివేసితిని. నీ విక్కడనే యుండుము. నే నింక రాను. నేను వెడలిపోవుచున్నాను. అనుచునే రంగఁడు నీలాంబరునకు కాగితము వ్రాసియిచ్చి, పెట్టె పుచ్చుకొని బయలుదేఱెను. మఱల వెనుదిరిగి వచ్చి, యీపెట్టె మాత్రము నాకెందులకని యదియు నచ్చటనే వదలిపెట్టి పోయెను. నీలాంబరుఁడు రంగఁడిచ్చినకాగితము చూచుకొనెను. అది అర్ధరూపాయిస్టాంపుమీఁద వ్రాయఁబడిన యీర్ధరు. నీలాంబరుఁడు నివ్వెఱపోయెను. పోవుచున్న రంగని పిలుచుటకుఁగూఁడ నతని నోటివెంట మాటరాలేదు. ఒకగంటసేపటికి నతని దిగ్భ్రాంతివదలెను. అప్పటికి రంగఁడు రైలెక్కి పోయియుండును. నీలాంబరుఁడు తాను సెంట్రల్ స్టేషనునకుఁబోయెను. రైలప్పుడే సాఁగిపోయెను. అతఁడు మఱల రంగని యింటికిఁ బోయెను. ఇంటిలోని సామానంతయుఁ జూచెను. నాలుగైదువందల రూపాయల ఖరీదుచేయఁగల సామానుండెను. అనేకపుస్తకములుండెను. నీలాంబరుఁడు ప్రొద్దుగ్రుంకిన తరువాత తలుపునకు తాళమువేసి, తాళముచెవి జేబులో పెట్టుకొని పోయెను.

రంగఁడు రైలెక్కెను. ఆరైలు ప్రతిస్టేషనువద్ద నిలుచుచు పోవుచుండెను. గూడూరుపోవువఱకు నైదుగంట లయ్యెను. అచ్చట గాలిమొదలుపెట్టెను. అట్లే నెమ్మదిగా నెల్లూరుచేరువఱకు రాత్రి యెనిమిదిగంటలయ్యెను. బండియచ్చట నాఁగిపోయెను. అప్పటికి వాయువు బొంయ్‌మని చెవులలో రొదచేయుచు, డభేలుమని రైలుపెట్టెలకు మోదుకొనుచు, తెఱచిన కిటికీలలోనుండి

పెద్దరొదతో దూసికొనిపోవుచు వృక్షములన్నియుఁ దలలు పెడఁ ద్రోసికొని యుయ్యేల లూఁగఁగా భయంకరమై వీవఁజొచ్చెను. రైలుపెట్టెలు బోల్తాపడు నని జనము రైలులోనుండి దిగి స్టేషనులో దాఁగుకొనిరి. గాలివెంబడి వానకూడ వచ్చెను. ఆవర్షము ధారాపాతముగాఁ గురిసెను. సముద్రములో భయంకరమైన తరంగము లేచి విఱిగినచోట నురుసులతో, శీకరములతో చిన్ని పడవ కేసి లాగి కొట్టునట్లు ఒక పెనుగాలి వెంటవచ్చెను. వాన జల్లు ఫెడేలుమని మనుజులవీపులపై, మొగములపై తాఁకించెను. ఒకగుప్పెఁడు సన్ననిఱాళ్ళతో విసురుగా ముఖముమీఁద కొట్టినట్లు, మసూచికములో ముఖముమీఁది పొక్కు లన్నియు నొక్కసారి చుఱుక్కున పోట్లు పొడిచినట్లు జనులు తల్లడిల్లి పోయిరి. వానకు నందఱి కట్టుగుడ్డలును తడిసెను. 'ఉహుహు' యనుచు గోడల కాని జనులు నక్కిపోయిరి. రంగని మనసు మాత్రము ప్రతిష్ఠాపురమువైపునకుఁ బరుగెత్తుచుండెను. ఈవాన తనయూహ కెంత యడ్డుతగిలెను. ఈవాన లేకున్నచో నాపాటికి మెయిలు అదిగోవచ్చెను, ఇదిగో వచ్చెననుకొనుచుండెడివాఁడు. స్టేషనులో నెవరినడిగినను మెయిలురాదనియే చెప్పిరి. ఆమఱునాఁడు పదిగంటలకు మఱల రైలు బయలుదేఱెను. అంతవఱకును రంగనికి భోజనము లేదు. ఆ రైలు మఱునాఁడు ప్రొద్దున పన్నెండుగంటలకు బెజవాడ చేరెను. అంతవఱకును రంగనికి భోజనము లేదు. వెంటనే ప్రతిష్ఠాపురముబండి బయలుదేఱెను. అది సాయంకాలము మూఁడుగంటలకు ప్రతిష్ఠాపురమువద్ద బస్తీచేరెను. అతఁడు దిగి తాను నడువలేనని తెలిసికొనెను. అతఁడు భోజనముచేసి రెండుదినములైనది. వేదవాంఛితంతే కాబో

లును. తిండిలేనివానికి దేహములో శక్తిలేదు; దుష్టకామము లేదు; అహంకారము లేదు. తిండిలో, ధనములో నన్నియుఁ గలుగుచున్నవి కాఁబోలు! రంగఁడు బజారులోనికిఁబోయి యింత సెనగపప్పును, బెల్లమును కొనితినెను. ఆనాఁడు ప్రతిష్ఠాపురములో కోమటియింట సెనగపప్పును, బెల్లమును తినినసంగతి యతనికి జ్ఞాపకమునకు వచ్చెను. ఆకోమట్ల యింటిలోననే వారి నడిగి మజ్జిగద్రాగెను. అప్పటికిఁ బ్రొద్దుటినుండియుఁ బడుచున్న తుప్పర కొంచెము వృద్ధియయ్యెను. మున్నటినుండియు రంగఁడు స్నానము చేయలేదు. బయలుదేఱిన నాఁటిరాత్రి వానకుఁ దడిసిన గుడ్డలతనియొడలుననే యుండెను. ఈనడుమ రెండుమూడు సార్లు చెమటపోసెను. మఱల నెండెను. ఆగుడ్డలట్టలు కట్టి బిఱ్ఱ బిగిసియుండెను. అవి యొడలికి రాచుకొనినపుడెల్ల నతనికి బాధగా నుండెను. అతఁడు ప్రతిష్ఠాపురము త్రోవపట్టెను. దారిలో నిద్దఱు మాట్లాడుకొనుచుండఁగా నతనికి వినిపించెను. ప్రతిష్ఠాపురము సముద్రములో మునిఁగిపోయినదనియు, నచ్చటి జనులందఱు నాయూరువదలి వెళ్లిపోయిరనియు వారనుకొనుచుండిరి. రంగఁడు వారివంక తలయెత్తిచూచి మఱల తనదారి వెంటదాను బోవుచుండెను. ఎఱిఁగియున్న త్రోవయయినను, జలముచే నిండి త్రోవ గుర్తుపట్టరాకుండెను. కాని యొక్కటే 'డొంక'యగుట చేత గుర్తుగాఁ బోవుచుండెను. అతఁడు సగముదూరము పైగాఁ బోయెను. అతఁడు కట్టుకొనిన వస్త్రములన్నియుఁ దడిసెను. అవి రాచుకొనినపుడు బాధపోయినది. తాను స్నానము చేయక పోవుటచేత కలిగిన యసహ్యము లేదు. అతఁడు తడిసిన చొక్కా యూడఁదీసి, పిండి, చంకను బెట్టుకొనెను.

కొంతసేపటికది బరువెత్తి దూరముగాఁ బాఱవేసెను. తనయుత్తరీయమును పిండి తలకుచుట్టుకొనెను. కట్టుదోవతి యెగఁగట్టెను. దారి పొడుగున బురదనీళ్ళు వానియొడలెల్ల చిమ్మెను. అతఁడు పోవుచుండెను. అతనికెదురుగా బలముగలరెండెడ్లు కష్టముతో లాగుచున్న యొకగుడిసెబండి యెదురుగా వచ్చుచుండెను. అతఁడా బండి తనకుదగ్గరగా వచ్చువఱకు నిలుచుండి శ్రమతీర్చుకొనెను. ఆ బండిగుడిసెకు రెండువైపులను దుప్పట్లు కట్టఁబడియుండెను. లోపల నెవరుండిరో కనిపించలేదు. బండివాఁడు ముందు నడచుచు యెడ్ల తలత్రాళ్ళుపుచ్చుకొని లాగుచుండెను. తొట్టిలో నొకఁడు కూర్చుండి తాటియాకుల గొడుగు జల్లునకు మొగమున కడ్డముపెట్టుకొని యెడ్లను తోలుచుండెను. రంగఁడు మఱల నడువ నారంభించెను. బండివాఁ డొక్క నిముషము మాత్రము నిలిచి రంగనివంకఁ జూచెను. తొట్టిలోఁ గూర్చున్నవాఁడు రంగనివంకఁ జూచెను. ఈలోపుగా రంగఁడు బండిని దాఁటిపోయెను. తొట్టిలోఁ గూర్చున్నవాఁడు బండివానితో నిట్లనెను. "ఒరేయ్? ఎవర్రా ఆ మనిషి! ఆ ఊరు వెళతాఁడెందుకు?" బండివాఁడు: ఎవఁడో పల్లెవాఁడై ఉంటాఁడు. పోనియ్యి బండి. తొట్టిలోఁ గూర్చున్నఆయన మఱలనిట్లనెను. "పాపము! పిలవరా! బండిలో ఎక్కించుకపోదాం." బండివాఁడు "యెడ్లు అసలు లాగలేవు. సావటానికి పోతున్నాఁడు కామలున్న. పోనివ్వండి. తెలుసుకుంటే వాఁడే నడిచి వస్తాడు!' అనెను.

తొట్టిలోఁ గూర్చున్నవానిమాటలు రంగనికి వినిపించెను. అతఁడాకంఠము గుర్తుపట్టెను. గుర్తుపట్టినవెంటనే యతఁ డొక్క నిముసము నిలిచెను, బండిలోఁ దనతల్లియు, నక్కగారునునుండ్రి

యుందురు. అతనికిఁ దనతల్లిని జూడవలెనని యనిపించెను. కాని అక్కగారికిఁ గనిపించుట వానికిష్టములేదు. అన్నగారికిఁదెలియఁ జేసికొనుట యిష్టములేదు. అంతలో బండిలోనుండి యొకపసి పిల్లవాఁడేడ్చుచున్నట్లు వినిపించెను. అతనికిఁ దనక్రొత్తవదినె గారిని జూడవలెననిపించెను. కాని యతనిమనస్సు చూడకుండ గనే పోవుటకు నిశ్చయించెను. ఇంతలో బండివెనుకఁ గట్టిన దుప్పటి యొత్తిగిల్లి యొక పదునాలేండ్ల పునిస్త్రీ తొంగి చూచెను. రంగఁడు వదినెగారిని చూచెను. ఆమె రంగనివంకఁ జూడలేదు. పదినిముసములలో బండి పిలుపుమూరము మీఱి పోయెను. రంగఁడు ప్రతిష్ఠాపురము చేరువఱకు బాగుగా జీఁకటి పడెను. ఆకాశము మేఘావృతమైయుండెను. ధాత్రియంతయు జలమయమైయుండెను.ఊరిలో వీథులన్నియు బురదగానుండెను. అతఁడు పడుచు, లేచుచు తనయింటికిఁ బోయెను. ఊరిలో నొక్కపురుగు లేదు. ఆయింటిలో నొకదీపము వెలుఁగు చుం డెను. బయటఁదాళము వేసియుండెను. లోపల దీప మెందుకు పెట్టిరి? అతఁడు దొడ్డిగుమ్మమువైపునకుఁబోయి తలుపుతట్టెను. ఆ తలుపు పాఁతది. దానిని తేలికగా బద్దలుకొట్టవచ్చును. గాలిచేకాఁబోలు,నాతలుపి దివఱకే బద్దలుకొట్టఁబడియుండెను. అతఁడు తలుపుచెక్కల నటునిటుత్రోసి లోనికిఁబోయెను. గదిలో నుండి "ఎవరువారు?" అను ప్రశ్న వచ్చెను. అతఁడును "ఎవరు వారు?" అనెను.

రంగనికెదురుగా నన్నగారిగదిముందఱ రత్నావళినిలుచుండెను. ఆమె దీపపు వెలుతురులో రంగనిఁజూచి యానవాలుపట్టెను. ఆమె యాశ్చర్యపోయెను. రంగఁడు నవ్వుచు నిలుచుండెను.

రత్నా:- నీవెందుకు వచ్చితివి? ఎట్లువచ్చితివి? రంగ:-ఎట్లు వచ్చితినో యెందుకుఁగాని, యెందుకువచ్చితినో చెప్పెదను. ఇద్దఱము గలిసియే చనిపోవుదమని వచ్చితిని. రత్నా:-చనిపోవుట కిక్కడనేమున్నది? రంగ:-బ్రతుకుటకిక్కడనేమున్నది? రంగఁడు పఱుపులో చుట్టియుంచిన దుప్పటితీసి కట్టుకొనెను. రత్నా:- నే నిచ్చటనుంటినని నీ కెవరుచెప్పిరి? రంగ:-నీ విందుండుమని యెవరు చెప్పిరి? తరువాత వారొకరితో నొకరు మాటాడలేదు. రాత్రి రెండుజాములు కావచ్చెను. రంగఁడు నేలమీఁద పండుకొనెను. రత్నా:-ఈపఱుపుమెత్తగానున్నది. సుఖముగానున్నది. ప్రతిష్ఠాపురము వదలినతరువాత నీమెత్తఁదనము, నీ సౌఖ్యము నాకు మఱలకలుగలేదు. మఱల నీనాఁడు కలిగినది. రంగ:-నీవు వచ్చివేసితివా; నీలాంబరము వచ్చెను. నిన్నడిగి యొక ధర్మసందేహము తీర్చుకొనవలెనని వచ్చెను. ఆధర్మసందేహ మేమిటనఁగా "నొక స్త్రీ భర్తను వదలి లేచిపోవును. ఆమె కొన్నాళ్ళకు పశ్చాత్తాపపడి మఱల భర్తదగ్గరకుఁ బోవును. తనను స్వీకరింపుమని యతనిని బతిమాలును. అతఁడు స్వీకరింపవలయునా, వలదా? స్వీకరించుట ధర్మమా, స్వీకరించకపోవుట ధర్మమా" అని. స్వీకరించుటయే ధర్మమని నేను చెప్పితిని. నీ వేమందువు? రత్నా:-స్వీకరించుట ధర్మముకాదు. ఆమెపోయి మఱల భర్తనడుగుటయే ధర్మముకాదు. ఎవరైన మనస్సునకు గ్రుచ్చుకొనుమాట నందురు. తరువాత నెన్నిక్షమాపణలు చెప్పుకొనినను, ఆ మాట మఱచిపోముకదా! అది మనస్సున కలుక్కు మనుచునేయుండును. ఒకరి కొకరేమియుఁగాని యిద్దఱు మనుష్యులమధ్య నొక్కమాట, యింతకష్టము కలిగించినచో

భార్యాభర్తలమధ్య భార్య లేచిపోవుటయన్నది యెంతకష్టము కలిగించునో యూహించుము. అతఁడు స్వీకరించినను నాభావము సెలవేయుచునే యుండును. ఆ కాఁపురము పొసఁగదు. అదియుఁగాక ఆ భర్త ఆమెను స్వీకరించినను లోకము వానిని నిందించును; వాఁడెంత సిగ్గుమాలినవాఁడని చెప్పుకొనుచుండును. ఆభార్యయందాభర్తకుఁ గోరికతీఱనిచో, నతఁడు నీతికన్న కోరికకే యెక్కువవెల గట్టెడివాఁడైనచో స్వీకరించును. ఆస్త్రీ నిజముగా పశ్చాత్తాపపడినచో వారు కామసుఖమును మిక్కిలిగా బొందుదురనుటలో సందేహములేదు. కాని నేనుచెప్పినది సౌఖ్యము, కామము మొదలైనవానివిషయము. ఇది ధర్మముకాదు. చెడిపోయినదాని గర్భమందుఁ గలిగిన సంతానము వంగడమునకు దివిటీలెత్తునా? ఆభర్త స్వీకరించినచో నది యతని యౌదార్యము. అట్టి యౌదార్యముకల భర్తలు చాలమందియుందురు. కాని అంత లజ్జమాలిన స్త్రీలుండరనుకొందును. రంగ—అట్లు పశ్చాత్తాపముపడెడి స్త్రీలే యుండ రనుకొందును. రత్నా—నీవు పూర్వము ప్రత్యక్షము ప్రమాణ మనుచుండెడివాఁడవు. ఇప్పు డదికూడఁ బోయినది. అసలు ప్రమాణమే లేదనుట వాద మెంతదూరమునకుఁ బోవలయునో యంతదూరముపోవుట; రత్నావళి బయలుదేఱి పోవుచుండెను. రంగఁ 'డెచ్చటికిఁ బోవుచుంటి?' వనెను.

రత్నా—నేను చేసిన పాప మీగడిలో మొదలుపెట్టి సముద్రమువద్ద పంపించితిని దానిని 'కడిగివేయుట నిచ్చట మొదలు పెట్టితిని. సముద్రములోఁ బూర్తిగా కడిగివేసెదను. రంగ:—నేనును అట్లే చేసితిని. అట్లే చేసెదను. రత్నా:—

పాపముచేసినది నేను; నీవు కాదు! రంగ:-నాతో జేసితివి; నాతో గసిగివేయుము. రత్నా:-నీకు విశ్వాసములేదు. నా కున్నది. రంగ:-విశ్వాసమో, మఱి యింకొకటో? నేనును వచ్చెదను. చీఁకటిలో దారి తెలియునా? రత్నా:-సముద్రమేవైపున నున్నదో తెలియును. ఆవైపుగా బోయినచో నెట్లు పోయినను సముద్రమే. ముందు రత్నావళియు, వెనుక రంగఁడును సముద్రాభిముఖముగాఁ బోయిరి. ఆ సాయంకాలమున రత్నావళి సముద్రాభిముఖముగాఁ బోయినట్లే పోయి మఱల తిరిగి వచ్చెను. బండి వెడలిపోయినగుర్తు సరిగా చూచుకొని దొడ్డి గుమ్మమునుండి యింటిలోనికిఁ బ్రవేశించెను. తన పాప మా గదినుండి మనసా తొలగించికొనుటకు మొదలు పెట్టెను. అప్పటికి రాత్రి రెండుజాము లయ్యెను. కడచిన మూఁడునాళ్ళ నుండియు గాలి నేలమీఁదనుండి సముద్రమువైపునకు వీచుచుండెను. అప్పుడు గాలి స్తంభించెను. గాలి యొకనిముస మాఁగెను. దూరమున నెక్కడో యొకమేఘము పొరవిచ్చెను. పొర విచ్చెనో, యాకసములో నేదోప్రళయమైన వెలుఁగు ఆమేఘము వెనుకఁదట్టి యామేఘము కాంతి చిమ్ముచుండెనో? ప్రతిప్రాపుర మంతయు వెలుఁగుతోనిండిపోయెను. రత్నావళియు,రంగఁడును సముద్రాభిముఖముగా నడుచుచుండిరి. తొందరగా నడుచు చుండిరి. నీళ్లులేనిచోట పరుగెత్తిరి. వారికి రెండువందల గజముల మేఱలో సముద్రము కనిపించెను. ఆ రెండువందల గజముల మేఱయు నీరు లేదు. మెట్టగా నుండెను. అదియే 'చలియలికట్ట' కాఁబోలు. ఈవలిస్థల మంతయు నానుపెట్టిచే నిండి యుండెను.వా రా మెట్టమీఁద కాలుపెట్టి, వెలుకురుపోయెను.

ఆ తెల్లని మేఘము నల్లవడెను. మఱల ప్రళయవాయువులు నేలపైనుండి సముద్రమువైపునకు వీచుచుండెను. వారొక వంద గజములమేర నామెట్టమీఁద నడచిపోయిరి. అచ్చట నిలఁబడిరి. కన్నుకన్ను పొడుచుకొన్నను ఏమియుఁ గనుపించుటలేదు. వారు గాలికి నిలువలేక కూర్చుండిరి, ఇంతలో గాలి కొంచెముతగ్గెను. వారిరువురును గాలికి కొట్టుకొనిపోయిరి. ఆ మెట్టమీఁదనే యొక చోటఁబడిరి. వారొకమనిషిమీఁద పడినట్లు తోఁచెను. ఆ మనుష్యుఁడు లేచి కూర్చుండి పాడ నారంభించెను.

ఇంతలో నా సముద్రమున నొక పెద్దమంటమండెను. ఆ వెలుతురులో నొకనిముసము సముద్రతీరమంతయు భగభగ మండిపోవుచుండెను. ఆ వెలుతురులో సముద్రజల మెట్లు మండుచుండెనో చెప్పుటకు వీలులేదు. ఆ సముద్రజలము సలసల క్రాఁగుచున్న మహారక్తమో, కరఁగించిపోసిన యినుమో, సీసమో! దానికి పోలికలేదు. వారినేత్రములు దానిని చూడను లేకపోయెను. వారి మనసులో మనస్స్వముపోయెను. కాని లీలగా నొక జాగ్రత్త మెలఁగుచుండెను. ఆ వెలుఁగుతోపాటు వారు తాముపోయిపడినది బైరాగిమీఁద నని తెలిసికొనిరి. ఆ బైరాగి లేచి కూర్చుండుటయుఁ, బాడుటయు వారికిఁ దెలిసెను. లీలగాఁ దెలిసెను. అది జాగ్రదవస్థకాదు. కాకనుపోలేదు. మృత్యువు రాలేదు; వచ్చినంతపని యయినది. ఆస్థితి యెట్టిదో వేదాంతములును జెప్పును.

## పాట

అది యెట్టిదో? - కడలితరంగలలోన
కలసిపోవుట యనున్న - దెట్టిదో? అది యెట్టిదో?
వట్టియిసుకలపైన - మెట్టనే లనుకొని
మిట్టిపడి పోవుచును మట్టిలోఁగలియు టది - యెట్టిదో? అది యెట్టిదో?
అట్టి సంద్రమునడుమ - పుట్టినది హాలహల
మిట్టి చెలియలికట్ట నెట్టుకొని వచ్చు టది-యెట్టిదో! అది యెట్టిదో?
కట్టుకొని ధర్మములు - గిట్టి చెలియలికట్ట
పట్టువిడి జాతి జల - మట్టుగా పొంగు టది - యెట్టిదో! అది యెట్టిదో?

రంగనికి, రత్నావళికిని బాట వినిపించుచున్నది; వినిపించుటయు లేదు. వారికన్నులు మూఁతపడియుండెను. వారికిఁ దమ జీవిత మంతయు లీలగాఁ దోఁచెను.

ఇది యంతయు నొక నిముసపుఁ గదలిక.

సముద్రము హోరు మని పెల్లగిల్లి వచ్చెను. ఆ పెల్లగిల్లి వచ్చుటకు వర్ణనలేదు. అది చూడరానిది. చెప్పరానిది. కడలిలో నొక కెరటము తాఁటియెత్తున లేచెను. ఆ కెరటము లేచినంతనే చెలియలికట్ట తాటిలోఁతున గ్రుంగిపోయెను. ఆ కెరటము విఱుచుకొని పడెను.

కడలు నడుమను గ్రుంగిన కట్ట లోయ
మై మహాపర్వతమువోని యా కెరటము
తోఁకపై నిల్చి పెనుబాము దూఁకినట్లు
ముందునకు వంగి పడగ క్రిమ్ముకొని చుట్టు
కొన్నయట్టుల విఱిగి యొక్కుమ్మడి పడి

పోయె, నా పడిపోయిన పోక పోక
గాక భ్రమివోలెఁ దిరిఁగినదాఁక లేదు.

అగ్నికావర్తమై హాలహాలము లేచి
కృత్తికామూర్త్తివలె బిట్టు కెరలి మఱలఁ
దాటియెత్తున భీషణోద్ధతిని బొలిచె.
ఇంత జరుగుట కనుమూసి యిట్టె తెఱచు
నంతలోపల నంతలో నంత వింత
లై నురువులు నిప్పులు సుడుల్ పట్టరాని
యుప్పులును వెల్గు లాత్తకుప్పు లగుచు.

లోన బ్రదికెడు చేఁప లుల్లోలభీక
రోగ్రఘూర్ణణజాతాగ్నిరూక్షతాప
మునకు ననధిగతాజ్ఞాతపూర్వ మైన
పటుతరావర్తములకును బగిలి చచ్చె.

కట్టగానున్న చెలియలికట్టగూడఁ
గూడి కుంకుడువేళ్ళతోఁ గుళ్ళగించి
నట్టి వాఃరాశిపతికి మత్స్యాళి లెక్క ?

ఘోరకాంతారతరువులు కుద్దలించి
సుడులు పెనవడి యాఁబోతు సుడియుఁదీతి
వఱద లై పొంగులెత్తుచుఁ బర్వతాగ్ర
భాగములనుండి దూఁకినభాతి వచ్చె.

వారిబంధనభాగముల్ పగిలిపోవ
నేన్గుతూములనుండి యట్టిట్టు లొరసి
కొన్ని రాపిళ్ళకును మహాఘూర్ణమాన
కుపితరేఖాగ్రితంబోలె గుడుసులువడి
పుష్కలావర్తకంబులు భుగభుగ మని

ప్రళయకాల మహోగ్రవిభావరీమ
హాఝరీపాత ఘోరనదీఝరాభ
వారిధారావిధంబున వచ్చివచ్చి
హద్దులను ద్రెంచి పూర్వమర్యాద లురలి
బద్దెలను దాటి ధర్మసంబంధ మెడలి
నిర్దయస్వాంతమగు వారినిధికి ఘోర
కర్దమాభీలజలపాతకంబు లేచి.

స మా ప్త ము.





**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA108B196 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 281 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1,2 TO6 |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |